







# పురాణములు

విచారణ

# అష్టాదశ పురాణ సారము - 1 , 3







## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004213,2030020024504

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit,<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Author's Last Name

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# అష్టాదశపురాణసారము

## మొదటి భాగము

ఇందు

శ్రీ శివ, స్కాంద, పద్మ, లింగ పురాణములు గలవు.

బ్రహ్మశ్రీ వేమూరి జగన్నాథశర్మ

విరచితము.




పబ్లిషర్సు:

**రామా అండ్ కో.,**

హెడ్ ఆఫీసు :— ఏలూరు.

(బ్రాంచీలు)

గుంటూరు - రాజమండ్రి - భీమవరం - తెనాలి - విజయనగరం.

 [వెల రు. **1—4—0**

# విషయసూచిక

—:0:—

## శ్రీ స్కాందపురాణము.

## శ్రీ పద్మపురాణము

## శ్రీ మహాలింగ పురాణము.



హరిః ఓం.

శ్రీమద్గురు చరణారవిందాభ్యాంనమః

శ్రీమహాలక్ష్మీ గణపతయే నమః

శ్రీ బాలాత్రిపుర సుందర్యైనమః

# అష్టాదశ పురాణ సారసంగ్రహము

## మొదటి భాగము.

ఇష్టదేవతా ప్రార్థనము.

శ్లో॥ నిత్యానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం । తత్త్వమస్యాదిలక్ష్యాం
ఏకం నిత్యం విమలమచలం । సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం । సద్గురుం తం నమామి॥

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం । శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనంధ్యాయే । త్సర్వ విఘ్నోపశాంతయే।

శ్లో॥ అం:- ఆనందవల్లీ అమృతకరతలీ ఆదిశక్తిః పరాయా
మాయా:- మాయాస్వరూపీ స్ఫటికమణిమయీ మామతంగీ
మతంగీ,

జ్ఞానార్థరూపా నళినపరిమళీ నాద ఓంకారరూపీ
యోగీ యోగాసనస్థా భువనవశీకరీ సుందరీ ఐంనమస్తే॥

త్రిమూర్తిస్తుతిః

ఉ. శ్రీకరలీలఁ బ్రాణులసృజింపఁ దలంచి విధాతతానస్థైః
చేకొనివానిఁ బ్రోచునెడ శ్రీవిభుఁడై యవి సంహరింప భీ
మాకృతిఁ దాల్చి యుమ్వరసు నవ్వలనొక్కఁడెయై వెలుంగు సు
శ్లోకుఁబురాణపుణ్యపురుషుఁ బరమాత్ముని భక్తిఁగొల్చెదన్

త్రిశక్తిస్తుతి

ఉ. శ్రీయనవిష్ణుపేరురము చెన్నువహించి యలంకరించి దా
క్షాయణినాఁగ శంభుమెయి సామున నెక్కొని వాణినాఁగనా
తోయజగర్భు నెమ్మొగముదూకొని యేలెడునాదిశక్తి సు
శ్రీయుఁజిరాయువుఁ సరససిద్ధకవిత్వము మాకు నీయుతన్.

శ్లో. వ్యాసం వసిష్ఠనప్తారం। శక్తేఃపౌత్రమకల్మషం।
పరాశరసుతం వందే। శుకతాతం తపోనిధిం॥

కాలమహిమ

క॥ కాలమున బుట్టు జంతువు
కాలముననువృద్ధిబొందు కాలమునఁ జెడుం
గాలము జనులకు దేవత
కాలము సుఖదుఃఖములకుఁ గారణ మధిపా!

కాలము చాలవిలువగలది. అంత విలువగల పదార్థము ప్రపంచకమందు వేరొకటిలేదు. కాలములో జరుగనిపనిలేదు. కాలములేకుండ జరిగెడు పనిలేదు. కొన్ని కార్యములు స్వల్ప

కాలములో నెరవేరును. మఱికొన్నిటికి హెచ్చుకాలమవసర మగును గాని కొంచెమయినను కాలము పట్టకుండ నేపనియు జరుగనేరదు. కాలములోనే సమస్త జీవ జంతువులును పుట్టు చున్నవి. కాలములోనే పెరుగుచున్నవి. కాలములోనే నశించు చున్నవి. కావున కాలమే మనకు దేవత, కాలమునను సరించియే మనకు సుఖముగాని దుఃఖముగాని సంభవించు చుండును. కాలభేదము ననుసరించియే మనకు కీడుగాని మేలు గాని కలుగుచుండును. శీతోష్ణస్థితులు మారుచుండును. కాలోచితముగానే పనులు జరుగుచుండును, జనులకు సుగుణ దుర్గుణములు, మంచి చెడ్డలు, హానివృద్ధులు, లాభాలాభ ములు, సుఖదుఃఖములు, కలిమిలేములు, మిత్రత్వ శత్రుత్వ ములు, ఉచ్చనీచలు, కలుగుచుండును. మనస్సు మారు చుండును. స్వభావములు భేదించుచుండును. కాబట్టి మనము కాలమును వృథపుచ్చగూడదు.

కాలమువిలువ మఱియొకవిధముగా కనిపెట్టినబాగుగా తెలియును. యుద్ధములయందు నిమిషములో నెన్నిఫిరంగులుం దుపాకులుకాల్పఁబడుచున్నవో, యెందఱు చంపఁబడుచున్నారో యోహించుడు. తప్పపాటుకాలములో వెలిగింపఁబడిననిప్పువలన నెన్నియిండ్లు దహింపఁబడునో చూడుడు. పరీక్షా దినములలో నాలస్యముగా పరీక్షకుఁబోవు విద్యార్థులకుఁ గల్గు నష్టమును గుఱించియు కచ్చేరీలలో దావాలున్నప్పుడాలస్యముగాఁ బోవు వాది ప్రతివాదుల నష్టమునుగుఱించియు కొంచె మాలో చింపుడు. వివాహాది శుభకార్యములలో సుముహూర్తము మించునేమోయని మనలో కొందఱు పడు తత్తరపాటందఱి

కిని విశదమేగదా? యిట్టి సమయములలో కాలము విలువ మనకు బాగుగఁ గనఁబడును.

ధనముకన్నను కాలము హెచ్చువిలువకలదని మనము తెలిసికొనవలెను. కాలములో పనిచేసికాని, పంటలుపండించి కాని, వడ్డికిచ్చికాని, వ్యాపారము చేసికాని ధనము సంపాదించుచున్నాము. ఆర్జించిన ధనము వెచ్చించినను తిరుగ సంపాదింపఁగలముగాని గతించినకాలమును తిరుగ రాఁబట్ట లేముగదా! కాఁబట్టి కాలము ధనముకంటె శ్రేష్ఠమయినదని చెప్పనవసరములేదు. కాలమును దెలిసికొను జ్ఞానముకంటె మించిన జ్ఞానములేదు – ఏలయన – కాలముననుసరించి జీవులు శరీరమును బొందుచున్నవి. కాలముననుసరించి పెరుగుచున్నవి. కాలము పరిసమాప్తిజెంద దేహములు విడుచుచున్నవి. కాలమునకు లోఁబడని శరీరములులేవు. ప్రతివ్యక్తియుఁ గాలమునకు లోఁబడి వర్తింపవలసినదే. మానవశరీరములు కాని పశ్వాది జంతుశరీరములుకాని చెట్టుచేమల యొక్క రూపములు గాని ప్రారంభదశలో యుండినట్టు లొక్కటే విధంబున యుండుట లేదని యెల్లరెఱింగిన విషయమే. దినదినంబునను పెరుగుచున్నవి. పెరిగినట్లెపెరిగి కొంతకాలమునకు క్షీణించుట. కొంత కాలమునకు నశించుట సంభవించుచున్నది.

దీనిని కన్నులార కాంచుచున్న మనము, ఇందులకు కారకులెవరో! యని తర్కించిచూచిన కాలకర్తలగుసూర్య చంద్రాది గ్రహములని చెప్పనొప్పు. జీవుడు శరీరమును [illegible] కర్మానుభవించుటకని వేదాంతులువ్యాఖ్యానించెదరు.

బుద్ధిమంతులు తెలిపిన సంతసింతురు. శరీరము పంచ భూతాత్మకమని ప్రతివారు అంగీకరించి యున్నారు. అదే విషయము భూమికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబు లైదును గలవనుచున్నారు. కావున భూమియే సప్త గ్రహములతో గూడినదని వ్రాసిచ్చిరి, అందు వలన సప్తగ్రహములే శరీర మని విదితమయినది.

గ్రహాదుల కాంతిపుంజమువలననే భూమియందు సర్వం బును బోషింపఁబడుచున్నదనుట యోషధులవలన ప్రాణములు శరీరములు పెరుగు చున్నయవి, పెరుగుచున్న మొక్క యెల్లప్పుడు నొకేవిధంబుగ నుండక నానావిధంబులగు పరిణామములనందుట తిలకించుచున్నాము. ఇంకొకవిషయమాలో చింతము. మనమండఱము మామిడి చెట్లును చూచున్నాము. దాని పూత వగరు వగరుగానుండును. కొంతకాలమునకు చిన్నచిన్న పిందెలు కన్పడును. వానియందు వగరు, పులుపు కలిసియుండును. కొంచెము పెద్దకాయ కాగానే మిక్కిలి పులుపుగా నుండును. కొంత కాలమునకు పులుపువిరిగి తియ్యగాను, పసుపుపచ్చగా నుండును. కాలగతివల్ల రంగులుకూడ మార్పు జెందుచున్నవి. ఇందుకు నిదర్శనముగా నాకాశమందు వివిధములగు రంగులతో నొప్పారుచున్న 'యింద్రధనుస్సు' నందఱము వీక్షించుచున్నాము. దీనినిబట్టి తెలియదగిన దేమన నానా రంగులుగల శరీరములు వృక్షములు మొదలగు వానికిగూడ కాలగ్రహ సంచారమే ప్రధానము. గ్రహసంచార కాలమును బట్టి గ్రహములు చాలవనుట యనగా బలము తగ్గినవని తిరిగి జపతపంబులుచేసి దానిని సంపాదించుకొనుట, గ్రహములు

ప్రియతమములైన ధాన్యములు, వస్త్రములు, లోహములు వగైరాలు పలు తెఱంగుల నిర్ణయింపబడియున్నవి.

ఏయే గ్రహములు బలముతగ్గినవో శాస్త్రజ్ఞానమువలన దెలిసికొని యా యా గ్రహంబులకు శాస్త్రచోదితంబులైన ధాన్యాదులు వస్త్రములు రత్నములు దానధర్మములుచేయుట వలన తగ్గిన శక్తులు తిరిగి పెరుగునని యర్థమూహ్యము. దానినే మన పెద్దలు శాంతి చేసుకొనవలెనని చెప్పుదురు. అంతకంటె శాంతి అంటే వేరర్థము కానరాదు. దీనినిబట్టి గ్రహింపవలసిన దేమన శరీరంబును దెలిసికొనుట సప్త గ్రహాదుల విద్య చదువుట. భావ మరయుట ఇట్టి విద్యనే మనవారు కాలజ్ఞాన శాస్త్ర (జ్యోతిషమనిరి.) ప్రతి వ్యక్తియు ప్రతి శరీరముతో భూమికి వచ్చినది మొదలు శరీరి శరీరమును విడుచునంతవరకు భూమిపై నడచు చరిత్రను తెలుపునది, జన్మకాలమునగల గ్రహసంచారమనియు దానినే జన్మ పత్రికయనియు.. జాతక చక్రమనియు, చెప్పుదురు - కాలముయొక్క మంచి చెడ్డలు దెలిసికొనుట జాతక చక్రముల ననుసరించి యీ దేహము వలన గల్గు సుఖదుఃఖములు - ఖేద మోదములు జీవశరీరమునకు మఱియొక శరీరమునకుగల పరస్పర సంబంధము గ్రహముల బలాబలంబులు నేకాలమం దేవిధంబున తగ్గునదియు, హెచ్చునదియు నెట్లు వ్యవహరించిన సుఖంబనుభవించునదియు మొదలగు వివిధవిషయములు దెలుపు వ్యక్తి కాలజ్ఞుడగు జ్యోతిష్కుడని పేర్కొనబడుచున్నాడు.

ఇట్టి కాలపరిమాణమును తెలిసికొనుట మన కవసరమని యెంచియే సర్వేశ్వరుడు సూర్యుని, చంద్రుని, నక్షత్రములను

మనకొఱకు సృజించెను. ఇతర సాధనములతో నవసరము లేక యే వీనివలన కాలమును (అనగా) నెంత వేళ అయినదియు, పగలు పూట యెంత ప్రొద్దెక్కినదియు, రాత్రి యెంతవేళ యయినదియు, మనపూర్వులలో నందఱును కనిపెట్టఁగలిగియుండిరి. ఇప్పటికినట్టి వారుకొందఱుగలరు. జ్యోతిష శాస్త్రము బాగుగఁ జదివినవారికి గాని యట్టి సామర్థ్యము గలుగదు. ఇటీవల కాలమును తెలిసి కొనుట కిసుక, జలములతో చేయఁబడినయంత్రములను, మన వారు కనిపెట్టిరి. ప్రస్తుతము వాచీలు, గడియారములు, టైంపీసులును మన దేశముననే గాక ప్రపంచమందలి యన్ని దేశములందు నింటింటను వాడుకలోనున్నవి. దీనినిబట్టి చూడఁగా కాలపరిమితి తెలియుట యందఱికిని యావశ్యకమన్న మాట స్పష్టమగు చున్నది.

కాలమానములు మూఁడు విధములు. అవియేవనఁగా 1. మనుష్యమానము 2. దేవమానము 3. బ్రహ్మమానము.

మనుష్యమానము:—60 లిప్తము 1 విగడియ
60 విగడియలు 1 గడియ
60 గడియలు 1 దినము
30 దినములు 1 మాసము
12 మాసములు 1 సంవత్సరము
7½ గడియలు 1 జాము
8 జాములు 1 దినము (రాత్రి, పగలు)
7 దినములు 1 వారము
52 వారములు 1 సంవత్సరము
15 దినములు 1 పక్షము

2 పక్షములు 1 మాసము (పితృదినము)
2 మాసములు 1 ఋతువు
3 ఋతువులు 1 అయనము
2 అయనములు 1 సంవత్సరము

| | | |
|---|---|---|
| 17 లక్షల 20 వేల | సంవత్సరములు | కృతయుగము. |
| 12 లక్షల 96 వేల | ,, | త్రేతాయుగము. |
| 8 లక్షల 64 వేల | ,, | ద్వాపరయుగము. |
| 4 లక్షల 32 వేల | ,, | కలియుగము. |

ఈ నాలుగు యుగములు కలసిన కాలము మహాయుగ మనఁబడును. 2000 మహాయుగములు బ్రహ్మకు 1 దినము. ఇప్పుడు 28 వ మహాయుగములో కలియుగము నడచుచున్నది. ఈ కలియుగమునందు 5052 వ సంవత్సరము జరుగుచున్నది.

దేవమానము:—మనకు 1 సంవత్సరము దేవతలకు 1 దినము. అట్టిదినములు 30 దేవతలకు 1 నెల. అట్టి నెలలు పండ్రెండు దేవతలకు 1 సంవత్సరము.

బ్రహ్మమానము:—2000మహాయుగములు బ్రహ్మకు 1 దినము. ఒకరాత్రి ఒకపగలు.

| | | |
|---|---|---|
| అట్టి 30 దినములు | బ్రహ్మకు | 1 మాసము. |
| అట్టి 12 మాసములు | ,, | 1 సంవత్సరము |
| అట్టి 108 సంవత్సరములు | ,, | జీవితకాలము. |

దీనికే బ్రహ్మకల్పమందురు. ఇది బ్రహ్మ ప్రళయము.

| | | |
|---|---|---|
| 1 బ్రహ్మకల్పము | ఆది విరాట్టునకు | 1 పగలు |
| 2 బ్రహ్మకల్పములు | ,, | 1 దినము. |

## మనుష్య జీవిత కాలము

మానవజీవిత పరిమాణము 100 సంవత్సరములని చెప్పు చురుగాని, ఇది గ్రంథములలో కనఁబడుటయేగాని తఱచుగా అనుభవమువలన కనఁబడదు. కొందఱుపుట్టఁగానే మృతినొందు చున్నారు. మఱికొందఱు బాల్యావస్థలో 12 సంవత్సరముల లోనే మరణించుచున్నారు. మఱికొందఱు యౌవనావస్థయందును, కొందఱు కౌమారదశయందును దేహాంత మొందు చున్నారు. కొందఱుమాత్రమువృద్ధావస్థవఱకుజీవించుటచూచు చున్నాము. కాఁబట్టి యెవరెంతవఱకు జీవించియుండఁగలరో చెప్పఁజాలము. ఈ జీవితకాలములో సుమారు సగమునిద్ర యందు గతించుచున్నది. మిగిలిన సగములో సుమారు నాల్గవ వంతు మలమూత్ర విసర్జనయందును స్నాన, పాన, భోజ నాదులయందును వినియోగింపఁబడుచున్నది. మిగత కాలము కుటుంబ పరిపోషణము, కుటుంబ పరిచర్య జీవనోపాధుల సంపాదించుటయందును వాడుక చేయఁబడుచున్నది. మనుష్య జన్మ దుర్లభమనియు నిది క్షణభంగురమనియును, పెద్దలు చెప్పియున్నారుగదా! యిట్టి దుర్లభమైన జన్మపొంది బాలారిష్ట ములు లేక (అనఁగా) బాల్యమరణముపొందక వృద్ధావస్థవఱకు జీవించియుండుట దుర్లభము. జీవించినను, నిహపరములను సాధించుటకుఁ దగినకాలము చాలతక్కువ. ఏమనఁగా బాల్యా వస్థయందుఁ గొంతకాలము విద్యాబుద్ధులు సంపాదించుట యందును యౌవనావస్థయందుఁ జాలకాలము సంసారమందు (అనగా) దారేషణ, ధనేషణ, పుత్రేషణల యందును జరుగు చున్నది. అంతట వృద్ధావస్థ సంభవింపఁగా నింద్రియపటుత్వ

నవయవబలము తప్పి వ్యాధులచే నాక్రమింపఁబడి తనశరీరము తనకే స్వాధీనము లేక మనుష్యుఁడు బాధపడుచుండును. కౌమారావస్థ యని మఱియొకటి చెప్పుచున్నారు. కాని యది దృఢశరీరులయందు యౌవనావస్థతోను, బలహీనులయందు వృద్ధావస్థతోను కలియుచున్నది. కావున పై చెప్పఁబడిన కారణములచేత మనుజులై పుట్టినను జీవులకు పరసాధనమును చూచుకొనుట కవకాశముచిక్కుట కష్టముగా కనబడుచున్నది.

పరము

పరమనఁగానేమి ? దాని సాధనము మన మెందుకు చూచుకోవలెనని కొందఱడుగవచ్చును. ఏ జీవుఁడుఁగాని పుట్టుటకు తన పూర్వజన్మమునందు తాను చేసిన సుకృత దుష్కృత కర్మయే కారణమునియు నట్టిజన్మ లెన్నో యీజీవుడు పొందునదియును, శాస్త్రములవలన కానఁబడుచున్నది. అట్టి కర్మఫలము మంచిదైనయెడల జీవుఁడు స్వర్గాదిభోగము లనుభవించుననియును, నీచమైనయెడల నరకలోకబాధలుపొంది పిదప పశుపక్ష్యాది జంతువులలో జన్మించుననియును, మధ్యమఫలము గల కర్మవల్ల మనుజులై పుట్టుదురనియును చెప్పుచున్నారు. ఇదిగాక కర్మఫలము మూఁడు విధములుగా చెప్పుచున్నారు.

1. సంచితము. 2. ప్రారబ్ధము, 3. ఆగామి.

సంచిత మనఁగా నిదివరకు పూర్వ జన్మములయందు మనచేఁజేయఁబడి మనమనుభవించుటకునిలువగానున్నకర్మ.

ప్రారబ్ధమనఁగా పూర్వజన్మములలో మనము జేయఁబడిన కర్మలలో నీ జన్మయందు మనమనుభవింపవలసిన కర్మ.

ఆగామి యనఁగా నీ జన్మయందు మనచేఁ జేయఁబడి ముందు మన మనుభవించుటకు నిలువలో చేరఁబోవు కర్మ.

ప్రారబ్ధము జన్మములలో నింతకుముందుమనచేఁ చేయఁబడిన కర్మ మానవులకునిలువఁగానుండుననియును, అందులో మొదటిది యనఁగా వెనుక ఏఁడవజన్మమునందలి కర్మ మన కీజన్మమందుననుభవించుటకు నియ్యఁబడినదనియును, వేదాంతశాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నది. దీనికే ప్రారబ్ధమని పేరు. ఈ ప్రారబ్ధము ప్రతి మనుజుఁడు, అనఁగా స్త్రీగాని పురుషుఁడుగాని యనుభవింపక తీరదు. అనఁగా 'తప్పదు' అనియును జ్ఞానమును పొందుటవలన నిదివరకు నిలువయున్న ఆఱుజన్మముల కర్మ యనఁగాసంచితమును, ఈజన్మయందు మనచేఁజేయఁబడుచున్న కర్మ యనఁగా నాగామియును నశింపఁజేసికొని మోక్షమును పొందవచ్చుననియును, వేదాంతము చెప్పుచున్నది. మోక్షమనఁగా జననమరణాదులు లేక (అనగా చావుపుట్టుటలుమరి లేకుండ) జీవుఁడు దేవునియందు లయించుటకనఁగా చేరుట. ఇట్లు మోక్షమునుపొందుశక్తియనఁగానర్హతమనుష్యులకుదప్ప పశుపక్ష్యాది యితర జంతువులకు లేదు. ఎందుచేతననఁగా వాని జన్మయనుభవము కొఱకే, అవి యదివఱకు చివరజన్మమున పొందిన మానవజన్మమందుచేసిన పాపపుఫలముననుభవించుటకే, ఆజంతుజన్మ వానికియ్యఁబడినది. వానికి నాగామి లేదు. అనఁగా పశుపక్ష్యాదులు చేసిన కర్మవలన గలిగిన పాపముగాని పుణ్యముగాని, యవి యనుభవింప నవసరము లేదు. ఎందుచేత ననఁగావానికిబుద్ధి లేదు. మానవులకు బుద్ధియున్నది. బుద్ధిపూర్వకముగాచేసిన కర్మఫలమే యనుభవింపవలసియుండును. కావున

మనుష్యులకు సర్వేశ్వరుఁడు బుద్ధియిచ్చియున్నాఁడు. దానిని వికసింపఁచేసికొనుటకు వారికి విద్య యావశ్యకము. అందుకే స్త్రీ పురుషాదులకు విద్యకావలసియున్నది. బుద్ధిని ప్రకాశింపఁజేయునదే విద్య. విద్యనేర్చుకొనుటవలన వినయము, దాని వలన తగినవా రనిపించుకొనుట, ధనము సంపాదించుట, కుటుంబ పరిపోషణము చేసికొనుట, దానధర్మములు చేయుట యందువలన నిహపరసుఖములను బొందుట సంభవించును. ఇట్టి విద్యవలన పాపమనఁగా నేమో పుణ్యమన నెట్టిదో, మాత్రము తెలిసి యుక్తప్రవర్తనగలవారై పాపకార్యములను మాని చేతనైనంతవఱకు పుణ్యకార్యములు చేసి స్వర్గాది భోగములు కొంతకాల మనుభవించి తిరిగి మనుష్యులై జన్మింతురు. తిరిగి యా విద్యను బాగుగ పొందినవారై హెచ్చు జ్ఞానమును సంపాదించి యిహలోకసుఖము క్షణమాత్రముండు నదియని యెంచి దానిని కోరక శ్రీసర్వేశ్వరునియందునిశ్చలమైన భక్తిగలవారై సేవించి తాము చేసిన పుణ్యకర్మఫలము తాము కోరక శాశ్వతమైన మోక్షమును పొందుదురు.

## ప ర లో క ము లు

జ్ఞానము ప్రతిమనుజుని కవసరమని పైనచ్ఛాయఁబడుట యేగాక యందఱికిఁ దెలిసియేయున్నది. ఇహలోకమునకు నుప యోగించు జ్ఞానము పరలోకమునకు నుపయోగించు జ్ఞానము నొకటే యయినను దానిని యుపయోగించుటను బట్టి ఫలము వేరుగానుండును. మోక్షమును పొందుటకు కావలసినజ్ఞానము వేరు. దానినియాత్మజ్ఞానమందురు. పరలోకములు నాలుగు

ముఖ్యమైనవిగాఁ జెప్పవచ్చును. అందు మొదటిది స్వర్గము. దీనిని దేవలోకమందురు. అందు రాజు దేవేంద్రుఁడు. ఇతఁడు అష్టదిక్కులలో నొకటైన తూర్పుదిక్కున కధిపతి. మిగిలిన యేఁడు దిక్కుల యధిపతులుకూడ దేవతలే.

రెండవది బ్రహ్మలోకము లేక సత్యలోకము. దానికధిపతి బ్రహ్మ. మూఁడవది కైలాసము, దానికధిపతి యీశ్వరుఁడు. నాల్గవది వైకుంఠము. దాని కధిపతి శ్రీమహావిష్ణువు. ఇందు 2,3,4 లోకములకు పోవువారా యా లోకాధిపతు, లుండునంత కాల మందు సుఖ మనుభవించుచుండి, వారితో కల్పాంతమున నంత మొంది తిరిగి కల్పాదియందు మరల భూలోకమున జన్మింతురు. మొదటిదగు స్వర్గమునకుఁ బోవు వారటు నింద్రుఁడుండు నంతకాలము నందుండరు. వారివారి పుణ్యఫల మనుభవము జెందినవెంటనే మరల భూలోకమున జన్మింతురు. పై నాలుగు లోకములందును కర్మ క్రొత్తగా చేయుటకుఁగాని, దాని ఫలము హెచ్చుచేసికొనుటకుఁగాని యధికారముండదు. భూలోకమందు తాము చేసికొన్న పుణ్య కర్మముల ఫలము వలన కలిగిన సుఖమనుభవించుటకే యక్కడకు పోవుదురు. అది చెల్లఁగానే తిరిగి వారికి చావుపుట్టుకలు కలుగును. కావున శాశ్వత సుఖము నవియ్యఁజాలవు.

జ్ఞానసాధనములు — మోక్షము.

మోక్షమట్టిదికాదు. మోక్షమనఁగా నాదివిరాట్టును, అది మధ్యాంతరహితుఁడును, సర్వశక్తుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వవ్యాపకుఁడును, సర్వాత్ముఁడును, సర్వాంతర్యామియు నైన

పరబ్రహ్మమునందు లయించుట లేక నైక్యమగుట. దీనినే శాశ్వత బ్రహ్మలోక నివాససిద్ధి పొందుట యని చెప్పుదురు. ఆత్మజ్ఞానము పొంది, మోక్షమును సంపాదించుటకే ప్రతివాడును ప్రయత్నము చేయవలెను. ఆత్మజ్ఞానమన నా పరబ్రహ్మ యొక్క యాత్మయే, మనయందున్నదనియు సర్వ యన్ని జీవ జంతువులయందు నున్నదనియు తెలిసికొని తనను తానెట్లు ప్రేమించునో యట్లే పిపీలికాది బ్రహ్మపర్యంతము గల జీవులను ప్రేమించుట. ఏ జంతువునందును భేదబుద్ధి లేకుండుట. సర్వ సమత్వము కలిగి తామరాకులోని నీటిబొట్టువలె సంసారమందు వర్తించుచు కర్మలు చేయుచు వాని ఫలమును కోరక సర్వేశ్వరునియందు సమర్పించుచు, ప్రారబ్ధము ననుభవింప వలసినంత కాలము బ్రతికియుండి యాత్మజ్ఞానమును సన్నివలన, యాగామి, సంచితములను దహింపజేసి దేహాంతమందు మోక్షము పొందుటకు ప్రతిమానవుడును ప్రయత్నింప వలెను. అట్లు ప్రతివారు నీజన్మ యంతమందే మోక్షమొక ప్పుడు పొందకున్నను, జన్మాంతరమందైనను తప్పక బొందుదు రని శ్రీభగవద్గీత మొదలగు జ్ఞానప్రతిపాదకములగు గ్రంథము లలో జెప్పబడియున్నది. జ్ఞానసాధనములగు గ్రంథములలో ముఖ్యమైనవి—1. వేదములు 2. ఉపనిషత్తులు 3. పురాణములు 4. శాస్త్రములు 5. బ్రహ్మసూత్రములు 6. భగవద్గీతమున్నగు నవి చెప్పబడి యున్నవి. కానియవి సంస్కృతమున వ్రాయబడి యుండుటచేత నాభాషా పాండిత్యముపూర్తిగా గలవారికేగాని యితరులకు సులభముగా నర్థబోధకములుగావు. మన మాతృ భాష పూర్వము సంస్కృతమే యయినను నిప్పుడు సాధారణ

ముగా వాడుకలో లేదు. పూర్వము సామాన్యముగా సంస్కృతమే, కుటుంబములో స్త్రీలుకూడమాటలాడుచుండెడివారఁట. అది నానాఁటి కంతరించినది. కావున నా గ్రంథములు మనంతట మనము పండితులసహాయము లేకుండ నుపయోగించుకొను శక్తి మనలో చాలమందికి లేదు. పై గ్రంథములన్నియు వ్యాఖ్యతో ననఁగా టీకతో తెలుఁగు లిపితో నున్నను,సులభముగా నర్థముగావు. పురాణములలో కొన్నిమాత్రము దేశభాషలలోనికిభాషాంతరీకరింపఁబడియున్నవి. అవిపద్యకావ్యములలోనున్నవి. కాఁబట్టి యా యాభాషలలోసామాన్య పాండిత్యమైనను గలవారికితప్ప నితరులకు బోధపడవు. అట్టి యర్థజ్ఞానముగలవారు సహితము వానిలో నొక్కొక్కటిని జదివి ముగించుట సులభముగాదు. చాలకాలము పరిశ్రమ యావశ్యకము. మహాపురాణములు పదునెనిమిదియు నేదైన నొక్క దేశభాషలో వ్రాయఁబడి యుండక పోవుటచేత నొకటేభాష తెలిసినవారికి వాని నన్నిటిని చదివి ముగించుటకవకాశము లేదు.

మోక్షాపేక్ష కలుగు వయసు.

ఏందుచేతననఁగాసాధారణముగా జనులలోచాలమందికి కాలము మళ్ళిన తరువాతగాని పాపపుణ్యవిచక్షణ కలుగదు. అది కలిగిన పిమ్మటగాని పాపకార్యములయందు భీతి, పుణ్యకార్యములయందు ప్రీతి కలుగనేరదు. అటుపిమ్మట వారది వఱకు తాముచేసినపాపములను తలఁచుకొని, భయపడి పశ్చాత్తాపమునొంది, చెయ్యికాలిన తరువాత యాకులు వెదకుకొను వానివలె, పాపములను పోగొట్టుకొనుటకు సాధనములను వెదకు

కొనుచు, నూతులు, చెఱువులు మొదలగు జలాశయముల యందుఁ బడినవారు తమప్రాణములను గాపాడుకొనుటకు తగిన యూఁత వెదకుకొనునట్లు, పలుదిక్కులఁజూచియనేక విధములఁ దల్లడిల్లుచు, నాలోచించెదరు. అప్పుడువారు తమంతట తాము సరియైన సాధనములు దెలిసికొనలేక, వారిని వీరిని యడిగి తెలిసికొందమని ప్రయత్నింతురుగానివారికితగినయుపాయ మునుచెప్పువారు దొరకుట దుర్లభము. ఏలయనఁగాసామాన్య ముగా నందఱు నట్టిస్థితిలోనే యుందురు. ఎవరికిని సరియైనసాధ నము తెలియదు. కావున కొందఱుపవాసములు మంచి వనియు, మఱికొందఱుతీర్థయాత్రలు మంచివనియు, కొందఱు పురాణములు చదువుట, వినుట మంచిదనియు, ఇతరులు దాన ధర్మములు చేయుట మంచిదనియు, నిట్లనేకవిధములుగాఁజెప్పు దురుగాని నిశ్చయించి చెప్పఁజాలరు. ఇవి యన్నియు మంచివే కావచ్చును, పాపములను బోగొట్టవచ్చునుగాని యిట్టి సాధన ములలో నెవరి కేది యనుకూలముగా నుండునో యది వారే యెంచుకోవలెనుగాని యొకరుకొకరు మరియొకరు వారికి తగిన సాధనము చూపలేరు. ఏమనఁగా జనులస్వభావములు, నడ వడికలు, స్థితిగతులు, నవకాశములు, బుద్ధులువేరుగానుండును. కావున నెవరికి సదుపాయముగా నుండు పాపపరిహార మార్గ ములు, తరణోపాయములు వారేయెంచుకొని యవలంబింప వలయును. అట్లుయెంచుకొనిమనస్సు నందుకు స్థిరపఱచుకొన్న పైని తమ రామార్గమున నడుచుటలో సహాయము కావలసి వచ్చు డదివఱ కామార్గముననుసరించినవారిలో బాగుగ తెలిసిన వారిని యడిగి, సరియైనత్రోవను తెలిసికొనవచ్చును.

జ్ఞానమును పొందుటకు నాయువవసరము.

ఈ పైన చెప్పిన కారణములవలన నింతకును ప్రధాన మైనది యాయువు. జనులు కొంతకాలము బ్రతికియుండి మనస్సు పరిపక్వముగలవారై నరలోక భయము, పుణ్యలోకములు పొందవలెనని కోరిక, కలిగినప్పుడు కదా దానికి తగిన సాధనములగురించి వెదకుకొందురు. ఈ లోపుగా రోగములవలనపీడితులై బలహీనులైనను, చనిపోయినను, నట్టియవసర మేతటస్థింపకుండునుగదా! పరమేశ్వరుఁ డెవరి కెంత పరమాయు విచ్చియున్నాఁడో నిశ్చయముగా నెవరికిని దెలియదు. కాని యారోగ్యమును కాపాడుకొనుటకు కొన్నిమార్గములున్నవి. వాని నిచ్చట నాకు తెలిసినంతవఱకు చదువరుల యుపయోగముకొఱకు క్రింద వ్రాయుచున్నాను.

ఆయువు వృద్ధినొందుటకారోగ్యవవసరము.

మనుష్యులకు పశుపక్ష్యాదిజంతువులకు సామాన్యధర్మములు నాలుగు. అవియేవనఁగా 1. ఆహారము 2. నిద్ర 3. భయము 4. మిథునకృత్యము. ఈధర్మములనఁగాపనులయందు మితిమీరక నియమముతో క్రమముగా సంచరించువారికి వైరోగ్యలోపముండదని వైద్యశాస్త్రములో చెప్పబడియున్నది. కానిజబ్బుప్రవేశించి మందుపుచ్చుకొనునప్పుడుగాని, యాసంగతులు మనకు వైద్యులు చెప్పరు. అప్పుడు వారుచెప్పు సంగతులకే పథ్యమందురు. ఆ పథ్యాపథ్యములు రోగములు రాక ముందే కొంతవఱకు మనకు తెలిసియుండినయెడల రోగబాధ కనబడక పోవచ్చును. పథ్యమనే మాటకు హితవనియు నపథ్య

మన హితవుకాని పనియు సర్వము. పథ్యము రెండువిధములు. 1. ఇచ్ఛాపథ్యము, అనఁగా తనశరీరస్థితినిబట్టి యాలోచించి యప్పటికితనకేమి యవసరమో దానిని నుపయోగించుట. 2. కఠినపథ్యము (అనగా) తనకేమికావలసియున్నను సరేగాని నియమితపదార్థములనే యుపయోగించుట. మనము నిత్యము వాడుకలోనుంచవలసినదియు నిచ్ఛాపథ్యమే. ఎవరినోటికే వస్తువు మిక్కిలిరుచిగానుండునో యదేవారి శరీరమునకు పడనిది 'మిక్కిలి బాధించునది' అని తెలిసి మితముగా తినవలెను. దానిని తఱచుగా దినకూడదు. ఆహార విషయమై ఈ క్రింది నియమములు పాటించవలెను.

ఆరోగ్య సాధనములు.

1. వేళ తప్పక భోజనము చేయవలెను,

2. తనశరీరమున కప్పటికి పడుపదార్థములు తినవలెను.

3. మితముగా తినవలెను.

4. తనపొట్టలో సగమన్నము మొదలగు పదార్థముల తోను నాల్గవభాగము నీటితోను నింపి మిగిలిన భాగమును వాయువుండుటకవకాశము నుంచవలెను.

5. భోజనము చేసినతరువాత నాలుగు గంటల వఱకు మఱి యేపదార్థమును తినఁగూడదు. అవసరమైనయెడల మంచి నీరు మాత్రమే త్రాగవచ్చును.

6. ఆకలితో నుండఁగూడదు. బాగుగ నాకలిగలిగి నప్పుడేమియును తినకయున్న పైత్యము ప్రకోపించి ప్రాణమున కుపద్రవము కలుగఁజేయును. ప్రకోపించుటనఁగా పొంగుట,

7. ఆకలి బాగుగకలిగినప్పుడు ద్రవపదార్థములు, అనగా నీరు, కాఫీ, టీ, మొదలగునవిమాత్రముచాలవు. పాలుమంచివి యయిన చాలును.

8. మితిమీరి భుజింపఁగూడదు.

శరీరము నందలి మురికినిపోఁగొట్టుకొనుటకు స్నానమవసరము. దీనికి తగినకాలము సూర్యోదయ సమయముగాని యంతకు కొంచెము ముందుకాలముగాని, చల్లనినీరు శ్రేష్ఠము. లేదా గోరువెచ్చని నీరుమంచిది. భోజనముచేసినపిమ్మట లేదా, యేదైన నాహారము పుచ్చుకొన్నపైని యదిబాగుగ జీర్ణమగువఱకు స్నానముగాని కంఠస్నానముగాని కూడదు. అభ్యంజన స్నానము (నూనెమర్దన వగైరాలు) తఱచుగానవసరము.

నిద్రయారోగ్యమునకు ముఖ్యసాధనము. ఇది బాలురకు విశేషముగా నవసరము. వారి నిద్రకు పరిమితిలేదు. యౌవనమందున్న వారి కెనిమిది తొమ్మిది గంటల నిద్రయవసరము. ఆరోగ్యదశలో నుండు వృద్ధులకు సయితమాఱు లేక యేడు గంటల నిద్రయుండవలెను. ఆఱుగంటలైనను నిద్రపట్టకపోయి నపుడు వారికారోగ్యము లేదని నమ్మవచ్చును. పగటినిద్ర యారోగ్యము చెఱచును. మంచివేసవికాలములో వేడివలన రాత్రి నిదుర వేగముగపట్టనిదినములలో పగలొకటి రెండుగంట లెండవేళ నిద్రించినను దోషములేదు. రాత్రి ప్రథమభాగమందు నిద్ర శ్రేష్ఠము. కావున పెందలకడ పరుండి పెందలకడ లేచుట యారోగ్యముకు బలపఱచును. కోడికూత వేళ నిద్రనుండి లేచుట యారోగ్యమును, బలమును, ధనమును, పార

మార్థికము నిచ్చునని చెప్పుదురు. ఇందుకు కారణములాలోచించి వేదాంత, వాత్స్యాయన, పారాశర్యాది మహామునులు వ్రాసిన మహోత్కృష్ట గ్రంథరాజముల వలన దెలిసికొన వచ్చును,

భయము, విచారము లేక దుఃఖము, కోపము నీమూడు నారోగ్యమును చెడఁగొట్టుటకు సమానమైన కారణములే. అవి హెచ్చుగా జనులకు కలిగినప్పుడు వానిని తగ్గించుకొనుటకెల్ల విధముల బ్రయత్నింపవలయును, లేకున్న నాయా సమయములందు మనశరీరమందు నెప్పుడును మితముగాను, నారోగ్యదశయందు సమభాగములుగాను, చరించు వాత, పిత్త, శ్లేష్మములు, భయముగాని దుఃఖముగాని, కోపముగాని మించి యధికమగు నప్పుడు పొంగి గొప్పవ్యాధులను కలిగించును. ఒకానొకప్పుడు వెంటనే మరణమును లేదా మూర్ఛనైనను కలిగించును. కావున తెలివిగలవారు దానిని నుపయోగించుటకు తగిన సమయములు కలుగు నప్పుడే. ఎప్పుడును సంతోషముగా నుండువారికి నాయురారోగ్యైశ్వర్యములు వృద్ధియగును.

మిథునకృత్యము పై మూఁటికన్న నారోగ్యమును గాపాడుటయందు ముఖ్యము. ఎందుచేతననఁగా నింద్రియ నిగ్రహమువలన బలవృద్ధియు, శరీరపుష్టియు, కాంతియు, కలుగును. వీర్యనష్టమువలన బలహీనతయు, శరీరముక్షీణించుటయు, కాంతివిహీనతయు కలుగును. ఇది పరమ రహస్యమైన విషయ మగుటచేత దీనిని గుఱించి తల్లిదండ్రులుగాని, గురు

వులుగాని, పెద్దలుగాని, తఱచుగామనకుపదేశము చేయరు. ఈ యంశములో స్వాభావికమైన జ్ఞానమును బట్టి స్త్రీ పురుషులు సంచరింతురే గాని వారికి హితోపదేశము చేయువారు లేరు. లేకున్న నిందువిషయమై పశుపక్ష్యాదులు బహునియమముతో సంచరించుచుండుట మనము చూచుచున్నాము. అవి వాని నియమిత ఋతుకాలము నందే సంగమము చేయును. ఈ సంగతి మనము చూచి కనిపెట్టుచున్నాము. పిచ్చుకలు, కాకులు,చిలుకలు,గోరలు,కుక్కలు మొదలగుజంతువులపిల్లలను మనము తెచ్చి పెంచవలెనన్న నా యా కాలములలోనే దొరకును గాని మనము కోరినప్పుడెల్లను దొరకవు. ఏలయన నవి వానినియమిత ఋతుకాలమునందే సంయోగము జేయును. ఆవులు కూడ నట్లే వానికవసర మైన సమయ మందొకటి రెండుసారులు జతకూడును, గాని గర్భము నిలిచినతరువాతనా స్త్రీజంతువును పురుషజంతువు మఱి చూడదు. వానికి పసిపట్టి తెలిసికొను శక్తి సర్వేశ్వరుఁ డిచ్చియున్నాఁడు. ఇట్లు సంచరించుచుండుటచేతనే యవి తఱచుగాబలారోగ్యములు కలిగి యుండును. మనుష్యులకువలె వానికి తఱచుగా రోగములు రావు.

### ఇంద్రియనిగ్రహము

జనులట్టి కాలనియమములను పాటింపక రాత్రిపగ లను విచక్షణ లేక సంచరించుటచేతనే బలహీనులగుటయు, వ్యాధి పీడితులగుటయు, సంతాన నష్టములు కలుగుటయు దక్కినపిల్లలు బలహీనులై రోగపీడితులు బుద్ధిహీను లగుటయు సంభవించుచున్నది. జనుల కట్టి కాలనియమములు, ఋతుకాల

ములు లేవా ? వానిని తెలిసికొనుటకు వీలులేదా ? యని కొందరు అడుగవచ్చును. అన్నిజంతువుల కన్న మనుష్యులకే యట్టివి కనిపెట్టుటకు హెచ్చవకాశము లున్నవి. ఎందుచేత ననగా స్త్రీల ఋతుకాలము ప్రత్యక్షముగా వారికి తెలియునుగదా ? యది మొదలు మూడురోజులు వారిని ముట్టుకొనగూడదు. ఎందుచేత ననగా, నదియే వారికి ఋతుకాలము. ఆకాలమందు గర్భకోశమందలి కమలము వికసించియుండును. అట్టి సమయములో సంయోగముచేసిన యా స్త్రీల కెప్పటికి సంతానము కలుగక పోవుటయే గాక కుసుమ జాడ్యములు, గర్భాంగశూల (కడుపునొప్పులు) వగైరాలుకలిగి వారు త్వరలో బలహీనలై యసువుల గోల్పోవుచున్నారు. నాలుగవ రోజుకూడ స్రావమున్నయెడల దూష్యమే. తరువాత 12రోజులవరకుసంతానము కలుగుటకు నియమితకాలము. వానిలో సరిదినములందు పురుష సంతానము, బేసిదినముల యందు స్త్రీసంతానము కలుగునని శాస్త్రములు చెప్పుచున్నవి. ఆ 12 దినములలో పర్వతిథులు అనగా పౌర్ణమి, అమావాస్య, ఏకాదశి, కృష్ణపక్షాష్టమి, చతుర్దశి, మాసాంతము, సంక్రమణము, పితృమాతృ తిథులు (తల్లిదండ్రులకు తద్దినము పెట్టిన దినములు) సంయోగమునకు దూష్యములని మనుస్మృతి మొదలగు గ్రంథములందు జెప్పబడియున్నది. ఇట్లు రజస్వలయిన 16 దినములు మించినపైని తిరిగి రజస్వలగువఱకు సంయోగమున కర్తలేదని పెద్దలు వేద, శాస్త్ర, పురాణములయందు నియమించియున్నారు. అట్టి నియమములననుసరించి సంచరించినవారు ముఖ్యముగా బలారోగ్యములుకలిగి మంచిబుద్ధిమంతులు, సుగుణవంతులు నాయురా

రోగ్యవంతులగు పిల్లలను కని సుఖింతురు. వారి కాయుర్వృద్ధి కలిగి చాలకాలముజీవించి పాపభీతి పుణ్యప్రీతి కలిగిసత్కార్యములు చేయుచు జీవించునంతవఱ కాయుర్భాగ్యము లనుభవించుచుపురాణములు, పుణ్యకథలు, చదువుచు వినుచు జ్ఞానము వృద్ధినొందించుకొని తుదకుమంచిలోకములనుగాని, మోక్షమునుగానిపొందుదురు. మనపూర్వు లిట్టి నియమములతో సంచరించుటచేతనే చిరకాలజీవులు నారోగ్యవంతులునై యుండిరి.

ఇందువిషయమై ముఖ్యనియమములు కలవు.

1. ఇరువదియొకటవ సంవత్సరము వఱకు పురుషుఁడు గర్భాధానము చేయుటకూడదు. ఎందుకనఁగా నింద్రియపుష్టి యప్పటివరకును బూర్తిగా కలుగదు.

2. స్త్రీలు ప్రథమ రజస్వల లైనంత వేగమే వారికి గర్భాధానము చేయకూడదు. వారు క్రమముగా నెలకొకసారి రజస్వల లగుచుండునపుడు యుక్తసమయము.

3. గర్భాధానమైన పిమ్మట, నొకటి రెండు సంతానములు కలుగువఱకు తమ భార్య మూఁడు మూట్లగువరకధమము రెండు మాసములైనను నప్పుడప్పుడెడబాసి యుండుట ధర్మము. అట్టి ధర్మముచే సంతానము కలుగుటకు, కలిగిన సంతాన మాయురారోగ్యబుద్ధి బలములు కలిగియుండుటకు ముఖ్యసాధనము. ఇందుకే స్త్రీలను చిన్నప్పుడు తఱచుగా పుట్టింటికి తీసికొని పోవువాడుక యున్నది. అట్లుచేయని దంపతులకు పిల్లలు కలుగు టరుదు. కలిగినను దక్కుట కష్టము.

4. సంతానము కలిగిన స్త్రీ తిరుగ ఋతుమతి యగు వఱకుసంయోగమునకుఁ బనికిరాదు. అంతకు ముందు తొందర పడిన యెడల తల్లి పిల్లలకు బలహీనత, రోగములు కలుగును.

5. స్త్రీ పురుషులలో నెవరికైనను, తలనొప్పిగాని నడ్డి నొప్పిగాని, జలుబుగాని, జ్వరముగాని, విశేషము కాళ్ళు పీకు గాని యున్నప్పుడు సంయోగముకూడదు. మూర్ఖతతో చేసిన ప్రాణోపద్రవము వెంటనే కలుగును.

6. జాతాశౌచము, మృతాశౌచము, పక్షిణీ కలుగు నప్పుడందు ముఖ్యముగా తామే కర్తలుగానుండి కర్మ చేయ వలసి నప్పుడు, సహపిండమయిన మరునాఁడు తామభ్యంజన స్నానము చేసిననాఁటిరాత్రిగాని సంగమముకూడదు, ఆక లితో నున్నప్పుడుగాని, భోజనము చేసిన వెంటనేగాని, సంభో గము కూడదు. స్త్రీ గర్భిణియైన 6 మాసముల పిమ్మట సంభో గము చేయుట స్త్రీహత్య, శిశుహత్యతో సరియైన పాపమని గ్రంథములలో చెప్పఁబడినది. కావున వివేకులు ఈ విషయము లందు మెలకువతో ప్రవర్తించినచో స్వకుటుంబమునకే గాక నిహపర ధర్మములకు సాధనభూతులై దేశమున క్షామాది మహోడంబరోపద్రవములు శాంతింపజేయు వారనుటకు సందియ మావంతయు నిల్లెయని చెప్పనొప్పు.

---

# విజ్ఞాపనము

ఈ పైని వ్రాయబడిన సంగతులవలన కొంతజీవిత కాలము చెల్లిన తరువాతగాని మనస్సు పరిపాకమును పొందదనియు, నటుతరువాతగాని పాపపుణ్య విచక్షణ మనుజులకు కలుగ దనియు, కలిగిన పైనిగాని పరలోక సాధనములను మనము వెదకుకొనమనియునప్పటికిశరీరమారోగ్యముగానుండినగాని యిట్టిసాధనములనుసరించి పుణ్యమును సాధించుటకు దగిన సమర్థత యుండదనియు దెలియుచున్నది. జ్ఞానసంపాదనకు పైని చెప్పఁబడిన ముఖ్యమైన యాఱుగ్రంథములలో నైదు కేవలము సంస్కృతములోనే వ్రాయఁబడి యుండుటచే అందఱికిస్వాధీనములు కావనియు, పురాణములు కొన్నిమాత్రము దేశభాషల యందు వ్రాయఁబడినందున కొంతవఱకు మనకు సాధ్యములని యెంచి, కొన్ని తెలుఁగునను మఱికొన్ని ఓఢ్రభాషలోనునేను చదువుచుండఁగా చూచిననాస్నేహితులలో కొందఱుపురాణములు గ్రంథబాహుళ్యము గలవనియు, నవియు తెలుఁగున సులభశైలిని వ్రాయఁబడి యుండనందున నందఱునువానినైన చదువుటకు వీలు లేదనియు, వానిని క్లుప్తముగా తెలుఁగున వచనముగ సులభశైలిని వ్రాసిన అందఱకు తెలుఁగుభాషను చదువనేర్చిన ప్రతివారికిని, జాతి మతభేద విచక్షణ లేక చదువవచ్చుననియు చెప్పి, నన్నుప్రోత్సాహపఱచిరి. వారిలో ముఖ్యులుగా బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రులుగారిని పేర్కొనవచ్చును.

వీరునన్ను గ్రంథము వ్రాయుటకు ప్రోత్సాహము చేయుటయేగాక సహాయసంపత్తియు నిచ్చెదమని వాగ్దానమొసంగినందున "అష్టాదశ పురాణ సారసంగ్రహ"మను పేరితో దీనిని రచించుటకు సాహసించితిని. ఉపోద్ఘాతమునందు వ్రాయఁబడిన సంగతులు, గ్రంథాంతరములందు కనిపెట్టబడినవియు, పెద్దల వలన విన్నవియు నాయనుభవమువలన స్థిరపరుపఁబడినవియు గనుక నాదరణీయములనితలంచెదను. ఇటుపైని వ్రాయబోవునవి శ్రీవ్యాస మహామునివలనసంస్కృతమునమహాపురాణములుగ వ్రాయఁబడి తెనుఁగు, ఓఢ్రభాషలలోపద్యకావ్యములుగాతగిన కవులవలన వ్రాయఁబడినవి కావున విశ్వసింపఁదగినవి. సదుపాయము కొఱకు చేయఁబడిన కొద్దిమార్పులు తప్ప నేను వ్రాయుదానిలో క్రొత్తసంగతు లేమియు నుండవు. ప్రతిపురాణమునకు ముఖ్యలక్షణములయిదు. అవియేవనగా 1. ప్రళయము 2. సృష్టి 3. వంశము (సూర్యచంద్ర వంశములు) 4. మనువర్ణనము. 5. ఈశానుచరిత్రము, అనఁగా శ్రీహరియొక్క లీలావతార చరిత్రములు.

ఈ పైని చెప్పినవానిలో ప్రళయము, సృష్టి, కొన్ని పురాణములలో విపులముగాను,కొన్నిటియందు క్లుప్తముగాను చెప్పఁబడియున్నవి. వానిలో బాగుగా వర్ణింపఁబడినదియొక్కట్టి మాత్రము వ్రాసి తక్కినవి విడిచి పెట్టుచున్నాను. గ్రంథబాహుళ్యభీతిచే చరిత్రములను క్లుప్తపఱచుచుముఖ్యాంశములు విడిచిపెట్టకుండ వ్రాయుచున్నాను. లోపాలోపములున్నను చదువరులు నన్ను క్షమింప వేడుచున్నాను.

మహాపురాణములు పదునెనిమిది. అవి యేవనఁగా :

1. మత్స్యపురాణము. 2. కూర్మపురాణము. 3. వరాహపురాణము. 4. వామన పురాణము. 5. బ్రహ్మవైవర్తపురాణము. 6. బ్రహ్మాండ పురాణము. 7. లింగపురాణము. 8. మార్కండేయ పురాణము. 9, అగ్నిపురాణము. 10 నారద పురాణము. 11. భవిష్యత్పురాణము. 12. శ్రీమద్భాగవతము. 13. విష్ణుపురాణము. 14. స్కందపురాణము. 15. పద్మపురాణము. 16. గరుడపురాణము. 17. శివపురాణము; 18. బ్రహ్మపురాణము.

వీనియందలి సంగతులు వేరువేరుగా వ్రాయుచున్నాను.

ఇట్లు గ్రంథకర్త:
వేమూరి జగన్నాథశర్మ



శ్రీ రామాయ నమః

# గ్రంథకర్త వంశానుక్రమణిక.

—:0:—

ఆర్యులారా !

నేను బహు స్వల్పజ్ఞుఁడ, నవివేకుఁడ నయినను నావిషయికమైన యీపురాణ గ్రంథరచనా యుద్యమము బహు గొప్పదియగుటచే నా యాధిక్యత లేకున్నను నాపూర్వీకులు బహు పవిత్రులని తెలుపుట యావశ్యకముగా తోఁచినందున యిచ్చట నాకు తెలిసినంతవఱకు వారిచరిత్రమిందుఁ బొందుపఱచుచున్నాను.

శ్రీమదాంగిరస, అంబరీష, యౌవనాశ్వులను త్రయార్షేయాత్మకమైన శ్రీహరితసగోత్ర పయఃపారావారంబున, అనేక పుణ్యపురుషులుజన్మించి పెక్కుస్థలములందు సద్వైదికవృత్తికలవారై నివసింపుచు రాగారాగా నా ప్రపితామహుండు వేమూరిసూరపశర్మగారు గుంటూరుజిల్లా తెనాలితాలూకాలో నున్న వేమూరుగ్రామమున నివసించుచుండెను. ఈయన వేదపారంగతుఁడై జటాంతస్వాధ్యాయియు, వైదికకర్మ కుశలుండును, ఆగమవేత్తయు నై యుండెను. ఇట్లుండఁగా విశాఖపట్నము జిల్లా విశాఖపట్న వాస్తవ్యులును, జమీందారులును, అగు రాయణంగారు తమ రాజ్యమున అనావృష్టి దోషమువలన పంటలు లేక, జనులకుగాని జంతువులకుగాని త్రాగుటకు నీరులేక బహుబాధలు పడుచుం

డుట చూచి జప, హోమ, దానాదులవలన వర్షముకలుగునని యోజించి కృష్ణాజిల్లా బందరు పట్టణముననున్న వారి స్నేహితుల పేర, వర్షములేమిచే, తమరు పడు బాధలను గురించి వ్రాయుచు అనావృష్టిదోషమును పోగొట్టి వర్షమును కురియునట్లు చేయుటకు తగిన సమర్థతగల బ్రాహ్మణుని చూచి పంపుడని కోరిరఁట. ఆ జాబు చూచి అచ్చట వారు మా ప్రపితామహులగు ఈ సూరపశర్మగారిని తగిన వారని ఎంచి పిలిపించి ఆ నిమిత్తము ఆయనతో చెప్పి విశాఖ పట్టణము వెళ్ళుమని ప్రార్థింపగా ఆయన అందుకు అంగీకరించి తగిన సన్నాహముతో బయలుదేరి వెళ్ళెనఁట. అప్పుడు ఆయనను వారు తగిన మర్యాదచేసి మంచి వర్షము కురిపింపుడనికోరఁగా దాని విధానము చొప్పున జరిగించినతప్పక వర్షము కురియునని ఆయన వారితో చెప్పి, మరికొందఱు బ్రాహ్మణులనుపిలిపించి, వారిచే కొన్నిజపములు, అభిషేకములుచేయించి, తాను చేయవలసిన వారుణజపము తానేచేసి, అందుకుతగిన హోమములు, దానములు, బ్రాహ్మణ సంతర్పణము చేయించి ఆ ప్రక్రియ ముగించు సమయమునహటాత్తుగా మేఘావరణము కలిగి వారి తాలూకా యందంతటను గొప్పవర్షము వర్షించి జలసమృద్ధి కలిగెనఁట. అందుకు రాయణింగారు అపరిమితానంద భరితులై ఆయనను, ఇతర బ్రాహ్మణులను తగిన దక్షిణాతాంబూలాదులచే తృప్తిపఱచిరఁట. పిమ్మట వారు మా ప్రపితామహుని తమదేశమున స్థిరముగా నివసింపవలెనని ప్రార్థింపఁగా ఆయన అందుకు అంగీకరించెనఁట. అప్పుడువారు తమతల్లిగారి పేరట సంవత్సరమునకు సుమారు 500 రూపాయలురాబడిగల

ఒక గ్రామమును ఆయనకు ఇనాముగా నిచ్చిరి. దానికి చెల్లయ్యమ్మ అగ్రహారమని పేరు. ఇది విశాఖపట్నము జిల్లా చీపురుపల్లి తాలూకాలో బుడుమూరు సమీపమున నున్నది. అప్పుడు ఆయన తన గ్రామమైన వేమూరుకు తిరుగ పోయి తనకుటుంబమును తోడుకొనివచ్చి తనచే ప్రతి గ్రహింపబడిన చెల్లయ్యమ్మ అగ్రహారమున శ్రీరాయణంగారిచే నిర్మింపబడినగృహమునందు స్థిరముగానివసించు చుండగా ఆయనకు ఇరువురు పుత్త్రులు కలిగిరి. వారిలో పెద్దవానికి గురుమూర్తి శర్మ రెండవవానికి వేంకటేశ్వరశర్మయని నామకరణము లొనర్చిరి. వారును వేదములను, శాస్త్రములను, జ్యోతిషమును చదివి కాలక్రమమున పెద్దవారై వారితండ్రి స్వర్గస్థులైనపిమ్మట విభక్తులై ఆ యగ్రహారమును సమముగా పంచుకొనిరి. వారిద్దఱిలో జ్యేష్ఠులగు గురుమూర్తి శర్మగారికి పురుషసంతతి లేకుండెను. కొందఱు పుత్త్రికలు కలిగిరి. వారిలో నొకరైన పుల్లెల వారికోడలకు మాత్రము సంతతి కలిగినందున దౌహిత్రులగుటచే ఆయన ఆస్తి వారికి కలిసినది. ఆ సంతతివారు ఉన్నారు.

రెండవకుమారుఁడైన వేంకటేశ్వర శర్మగారే మాపితామహులు. ఈయనకనువరుసగా, ఆఱ్వురు పుత్త్రికలును, పిమ్మట కడసారి కాన్పుగా ఒక పుత్త్రుడును కలిగిరి. ఆయనను వారు బహుప్రీతితో పెంచుచు శ్రీసూర్యనారాయణ శర్మ యని నామకరణ మొనర్చిరి. ఆయనకు యజుర్వేదమును, జ్యోతిషమును నేర్పించి బొబ్బిలి పురవాస్తవ్యులగు తనికెళ్ళ రామేశ్వరశర్మగారి కొమార్తెయగు శ్రీజోగాంబయను కన్య

కను వివాహము చేసిరి. ఈ దంపతులకు ఇరువురుపుత్రులు, నలుపురు పుత్రికలు జన్మించిరి. వారిలో సర్వజ్యేష్ఠుడను నేను. నాతమ్ముని పేరు నరసింహశాస్త్రి. మాలో ముప్వురము జన్మించినపిమ్మట మాపితామహులు స్వర్గస్థులైరి. ఆసరికి భూములలో కొన్ని విక్రయింపబడి మిగిలినవి ఋణాక్రాంతములై యుండెను. అప్పుడు మాతండ్రిగారు మాకు పాఠాణ విద్య నభ్యసింపఁజేయుటకై ఆగ్రామమును విడిచి శ్రీకాకుళము కాపురము వెళ్ళి, అచ్చట బడిలో చదువ నన్ను ప్రవేశపెట్టిరి. అచ్చట కొద్దికాలమైన పిమ్మట పెక్కలివచ్చి నన్ను ఆంగ్లేయ పాఠశాలలో చేర్చిరి. అచ్చట నేను మిడిల్ స్కూలు పరీక్ష యిచ్చినపైని పర్లాకిమిడిలో శ్రీరాజావారి ధర్మసత్రములో భుజించుచు వారి హైస్కూలులో చదివి మెట్రిక్యులేషను పరీక్షనిచ్చితిని. అప్పటికి మా ప్రపితామహార్జితమైన గ్రామములోని భూములన్నియు పూర్తిగా విక్రయింపబడి నందున అంతట నేచదువు చాలించి జీవనోపాధి సంపాదింప వలసియుండెను. కావున నేను శ్రీమందసా రాజావారి ఆంగ్లేయ పాఠశాలలో సహాయోపాధ్యాయుడనుగా పదునైదు రూపాయలవేతనమునకు ప్రవేశించి, పిమ్మట ఇరువది రూప్యములకు ప్రమోషను పొంది అచ్చట కొంతకాలముండి పిమ్మట బడులపై తణిఖీదారుగా సుమారు ఒక సంవత్సరముండిన తరువాత ఈ ఛత్రపురములో మాష్టరు ఆన్ సోదొరగారు స్థాపించియుండిన ఆంగ్లేయ పాఠశాలలో సహాయోపాధ్యాయుని పదవిలో నెలకు ముప్పది రూప్యముల వేతనమునకు ప్రవేశించితిని. ఇచ్చట క్రమక్రమముగా ఉద్యోగాభివృద్ధి పొంది ఆ పాఠ

శాలలో ప్రధానోపాధ్యాయుడనైతిని. అప్పటికి ఈ పాఠ శాలకు మేనేజరుగాను, ఈజిల్లా కలెక్టరుగా నుండిన మాష్టర్ మార్ మైకేలు దొరవారికిని, మ॥ రా॥ శ్రీ రావుబహదూర్ తాడేపల్లి వెంకటకృష్ణయ్య పంతులు బి. ఎ., బి, యల్., గారికిని ప్రోత్సాహము కలిగించి వారి సహాయమున ఈ పాఠ శాలను హైస్కూలుగా మార్చగలిగితిని. పిమ్మట నీ పాఠ శాల జిల్లాబోర్డువారి పాలనక్రిందికి వచ్చి యిప్పుడు మంచి అభివృద్ధిలో నున్నది. నేనును ఇంకను ఇందే సహాయోపాధ్యాయుడనుగా నున్నాను.

నేను నా ధర్మపత్నియగు శ్రీ లక్ష్మీదేవితో గూడి నిత్యనైమిత్తిక కర్మలు, యథోచితముగా చేయుచు తీరుబడి సమయములలో పంచదశి, భగవద్గీత, శ్రీరామాయణము, భారతము, శ్రీమద్భాగవతము మొదలగు గ్రంథములు తఱచుగా పఠించుచు, చదివినవే చదువుటకు విసికి, అష్టాదశ మహాపురాణములను పఠియింప నారంభించితిని. నాకు సంస్కృత భాషా ప్రవేశము లేనందున ఈ పురాణము లన్నియు తెలుఁగు భాషలో దొరకనందునను, ఓఢ్రభాషా ప్రవేశము గలుగుటచే పదునెనిమిది పురాణములను చదువ గలిగితిని. ఈ పదునెనిమిదింటిలో మూఁడు, 1. శ్రీమద్భాగవతము, 2. మార్కండేయ పురాణము, 3. బ్రహ్మాండ పురాణములు మాత్రము తెలుఁగు భాషలో చదివితిని. మిగిలినవన్నియు ఓఢ్రభాషలో చదివితిని. ఇవియు పద్యకావ్యములే. ఐనను పామరులకు సైతము అర్థమగు నట్లు సులభశైలిని వ్రాయఁబడియున్నవి. తెలుఁగు భాషలో పద్యాత్మకములై యున్న పురాణములు పండితులకే అర్థ

మగును. ఓ|ఘమున పురాణములు చదువుటకు ప్రయాసపడ నవసరములేదు. ఇవియు సంస్కృతపదములతో నిండి సంస్కృతమునుండి తర్జుమాచేయఁబడియున్నవి. నాగరికత కలవార మనిపించుకొనుచున్న మన యాంధ్రులలో పలువురు స్త్రీ పురుషుల కుపయోగించునంత సులభశైలిని యీ గ్రంథములు లేకుండుట చూచి 'అష్టాదశపురాణసార సంగ్రహ' మను పేర నీ గ్రంథమును శ్రీహరికరుణాకటాక్షమున వ్రాసితిని. పురాణ గాధలను ప్రజలకు తెలియజేయుటయే నా ముఖ్యాభిప్రాయము గాని పాండిత్యప్రకటనకాదు. కావున యిందలి తప్పులను విడిచి యొప్పులను గ్రహింప నా చదువరులను ప్రార్థించుచున్నాను.

ఇట్లు సుజనవిధేయుఁడు,

వేమూరి జగన్నాథశర్మ.

---

# అష్టాదశపురాణసారము

## 1. శ్రీ శివ పు రా ణ ము

ఈ శివమహాపురాణమును శ్రీవేదవ్యాసునివలన తాను వినినట్లు సనత్కుమారుఁడు శౌనకాదిమహామునులకుం సవిస్తరంబుగా వక్కాణించిన తెరంగెట్టిదనిన.

పూర్వమొకప్పుడు శౌనకాది మహర్షులు నైమిశారణ్యమున సభచేసి కూర్చుండి ధర్మచింతనము చేయుచు నొకరితో నొకరు సంభాషించుచుండఁగా సనత్కుమారుఁ డచ్చటికరుదెంచెను. అప్పుడామునులాయనను చూచిలేచి యెదురేగి తోడ్కొనిపోయి యర్ఘ్యపాద్యాది విధులచే యథావిధిగ బూజించి యుచితాసనమున గూర్చుండచేసి సగౌరవంబుగ నాయనతో నిట్లనిరి. "స్వామీ! మీరు బ్రహ్మకుమారులు. మీకు సమస్తవిద్యలుపూర్తిగ తెలియును, వేదము వేదాంగములు, శాస్త్రములు, పురాణములు, సమస్తమును తమరు పరిశోధించిరి. శివపురాణము తమవలన విని తరింపఁ గోరుచున్నాము. కావున దానిని సవిస్తరముగ సెలవిచ్చి మమ్ము‌ను కృతార్థులను జేయుఁడు" అని శౌనకాదులు ప్రార్థింపఁగా విని సనత్కుమారుఁడు వారలతో నిట్లు చెప్ప నారంభించెను. "మహామునులారా! వినుండు శ్రీ సదాశివునిచరిత్ర మనంతము నిరపాయము నిష్ప్రత్యూహము దానిని

చెప్పుటకెవరితరము! నలుముఖములుగల బ్రహ్మకే శక్యముగాదు. దానిని చెప్పుటకు నేనెంతవాడను! మీరు నన్ను శ్రద్ధతో నడిగితిరి. కావున బూర్వము శ్రీవేదవ్యాసునివలన వినినంత చెప్పెదను. ఈ పురాణము బహుపవిత్రమైనది. దీనిని వినువారును చదువువారును సమస్తపాపములను నశింపజేసి కోరిన వారలై భూలోకంబున సకలభోగ భాగ్యసంపదలనుభవించి కృతార్థులై నీ జన్మాంతమున స్వర్గాది భోగము లనుభవింతురు.

## సృష్టిప్రశంస

పూర్వము ప్రళయకాల మందు చిమ్మచీకటిభూనభోంతరాళములందు వ్యాపించియుండగా సృష్టిస్థితిలయములకు గారణభూతుడైన యాదివిరాట్టు వటపత్రశాయియై సూర్యకాంతమణివలె దేదీప్యమానముగా బ్రకాశించుచుండెను. అప్పుడాయన తెలివొంది నిద్ర లేచి యీ ప్రపంచపు దురవస్థను జూచి విచారించి జ్ఞానమునుత్పాదింపజేసెను. జ్ఞానమువలన నహంకారమును, దానివలన మనస్సును, దానివలన పంచభూతములను, (భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకసములను) పుట్టించెను. వానిలో నభంబువలన శబ్దము, వాయువువలన స్పర్శము, అగ్నివలన రూపము, జలమువలన రసము, భూమివలన గంధము జన్మించెను. వానితరువాత ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, అనుపంచ ప్రాణములు; సత్వము, రజము, తమము, అను త్రిగుణములు నుద్భవించెను. అందు సత్వగుణమువలన విష్ణువు, రజోగుణమువలన బ్రహ్మ,

తమోగుణమువలన మహేశ్వరుఁడుజన్మించిరి. వారిలో మహేశ్వరుఁడు సనాతనుఁడు, నిరూపుఁడు, నిరంజనుఁడు,నాదిమధ్యాంతరహితుఁడై యందఱికిని జ్ఞానము నిచ్చు నిమిత్తము పరమశివుఁడను పేరితో నెల్లప్పుడును స్థిరస్థాయిగా నుండువాఁడనియు నతఁడే పైన జెప్పఁబడిన సమస్తమును సృష్టించువాఁడనియు కల్పాంతనమున దిృమూర్తులునశించిన నమ్మహాసీయమూర్తి నశింపడనియు, పురాణము లన్నియు నేకగ్రీవముగా చాటి చెప్పచున్నవి. కావున నతడే యాదివిరాట్టనిగానిపరబ్రహ్మమని గాని పేరుగలవాఁడు, ఆయనకు లోబడినదే ప్రకృతి. ఈయన బ్రహ్మకల్పాంతమున యోగనిద్ర జెందియుండును. బ్రహ్మకల్పమనఁగా:—

7 యుగములు—1 మన్వంతరము
14 మన్వంతరములు— 1 కల్పము.
1 కల్పము—బ్రహ్మకు ఒక పగలు.
1 కల్పము—బ్రహ్మకు ఒక రాత్రి.
2 కల్పములు—బ్రహ్మకు ఒక రోజు.
ఇట్టి 30 రోజులు—బ్రహ్మకు 1 మాసము.
12 మాసములు—బ్రహ్మకు 1 సంవత్సరము.
10 సంవత్సరములు—బ్రహ్మకు 1 ఆయువు.
బ్రహ్మ జీవితకాలము పరబ్రహ్మమునకు నిమిషము.

మనుష్యాదులు జీవించు కాలమెంత? బహుస్వల్పము కదా! కావున మనముదానిని క్రమముగా నుపయోగించి దుస్తరంబైన యీ మాయామయ సంసార సాగరమునుండి

విముక్తిపొందవలెను. ముక్తియనగా నీ ప్రపంచమందుబుట్టుచు జచ్చుచు నుండక, ధర్మ ప్రవర్తనంబు కలవారమై, జ్ఞానము సంపాదించుట, అందువలన మోక్షమునొందుట, అని సనత్కుమారుఁడు చెప్పగా విని యాయనతో ఋషులిట్లనిరి. ఓ బ్రహ్మపుత్రా! యనుల్లంఘ్యమైన యీ సంసార సాగరమును తరించుటకు ముఖ్యసాధన భూతమగు నౌక యేది?

### తరణోపాయము

యయ్యదిమాకు విన్నవింపవేయని యానిరాబారులు కరంబు వేడికోలుసలుప గరుణావరుణాలయుఁడగు సనత్కుమారుఁడు వారలతో నిట్లనియె "ఓ ఋషివరులారా! వినుండు, ఈ పాపపు సంసారమనుసాగరము తరించుటకు (దాటుటకు), నావవంటిది ధర్మము. ఆ ధర్మమును చేయువాఁడు తప్పక ముక్తిపొందును. ధర్మమొకటేసారం అదిలేనివారుతరింపలేరు. కావుననే సాధువులుధర్మమాచరింతురు. ధర్మమే తల్లి, తండ్రి, కొడుకు, కూతురు, గురువు, బంధువు, స్నేహితుఁడు, దైవము. దానికి మించినది మఱిలేదు. అంతమున వెంటవచ్చునదిధర్మమే. జీవించునంతకాలము సుఖమిచ్చునదియు నాపదలనుండికాపాడు నదియు ధర్మమే. స్త్రీపురుషు లుభయులు ధర్మప్రవర్తనులైన యాకుటుంబము దీర్ఘాయుర్యుక్తమై యాయురారోగ్యపుత్ర సంపదచే మేఱమీఱి నిరంతర భాగ్యభోగములతో పస మీఱుచు నితోధికాభ్యుదయ పరంపరాభివృద్ధి నలరుచు నమిత ఆనందము గొల్పుచుం బరార్థమునకు ముఖ్యసాధనభూతమగు చున్నయది. దానివలననే యా జగదీశ్వరుఁడు సృష్టిస్థితిలయ

ములు చేయుచున్నారు. సూర్యచంద్రులు సంచరించు చున్నారు. భూమి పంటలుపండుచున్నవి. చిన్నవిత్తునుండి పెద్ద వృక్షములు పెరుగుచున్నవి. స్త్రీలు సుఖముగా ప్రసవించు చున్నారు. అంతమున ధర్మమొక్కటే మన వెంటవచ్చును గాని, చింకి గుడ్డ సైతము వెంటరాదు. అధర్మపరులకు ముక్తి లేదు. వారలకు తఱచుగాకష్టములు సంభవించును. వారి ముఖమును చూచిన పాపముసంభవించును. మఱియు జాతక చక్రంబున జన్మకాల సంచారగ్రహంబులు స్వోచ్చోపచయాది మహాస్థానంబులనుండినను తాము ధర్మముతప్పుటవలన వ్యతి రేక నీచ ఫలంబుల నిచ్చును గాని పుణ్యఫలంబుల నివ్వజాలవు. స్త్రీ పురుషు లిరువురకు దుష్టస్థానంబుల గ్రహంబులున్నను స్వధర్మ ప్రవర్తనవల్ల కొంచెమాలస్యముగా నైనను పాప ఫలంబు పటాపంచలుచేసి ఫలంబునే యొసంగును. ఇందులకు నిదర్శనము మనముకన్నులారగాంచుచున్నారము. మఱియు జన్మాంతమునయముడు వారలపలువిధనరకబాధలనొందించును. కావున నధర్మమును విడచి ధర్మమార్గమున ప్రవర్తింపవలెను. సూర్యోదయింపగా చీకటులుపోయి వెలుతురుకలుగునట్లు మనుజులకుధర్మబుద్ధికలుగగా వారిపాపములునశించి పుణ్యము కలుగును. దేశమందు క్షామాదియీతిబాధలు తొలగును. ఈ ధర్మదేవతకుపాదములు నాలుగు. అవియేవనగా (1) అహింస (2) సత్యము. (3) దయ (4) శాంతి. ఈ నాలుగుపాదములతో కృతయుగమున ధర్మదేవత సంచరించుచుండెను. త్రేతా యుగమున నహింసనశించెను. ద్వాపరయుగమున సత్యము కూడలోపించెను. ఈ కలియుగమున దయయంతరించెను. ఒక

పాదము మిగిలియున్నది. ధర్మబుద్ధిగలవారి లక్షణములేమన_ తల్లిదండ్రులకు గురువులకు విధిప్రకారమర్చలు సల్పుచు వినయములుగలిగి వారియాజ్ఞలను మీరకుండుట, తీర్థములు, వ్రతములు మొదలగు పుణ్యకర్మలు చేయుట; వంశపరంపరగా వచ్చుచున్న సత్కార్యములుచేయుట, యబద్ధంబగుపథంబు విడిచి సత్యమే చెప్పుట, మృదువుగా మాట్లాడుట, సజ్జనుల యందు ప్రీతిగలిగియుండుట పరుల కుపకారము చేయుట, దరిద్రులకు ధనమిచ్చుట, యెల్లరితో వినయముగా మాటలాడుట, శత్రుమిత్రులను సమముగా చూచుట, పరులనునిందింపకుండుట దేవతలనుపూజించుట, పరస్త్రీలను పరధనముల నాశింపకుండుట, యతిథులను బూజించుట మొదలగునవి ధర్మముగలవారి లక్షణములు

అధర్మపరులు యమునివలన 28 మహానరకములలో వేయఁబడి పలువిధముల యాతనలు పొందుదురు. (ఈమహానరకముల వివరములు వామనపురాణమందు జెప్పబడినవి.)

### శివుఁడు చంద్రుని ధరించుట

పూర్వము శివునిభార్యయైన సతీదేవి, తనతండ్రియైన దక్షుని యజ్ఞగుండమునబడి భస్మమైనపిమ్మట యామెవియోగముచే కలిగిన తాపమును సహింపలేక శివుడు పలుచోట్ల సంచరించుచు మనస్సును స్థిరముచేసికొనలేక యుండెను. అట్టితఱి యుమ్మెక్కంటి తుంటవిలుకాని యంపవాసల యలజడులకు లోగి మది కుదురులేమి నటునిటు నడయాడుచు పలుతావుల నదనదీ కాంతారశిలోచ్చయ కందరాంతర జలాశయ నగ...

పరిజపంబొనరింపనయ్యెడ తృణగుల్మాది తరుచ్ఛదంబులు భస్మీకృతంబులగుచుండె. మఱియునజ్జటావల్లభు కంటిమంటలకుత్కటంబుగకసిమసంగి రవిసోముల తేజఃపుంజంబు వాసిదఱిగె. ఇంద్రాది యష్టదిక్పాలురును తపస్సుచేయఁదలఁచి యొకచెట్టు క్రిందగాని, పర్వతమునగాని కూర్చుండియున్న నవియన్నియు నా తపము వేడిమివలన భస్మమగుచుండెను. ఆ కాకవలన సూర్యచంద్రులకాంతి మాసెను.

సమస్తదేవతలును, మారువర్చస్సు కలవారైరి. కాని యావేడిమికి కారణమును తెలిసికొనలేక బ్రహ్మయొద్దకుపోయి మొఱపెట్టగా నాచతుర్ముఖుఁడు దివ్యదృష్టి వలన దానికికారణమును కనిపెట్టి యింద్రాదులతో నిట్లనియె. "ఓదేవరాజా! శివునితపమువేడిమిగాని వేరుగాదు. ఆయన సతీవియోగదుఃఖముచేఘోరతపముచేయుచున్నారు. కావున మీరు చంద్రుని యాయనకు సమర్పించిన నప్పరమశివుఁడు శాంతి వహించి దుఃఖమును మఱచును. లోకములు చల్లబడును. లేకున్న ముల్లోకములును త్వరలో భస్మమగును." అన బ్రహ్మమాటలు విని దేవత లమృతకలశమును చేఁబూని మందరపర్వతమున తపంబుచేయుచుండిన యీశ్వరునిసన్నిధికిపోయి, సాష్టాంగదండ ప్రణామములుచేసి యాకలశమును కానుకగా నొసంగిరి. దాని సువాసనకుమెచ్చి యీశ్వరుఁడు దానిని చేతబట్టగా నది యర్ధచంద్రాకృతిని బొందియాయన శిరస్సున స్థిరముగ నిలిచెను. దాని చల్లదనము వలనఁ గ్రమముగా శివునితాపము చల్లారెను. లోకములనంతటను శాంతి వ్యాపించెను. ఆది మొదలు శివునికిఁ చంద్రశేఖరుఁడను పేరు స్థిరపడెను. అప్పి

చెప్పగా ఋషులువిని విభూతిమహిమయు, దానిని శివుఁడు ధరించుటకు కారణమును చెప్పుమని సనత్కుమారుని పృచ్ఛ చేసిరి.

విభూతిమహత్మ్యము

అప్పుడు శౌనకాదులను జూచి సనత్కుమారుఁ డిట్లు చెప్పెను. "ఓ ఋషివర్యులారా! వినుండు. పూర్వము భృగు వంశమునందు జన్మించిన యొక బ్రాహ్మణుఁడు గొప్ప తపస్సు చేయుచుండెను. అతడు వైశాఖ జ్యేష్ఠ మాసములందు పంచాగ్ని మధ్యమున, మార్గశిర పుష్యమాసములందు జల మధ్యమున, శ్రావణభాద్రపదమాసములందు బయలున నిలచి ఘోరతపస్సు చేయుచు గందమూలాది ఫలములను దినుచుం డెను. ఆయన క్రమ క్రమముగా నితరాహారములను విడిచి యాకుకూరలను తినుచుండెను. అందుచే నాయనకు బర్ణాదుఁ డను పేరు వచ్చెను.

ఈయన తపమువేడిమి ముల్లోకములు వ్యాపించెను. ఒక నాడతఁడు దర్భలుకోయుచుండఁగా వ్రేలు తెగి రక్తముకారఁగా చూచి యది యాకుపసరువలెనుండుట కనిపెట్టి తన తపస్సు ఫలించెనని సంతసించి యాడుట, పాడుట, కేకలువేయుట యారంభించెను. వాని తపస్సునకు మెచ్చి వరమీయదలంచి బ్రాహ్మణరూపమున శివుఁడు వానియెదుట ప్రత్యక్షమయ్యెను. అప్పుడతఁడు వానిని జూచి కేకలు వేయుచు గెంతుచు దూర ముగాబోయెను. బ్రాహ్మణుఁడు వానికి దగ్గరగా బోయి చెయ్యి పట్టుకొని యిట్లనెను. "ఓపర్ణాదుఁడా! యేల యిట్లు చేలవై

యఱచు చున్నావు? బహుశ్రమపడి సంపాదించిన తపోబలమును వ్యర్థము చేయుచున్నావు. ఈ మానవ దేహము భూమివంటిది. భూమియం దెన్నిరసములున్నవో శరీరమునందు గూడ యన్ని రసములున్నవి. సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని మొదలగు దేవతలు ప్రభావము కలవారు కారా? వారునీవలె గర్వించిరా? నీవేల యహంకారమునుబొంది విఱ్ఱవీగెదవు? నీ వ్రేలు వెంట శాకరసము స్రవించి నంతమాత్రమున నింత గర్వింపవలెనా? నా వ్రేలు! విభూతి కారుట చూడుము. అనితన వ్రేలు కోసికొని భస్మము స్రవింపజేసిచూపెను. దానిని చూచి ప్రహ్లాదుఁడు తన కంటె నతఁడు గొప్పతపశ్శాలి యని భావించి వానితో నిట్లు చెప్పెను. "అయ్యా మీరు గొప్ప తపశ్శాలివలె నున్నారు. మీకుల గోత్రములతో మీచరిత్రము సవిస్తరముగాజెప్పి, నామనవి చెల్లింపుఁడు"అనిమిగుల ప్రార్థింపఁగా నీశ్వరుఁడు నిజ రూపమును చూపెను. చూచినవెంటనే ప్రహ్లాదుఁడు శివునికి సాష్టాంగ ప్రణామముచేసి పలువిధముల స్తుతించెను. వాని ప్రార్థనలకు సంతసించి శివుఁడతని కీవరము లొసంగెను. "ఓప్రహ్లాదా! నీస్తోత్రములకుమెచ్చితిని. నీకమరత్వ మిచ్చితిని. నీకు మఱి దుఃఖములుండవు. నీవు నా ప్రమథ గణములలో శ్రేష్ఠుడవు, నీవు మేరుపర్వతమున తపస్సు చేసికొనుచుండుము" అని చెప్పి యా దినము మొదలు శివుఁడు భస్మధారణము జేయుచుండెను. ఆ ప్రహ్లాదుని వలన భస్మమీశ్వరునికి ప్రియ మయ్యెను. ప్రయాగలో గంగా సంగమమందును, పుష్కర, ప్రభాస తీర్థములందును స్నానము చేయుటవలన నెట్టి ఫలము కలుగునో భస్మస్నానము వలన గూడనంతఫలము లభించును.

బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలగు దేవతలందఱును భస్మస్నానమువలననే గొప్పవారైరి. భస్మమునుధరించినవారిని చూచి భూత, ప్రేత, పిశాచ రాక్షసులు దూరముగా పారి పోవును. వారి కవి యెట్టి కీడును చేయలేవు. భస్మముధరించు వారికీశ్వరుడు సకలైశ్వర్యముల నొసంగును.

## ప్రకృతి మహత్వము - శివుని గర్వభంగము

ఈ ముల్లోకములందుండు పురుషులందఱు నాదివిరాట్టు రూపమనియును, స్త్రీలందఱు నాదిశక్తియైన ప్రకృతి రూప మనియును దెలిసిన విషయమే. పురుషునికిని, ప్రకృతికిని తారతమ్యము లేదని చెప్పెదరు. పురుషుడు, ప్రకృతి స్వాధీనుడై యున్నాడు. ప్రకృతి సహాయములేకుండ పురుషుడేకార్యము నుచేయజాలడు. మనలో ననేకులనుభవము వలన నీ సంగతిని గ్రహించియుందురు. ఒకరోజున పార్వతీపరమేశ్వరులు కైలాసమున తమ దివ్యభవనమునం దిష్టాగోష్ఠి నుండిరి. అప్పుడు శివుడు పార్వతినిజూచి ప్రసంగవశమున నిట్లనియె.

“ఓగిరిరాజనందనా! పదునాల్గు భువనములందును నేను శ్రేష్ఠుడను;వానిని సృష్టించి,పాలించి, సంహరింపజేయువాడను నేను. నాత్రిగుణములవలన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను, రూపములు మూటినిదాల్చియుందును, భక్తులకు, తాపసులకు రాక్షసులకు వరము లిచ్చుచుందును. నేనొకప్పుడయిదు ముఖములును మఱియొకప్పుడేక ముఖమును, ధరించియుందును. హాలహాలమునుభక్షించి లోకములను రక్షించితిని. ఎల్లప్పుడు దిగంబరిగా సంచరించుచుందును” అనగా పార్వతి, పరమేశ్వ

రుని గర్వభంగము చేయ సమకట్టి తన చేతితో కొంతమన్ను తీసి బంతివలె గుండ్రముగాజేసి దానిపై చిరత్నంబులగు నవ రత్నములను స్థాపించి బహు రమ్యముగా తయారుచేసి, భర్త చేతికిచ్చి చిత్తగింపుమనెను. దానినిజూచి శివుడాశ్చర్యపరవశుడై త్రిప్పి త్రిప్పి చూచుచుండగా నందొకచోట చిన్న ద్వారము దానిలో పెద్దతోట, దానియందు పలువిధములగు వృక్షములు వింతయైన ఫలములతోను,పుష్పములతో నొప్పుచు చున్నట్టులఁ గట్టెదుట గన్పట్టెను. వాని వెనుక, పద్మములు, కలువలు వింతవింత పక్షులుగల సరోవరములను చూచి సాశ్చర్యనిమగ్న మానసుడాయెను. పిమ్మట దానియందలి మఱియొక ద్వారమున జూడగా నందు పది ముఖములు నరు వది బాహువులు గలిగి తనవలె జడలు నాయుధములు నాగాభరణములు గల్గి ప్రకృతే గొప్పదని యఱచుచున్న మఱియొక శివునిజూచి సిగ్గుపడెను. ఇంకొక ద్వారమున చూడగా దివ్యభవనమున గొప్పనవరత్న సింహాసనమున గూర్చుండియున్న దివ్యమంగళ విగ్రహముగల దేవిని,యామె యెదుటనాట్యము చేయుచున్న తనవంటి శివుని నామె కుభయ పార్శ్వములందును నిలిచియుండి స్తోత్రము చేయుచున్న బ్రహ్మవిష్ణువులనుచూచి మైమరచెను. ఇదంతయు చూచి యీశ్వరుడిట్లు చింతించెను. "నేనేగొప్పవాడననియు, నా కంటెవేరులేరనియు తలంచి గర్వించితిని. నేనెంత జేలను.. ప్రకృతియేగొప్పది"అని ప్రకృతిరూపమును మనస్సా ధ్యానించి స్తోత్రము చేసి నేత్రములు తెఱచి చూచుసరికచ్చట పార్వతి తప్ప మఱియేమియును కానరాకుండెను. అప్పుడు శివుడు

తెలంచియూరుకుండెను. పార్వతియాయనను కౌగిలించుకొని వేషు విషయములగుఱించి ప్రసంగించెను. అని శౌనకాది ఋషులను సనత్కుమారుడు చెప్పెను. కావున ప్రకృతికిని, పురుషునికిని భేదములేదు.

## శివునికి ప్రియమగు పుష్పములు

పిమ్మట ఋషులు సనత్కుమారుని జూచి యిట్లనిరి. "ఓ ఋషివర్యా! శివునికి ప్రీతికరములగు పుష్పములను వివరముగా సెలవిం"డని యడుగఁగా, నాయన వారితో నిట్లయెను. "ఓ ఋషులారా! వినుఁడు. బంగారుకొమ్ములు, వెండిగొరిజలు వస్త్రములతో నలంకరించిన మంచి పాలిచ్చు గోవును వేద శాస్త్రవేదియు శుచియు సత్కుటుంబియు సదాచార సంపన్నుఁడు నిరాశుడు నిర్మత్సరుఁడు నిరంతర తపశ్శాలి, నియతాగ్నిహోత్రియు శమదమోపేతుఁడునగు బ్రాహ్మణునికి దానమిచ్చుటవలన నెంతఫలమో తెల్లగన్నేరు పువ్వులతో శివుని బూజించుటవలన నంతఫలముకలుగును. ఎఱ్ఱగన్నేరు పుష్పములైన దానికి రెండు రెట్లు ఫలము లభించును. కుందంబులవలన దానికి నూఱు రెట్లు ఫలము. మల్లెపువ్వులవలన మఱినూఱు రెట్లు ఫలమధికము ముత్యములతో చేసిన లింగములను ముత్యములతో పూజించుటవలన నెంతఫలము కలుగునో ద్రోణ (తుమ్మి) పుష్పములతో పూజించిన ఫలమంత యగును. మరియు బంగారులింగమును బూజించిన ఫలమంత యగును. బంగారు లింగమును పూజించు నంతఫలము సంపెంగ పూలవలన కలుగును. నాగేశ్వరపుష్పములతో బూజించిన నశ్వమేధయాగము

కోటిగంగా స్నానమువలన కలుగుఫలము లభించును. కుంద పుష్పపూజవలనగయా శ్రాద్ధ ఫలముకలుగును. తులసీదళము వలన దానికి నూఱురెట్లు ఫలమధికము. ఉమ్మెత్తపూలతో పూజించిన నేకాదశీవ్రతఫలము కలుగును. పద్మములన్నిటి కన్న శ్రేష్ఠము. కేతకి పూల పూజలవలన సమస్తపుణ్యములు నశించి యనేక బాధలు కలుగును. ఇందుకు కారణమీపువ్వుకు కలిగిన శాపమే (ఈవిషయము స్కాందపురాణమున సవిస్తరముగా చెప్పబడినది.) మారేడు దళములతో బూజించుట మిక్కిలి శ్రేష్ఠము. అనఁగా విని మారేడుదళముల కంత శ్రేష్ఠత కలుగుటకు కారణమేమని ఋషులడుగఁగా సనత్కుమారుఁ డిట్లుచెప్పందొడంగె.

## మారేడుచెట్టు పుట్టుక

ఒకరోజున శ్రీ లక్ష్మీనారాయణులు వైకుంఠమున ముచ్చటలాడుకొనుచుండఁగా లక్ష్మి తనభర్తను జూచియిట్లు ప్రశ్నచేసెను. "స్వామీ!మీకు మిక్కిలి ప్రియులెవరు?" అన విని శ్రీమన్నారాయణుం డామెతో నిట్లనెను. "సతీ నాకు ప్రియుఁడు శివుఁడు." ఏలననఁగా నాతఁడు సర్వకాల సర్వావస్థలందును త్రికరణశుద్ధిగా నన్నే ధ్యానించుచుండును, త్రికరణములనఁగా మనస్సు, వాక్కు, కాయములు. మనస్సుచే ధ్యానించుట, వాక్కుచే నామోచ్చారణము చేయుచుండుట, కాయముచే ననఁగా కర్మేంద్రియములచే పూజాదికర్మలు చేయుట. అందుచే తాయన నాభక్తులలో శ్రేష్ఠుఁడు. అనఁగా విని లక్ష్మి వానితరువాత మీకు ప్రియులెవరని యడుగఁగా విని

శివభక్తులని విష్ణువు సెలవిచ్చెను. అదివిని లక్ష్మి "నాథా! శివభక్తులలో శ్రేష్ఠులెవరు?" అని ప్రశ్నింప నాతడిట్లనియె.

ప్రియసఖీ! పుష్పములన్నిటిలో పద్మములు మిగుల శ్రేష్ఠమైనవి. అట్టి పద్మములతో నిత్యమూ తీరు వానినొక సంవత్సరమువఱకు విడువక పూజించువారు నాకు ప్రియభక్తులగుదురు." అని విష్ణువు సెలవిచ్చెను. ఆ మాటలు విని లక్ష్మి తానట్లు పూజించి శివునికి భక్తురాలు కావలెననియెంచి భర్త యనుజ్ఞను బొందెను. ఆమరునాటినుంచి యుదయముననే లేచి తన యుద్యానవనమునందున్న తామరకొలనుకుపోయి స్వయముగా నూటయెనిమిది పూవులుకోసి స్నానాది విధులను తీర్చుకొని, మందిరమున కేగి శివలింగమును, పంచాక్షరీ మంత్రమున శక్తి బీజమును సంపుటీకరణము చేసి, షోడశోపచారముల పూజించుచుండెను. ఇట్లు ఒకసంవత్సరముపూర్తియగుట కంత్య దినమునకొలనికిపోయి పద్మములను కోయగానూటయెనిమిదియే యుండెను. మఱి యందు పువ్వులు లేకుండెను. వానిని ముమ్మారులెక్కించినను సమముగా 108యే యుండెను. పూజ చేయునపుడామెయేబహుజాగ్రత్తగానామమున కొకటిచొప్పున పుష్పములను సమర్పింపగా రెండుపువ్వులు చాలకుండెను. అందు కామె మిగులాశ్చర్యమునొంది, ఖిన్నురాలై యేమి చేయుటకును తోచనందున విచారించుచుండగా, తన భర్తతో నొకప్పుడు తన కుచములు పద్మములవంటివని చెప్పియుండుట జ్ఞప్తికి తెచ్చుకొని, వానిని కోసి శివునికి సమర్పించి పూజపూర్తిచేసి, వ్రతమును సమాప్తినొందింప దలంచి యొక కత్తితో యెడమ కుచమునుకోసి, శివుని శిరస్సునసుంచి,

రెండవది కోయుటకు సిద్ధపడగా, శివుడు ప్రత్యక్షమై యామె చేతిని పట్టుకొని యాటంకపఱచి యిట్లనెను. "ఓజననీ !నీభక్తికి మెచ్చితిని. మఱి శ్రమపడకుము. నీకుచము నీకెప్పటివలె ప్రసాదించితిని. నీవు నాకు సమర్పించిన యీకుచమువలన నీకీర్తి శాశ్వతముగా నుండునట్లు దీనినొక చెట్టుగా బుట్టించెదను. దానిపత్రములు నాకేగాక సమస్తదేవతలకును మిగుల ప్రియమగు పూజా ద్రవ్యమగును. అని చెప్పి ఆ కుచమును భూమిపై నుంచగా అదియే మారేడుచెట్టుగా వెంటనే జన్మించెను. దాని దళములు మూడాకులు గలిగి యుండెను. అందు మధ్యనున్న ఆకు శివుడు. దాని కుడిప్రైపుననున్న ఆకు విష్ణువు. ఎడమవైపుది బ్రహ్మ అని తెలియవలెను. ఈ మారేడు చెట్టుకు, మాలూరము, శ్రీఫలము, బిల్వము, శాండిల్యము, శైలూషము ధూమ్రాక్షము, శివప్రియ మొదలగు నిరువది యొక్క నామములున్నవి. దీని మొదలునుండి చుట్టునునూఱు మూరలవరకు బహుపవిత్ర స్థలమందురు. దీని యాకులను కాలుతో ముట్టినవార లల్పాయుష్కులు, దరిద్రులు నగుదురని యామహా శివుడాజ్ఞయిచ్చెను. వేయి పద్మములతో పూజించుటవలన కలుగునంత ఫలమొక బిల్వదళము వలన కలుగుననియు, బిల్వవనము కాశితో సమానమనియు నాచెట్టు లుండుచోట తాను లింగరూపమున నుండుననియు నీశ్వరుడు చెప్పెను. ఇంటియావరణములో నీశాన్యభాగమున బిల్వవృక్షమున్న ఐశ్వర్యము కలుగుననియు నాపదలుండవనియుతూర్పు దిక్కునందాచెట్టు మొలచిన వారు సుఖింతురనియు, పశ్చిమ భాగమున మొలచిన పుత్త్రవంతులగుదురనియుదక్షిణపువైపున

నున్న యమబాధలుండవనియు చెప్పుదురు. వసంత గ్రీష్మ ఋతువులందు బిల్వపత్రితో పూజించిన వారక్షయగోదానములు చేసిన ఫలముపొందుదురు. జన్మాంతమున కైలాసమున నివసింతురు. అని సనత్కుమారుఁడు మునులతో చెప్పఁగా విని వారిట్లనిరి.

శివుఁడు హనుమంతుఁడగుట.

"ఋషివర్యా! ఈశ్వరుఁడు హనుమంతుఁడై జన్మించెనని చెప్పుదురు. అది యెట్లు తటస్థించెనో సెలవిచ్చి మాసందేహమును తీర్పుఁడు" అనఁగా సనత్కుమారుఁ డిట్లుచెప్ప నారంభించెను. "ఓ మునులారా! శ్రద్ధతో వినుండు. పూర్వము లంకాధీశుఁడైన రావణుని బాధలుపడి యింద్రాది దేవతలందఱు బ్రహ్మయొద్దకుపోయి మొఱబెట్టుకొనిరి. అదివిని బ్రహ్మ తానేమియు చేయలేక వైకుంఠముననున్న శ్రీమహావిష్ణువు నొద్దకుబోవుదము రండని వారిని తోడుకొనిపోయెను. శ్రీమన్నారాయణుండు బ్రహ్మాదులనుజూచి, వారిరాకకు కారణమేమని యడుగఁగా బ్రహ్మయాయనతోనిట్లనిమనవిచేసెను. "ఓ శ్రీహరీ! దశకంఠుఁడు తపస్సుచేసి పొందిన వరబలమువలన, స్వర్గ, మర్త్యపాతాళములను జయించి యింద్రాది దేవతలను పలువిధముల బాధించుచున్నాఁడు. రావణుఁడు వారివలన తానుపరిచారకకృత్యములను చేయించుకొనుచున్నాఁడు. ఋషులు తాము చేయుచుండు యజ్ఞములు, యాగములు మానుకొనిరి. వాని భారమును [illegible]పలేక భూదేవి విచారించుచున్నది. వానిబాధను నివా[illegible] చేయుటకు మీకంటె వేరు దిక్కులేదని మీతో

మనవిచేసుకొనుటకే దేవతలందఱును వచ్చియున్నారు" నా విని శ్రీహరి బ్రహ్మతో నిట్లనెను. "ఓచతుర్ముఖుఁడా! వాఁడు సామాన్యుఁడుకాఁడు. వానిని చంపుట కష్టసాధ్యము, నీవు వానికి పెక్కువరము లిచ్చితివి. కాని మనుష్య వానరముల వలన వానికి లక్ష్యము లేక వారివలన చావు లేకుండునటుల వరమడుగ మరచెను. కావున నరవానరులవలన తప్ప నితరులచే వాఁడుచావడు. అందుచే నేను దశరథమహారాజునకు పుత్రుఁడనై జన్మించెదను. మీరందఱును వానరులై భూలోకమున జన్మింపుఁడు. ఆ రావణుఁడు నిత్యమును పార్వతీపరమేశ్వరుల నతిభక్తితో పూజించుచున్నాఁడు. కావున నాతఁడు పరమ భక్తుఁడు. శివుని సహాయమునుపొందినగాని వానిని జంపుట దుర్లభము. నేను శివునిజూచి మాట్లాడుటకు కైలాసమునకుఁ బోయెదను. మీరు మీ నివాసములకు జనుడు. అనిచెప్పి శ్రీమన్నారాయణుం డీశ్వరునియొద్దకు పోయెను. అప్పుడు శివుఁడు శ్రీహరికి ప్రత్యుత్థానముచేసి కూర్చుండఁబెట్టి విచ్చేసిన కారణ మేమని యడుగఁగా, విష్ణువు శివునితో బ్రహ్మాది దేవతలు తనవద్దకు వచ్చి మనవిచేసిన సంగతులను, తాను వారితో చెప్పినదియు తెలియఁజేసి "తమ సహాయముచే గాని వాని జయింప నాకు శక్యముకాదు" అని మనవిచేయఁగా శివుఁడు సంతసించి యిట్లనియె. "ఓ కేశవా! నే నంజనీదేవి గర్భమున హనుమంతుఁడను పేర జన్మించి నీకు తగినంత సహాయము చేయుదును" అని వాగ్దానముచేసెను. నీశ్వరుఁడు హనుమంతుఁడై జన్మించెను.

## అర్జునుఁడు, కపిధ్వజము

ఈశ్వరుఁడుహనుమంతుఁడై జన్మించుటకు కారణమును విని శౌనకాదులు సనత్కుమారుని జూచి యిట్లు ప్రశ్న చేసిరి. "ఋషివర్యా! శ్రీమహావిష్ణువు శ్రీరాముడై జన్మించుట, రావణుని వధించుట త్రేతాయుగమున జరిగినట్లు చెప్పుదురు. కురు పాండవ యుద్ధము ద్వాపరాంతమునగదా జరిగినది. హనుమంతుఁ డర్జునుని రథముపైన కపిధ్వజమై యుండెనని చెప్పుదురు. ఇది యెట్లు విశ్వసింపవచ్చును? ఈ సందేహము నివృత్తిచేయుఁడని యడుగఁగా సనత్కుమారుఁ డిట్లు చెప్ప నుపక్రమించెను. "ఓ మునులారా! వినుం డిది యసంభవము కాదు. ఏలననఁగా హనుమంతుఁడు చిరంజీవి యగునట్లు శ్రీరాము లతనికి వర మొసంగెను. కావున నిప్పటికిని సజీవుఁడే. పూర్వము పాండవులు ద్రౌపదీ సహితులై యరణ్య వాసము చేయుచుండఁగా నొకరోజున ద్రౌపది ధర్మజునిజూచి "నాథా! నల్లని పద్మములు గలవనియు వానితో పూజించిన శివుఁడు మిగులతృప్తిపొందుననియు, ఋషిపత్నులవలనవింటిని. మీకు నాయందు దయగలదేని నొకవెయ్యి నల్లని పద్మములు తెప్పించిన నీశ్వరుని బూజించి యాయనకరుణవడసి మనకు శత్రు క్షయమగునట్లు వరము పొందెదను" అనఁగా విని యాపుష్పముల నెచ్చట సంపాదింపనగునని ధర్మరాజుచింతించు చుండెను. ఇట్టియసాధ్యమైనకోరికను తెలుపుటవలన భర్తకు విచారముకలిగించితిని గదా, అని ద్రౌపదియు కపోలమ్మున వ్రేలుంచుకొనివిచారించుచుండెను. అట్టిసమయమున భీముఁడు వారి యొద్దకుఁబోయి వారిముఖలక్షణములను కనిపెట్టి కించకు

కారణమేమని యడుగఁగా ద్రౌపది కారణమును తెలియఁ జేసెను. దానిని వినిన వెంటనే భీముఁడిట్లనెను. "ఇందుకు విచారమేల? యిదియెంతపని? మీరు సెలవిచ్చిన నిప్పుడేపోయి తెచ్చెదను" సరే మంచిదని భీముఁడు వెంటనే బయలుదేరి యడవిదారిని బోవుచుండెను. అతని గమన వేగమువలన కలిగిన గాలివలన నచ్చట చెట్లు చలించుచుండెను. అదికనిపెట్టి యందొకచోట శ్రీరామనామమును జపించుచుండిన యాంజనేయులు, అటునిటుచూచి దూరమున వచ్చుచున్న భీముని గాంచి, తనదివ్యదృష్టిచే నాతనివృత్తాంతమంతయు నెఱింగి వాని బలము శోధింపనెంచి, మార్గమున నొకచోట, చిన్నరూపమున నడ్డముగా పరుండెను. కొద్దికాలములో భీముఁడతనిని సమీపించి "త్రోవవిడువు"మనెను. అప్పుడు వారికిట్లు ప్రసంగము జరిగెను.

హనుమంతుఁడు:—అయ్యా! నేనుముసలివాఁడను. బలముడిగినది. రోగపీడితుఁడను. కదలలేకున్నాను, దయచేసి వేరు దారిని బొమ్ము.

భీముఁడు:—నేను క్షత్రియ వీరుఁడను, చేతనేమియు కానివానివలె, వేరుమార్గమున బోయెదనా ?

హను:—బాబూ ! అట్లయిన నాతోక మాత్రము త్రోవలోనున్నది, దానినికదలించుటకైన నాకుశక్తి లేకున్నది. దాని ప్రక్కకుద్రోచి నీవుమార్గమున పొమ్ము.

భీము:—(తోకనుకాలుచే తన్నియు, చేతనెత్తియు రెండుచేతులబట్టియు కదలింపలేక యతఁడు శివుఁడో, విష్ణువో, యింద్రుఁడో యనితలంచి), అయ్యా ! నీవుమహానుభావునివలె

కనఁబడుచున్నావు. ఇదుగో నీకు నమస్కరించుచున్నాను. నీవెవరవో చెప్పి నాసందియము తీర్పుము. ఈయపరాధమును క్షమింపుము.

హను:—(అది విని హనుమంతుఁడు దిగ్గునలేచి భీముని కౌఁగిలించుకొని తొడపై కూర్చుండబెట్టుకొనుచు) తమ్ముఁడా ఇటుఁరమ్ము, నేను వాయుదేవునివలన యంజనాదేవి గర్భమున జన్మించితిని. నాపేరు హనుమంతుఁడు. నీవునాయన్నయైన ధర్మజునిపంపున మీభార్య ద్రౌపదికొఱకు వేయి నల్లని పద్మములను దేఁబోవుచున్నావు. నీవును వాయుదేవునివలన బుట్టితివి. కావున మనమన్నదమ్ములము. నీబలమును పరీక్షించు టకిచ్చట పడియున్నాను. నిన్నుఁ జూచుటవలన నాకుమిగుల సంతోషము కలిగినది. నీకుసమస్త సుఖములు కలుగుఁగాత !

భీముఁ:—అన్నగారూ ! నాకీ పుష్పము లెచ్చట లభించును !

హను:—తమ్ముఁడా. చూచితివా ? మనముందు మూఁడు త్రోవలు కానఁబడుచున్నవి. వానిలోనెడమ వైపున మన్న కోన మార్గమున చాలదూరము పోయిన గంధర్వుల యుద్యానవన మున్నది. అది యక్షులకు రాజయిన కుబేరుని కేళీవనము. దాని నడుమ నొక సరోవర మున్నది. అందు లక్షలకొలఁది నల్లని పద్మములు వికసించి యుండును. అచ్చట పలువురు గంధర్వభటులు కాపుందురు. వారితోఁ గలహింపక నీవుకావలసిన పువ్వులను కోసికొని రావచ్చును. కుబేరుని కా సంగతి తెలిసిన ప్రమాదము సంభవించును సుమీ ! దేవ తలు, గురువు, తలిదండ్రులు, బ్రాహ్మణులు వీరియెడల విధి

వినయము కలిగి మెలఁగవలయును. శ్రీరాములు నీకు జయము నిచ్చుగాక ! పోయిరమ్ము.

భీము:—అన్నగారూ! మీకుఁబ్రదక్షిణ నమస్కారములు చేయుచున్నాను. మీ బలపరాక్రమము లత్యద్భుతములు, మీరు రుద్రుని యవతారము. మీ మహిమలు సురాసురుల కగోచరములు. సముద్రము నవలీల లంఘించితిరి. నిమిషములో లంక కాల్చితిరి. మీ సహాయముననే శ్రీరాములు సీతను పొందెను. మిమ్మును ప్రార్థించిన వారికి సమస్తాపదలును నశించును. నాయందు దయకలిగి వరమొసంగుఁడు.

హను:—తమ్ముఁడా ! ఏమి వరము కోరెదవు?

భీము:—అన్నా ! మాకు శత్రువు దుర్యోధనుఁడు. మమ్ము ననేక కష్టముల పాలుచేసెను. ఈ వనవాసము కడచిన నొక సంవత్సర మజ్ఞాతవాసము చేసి, పిమ్మట వానితో యుద్ధముచేసినగాని, మాకురాజ్యమొసంగడు. ఆ రణమున మీ సహాయము మాకవసరము. దానిని నాకుబ్రసాదింపవలయును.

హను:—తమ్ముఁడా! నేను త్రేతాయుగమునయుద్ధము చేసి యుంటిని. ఇది ద్వాపరాంతము, యుగముల ననుసరించి మనుజుల పరిమాణములు, బలములు, వేరు వేరుగా నుండును.

| యుగములు | కాలప్రమాణము. | మనుష్యపరిమితి. |
|---|---|---|
| కృతయుగము | 1720000 సంవత్సరములు | 28 మూరలు |
| త్రేతాయుగము | 1296000 ,, | 14 ,, |
| ద్వాపరయుగము | 864000 సంవత్సరములు | 7 మూరలు |
| కలియుగము | 432000 ,, | 3½ ,, |

ఎవరి మూరతో వారికే కొలత.

కావున యీయుగమున నేను నిజరూపముతో యుద్ధము చేసిన భూమి పాతాళమునకు క్రుంగును. అనేక జీవజంతువులు నశించును. కనుక నేను యుద్ధముచేయ వలనుపడదు.

భీము:—అన్నా! కౌరవబలమున భీష్ముడు. ద్రోణుడు మొదలగు మహావీరులున్నారే ! వారితో మీరు పోరాడ వచ్చును.

హను:—తమ్ముడా ! వారందఱును నా భీకరరూపమును జూచి మూర్ఛిల్లి క్రిందబడుదురు.

భీము:—అన్నగారూ! మీరూపమును నాకుజూపరా?

హను:—తమ్ముడా ! వలదు, నీవు చూడలేవు. భయపడుదువు.

భీము:—అన్నా! లేదు భయపడను. నాయందు దయయుంచి నీ నిజరూపమును జూపుము.

హను:—తమ్ముడా! భయపడక చూడుము. (అని తన విశ్వరూపముజూపెను). అప్పుడు తన శిరస్సున శ్రీరాములును. కుడిభుజమున లక్ష్మణుడు, నెడమభుజమున సీతయును శ్రీరాముని పాదములయొద్ద విభీషణుడును కనబడిరి. ఆ భయంకరాకారమును జూచి భీముడు మూర్ఛిల్లి క్రిందపడెను. వెంటనే హనుమంతుడు తన విశ్వరూపము నుపసంహరించి నిజరూపముతో భీముని లేవనెత్తి భయమును పోగొట్టి తన శరీరమునుండి యొకరోమమునుదీసి భీమునికిచ్చి దీనిని యర్జునుని రథమున జండావలె కట్టుము. దానిని జూచిన మాత్రమున శత్రువులు తమధైర్యమును కోలుపోయి యోడిపోదురు. నేటి

నుండి యర్జునునకు కపిధ్వజుఁడను పేరు కలుగును. ఇది నా వరము. మీరు శత్రువులను జయించి సుఖముగా రాజ్యసుఖము లనుభవింతురు.

భీము:—అన్నగారూ ! సెలవు. నేఁబోవుచున్నాను. నమస్కారము.

హను:—తమ్ముఁడా ! పోయిరమ్ము. శ్రీరాముని కరుణ వలన నీకు జయమగుఁగాక !

ఇట్లు సెలవుతీసికొని భీముఁడు గంధర్వోద్యానమునకు బోయి సరోవరమున జొచ్చి పూలుగోయుచుండఁగా నచ్చటి కావలిభటులైన గంధర్వులు, ఆయనపై బాణవర్షము కురిపించిరి. కాని భీముడందులకు లక్ష్యపెట్టక కావలసియున్న పువ్వులు కోసికొని తీరమునచేరి విశ్రమించుచుండెను. వారాతని చుట్టును జేరి యిట్లనిరి. "అయ్యా ! నీవెవరు. ఎందుండివచ్చితివి ! ఈ వనము కుబేరునిది. ఇందెవ్వరును జొరవెఱతురు. నీవింత భయములేక పుష్పము లేల కోసితివని యితనిపై బాణములు వేయఁగా నతడొక తాళవృక్షమునూడబెరికి గిరగిరద్రిప్పివార లపై వైచెను. దానివలన కొందఱు చచ్చిరి. మిగిలినవారు పారిపోయి కుబేరునితో జరిగినదంతయు చెప్పిరి. అదివిని ఆయక్షపతి వచ్చి భీమునిజూచి యిట్లు సంభాషించెను.

కుబేరుఁడు:—ఓయి ! నీవెవరు ?

భీము:—అయ్యా ! నాపేరు భీముఁడు—పాండవులలో రెండవవాఁడను. మాయన్న ధర్మజుఁడు.

కుబే:—నీవిట వచ్చుటకు కారణమేమి ?

భీము:—మా భార్యయయిన ద్రౌపది యీ నల్లని పద్మముచే శివుని బూజింపఁగోరినందున, మాయన్నగారి పంపున నిటువచ్చితిని.

కుబే:—సరే ఈ నా వనము నా యనుమతిలేక జొచ్చి పుష్పము లపహరించవచ్చునా ?

భీము:—అయ్యా' వినుండు. పుష్పములు, వాని పరిమళము శాశ్వతము కాదుగదా! ఎవరైనను వానిని పూజకే యుపయోగించెదరు. మనముపయోగింపకున్న వాటంతటయవే నశించునుగదా? అందువిషయమై యంతపట్టుదలయేలచేసెదరు?

కుబే:—సరేకాని, నీవు నా దూతల నేలచంపితివి ?

భీము:—అందు నేరము నాదికాదు. నే నెంత బోధించినను వినక వారే నాతో దలఁపడిరి. నన్ను నేను కాపాడుకొనుట విధికావున, నే వారిపై నొక చెట్టువేసితిని. ఇందు తప్పున్న క్షమింప వేడుచున్నాను.

కుబే:—అయ్యా? నీ ధర్మబుద్ధికి మెచ్చితిని. నీవలన దోషములేదు పొమ్ము.

భీము:—ఓ యక్షేశా ! నమస్కారము. సెల విమ్ము అని పూవులు తీసికొనిపోయి ద్రౌపదికివ్వఁగా, నామె శివుని పూజించి తృప్తిపడి వాని ప్రసాదమును పొందెను.

అర్జునునికి హనుమంతునికి వివాదము.

ఈ కథవిని చాలసంతసించి శౌనకాదులు సనత్కుమారుని జూచి యిట్లనిరి. "అయ్యా ! ఒకప్పు డర్జునుఁ డాంజనేయునితో కలిసినట్లు వారిబలాబలములను గుఱించి

వా రుభయులు వాదించుకొనినట్లు చెప్పుదురు. ఆ కథ సవిస్తరముగా సెలవిచ్చి మమ్మును సంతసింపఁ జేయుఁడు ప్రార్థింపుచున్నాను" అనగా విని ఆయన వారలతో నిట్లనెను, "ఓమునివరులారా ! పూర్వమొక దినమున శ్రీకృష్ణుఁడు రుక్మిణీ సహితుఁడై ద్వారకానగరమున ముచ్చటలాడుకొనుచుండఁగా శ్రీ రుక్మిణీదేవి శ్రీకృష్ణునితో నిట్లనెను. నాథా ! సౌగంధిక పుష్పములు మిగుల పరిమళము గలవనియు, అతి మనోహరములనియు విందును. వానిని దెప్పించి నాకోరికదీర్పఁగలరా?" అనగా విని "ప్రియసఖీ ! ఇది యెంతపని! తప్పక తెప్పించెదను" అని యర్జునుని దలంపఁగా నతఁడు స్వల్పకాలములోనే హస్తినాపురమునుండి విచ్చేసెను. అతనిని చూచి కృష్ణుఁడు వారి కుశలమడిగి రుక్మిణి కోరిక చెప్పి దీనిని నీవు దీర్పవలెను. ఇవికదళీవనమందున్న సరోవరమున వికసించి యుండును. నీవు పోయి వానిని త్వరలో గొనిరమ్ము" అనఁగా విని పార్థుఁడు ధనుర్బాణములను చేఁబట్టి కిరాతరూపమునబోయి యేఁడు దినములలో నా సరోవరమునుజేరి పూలు గోయుచుండగానచ్చట కావలియున్న వానరులతనిని బెదరించి వానిపైఁబడిరి. అప్పుడతఁడు వారిపై బాణములు వేయఁగా వారు పారిపోయి హనుమంతునితో చెప్పిరి. అతఁడు కోపావేశుఁడై పోయి పూలుగోయుచున్న కిరాతుని జూచి యిట్లనెను.

హను:—ఓ కిరాతుఁడా! ఏమి యింతనిర్భయముగా నా సరస్సునఁజొచ్చి పూలు గోయుచున్నావు. నేను వీనిని ప్రతిదినము శ్రీరాముని పూజ కొఱకుపయోగించుచుందును.

కిరాతుఁడు:—వానరులు పశుజాతిలోనివారు కదా? వారికి పూజ యనఁగనేమి? పండ్లు, కాయలు దొంగిలించి తినుటయే వారికి తెలియును.

హను:—ఓరీ! నీవు మూర్ఖుఁడవు. బ్రహ్మాండములకు కర్తయైన శ్రీరామునిపూజ కంతరాయ మొనర్చుచున్నావు.

అర్జు:—నీవు పశుజాతిలో చేరిన వాఁడవగుటచేత రాముని మహిమను చెప్పుచున్నావు. ఆ శివుని మహిమ సురాసురుల కైన నగోచరము. వానరుఁడవగుటచే నీకుఁ దెలియక పోవచ్చును. ఈశ్వరుఁడు వాంఛాకల్పతరువు. జగత్తులకు కర్త. వాని పూజకు నీవు విఘ్నము చేయుచున్నావు.

హను:—ఓరే! నీచుఁడా శ్రీరాములను దూషించుచున్నావు. దశకంఠుని సంహరించినవాఁడును, కొండను నీటిపై తేల్చినవాఁడు నాయనయే.

అర్జు:—ఓమూర్ఖుఁడా! ఆయన నీకు గొప్పగా కనఁబడుచున్నాఁడు. వృక్షములు లేనిదేశమునం దాముదపుచెట్టుగొప్పది కాదా! ఆ కాలమున రాముఁడొక్కఁడే విల్లుబట్టియుండెను. ఆయన యొక్క రాక్షసుని చంపెనని గొప్పవాఁ డనుచున్నావు. అట్టి యనేకమంది రాక్షసులను నేను వధించితిని, మీరు కట్టిన వంతెనను నేను బాణములతో కట్టగలను.

హను:—ఓకిరాతుఁడా! నీవు వారధి బాణములతో కట్టినంతమాత్రమున భగవదంశ సంభవుఁడయిన యా శ్రీరామునితో సరియగుదువా? ఇంద్రనీల మాణిక్యములతో గాజుముక్క సమానమగునా? శ్రీరాముని సామాన్యనరునిగా నెంచు

చున్నావు. నీవు బాణములతో వారధికట్టినను దానిపై నావంటివాఁడు నడచిన నది విరుగకుండునా?

అర్జు:—ఎందుకు విరుగును? నిదర్శనము చూతుము.

హను:—సరే రమ్ము. సముద్రతీరమునకుఁ బోవుదము. నీవు వారధికట్టుము. దానిపై నేను నడచెదను. అది విరుగకున్న నేను నిన్ను మహావీరుఁడ వందును.

అప్పుడు వారిద్దఱును సముద్రతీరమునకుఁబోయిరి. అర్జునుఁడు నూఱుయోజనములపొడవును, దానికిఁదగినయెత్తును, గలవంతెనబాణములతో నొకగంటలోతయారుచేసెను. అట్టిపట్టున వేఁగంటితో సాటినాఁగఁ బ్రకాశించుచున్న విల్వచ్చుని జూచి యాశ్చర్యపడి హనుమంతుఁడు తనలో తానిట్లనుకొనెను. "ఇతఁడు సామాన్యుఁడుగాడు. నిష్కారణము వీనితో కలహించితిని కాని చూతము" అని యర్జునునితో "ఓయీ నేనుపశ్చిమదిక్కునకుఁబోయి యిప్పుడే వచ్చెదను. ఇందుండుము" అని చెప్పి, శ్రీరామునికి నమస్కరించి విశ్వరూపమును బొంది వచ్చుచున్న యాంజనేయుని దూరమునజూచి, భయపడి, వీనిభారంబెల్ల నీవంతెన భరింపలేదని శ్రీకృష్ణుని మనసార ధ్యానించి యిట్లువేడికొనెను. "ఓదీనరక్షకా! కరుణాసాగరా! యదుకులమణీ! గొప్పయాపదలో మునిఁగియున్నాను. ఇయ్యది మహాసమయము. చిన్ననాఁటినుండి మమ్మనేకాపదలనుండి కాపాడితివి. ఇప్పుడు నన్ను రక్షింపుము. నీకు తెలియనివిషయములు లేవుగదా! హనుమంతుఁడున్న యీ వనమునకు నన్నేల పంపితివి! నీకు నేనెంతోమాత్రము నపకారముచేసి యెఱుఁగనే. నాయందు నింత నిర్ద

యను కారణమేమి? నిష్కారణముగా నన్ను యమునిపాలి కేల పంపితివి? ఇది నీవు తెలిసినపని గాని వేరుగాదు. ఇప్పుడు నన్ను రక్షించుభారము నిది. శరణాగత రక్షణ బిరుదు వహించితివి గదా. మహాతరుణముతటస్థించినది రక్షింపుము, రక్షింపుము. ఈ దీనాలాపములువిని ద్వారకలో కేళీమందిరమునరుక్మిణితో వినోదించుచున్న శ్రీకృష్ణుడు ప్రియసఖితో "అర్జునుడు పుష్ప ముల నిమిత్తముపోయి చాలకాలమైనది. ఇంకనురాలేదు. కారణము తెలిసికొని వచ్చెదను. అని యతిశీఘ్రముగాబోయి కూర్మరూపమున నర్జునుడు బాణములతో కట్టిన వారధి క్రింద నుండెను. అంత నాంజనేయు లావారధిపై నడచిరాగా నది కొంచెము వంగెను. కాని విరుగలేదు. ఆ సముద్రములోనినీరు రక్తమయమైయుండెను. అది చూచి కారణమేమని కిరాతు డడుగగా "అయ్యా చాలకాలమునుండి, తూణీరమున నుండు టచే బాణములు తుప్పుపట్టినవి. మీ పాదాఘాతమువలన నవి రాపాడుటచే వాని మలినము నీటియందువ్యాపించెను." అనెను. ఆ మాటలువిని యాంజనేయుడు దివ్యదృష్టివలన శ్రీహరి కూర్మమై యందుండుట, ఆయన నవరంధ్రములనుండి రక్తమట్లు స్రవించుట తెలిసి, ఖిన్నుడై యిట్లు విలపించెను. "నేను బహుపాపుడను, శ్రీహరిని నాకాళ్ళతోనొక్కితిని. నేను జీవించుటవలన కార్యములేదు. ఈ సముద్రమునబడి ప్రాణ ములు విడిచెదను." అంతటగృష్ణుడు కూర్మరూపమునువిడిచి గరుడవాహనుడై వారికి ప్రత్యక్షుడై హనుమంతునిజూచి యిట్లనెను. ఓ కేసరిపుత్రా! విచారింపకుము. నీవు రుద్రుడవు. ఈ [illegible]మునుబుట్టి నాకు పెక్కు లుపకారములుచేసితివి. నీ మేలు

మరువఁజాలను. పదునాల్గు భువనములందును నీకు సరియైన వీరుఁడు లేడు. ఇతఁడు పాండవ మధ్యముఁడైన యర్జునుఁడు. మీ రన్నదమ్ములయ్యు నేల కలహించుచున్నారు! అనగా నా మాటలు వినక "నేను నీచకృత్య మొనర్చితిని. మీతలను త్రొక్కితిని. మీ రెవరో చెప్పి నాదోషమును క్షమింపకున్న విషభక్షణము చేసి చనిపోయెదను." నా విని శ్రీకృష్ణుఁడు రాముఁడై నిలిచెను. ఆ రూపమును చూచిన వెంటనే హనుమంతు డాయనకు ప్రదక్షిణ నమస్కారములు చేసి ప్రార్థించెను. శ్రీరాముఁ డతనికి మృదువచనముల చెప్పి బోధించి యిట్లనెను. "నేఁటినుండి మీరు భ్రాతృభావమున మెలఁగవలెను" అనఁగా ఆంజనేయుఁడు "చిత్తము. ఇతఁడు నాసోదరుఁడు. సమయము తటస్థించునప్పుడు తప్పక సహాయము చేసెదను." అనెను. అనవుడు పార్థుఁడన్నకు నమస్కరించి తాను తెలియని నాడినమాటలను క్షమింపుమని వేడుకొనెను. శ్రీహరి యంతర్ధానము నొందఁగా నాంజనేయుఁడు తన నెలవునకుఁ బోయెను. పార్థుఁడు సౌగంధికపుష్పములను తీసికొని ద్వారకనుజేరి రుక్మిణికి సమర్పించెను.

## అంజనాదేవి చరిత్రము

పిమ్మట నొకనాఁడు శౌనకాదిమునులుసనత్కుమారుని జూచి యిట్లనిరి. "ఋషివర్యా! హనుమంతున కాంజనేయుఁడను పేరెట్లుకలిగెను. వివరించి చెప్పుడు" అని ప్రార్థింపఁగా ఆయన వారితో నిట్లు వ్యాకువ్వఁగడంగె, "ఇతడంజనాదేవి కుమారుఁడగుటచే నాపేరు వానికివచ్చెను. ఈ యంజనాదేవి

గౌతమ మహాఋషికిని యహల్యకును కొమార్తె. ఈమె తల్లి శాపమునకు వెఱచి వివాహామువాని తపస్సు చేయుచు బ్రహ్మచారిణియై యుండెను. ఇట్లుండ తండ్రి యొకనాఁడామె యొద్దకు బోయి యిట్లు చెప్పెను. "అమ్మాయీ! నీసుకుమార దేహాము నేల యిట్లు కందించెదవు. ఆహారమును విడుచుటయేటికి? మానవశరీరము సులభలభ్యముకాదుగదా దానినారోగ్యవంత ముగ నుంచినఁ గాని నేకార్యమును జేయుటకు సమర్థులము కాము గదా? కావున శరీరపోషణము ప్రతిమానవునకునువిధి, అందుచే నాహారమవసరము. అట్టి యాహారమును విడువక మితముగా భుజింపవలెను" అనఁగా విని ఆమె తండ్రిని జూచి "నాయనా నేను పురుషుని ముఖమైన చూడనని మీకు దెలియునుగదా! కావున నాకండ్లు తెరువను. అట్టి నాకీ పర్వతమున నాహార మెట్లులభించును? కావున బొత్తిగా మానితిని." అమ్మాయీ! "ఇందుకు నేనొక యేర్పాటు చేసెదను, వాయు దేవుఁడు నీకాహారమును దెచ్చి చేతవేయుచుండును. దానిని నీవు భుజింపుచుండుము" అనెను. అదిమొదలామహాఋషి యాజ్ఞవలన వాయుదేవుఁడామె కాహారము చేతిలోవేయుచుండెను. ఆమె వెంటనేదానినిచూడకుండభుజింపుచుండెను. ఇట్లుండ గొంతకాలమునకు నొకనాఁడు పార్వతీ పరమేశ్వరులు విలాసార్థము వనమున సంచరించుచుండఁగా మర్కటీ మర్కటులు కామకేళి సలుపుచుండుట చూచి యారూపమున తాము సుఖమనుభవింపఁదలంచి యారూపమును బొందిరి. ఇట్లుండ వాయుదేవుఁడు వారి దరిచేరి యనేకవిధముల బ్రార్థించి తన సాటిపుత్రునిమ్మని యీశ్వరుని ప్రార్థింపఁగా ఆయన సంతసించి

తన తేజమును చేత విడచెను. తత్‌క్షణమే వాయువు దానిని గొని పోయి యంజనాదేవి చేతిలో వేసెను. ఆహారమను భ్రాంతితో నామె దానిని భ్రమింగెను. యుక్తకాలమున నామె వానర రూపుఁడగు కుమారుని ప్రసవించెను. ఆబిడ్డకే యంజనీతనయుఁ డని వాయుపుత్త్రుఁడని యనేక నామములు కలవు. "ఋషి వర్యా! బాగుగ సెలవిచ్చిరి. కానియింకొక సందేహమున్నది. అది యెద్దియన సంజనను తల్లి శపించెనంటిరి. తల్లి బిడ్డను శపించుట యస్వాభావికము గదా!

### వాలి సుగ్రీవుల జన్మము

అదియెట్లు సంభవించెను. అనఁగా పూర్వమొకప్పుడు గౌతమ మహాముని తీర్థాటనము చేయఁబోఁగా నాయన ధర్మ పత్నియైన యహల్య మిగులసుందరియు యౌవనవతియునై యింటనుండుట యింద్రసూర్యులుచూచి యామెను కామించి? ఆమె మిగుల పతివ్రతయైనను మాయోపాయముల భంగ పఱచిపోయిరి. అంతకు ముందే యీ అంజన యీ మెకుబుట్టి యుండెను. కావున ఈసంగతి గుర్తెఱిఁగియుఁదల్లికి వెలిచి మఱుగుపఱచెను. కొద్దికాలములో గౌతముఁ డాశ్రమమునుజేరి యెప్పటివలె నింటనుండెను. తగు కాలమున నిరువురు పుత్త్రులు కలిగిరి. వారిని తలిదండ్రులు మిగులగారాబమున పెంచుచుండిరి. ఇట్లు కొంతకాలమైన పిమ్మట బిడ్డలను తోడుకొని గౌతముఁడు నదిలో స్నానము చేయబోయెను. వైశాఖమాస మయినందున నెండవేడిమిచే త్రోవలో నున్న యిసుక కాలుచుండెను. అది చూచి పసిబాలురైన

మగపిల్లలను రెండు చంకల నుంచుకొని యాయన పోవు చుండెను. పిల్లనడుచు చుండుటచే పాదములు చురికి నడువలేక ఏడ్చుచుండెను. అదివిని అమ్మాయి! రమ్ము. వీరికితోడు నిన్ను నే నెట్లు ర్తెత్తుకొనఁగలుగుదును ? వీరికంటెనీవు పెద్దదానవుకదా అనెను. నాయనగారూ! పుత్త్రికనైన నాయందు నింత నిర్ద యయు పరపుత్త్రులయందుఁ బ్రీతియుఁగలిగియుంకుట సహజ గుణము కాదే! ఇది మీకెట్లు సంభవించెనని యాశ్చర్యపడు చున్నాను. అనవిని గౌతముఁడిట్లనెను, "అమ్మాయీ! వీరెవరి పుత్త్రులు ? ఇంద్రునికి సూర్యునికిఁబుట్టినవారు. మీరు లేని ప్పుడు వారు మారువేషములవచ్చి మాతల్లిని భంగపఱచిరి." అని బిడ్డ చెప్పెను. ఆ మాటలువిని గౌతముఁడు పుత్త్రుల నిరు వురను దీసికొని నదిలోవిడిచి "మీరు నాకు జన్మించినట్లయిన మెప్పటివలె నాయొద్దకు రండు, జారజులైన మర్కటరూప లౌదురుకాక!"అనెను. వారు తత్క్షణమే మర్కటరూపమును పొంది, ఆయనయొద్దకు వెళ్ళిరి. అప్పు డాఋషి కోమార్తె నెత్తుకొని వారిద్దఱను వెనుక తీసుకొనిపోవుచు త్రోవలో కనఁబడిన కిరాతరాజు ఋక్షుఁడను వాని కాయిరువురుపిల్లల నిచ్చివేసెను. అతనికి సంతతి లేనందున మిగుల సంతోషముతో వా నితీసికొని యింటికిపోయి వారిలో పెద్దవాఁడైన యింద్ర పుత్త్రునికి వాలియనియు, చిన్నవాఁడగు సూర్య పుత్త్రునకు సుగ్రీవుఁడనియు పేరుపెట్టి వారిని ముద్దుగా పెంచుచుండెను. తండ్రి చనిపోయిన పిమ్మట వాలి కిష్కింధకు రాజయ్యెను.

తదనంతరము గౌతమ మహాముని యాశ్రమమునకుఁ బోయి భార్యను జూచి "నీ వీ యరణ్యమున పాషాణమై

యుందువుగాక యనియు నింద్రుని సహస్రయోనులు గలవాఁడ వగుమనియు సూర్యుని యండములు తెగిపడునట్లును శపించెను. అప్పుడహల్య బహు ప్రార్థింపఁగా రాముని పాదము సోకిన నిజ రూపమును పొందుదు వనెను. అహల్య తనకూతుని జూచి నాగుట్టు బయలుబెట్టితివి గాన నీవు కోఁతిముఖము గల కుమారుని కందువుగాక యని శపించి తాను పాషాణమయ్యెను. వివాహమాడిన గదా పుత్త్రులుద్భవించెదరు. కావున నేను బ్రహ్మచర్యవ్రతమున తపస్సు చేయుచు కనులు మూసుకొని యుందునని యంజనాదేవి భీష్మించెను. అందువలననే యామెకు నాహారమును స్వయముగా సంపాదించుకొను శక్తి లేకుండెను. అని సనత్కుమారుఁడు చెప్పఁగా విని శౌనకాదులు సంతుష్టి పొందిరి.

## నందీ, భృంగుల జన్మవృత్తాంతము

అప్పుడా ఋషులు బ్రహ్మకుమారుని యిట్లు ప్రశ్న చేసిరి. "అయ్యా! ఈశ్వరుని ప్రమథగణములలో మొదటివారు నంది, భృంగియని చెప్పుదురు. వారిజన్మ యెట్లో, వారికట్టి ముఖ్యత యెట్లుకలుగెనో వినఁగోరుచున్నాము. మాయందుదయ యుంచి దానిని మాకు వివరముగాఁజెప్పి మమ్ము నుద్ధరింపఁ జేయవేడెదము. అనఁగా ఆ బ్రహ్మమానసపుత్త్రుఁ డిట్లు చెప్ప నారంభించెను.

ఋషులారా! వినుండు. పూర్వము పార్వతి యీశ్వరుని వివాహమాడఁగోరి హిమవత్పర్వత ప్రాంతమునతపస్సుచేయు చుండఁగా. నామెతోఁగూడ పోయిన చెలికత్తెలలో నొకతె

యగు జయ, తానుగూడ శివుని వరింపవలెనని తపం బాచ రించెను, కాని యప్పటికామెకోరిక నెరవేరలేదు. పిమ్మట కొంతకాలమునకు శివుఁడు గిరిజను వివాహమై కైలాసము నందు సరస సల్లాపము లాడుకొనుచుండఁగా, జయ వారిని జూచి, శివునియందు బద్ధానురాగము గలదియై యుండెను. ఈ సంగతిపార్వతి గ్రహించి "మానవజాతియందు భూలోక మునఁబుట్టుమని జయనుశపించెను." ఆశాపానుసారముగా నీ జయ ధర్మకేతుఁడను రాజునకు సత్యవతి యనుపేర గొమార్తె యైపుట్టి క్రమక్రమముగా పెరిగి పెద్దదయ్యెను. అప్పుడామె నారాజు హరిశ్చంద్రునకిచ్చి పరిణయము చేసెను. ఆచక్రవర్తి యామెతో సుఖించుచు, కాశీపట్టణమున నివసించుచుండెను. ఆతఁడొకనాఁడు శయనమందిరమునసనుండఁగా సత్యవతి లలాట మునఁ బ్రకాశించుచున్న మూఁడవకంటి చిహ్నము చూచి యీామెపార్వతి కాని వేరు కాదు. కపటమున నాకుభార్యయయిన దనియెంచి యీామెను మేడపైని యుంచిబహుగౌరవముతో చూచుచుండెను.

ఇట్లుకొంతకాలము జరిగినపిమ్మట, నొకనాఁడు పార్వతి శివునిజూచి "స్వామీ! మీరు ముల్లోకవాసులుగదా! అన్ని టిలో మీకు మిగుల ప్రియమైన స్థలమెద్దియో సెలవిండు" అని యడిగెను. అందుకు శివుఁడు తనకు మిగుల ప్రియమైనది కాశీపట్టణమని చెప్పెను. అది విని పార్వతి యిట్లనెను. "నాథా! అట్లయిన మన మిందేల యుండవలెను? అచ్చటనే నివసిం తము రండని వెంటనే బయలు వెడలిపోయి కాశీలో నివసించు చుండిరి. వారప్పటికి వేంచేసినది మొదలకాశీ జనులు సర్వ

సుఖము లనుభవించుచుండిరి. ఒకనాటి రాత్రి శివుఁడు నిశీథమందు సంచరించుచు, సత్యవతి యొంటరిగా మేడలోనిద్రించుచుండుట చూచి "ఈమె నాభార్యకు ప్రియసఖియైన జయ. ఆమెశాపమువలన మర్త్యలోకమున జన్మించినది. ఈమెనన్నువరింపఁగోరి పార్వతితోఁగూడ చాలకాలము నా నిమిత్తము తపముచేసినది. కాని యామెకు జడిసి నేను నీమె కోర్కె తీర్పనుంటిని. ఇప్పు డాపని తీర్చెదనని హరిశ్చంద్రుని రూపమున నామెతో భోగించెను. పిమ్మట నామెకు తన నిజరూపమును జూపి వృత్తాంతమును జెప్పెను. అది విని యామె తనకు శాపమోక్షమును ప్రసాదింపుమని వేడుకొనఁగా శివుఁడిట్లనెను. "సఖి ! కొద్దికాలములో నీకిద్దఱు పుత్రులుద్భవింతురు.పిమ్మట నీవు శాపవిమోచన మగును. అని యీశ్వరుఁడంతర్ధానమొందెను. పిమ్మట దశ మాసములు పూర్తికాఁగా సత్యవతి యిరువురు పుత్రులను ప్రసవించెను. వారు దినదిన ప్రవర్ధమానులై శుక్ల పక్షమున చంద్రునివలె పెరుగుచుండిరి వారియం దీశ్వరచిహ్నము లుండెను. వాని చూచి యాశ్చర్యపడి రాజు కొందఱు ఋషులనుపిలిపించి సభచేసి వారికితన పిల్లలనుచూపించి వీరియందు శివుని లక్షణములుండుటకు కారణమేమని యడుగఁగా వారు దివ్యదృష్టిచే సర్వమును దెలిసికొని యిట్లనిరి. "ఓరాజా! వీరీశ్వరునికి బుట్టినవారగుటచే శివుని లక్షణములు వీరియందున్నవి. వీరిని వీరితల్లితోఁగూడ నీశ్వరుని కొప్పగింపుము." తరువాత రాజు సత్యవతి యొద్దకు బోయి నిజస్థితి చెప్పుమనఁగా జరిగిన సమాచార మంతయు స్పష్టముగ నామె చెప్పెను. అది వినిరాజు మిగుల సంతసించి

యూమెను. కొమరులను తీసికొనిపోయి శివున కొప్పగించెను. ఆసమా శివుఁడు వారికి నందీశ్వరుఁడు, భృంగీశ్వరుఁడనునామములొసంగి తనయొద్ద ద్వారపాలకులుగా నుండ నియమించెను. సత్యవతియు జయమై పార్వతికి నెప్పటివలె చెలికత్తెయయ్యెను. పిమ్మట హరిశ్చంద్రమహారాజు చంద్రమతిని వివాహమై లోహితాస్యుఁడను కుమారునికనెను.

## పరశురామోపాఖ్యానము

అత్యద్భుతమైన యీ కథను విని ఋషులు సంతోషించి శివుఁడు దయార్ద్రహృదయుఁడని వేయినోళ్ళ పొగడి సనత్కుమారుని జూచి యిట్లు ప్రశ్న చేసిరి. "ఋషివర్యా! పరశురాముఁడు శివునివరమువలన యష్టాదశద్వీపములకుఁ జక్రవర్తియైన కార్తవీర్యార్జునుని సంహరించుటయే గాక భూలోకమండలి రాజులందఱిని యిరువదియొకసారి వెదకి చంపెనని వింటిమి. ఆ చరిత్రమును కారణసహితముగా సెలవిచ్చి మమ్ములఁ గృతార్థులఁజేయఁ బ్రార్థించెద" మనఁగా, ఆ బ్రహ్మమానసపుత్రుఁడిట్లు చెప్పనారంభించెను. "ఓ మునులారా! శ్రద్ధతో వినుండు. పూర్వము కార్తవీర్యార్జునుఁడను చక్రవర్తి పదునెనిమిదిద్వీపములను పాలించుచుండెను. అతఁడు బహుధార్మికుఁడు. బాహుబలపరాక్రమములుకలవాఁడునై యుండెను. అతనికి వేయిచేతులుండెను. ఆయన యెల్ల విద్యలందును బండితుఁడై ప్రజలను బాగుగ నేలుచుండువాఁడు. ఆ చక్రవర్తి యొకరోజున వేఁటాడుటకై తనపరివారముతో వనమునకుఁ బోయి పెక్కుమృగములను జంపి నేసాగి తన నగరునకు మరలి

పోవు సమయమున గాలి, వాన సంభవించి యురుములతోను, మెఱపులతోను, పిడుగులు పడుచుండెను. అంతట సూర్యుఁ డస్తమింపఁగా చీఁకటి వ్యాపించెను. అప్పుడు రాజును తన సైన్యములును ప్రాణాపాయకరమైన స్థితినిజూచి యొకరికొకరు కానరాక చెట్లపై నెక్కి తమ ప్రాణములను తెల్లవారువఱకు కాపాడుకొనిరి. మరుచటియుదయమున నాకసము నిర్మలముగా నున్నందున నందఱును గలిసి పట్టణమునకుఁ బోవబయలు వెడలిరి. ఇట్లు పోవుచు మార్గ మధ్యముననున్న జమదగ్ని మహాముని యాశ్రమమును రాజు చూచి యచ్చట కొంచెము విశ్రమింపుఁడని పరివారముతోఁ జెప్పి, తాను మహామునిని దర్శించి వచ్చెదనని వానియాశ్రమములోనికి బోయెను. రాజు ముని యెదుటికిపోయి ప్రదక్షిణ నమస్కారములు చేయఁగా మహర్షి యాయనను సత్కరించి కూర్చుండ నియమించి కుశల మడిగెను. అప్పుడు వారికిట్లు ప్రసంగంబు జరిగెను.

జమదగ్ని:—రాజా! ఎందుండి వచ్చితివి?

రాజు:—ఋషివర్యా! నిన్నటి దినమున వేట నిమిత్త మడవికిఁబోయి యుంటిని.

జమదగ్ని:—సరే. రాత్రి యిందే నివసించితివా?

రాజు:—అయ్యా! ఔను. అట్లే సంభవించెను.

జమదగ్ని:—ఏమీ! రాత్రికాలమున వేట కవకాశ ముండునా?

రాజు:—అయ్యా! లేదుగాని మేము వేఁట చాలించు సరికి గాలియు, వానయు తటస్థించెను. అంతట చీఁకటిక్రమ్మి

నందున తెరువు కానరాక యందే చెట్లచాటుననుండి ప్రాణము లను గాపాడుకొంటిమి. ఉదయమున, నగరునకుఁ బోవుచు మీ దర్శనముచేసి పోవలెనని యిటువచ్చితిని. నమస్కారము, సెలవిండు పోయెదను.

జమ:—రాజా ! చాల ప్రొద్దెక్కినది. ఇపుడెందుఁ బోయెదవు? ఈ పూట మాయాశ్రమముననతిథివై యుండుము.

రాజు:—మునివర్యా! క్షమింపుము. నేను పరివార సహితముగా నున్నాను. తమకు చాల శ్రమకలుగఁజేసినవాఁడ నగుదును. కావున నన్నుఁ బోనిండు.

జమదగ్ని:—రాజా! వెఱవకుము. ఎందఱున్న నేమి ? అతిథి సత్కారముచేయుట గృహస్థులకు విధిగదా! దానిని మానిన సమ స్తధర్మములునునశించును. కావున నీవు నీపరివార ముతో ఆతిథ్యమును పొందవలెను. నా మాట చెల్లింపుము.

రాజు:— ఋషివర్యా ! చిత్తము తమయాజ్ఞను శిరసా వహించెదను. సెలవిచ్చిన పరివారమును తోడుకొనివచ్చెదను.

జమదగ్ని:—రాజా! మంచిది. ఆలాగుననే చేయుము.

కార్తవీర్యునకు జమదగ్ని విందుచేయుట.

రాజు తన పరివారమునొద్దకు వెళ్ళిన పిమ్మట మునితన కామ ధేనువునొద్దకు పోయి కార్తవీర్యార్జునునికి తగిన వసతి గృహములను విందునకు తగిన పదార్థములను జాగ్రత్తపరుప మని ప్రార్థింపఁగా నాసురభి యంగీకరించెను. రాజు తన పరి వారముతోడుకొనియాశ్రమమునప్రవేశించుసరికి,ఆయనకొఱకు

దివ్యమైన మేడయు వానిమంత్రులకు వేరువేరు భవనములును పరివారముకొఱకు తగిన యిండ్లును, గజాశ్వములకు వేరు శాలలును, వానికితగిన గృహోపకరణములతోను మంచములు, పరుపులు మొదలగువానితో సిద్ధముగా నుండెను. అవిగాక స్నానశాలలు, పాకశాలలు, మరుగుదొడ్లు మొదలగునవియుతయారు చేయఁబడెను. రాజు, వాని మంత్రు లితర పరివారములకు తగిన సత్కారములుచేసి వారికి నియమింపఁబడిన గృహములను చూపించుటకు తగిన పరిజనులును తయారుగానుండి వారి విధులను వారుచేయుచుండిరి. వారికి యుక్తాహార పదార్థములు (శాల్యన్నములు, పలు విధములగు కూరలు, పచ్చండ్లు ఊఁరుగాయలు పిండివంటలు, పాయసము) వింతవింత రుచులు గల వస్తువులు వానిని వడ్డించుటకు బ్రాహ్మణులుండిరి. అందఱును షడ్రసోపేతముగా భుజించిరి. అట్టి దివ్యమైన భోజనమును రాజుగాని, పరివారము గాని, యంతకు ముందెన్నఁడును చేసి యెఱుఁగరఁట, వారి భోజనము ముగియుసరికి నట గాయకులు వివిధవాద్య విశేషములతో వారిని వినోదింపఁ జేయుటకు మొదలుపెట్టిరి. ఇట్లు కొంతసేపు గడచిన తరువాత రాజు మంత్రులను జూచి, "అమాత్యులారా! ఈ ఋషిచర్య మిక్కిలి యద్భుతముగా నున్నది. ఏలయన, నేనీయుదయమున వారిని దర్శింపఁబోవుసరికి గృహము లేమియు నాశ్రమమున లేకుండెను. ఆఋషి యొకపర్ణశాలయందుండెను. ఇంతలోనే నీ దివ్యభవనము లన్నియు నెట్లు తయారయ్యెను! నావంటి చక్రవర్తికైన వీనిలో చిన్నగృహమును నిర్మింపఁజేయుటకు కొన్నిదినములు పట్టునుగదా? అరగడియలో నివి యన్నియు

నెట్లునిర్మితమయ్యెను! ఇవి నరుల సాధ్యములు. అదియటుండ ఋషులు దుంపలను ఫలములనుగదా భుజింతురు. ఈయన మనవిందునకు దివ్యమైన పదార్థముల నెట్లు సిద్ధపఱచెను? ఇందుకు కారణమును మీరు త్వరలో కనిపెట్టి నాకు తెలియ పఱచుడు" అని ఆజ్ఞాపించెను. రాజాజ్ఞను శిరసావహించి యమాత్యు లందుకు కారణమును గనుపెట్టి, మరల, రాజు సాన్నిధ్యమును జేరి యిట్లువిన్నవించిరి. "రాజోత్తమా! ఈముని యొద్ద నొక కామధేనువున్నది, ఆయన దానికేమికోరిననుతత్‌క్ష ణ మొసంగును. కావున నాయన కసాధ్యమైన పనిలేదు. ఇవి యన్నియును దాని మహాత్మ్యమున కలిగినవి." అనఁగా విని యాశ్చర్యమును బొంది రాజు మంత్రులతో నిట్లనెను. "అట్టి కామధేనువు మావంటివారివద్ద నుండవలెను. కాని కాఱడవుల నాకలములు మెక్కుచు బక్కచిక్కి తపస్సుచేయు బడుగు మునుల కెందుకు? దాని యుపయోగమును వారు సరిగా చేయ లేరు, కావున నే నిప్పుడే మునియొద్దకుఁబోయి దానిని పుచ్చు కొందునని వెంటనే లేచిపోయెను.

కార్తవీర్యార్జునుఁడు కామధేనువును గోరుట

రాజు:—(మునిని జూచి నమస్కరించి) మునివర్యా! నేను మిమ్ము నొక్కటి యాచింపవచ్చితిని.

ముని:—రాజేంద్రా! నీవు క్షత్రియుఁడవు. మూర్ధాభి షిక్తుఁడవు. యాచించుట కధికారములేదే, అయినను నీకోరిక దెలుపుము.

రాజు:—మునివర్యా! మీ కామధేనువును నాకునిప్పింపవలెను. దానికి బదులు లక్షగోవులను మీకు సమర్పించెదను.

ముని:—రాజా! ఏమి నీ కీ దుర్బుద్ధి జనించినది, నీవు బహు ధర్మాత్ముఁడవని వినుచుందునే? ఋషులకు యోగ్యమగు హోమధేనువు, నీ కెందులకు. ఇంతేకాక దానమును ప్రతిగ్రహించు శక్తి బ్రాహ్మణునికి దప్ప యితరులకు లేదే. యజ్ఞములు చేయించుట, చేయుట, వేదమును నేర్చుకొనుట, నేర్పుట, దానమును గ్రహించుట, ఇచ్చుట ఈ యాఱును బ్రాహ్మణునికి నియమిత కర్మములు. వానిలో మూఁడు మాత్రము ఇతర ద్విజాతులకు (క్షత్రియ వైశ్యులకు) అర్హకృత్యములుగానున్నవి. సర్వధర్మములు తెలిసిన నీ కీ విపరీతబుద్ధి యేల పుట్టినది!

రాజు:—ఋషివర్యా! ఏమి యిట్లు సెలవిచ్చెదరు. చక్కని స్త్రీని, మంచిగోవును, ఎందున్నను గ్రహించుటకు శక్తిమూర్ధాభిషిక్తునకు కలదు.

ముని:—ఈ ధర్మమెందు చెప్పబడియున్నది? నీ తలను బుట్టినదిగాబోలు.

రాజు:—మునివర్యా! ఇది సదాచారముగ నున్నది. మూర్ధాభిషిక్తులు చేయుచున్నారు. మీ రియ్యకున్న బలాత్కారముగనైన, నేను మీగోవును తీసుకొనక మానను.

ముని:—ఇది నీతప్పుగాదు. నీ కతిథి సత్కారమును చేసినతప్పు నాది. అదియే యింతమోసము కలిగించినది. నీకు మరణకాలము సమీపించినది. కాకున్న యిట్టి దుర్బుద్ధి

పుట్టదు. నిన్ను ఇప్పుడే భస్మముచేయు సమర్థత నాకు కలదు. కాని యతిక్షిపవగుటచే నాపనికి సాహసింపను.

నావుడు రాజు దిగ్గున లేచి బసకుపోయి తనపరివార మును జూచి "సురభిని తీసికొని రండు. అడ్డము వచ్చినవారి ప్రాణములను పుచ్చుకొనెద" ననెను. అతని పరివార మందుకు తయారుపడుచుండిరి. అంతలో ఋషి, సురభి యొద్దకుబోయి రాజు నుద్యమమును నామెతో నివేదించెను. ఆదివిని ధేనువు నాయనతో నిట్లనెను. "అయ్యా! మీరు వెఱ వకుఁడు. మీసెలవును పొందకుండ నన్ను నిచ్చటినుండి తీసి కొని పోవువారెవరు? ఈ పదునాల్గు భువనము లందలివార లేకమై వచ్చినను నన్ను గొంపోవ సమర్థులుకారు. కావున మీరు విచారింపకుఁడు." మీరు సైన్యమునకు ముందుఁబోక వెనుకనే యుండిన, మీకు కీడుమూడదు.

## జమదగ్ని కార్తవీర్యుల యుద్ధము

ఇట్లు చెప్పి నిట్టూర్పువిడచి అంబారవముచేయఁగా ననేక మ్లేచ్ఛవీరులు, రథములు, రథికులు, నశ్వములు, గజ ములు పలువిధములయిన యాయుధములతో దానిరోమముల నుండియు, గొరిజలనుండియు కోటానకోట్లు జన్మించి రాజుతో యుద్ధమునకు సిద్ధపడిరి. వారినిజూచి యాశ్చర్యపడి రాజు తన కోటకు వర్తమానమంపఁగా నాతని సైన్యము వేనవేలుయుద్ధ సన్నద్ధులై వచ్చిరి. ఉభయపక్షములకునుగొప్పయుద్ధమయ్యెను. సురభిమహాత్మ్యవలన చక్రవర్తి సైన్యమున ననేక జంతువులు, భటులును, చచ్చి రక్తపుఏరులు ప్రవహించెను. కాని ముని

సైన్యమున నొకరును చావకైరి. అదిచూచి రాజు విపుల యుద్ధము చేయఁగా ముని సమ్మోహనాస్త్రమును ప్రయోగించెను. దానివలన రాజును, అతనిభటులును మూర్ఛిల్లి క్రిందఁబడిరి.

అప్పుడు ముని వానిపై కరుణించి సమీపమునకు బోయి ముఖమున నీళ్లుచల్లి సేదదీర్చి, తన యాశ్రమమునకు తీసికొనిపోయి భోజనముపెట్టించి యనేకనీతులు బోధించి, తన కోటకు బొమ్మని బోధించెను. కాని రాజు సురభినియిచ్చిన గాని యుద్ధముమాననని మరల రణమునకు డీకొనెను.

### రెండవసారి యుద్ధము

ఉభయసేనలకు తిరుగ ఘోరయుద్ధమయ్యెను. రాజుసైన్యమున ననేకులు చచ్చిరి. కొందఱు పారిపోయి తమప్రాణములను దక్కించుకొనిరి. యుద్ధరంగమున మూర్ఛనొందిన రాజునువిడచి ముని తనసైన్యమును మరలించుకొని యాశ్రమమునుచేరెను. అంతట రాజు తన పరివారముచేయు నుపచారములవలన తెలివొంది మరల యుద్ధమారంభించెను.

### మూఁడవసారి యుద్ధము

మునియు తనసేనలతో మరల యుద్ధమునకుఁ బోయి రాజు సేనను చంపి యాతని మరల మూర్ఛనొందఁజేసి నాగపాశముచే బంధించి తీసికొనిపోయి తనయాశ్రమమున చెఱలో నుంచెను. అప్పుడుబ్రహ్మ హంసవాహనుఁడై తనమనుమఁడైన జమదగ్ని యాశ్రమమునకు వచ్చి ఆయనవలన సత్కారము

లను పొంది కుశలమడిగి కార్తవీర్యుని సంగతివిని యతఁడు దురాత్ముఁడని చెప్పి విడిపించి వానికి బుద్ధులుసెప్పి నగరుకు నంపెను.

కార్తవీర్యుఁడు తిరిగి యుద్ధముచేయుట

రాజు స్వగృహంబుజేరి తానుపొందిన పరాభవమునకు మిగులఁజింతించి యట్టిసురభిని సంపాదింప లేనప్పుడు తాను జీవించియున్నను లాభములేదని యెంచి సేనలను సమకూర్చు కొని మరల నామునితో యుద్ధమునకుఁ బోయెను. ఇట్లు లిరు వదియొకసారి మునితోఁబోరి చిట్టచివఱ కాముని కోపపర వశుఁడై సురభి చెప్పినమాట మఱచి తనసేనలకు ముందుగా బోయి రాజుతోఁ దలపడెను. అప్పుడు రాజాయనపై ననేక దివ్యాస్త్రంబులను వేయఁగా నాముని వాని ప్రత్యస్త్రములఁ గొట్టెను. దేవతలు గగనమునుండి చూచుచుండిరి. రాజు బ్రహ్మాస్త్రము ప్రయోగింపఁగా, ముని నారాయణాస్త్రమును వేసెను. ఆరెండును పోరుచుండఁగా ప్రళయముసంభవించునని బ్రహ్మవానిని స్తోత్రముచేసి చల్లార్చెను. పిమ్మట శక్తి ప్రయో గించి రాజు జమదగ్ని మహామునిని సంహరించెను. ఆవెంటనే సురభి మిగుల విచారించియింద్రునికడకుఁబోయెను.

రేణుకా విలాపము, సహగమనము.

అట్లు జమదగ్ని మహాముని కార్తవీర్యునిచేచంపఁబడిన సంగతివిని రేణుకాదేవి తత్క్షణమే మూర్ఛబడి కొంతసేపటికి లేచి తెలివొంది శిష్యులతో మెల్లఁగానిట్లనెను. “బాబూ! వారెక్కడనున్నారో నాకుజూపుడు. నాప్రియ సఖుఁడు రణ

భూమిని పడియున్నారా” అనుచుబోయి యాయనను జూచి తలమొత్తుకొనుచు నిట్లువిలపించెను. “ఓ ప్రాణనాథా! క్రింద పడియున్నా రేమి? నాతొడమీద మీశిరస్సునుంచుడుస్వామీ మీకు నేనేమియపరాధము చేసితిని నాపై మీకేల దయవిడచిరి? పుట్టుకచేతనే యబలనైన నేను ననాథనైతినికదా? ఆ బ్రహ్మ నాకు పరమశత్రువయ్యెనుగా! మీరు, మహర్షులును జ్ఞానులుగదా! నన్నొంటరిగావిడచి యెట్లుపోయెదరు? తమ రెఱుగని ధర్మములు గలవా, నన్ను తోడుకొని పోయి మీ పాదసేవ చేయుచుండనిండు; పతివ్రతలకు పతియేగతి, పతిహీనలజీవనము వృథా” అని నిరంతరముగ రోదించుచు తన శరీరమున నున్న నగలుతీసి క్రింద పారవేసెను.

అప్పటికి పుష్కరతీర్థమున తపస్సుచేయుచుండినపరశురాముడు తన కనులనీరు గారుటయు నెడమభుజ మదరుటయు గాంచి తన తల్లితండ్రుల కేమియాపద సంభవించి యుండునో యని వెంటనేబయలుదేరియాశ్రమమునకువచ్చిరోదనముచేయు చున్న తల్లిధ్వనివిని యామెవద్దకుబోయి నమస్కరించి చచ్చిపడి యున్న తండ్రినిజూచి మరణకారణ మడుగగా తల్లి మొదట నుండి చివరకుజరిగిన వృత్తాంతము చెప్పెను. అదివిని,కోపపరవశుడై పరశురాముడిట్లు ప్రతిజ్ఞచేసెను. “ఓ ఇంద్రాదిదశదిశాపతులారా! వినుండు. నేను కార్తవీర్యుని శిరస్సునువేయి చేతులను ఖండించి వానిరక్తముతో పితృతర్పణము చేతును. అట్లుచేయకున్న పితృద్రోహులు బోవుగతిని పోవుదును. అని తల్లివైపుదిరిగి “అమ్మా! విచారింపకుము, నేనుండగ నీ కేమి కొఱత? నాతండ్రిని చంపిన కార్తవీర్యుని రూపుమాపెదను.

నా ప్రతినవించితివిగదా” అనిన అమ్మాటలు విని రేణుకాదేవి పుత్త్రునిం జూచి “కుమారా! ఎందులకు ప్రతిజ్ఞ పట్టితివి ? వాఁడు బహుప్రతాపశాలి. మీతండ్రి బాహుపరాక్రమములు తపోమహిమ శస్త్రాస్త్రనిపుణత నీ వెఱిఁగిన వేగదా ? అట్టివీరవరుని చంపినవానిని నీ కేపంతమేల? విడువుము,” అనెను. “అమ్మా! ఈ విషయమున నీవు చెప్పకుము. మఱి యేసంగతి చెప్పినను నీ యాజ్ఞ శిరసావహించెదను” అని చెప్పెను.

ఈ సమయమున దాసీ, అను పేరుగల దేవఋషియచ్చటికి కరుగుదెంచిన మునివరుని చూచి రేణుక యిట్లు ప్రశ్నించెను. “అయ్యా! నాప్రాణేశ్వరుఁడు నన్నువిడచి పరలోకగతుఁడయ్యెను. నేనుండి ప్రయోజనమేమి! సహగమనము చేయ నిశ్చయించితిని. తమరు సర్వశాస్త్రముల నెఱిఁగిన వారగుటచే నొక్కవిషయమున సందేహము కలిగి మిమ్మడుగుచున్నాను. నేను ఋతుమతినై నాలుగు దినములైనది. ఇందువిషయమై యాక్షేపణలేదుగదా?” ఆ మునియిట్లు బదులు చెప్పెను. “అమ్మాయీ! భర్త చనిపోయినప్పటికి గర్భవతియగు స్త్రీయును, పాలు త్రాఁగుచుండు పసిబిడ్డ గలదియును, ఋతుమతియై మూఁడుదినములు పూర్తిగాకుండునదియును, సహగమనము చేయరాదు. కులటఅనఁగా జారిణియును, కుష్ఠరోగము కలదియు, పతిని నిందించునదియు సహగమనమునకు అర్హలు గారు. అని శాస్త్రమున చెప్పఁబడియున్నది. ఆమాటవిని రేణుక తనమనస్సు దృఢపఱచుకొని పతిచితిచుట్టును ముమ్మారు ప్రదక్షిణమును చేసి కుమారుని జూచి “నాయనా ! నీవు బ్రహ్మ

చెప్పిన చొప్పున కార్యములు చేయుచుండుము. చిరంజీవివై యుందువు గాక" అని యగ్నిలోబడి భస్మమయ్యెను.

పిమ్మట పరశురాముఁడు తగిన విధమున వారికుత్తర క్రియలు నెరవేర్చి దానధర్మములు బ్రాహ్మణ సంతర్పణము వగైరాలుచేసి తన యాశ్రమమున నొంటరిగా నుండి తనతల్లి దండ్రులకొఱకు విచారించుచుండఁగా తనకు తాతయైన భృగుమహాముని వచ్చిన యాయనకు సత్కారములు చేసి చేతులు జోడించుకొని యుండఁగా నమ్ముని పరశురాముని జూచి యోదార్చెను, తరువాత పరశురాముఁడు తాతతో తన ప్రతిజ్ఞ చెప్పెను. అదివిని బ్రాహ్మణునికి క్రోధము కూడదనియు, యుద్ధము తగదనియు బోధించెను. కాని పరశురాముఁడు విననందున బ్రహ్మతో నాలోచించి యాయన చెప్పినప్రకారము చేయుమని చెప్పిపోయెను. ఆ వెనుక పరశురాముఁడు సత్య లోకమునకుపోయి బ్రహ్మను దర్శించి కార్తవీర్యుఁడు తన తండ్రిని చంపుటయు, వారి కలహకారణము, తల్లి సహగమనము చేయుటయు, తన ప్రతిజ్ఞయు చెప్పుటయేగాక భూలోక మందలి, రాజుల నందఱిని యిరువది యొకసారి వెదకి వెదకి చంపెదననియు, విన్నవించెను, అది విని బ్రహ్మ యిట్లనెను. "వత్సా ! ఇది తగనిపని. కార్తవీర్యుఁడుకదా నీకు కీడుచేసెను. మిగిలిన రాజులనేల చంపవలెను ? అందువలన చాల ప్రజా క్షయమగును, లోక మరాజకమగును. అందు నా సంతతియే కదా ! దీనికి నేమి చెప్పఁగలను ! నీవీశ్వరుని యొద్దకు బోయి యాయన చెప్పినట్లుచేయుము. ఆయన సర్వజ్ఞుఁడు.

పరశురాముఁడు శివునివలనఁబాశుపతాస్త్రము పొందుట

బ్రహ్మ సెలవుతీసికొని, పరశురాముఁడు కైలాసమునకు పోయెను. సత్యలోకముపైని లక్షయోజనములదూరమున కైలాసమున్నది. దానిపై లక్షయోజనములకు వైకుంఠమున్నది. దానిపై మఱిలక్షయోజనములకు ధ్రువలోకమున్నది. అచ్చటనుండి మఱి లక్షబోయిన గోలోకమున్నదఁట. ఆ కైలాసముయొక్క వైభవమును జూచి మిగుల నాశ్చర్యపడి, ద్వారమునొద్దచేరి, ద్వారపాలకుజూచి యీశ్వరుఁడేమో భ్రమపడెనఁట. వారిని ప్రార్థించి మరియొక ద్వారముచేరెను. అటులేఁడుద్వారములను గడచి పార్వతీ సహితుఁడైయున్న శివునిదర్శించి, తన గోత్రనామములను విన్నవించి, తనతండ్రిని కార్తవీర్యార్జునుఁడు సురభినిమ్మని యడుగుటయు, నాయన దానిని నివ్వనందున నాయనతోయుద్ధముచేసి చంపుటయు తను వానిని చంపుటకుప్రతిజ్ఞ చేయుటయు మనవిచేసి వానిని చంపుటకు తగిన వరములు నస్త్రశస్త్రములును తనకు ప్రసాదింపుమని యాశివుని బ్రార్థించెను. ఆ మాటలు పార్వతివిని కార్తవీర్యుఁడు తనకు ప్రియభక్తుఁడనియు వాని చంప వలను పడదనియు తన ప్రతిన విడచి యింటికిబోయి బుద్ధిగానుండమనియు పరశురామునికిబోధించెను. అప్పుడు పరశురాముఁడు తనదీనత్వమును నొంటరితనమును కార్పణ్యమును తెలుపుచు రాజు నిష్కారణముగా బ్రాహ్మణుఁడైనట్టియు తపశ్శాలి యయినట్టియు తన తండ్రిని చంపెననియు నట్టివానిని చంపనియెడల తాను పితృద్రోహి నగుదుననియు, మనవిచేసి వారి పాదములపై బడి రక్షింపుమని పలువిధముల స్తోత్రములు చేయఁగా శివుఁడు

వానిపై కరుణించి పార్వతినిచూచి "ప్రేయసీ! ఏమి ఏనియందు నిర్దయ హృదయముగలదానవైతివి? యతఁడుస్వల్పబాలుఁడు తలిదండ్రులు లేనివాఁడు. దిక్కులేక యిందువచ్చినవాఁడు కార్తవీర్యుఁడు ధర్మమును తప్పినవాఁడు. కావున ఏనిని రక్షించుట మన విధి"అని పరశురామునిచూచి "వత్సా! భయపడకుము. పాశుపతాస్త్రమిచ్చెదను దానను క్షత్రియుల నిరువదియొక సారి సంహరింపుము. కార్తవీర్యుని ముందు సంహరింపుము. నాగపాశమిచ్చెదను. దానివలన నీవు జగత్తును జయింతువు గాక!" అనియాశీర్వదించెను. శివునిమాటలు విని పార్వతియు వానిపై కరుణించి యక్షయతూణీరము ననేకదివ్యాస్త్రముల నొసంగి నేటినుండి నీవు మాకు పుత్రతుల్యుఁడవనెను. పరశురాముఁడు మిగుల సంతసించి పార్వతి పరమేశ్వరులకు భక్తితో నమస్కరించి సెలవు తీసికొని నిజాశ్రమమునకు బోయెను.

## పరశురామ కార్తవీర్యుల యుద్ధము

ఇట్లుదనయాశ్రమమునుచేరి యుద్ధసన్నాహుఁడై కార్తవీర్యునితో నిరువది సార్లు యుద్ధములు చేసియారాజు సేనల నెల్ల సంహరించెను. కాని వానిని చంపలేక నర్మదా తీరమునకుఁబోయి తన జీవనము వృథాయని యెంచి యానదిలో బడి ప్రాణత్యాగము చేయదలఁచి శ్రీమహావిష్ణువును మనస్సారఁదలంచి పెక్కుస్తోత్రములు చేయఁగా, శ్రీహరి కరుణించి గరుడవాహనుఁడై వానికి దర్శనమిచ్చెను. ఆ బాలతాపసి యాయన యెదుట చేతులు జోడించుకొని తన మొఱవిన్న వింపఁగా సంతసించి యాయన వైష్ణవశక్తిని మంత్రపూరిత

ముగా నిచ్చి దానిసహాయమువలన కార్తవీర్యునిసంహరింపు మనియు, పిమ్మటరాజులనందఱను చంపుమనియు వరమిచ్చి యంతర్ధానమయ్యెను. ఆ బలముచే పరశురాముఁడు తిరుగ కార్తవీర్యునితో యుద్ధమునకు పోయెను. అదివిని రాజు భయముచే వణకనారంభించెను. అతనియెడమకన్ను భుజము బెదరెను. పగలు చీఁకటిగా నుండెను. ఈ అశుభసూచకముల వలన భయపడి అంతఃపురమునకుబోయెను. అతి పతివ్రతయు, మిగుల సుందరియు బుద్ధిగలదియు నగు మనోరమ యను నతనిభార్య యెదుట గని తోడ్కొనిపోయి పర్యంకమునఁ గూర్చుండఁబెట్టి యిట్లనెను.

మనోరమ:—ఓ ప్రాణనాథా! మీా భయమునకు కారణమేమి? పరశురాములతో యుద్ధము ముగిసెను గదా?

రాజు:—సఖీ! ముగియలేదే యమునివలె తిరిగివచ్చినాఁడు. నన్ను యుద్ధమునకు పిలుచుచున్నాఁడు.

మనో:—నాథా! ఎందుకు మన కీకలహము? అతఁడు బ్రాహ్మణుఁడు, తపశ్శాలి, విష్ణువు నవతారము.

రాజు:—సఖీ! విధివశమునెవరు తప్పింపగలరు!

మనో:—నాథా! కేవలము విధినేల నిందింపవలయును? ఇందు మనవశము కొంతయున్నదికదా! జమదగ్ని మహాముని మీాకు కామధేనువు నివ్వనందున మీారాయనను చంపి బ్రహ్మహత్య గావించితిరి. ఆ పగసాధింప నాయనకుమారుఁడైన పరశురాముఁడు పూనుకొనెను.

రాజు:—ఔను సఖి! యిప్పుడు తప్పుట యెట్లు? యిది యంతయు వృథాశ్రమ యయినది. ఆ సురభికొఱకుగదా యిన్నిసారులు యుద్ధము చేయవలసివచ్చినది. నేను జమదగ్నిని చంపిన వెంటనే యది లేగా యింద్రునియొద్దకు పోయినది. మనకు చిక్కనేలేదు.

మనో:—నాథా! బ్రహ్మహత్యమాత్రము దక్కినది. రెండవదికూడ నెందుకు? నామాట చిత్తగించి యా మునిని శరణు వేడుట మంచిది. ఇంతటితో కలహము చాలింపుడు. బ్రాహ్మణుడు కావున మనకు న్యూనత లేదు.

రాజు:—సఖీ! ఆతడు బహు కార్పణ్యశాలి. శరణు వేడినను చంపకమానడు. అవమానము మాత్రము తప్పదు. కావున యుద్ధమునకే సిద్ధపడుదును.

మనో:—నాథా! అట్లయిన నన్ను ముందు కడతేర్చి యుద్ధమునకు పొండు. లేకున్న నాగతియేమి? పతిలేని సతి జీవనము వృథాగదా!

రాజు:—ప్రేయసీ! నీ వట్లు విచారింపకుము. నీ కేమి భయము? బ్రాహ్మణుడు వచ్చి, క్షత్రియవీరుడనైన నన్ను యుద్ధమునకు పిలిచిన పోకున్న, యమర్యాదకదా! దానినెట్లు సహింపగలను? విధివశ మెట్లున్న నట్లగును. ఇందుకింతవిచార మేల! పుట్టిన ప్రతిజంతువును గిట్టుట నిజమేగదా!

మనో:—పతి నిశ్చయము నెఱింగి, తన కుమారుని పరివారమును పిలిపించి, చుట్టు కూర్చుండి శ్రీహరినామస్మరణ మును చేయుడని తాను పతితొడపై తలనుంచి పరుండి నారా

యీశస్మరణ చేయుచు, నవరంధ్రములను మూసి ప్రాణములను విడిచి తాను ముందుస్వర్గమును బొందెను. అందుకు రాజు మిగుల శోకించి, యామెకు దహనాది కృత్యములు దీర్చి, తన జీవనము నిష్ప్రయోజనమని యెంచి, యుద్ధమునకు బోయెను. పరశురాముఁడొక్కఁడే యయినను కార్తవీర్యుని బలములను నశింపచేసి విరథుని గావించెను. అంతట మత్స్యరాజు పరశురామునితో తలఁబడి ఘోరయుద్ధము చేసెను. ఇట్లు మూఁడు రాత్రింబవళ్ళు పోరినను మత్స్యరాజు చావకుండుట చూచి విష్ణువును ప్రార్థింపఁగా నాకసమునుండి యిట్లు శబ్దము వినఁబడెను. ఓ వీరుఁడా! శివుని కవచము మత్స్యరాజు శరీరమున నున్నది. అది యున్నంతసేపు వాఁడుచావఁడు. ఆ మాటలు విని పరశురాముఁడు నాఁటిరాత్రి బ్రాహ్మణవేషము దాల్చి పంచమస్వరమున వేదమును బాడుచు, మత్స్యరాజు శిబిరమునకుఁ బోగా నావేదధ్వని విని యాశ్చర్యపడి యా బ్రాహ్మణునికి నమస్కరించి "అయ్యా! మీ కేమి కావలసి యింత రాత్రివేళ వచ్చితిరి? మీరు కోరినది తప్పక నిత్తును" నావుడు విప్రపుంగవుఁడు "రాజా! నీకవచమును కోసియిమ్ము" అని బ్రాహ్మణుఁ డనెను. రాజట్లే యిచ్చెను. ఆ మరునాఁటి యుద్ధమున రాజు చనిపోయెను. తరువాత కార్తవీర్యుని సామంత రాజులయిన మగధ, నేపాళ, భూపాళ, సౌరాష్ట్ర, మాళవ, అంగ, వంగ, కళింగాధిపతులు పరశురామునితో గొప్పగా పోరి మరణించిరి. అదిచూచి యధైర్యమునుపొంది కార్తవీర్యుఁడు పదిరెండు వత్సరముల బాలుఁడైన సుచంద్రుని చూచి యిట్లు చెప్పెను.

సుచంద్రుని యుద్ధము

కార్తవీర్యుడు:—కుమారా! నీవు పోయి యడవిలో దాగియుండుము. లేకున్న నిశ్చయముగా నీ పరశురాముని బారి పడుదువు. నీతల్లి నాయొద్ద నిన్ను విడిచిపోయినది. నీవే నా జీవధనము, నిన్ను నే నెవరి కప్పగింతును? ఈ ఋషికి నా ప్రాణములు సమర్పించెదను.

సుచంద్రుడు:—నాన్నగారూ! మీరు భూలోకేంద్రులు. పరమధార్మికులు, సుగుణ ఖనులు. ప్రపంచమందలి సమస్త రాజులును మిమ్ము సేవించుచున్నారు. దశకంఠుడు కూడ మీకు దగినవాడు. మీతో సరియైన రాజులు భూలోకమున లేరు. అట్టి మీకు పుత్రుడనై యుద్ధము సేయక యడవిలో దాగియుండెదనా? ఈ జీవనమున ప్రయోజనమేమి? ఋషిపుత్రునితో పోరాడి చంపెదను. నా ప్రతాపమును చూచుచుండుడు. వింత వింత యుద్ధములుచేసి వానిని చంపి దేవతలవలన మెప్పువడసెదను.

ఇట్లు తండ్రిని బోధించి సుచంద్రుడు పరశురామునితో తలపడి యేడురాత్రింబవళ్లు ఘోరయుద్ధముచేసి యనేక దివ్యాస్త్రములు ప్రయోగించి ఋషి ప్రయోగించు దివ్యాస్త్రములను సంహరించుచు, దేవదానవులవలన పొగడబడెను. కాని పరశురాముడు విసికి వానిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించి చంపెను. ఈ సమాచారము చారులవలన విని రాజు మూర్ఛిల్లెను. కొంతసేపటికి తెలివొంది మనస్సు దృఢపఱచుకొని యుద్ధమారంభించెను.

## భద్రకాళి దర్శనము

అప్పుడు రణభూమియందు భద్రకాళి ప్రత్యక్షమయ్యెను. ఆమె మిగుల పొడవై భయంకరాకారముగలదై జుట్టువిరియబోసికొని వ్రేజుని నాలుక, పది భుజములు, దివ్యాయుధములును ధరించి దిగంబరియై శవముపై నెక్కియుండెను.

ఆమె కార్తవీర్యుని పక్షము వహించి ఋషి వేయు శస్త్రాస్త్రములను చేతబట్టుకొనుచుండెను. తాను వేసిన దివ్యాస్త్రములు వృథాయగుట చూచి పరశురాముఁ డామెను మిక్కిలి ప్రార్థించెను. అందు కామె సంతసించి వరమడుగుమనెను. తల్లీ! నాప్రతిజ్ఞ నెరవేరున ట్లనుగ్రహింపుమనెను. తిరిగి యుద్ధ మారంభింపఁగా కార్తవీర్యుని శక్తిప్రయోగము వలన పరశురాముఁడు మూర్ఛిల్లి క్రిందపడెను. అప్పు డీశ్వరుఁడువచ్చి లేవనెత్తి యాతనిశరీరమునుతట్టఁగా మిగులబలము గలవాఁడై తిరుగ సంగ్రామ మారంభించెను. శివుఁడు బ్రహ్మ యొద్దకుపోయి "కార్తవీర్యుఁడు పరశురామునితో యుద్ధము చేయుచున్నాఁడు. వాని శరీరమున విష్ణుకవచ మున్నది. అది యున్నంతకాల మూ రాజ జేయుఁడు. కావున నీవు యేూపాయముల దానిని తీసికొనుము." అది విని బ్రహ్మ సామాన్య బ్రాహ్మణరూపమున రాజునొద్దకు సామగానము చేయుచు పోయి మెప్పువడసెను. ఏమి కావలెనని రాజడుగఁగా నీకవచ మిమ్మనెను. దానిని రాజుకోసి యిచ్చి నీ వెవరవో చెప్పి పొమ్మనెను. బ్రహ్మ తన నిజరూపమును జూపి, వారే దేవతలు నీకొఱకు విమానముతో సిద్ధముగ నున్నారు.

చూతుమని చెప్పి పోయెను. మరునాడు కార్తవీర్యుడు యుద్ధమున బహు పరాక్రమముతో పోరుచుండగా పరశు రాముడు పాశుపతాస్త్రము విల్లున సంధించి, పార్వతీ పరమేశ్వరులను ధ్యానించి కార్తవీర్యునిపై విడిచెను. అప్పుడు దిక్కులు ఘూర్ణిల్లెను. సముద్రములు పొంగెను. ఆబాణము గిరగిర తిరుగుచు పోయి రాజుపైబడి వానిని చంపి వెంటనే కైలాసమునకుబోయి యీశ్వరునకు పార్వతికిని నమస్కరించెను. పిమ్మట ఋషిపుత్రుడు రణరంగమున నాట్యమాడుచు నచ్చట నున్న రాజులనందఱిని స్వర్గస్థులఁజేసెను. వారిరక్తముతో పితృతర్పణ మొనరించెను. తరువాత భూప్రదక్షిణము చేయుచు నిరువదియొకసారి రాజులను వెదకి వెదకి చంపెను. సంతానహీనుఁడైనందున దశరథమహారాజును మాత్రము విడిచిపెట్టెను. గర్భములో నున్న శిశువులను కూడ చంపెను. అందువలన క్షత్రియస్త్రీలు భయపడి బ్రాహ్మణుల యిండ్ల దాగియుండి పిమ్మట వారివలన సంతానమును బడసిరట. ఈయనవలన నశింప చేయఁబడిన రాచకుల మిట్లు మరల వృద్ధినొందెనని చెప్పఁబడియున్నది.

### పరశురాముఁడు పాపవిముక్తికై బ్రహ్మను, శివుని దర్శించుట

ఇట్టి ఘోరపాపమున మనస్సున శాంతి లేక పరశురాముఁడు నర్మదలో స్నానముచేసి సత్యలోకమునకుఁ బోయి బ్రహ్మకు వందనము లాచరించి తాను చేసిన ఘోరకృత్యములను విన్నవించి పాపవిముక్తి తనకెట్లు కలుగునని యడుగఁగా బ్రహ్మ "నీ గురువైన యీశ్వరుని దర్శించి యాయన సెలవు ప్రకారము

చేయుము" అనెను. అది విని కైలాసమునకుఁ బోయి యుమా మహేశ్వరులను దర్శించి పాపవిముక్తి సాధనమును చెప్పుడని వేడికొనఁగా "కామరూపతీర్థమునకుఁబోయి విధియుక్తముగా స్నానము చేసి కామాఖ్య దేవతను పూజించిన, సమస్త పాపములు నశించు" నని వారు సెలవీయఁగా నట్లొనరించి తనయాశ్రమమును చేరెను.

### పరశురాముని జననము

శౌనకాది మహామునులు పరశురామునిచరిత్రనంతయు విని సనత్కుమారునిజూచి, యిట్లనిరి. "ఋషివర్యా ! పరశురాముఁడు బ్రాహ్మణుఁడయ్యును, క్షత్రియులుచేయునట్టి క్రూరకర్మ యయినయుద్ధములుచేయుటకు కారణమేమి? యనియడుగ నాబ్రహ్మపుత్రుఁడు వారలతోనిట్లు చెప్పెను. పూర్వముచంద్ర వంశపు చక్రవర్తియయిన కుశనాభునికుమారుఁడైన గాధిమహారాజు రాజ్యముచేయుచుండగా ఋచకుండను బ్రాహ్మణుఁడాయన యొద్దకుఁబోయి యాశీర్వదించి నీకొమార్తెను నాకిచ్చి వివాహముచేయుమని కోరెను. అతని కిచ్చుటకు, రాజిష్టపడక మిషపెట్టి పంపదమని నల్లనిచెవులుగల తెల్లని వేయి గుఱ్ఱములను కానుకగా నిచ్చిన తనబిడ్డ నిచ్చెదననెను. ఆ ఋచికుఁడు వరుణుని యడిగి తెచ్చి వేయిగుఱ్ఱముల నిచ్చెను. అందులకు మెచ్చి గాధిరాజు తన కూతు నతనికిచ్చి వివాహము చేసెను. అప్పటికి గాధిరాజునకుపురుషసంతతిలేకుండెను. తరువాత కొంతకాలమునకు ఋచికుఁడు గొప్ప మంత్రప్రభావము గలవాఁడని తెలిసి, అతనియత్తగారు, నాతని భార్యయైన

సత్యవతియు, కుమారులను ప్రసాదింపుమని యతని నడుగఁగా బ్రహ్మమంత్రములతో నొకపాయసమును, క్షాత్రమంత్రములతో నొక పాయసమును తయారుచేసి యుంచి తానుస్నానముచేయుటకై నదికిపోయెను. అట్టిసమయమున తల్లి పాయసము నడుగఁగా సత్యవతి తననిమిత్తము తయారుచేసిన పాయసము తల్లికిచ్చి తన తల్లికొఱకు నుంచినది తాను త్రాగెను. అంతటఋచికుఁడిల్లుచేరి పాయసములు వ్యత్యాసమగుట తెలిసి భార్యను జూచి నీకు మంచి వీరుఁడైన క్షత్రియుఁడును, నీతల్లికి బ్రహ్మజ్ఞానముగలవాఁడును పుట్టునని చెప్పెను. అది విని సత్యవతి మిగుల విచారించి పతిని ప్రార్థింపఁగా కనికరించి నీమనుమఁడు వీరుఁడగునని వరమిచ్చెను. పిమ్మట పది మాసములు కాఁగా తల్లికి విశ్వామిత్రుఁడుపుట్టిక్రమముగా బ్రహ్మఋషియయ్యెను. సత్యవతికి జమదగ్ని జన్మించెను. అతనికి రేణుకయందు పరశురాముఁడు పుట్టి వీరుఁడై యిట్టి క్రూరకృత్యములు చేసెను. బ్రాహ్మణుడై పుట్టి క్షత్రియధర్మము నడుపుటకుకారణమిదియే. అతఁడొకప్పుడు తల్లినికూడ చంపెను. అది యెట్లనఁగాఁ జెప్పెదను వినుండు.

## పరశురాముఁడు తల్లినిచంపుట

ఒకనాఁడు రేణుక గంగకుఁబోయి యచ్చటతనపత్నులతో జలక్రీడ సల్పుచున్న చిత్రరథుఁడనుగంధర్వరాజునుజూచుచు కొంతసేపు నిలిచెను. అందువలన కొంత యాలస్యమయినదని యామెభయపడుచు నింటికిఁబోయి జలఘటమును దించి, భర్తయెదుటనిలిచియుండెను. ఆయన దివ్యదృష్టిచే నామె యాలస్య

ముగా నచ్చుటకు కారణ మెఱింగి కొడుకులను జూచి యామెను చంపుమని యాజ్ఞాపించెను. కాని కొడుకు లట్లు చేయరైరి. కడసారపు వాఁడైన యీ పరశురాముఁడు తండ్రి యాజ్ఞాప్రకారమన్నలను తల్లిని వెంటనే చంపెను. అందుకు జమదగ్ని మిగుల సంతసించి వానిని మెచ్చి వరము కుగుమనెను. అప్పుడతఁడు తన తల్లిని యన్నలను బ్రతికింపుమనెను. జమదగ్ని వానినిసజీవుల చేయఁగా వారు దిగ్గునలేచిరి. జమదగ్ని మహాముని కిట్టి సమర్థత గలదని పరశురాముఁ డట్లు సాహసించెను. ఇతనికి ముఖ్యమైన యాయుధము గొడ్డలి. ఇతఁడు విష్ణువుయొక్క యవతారము. కావున నీయుపాఖ్యానము సమస్త పాపహరము. సర్వశుభప్రదము. శ్రీరాములు సీతను వివాహమై యయోధ్యకు పోవుచు, నీయన విల్లునందుకొనుచు నతని బలమంతయు తీసికొనెను. ఆ విల్లుతో రాజులతలలతో పరశురాముఁడు స్వరమునకు కట్టినమెట్లు విరుగఁగొట్టెను. నాఁటనుండి బలహీనుఁడై తల్లి వరమున చిరంజీవియై తపస్సుచేయు చాయన మహేంద్ర పర్వతమునందున్నారు. ఇతఁడు రాజులనందఱిని చంపి గెలిచిన భూమిని బ్రాహ్మణుల కిచ్చెను. కాబట్టి భూమిపై దాతైన బెట్టుకు." అని చెప్పఁగా ఋషులు విని స్వామీ! అవతారపురుషుఁడైన శ్రీహరి కథ పూర్తిగా సెలవిచ్చి మమ్ము కృతార్థుల జేసితిరి. ధన్యులమైతిమి. ఇప్పుడు ముక్తి నొందుటకు ముఖ్యాధార మేమో చెప్పుడు. అని శౌనకాదులడుగఁగా నాయన వారలతో నిట్లు చెప్పెను.

ముక్తిసాధనములు

మునులారా! వినుండు. పూర్వమీ ప్రశ్న పార్వతి పరమేశ్వరుని నడిగెను. అందు కామెత్తో శివుడిట్లు చెప్పెను. "దేవా! ముక్తియెట్లులభించునో వినుము. వైష్ణవభక్తులుము క్తి నొందుదురు. వారభేదబుద్ధితో హరిహరులను ధ్యానించుచుందురు. వారే సర్వజీవులయందు నాత్మరూపమున నున్నారు. కావున తనను తానెంత ప్రేమించునో సమస్త జీవరాసుల నట్లే ప్రేమింపవలెను. పరోపకారము, ధర్మ కార్యములు, హరినామస్మరణము చేయుచు, తానుచేసిన కర్మ ఫలము తానపేక్షింపక నేకమనస్సుతో ధ్యానము చేయుచు, నింద్రియములను జయించి కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములను నరిషడ్వర్గమును సంహరించి జాగరూకతతో సుఖదుఃఖములందు సమభావము గలిగి సర్వదా సంతోషముతో శ్రీహరిని హృదయ పద్మమందు స్మరించువారు తప్పకముక్తినొందుదురు. అట్లుగాక విషయసుఖముల దగులు వారు చనిపోయిన పిమ్మట నరక బాధలను పొందుదురు. పాపములు పలువిధములై యున్నవి. అట్లే వారనుభవింప వలసిన శిక్షలుకూడా వేరువేరుగా నుండును. ఇరువది యెనిమిది మహానరకము లున్నవి. ప్రాణులందు చాలకాలమపరిమిత యాతనలు పొంది పిమ్మట పశుపక్షి కీటకాదులై జన్మించి, కొనకు మరల మనుష్యులై పుట్టి యందు జ్ఞానశూన్యులై సంచరించుచు తిరుగ నరకములో పడుదురు. జ్ఞానము కలవారు గూడ నంతనుత్తమ జన్మములెత్తి జ్ఞానాభివృద్ధి చేసుకొని తుదకు ముక్తినొందుదురు. మానవజన్మము దుర్లభము.

పిండోత్పత్తి ప్రకారము

జీవుడు పుట్టవలసి వచ్చినపుడోషధుల యందనగా మనుష్యులు భక్షించు పదార్థములు, ఫలములు, మొదలగువాని యందు బీజరూపముననుండి పురుషుని గర్భమున ప్రవేశించి శుక్లరూపమున స్త్రీగర్భమునందున్న పుష్పమునబడి స్త్రీ రేతస్సుతో కలిసి పిండరూపమగును. ఆపుష్పము స్త్రీలబుతుకాలమున వికసించి యుండును. దానికే జరాయువని పేరు. సృష్టికర్తవలన నివ్వబడిన శక్తివలన శుక్లము రేతస్సు కలిసి క్రమక్రమముగా వృద్ధిపొందును. అయిదురోజులలో నీటిబుంగవలె నగును. పదునేను దినములకండాకృతి నొందును. నెలలో లావై తెడు పెరుగును. రెండుమాసములకు మనుష్యాకారము పొందును. నాలుగు నెలలలో నంగము లేర్పడును. అయిదాఱు మాసములకు గోళ్లు వగైరా లేర్పడును. ఏడుమాసములకు నెముకలు, తల, చర్మము, రోమము లేర్పడును. ఎనిమిదవ మాసమున పూర్ణచైతన్యము కలుగును. బొడ్డుతీగద్వారా యా శిశువుకు కావలసిన యాహారమును పొందుచుండును. తల్లి భుజించు నాహారపదార్థము లుప్పు, పులుసు, కారము, చేదు, వగరు, తీపు మొదలగునారములు శరీరమునకు తగిలి బాధపడుచు పూర్వజన్మల జ్ఞానము కలిగి తాను ముందుచేసిన పాపములను తలంచుచు, ఇక నిట్టిపాపము చేయననియు, రక్షింపు మనియు శ్రీహరిని ధ్యానింపుచుండును. పాపములఫలము వాని వలన కలుగు బాధలు తెలిసిన వనియు నట్టివి మఱిచేయనని యు, క్షమింపు మనియు పలువిధముల శ్రీహరిని వేడుకొనును. అన్ని నరకములకన్న గర్భనరకము హెచ్చు బాధకర మని,

దానిని, మఱి తనకు కలిగింప వద్దనియు ప్రార్థించుచుండును. ఇట్లు దశమాసములు పూర్తికాఁగా తల్లిని బహుకష్ట పెట్టి జన్మించును. పుట్టిన పిమ్మట దివ్యజ్ఞానము నశించి, మాయ లోఁబడి క్రమక్రమముగా వృద్ధిపొందును. కావున తన కర్మయే తనకిట్టి సంసారదుఃఖమును కలిగించును. దానిని తప్పించు కొనుట యెట్టివారికైన నసాధ్యము. కావున పాప కర్మను విడచి, ధర్మము జేయుచుండవలెను. జన్మాంతమున ధర్మ మొక్కటే జీవునికితోడు. ఆ ధర్మమే జీవులనాపదల నుండి కాపాడుచుండును. బృహస్పతివంటి జ్ఞానులకైనను కర్మ ఫలమనుభవింపక తీరదు. అని చెప్పఁగా బ్రహ్మ కుమారుని జూచి ఋషులు బృహస్పతి యెట్టి కర్మఫల మనుభవించెనో చెప్పుడనఁగా నాయన వారలతోనిట్లు చెప్పెను.

బృహస్పత్యుపాఖ్యానము

పూర్వమొకప్పుడు దేవగురువైన బృహస్పతి జనులకు బ్రహ్మజ్ఞానముపదేశింపఁదలంచి, భూలోకమునజన్మించి, నర్మదా నదీతీరమున నున్న ఒక గ్రామమున నివసించుచు, ననేక మంది బ్రాహ్మణులను తనయొద్ద శిష్యులుగా చేర్చుకొని,వారి కన్నవస్త్రములుతానే యిచ్చుచు, వారికి విద్యగఱపుచుండెను. ఆ సమయమున సూర్యుని కుమారుఁడైన శనైశ్చరుఁడు విద్య నేర్చుకొనవలెనని తండ్రియొద్దకుబోయి తనకోరిక నాయనతో విన్నవించి తగిన గురువెవరని యడుగఁగా, "నాయనా ! బృహ స్పతి యెల్లవిద్యలయందును గొప్పవాఁడు, ఆయన యిప్పుడు వాచస్పతియనుపేరున భూలోకవాసులకు విద్యనేర్పుచున్నాఁడు

వానియొద్దకుబోయి బ్రహ్మజ్ఞానమునుసంపాదించుము. బ్రాహ్మణులకు తప్ప నితరులకాయన విద్య నేర్పడు" అనెను. తండ్రి వాక్యములువిని శనైశ్చరుఁడు విప్రకుమారునిరూపమున వాచస్పతియున్న గ్రామమునకుఁబోయి విద్యార్థులను జూచి, వారి ద్వారా వాచస్పతినిదర్శించెను. వాచస్పతి యాబాలుని జూచి వంశ మేదని యడుగఁగా కపిలుని వంశమున జన్మించితిననెను. ఆయన యా బాలుని విద్యార్థులలో చేర్చుకొని విద్య నేర్పుచుండెను. గొప్ప ప్రతిభ గలవాఁడగుటచే నాతఁడన్ని విద్యలను వినినమాత్రమున పూర్తిగా గ్రహించి త్వరలో వేద వేదాంగాది విద్యలను, శాస్త్రములను, బ్రహ్మజ్ఞానమును నేర్చుకొనెను. వాచస్పతియు వాని తెలివికి మిగుల సంతసించుచుండెను. విద్యలన్నియు పూర్తికాగానే గురువతనిఁ జూచి "అబ్బాయీ! నీకు నేను నేర్పవలసిన విద్యలుపూర్తియయినవి. నీవు తలిదండ్రులయొద్దకు పోయి సుఖముగా నుండుము." అనఁగా శని గురువునకు నమస్కరించి "ఓగురువర్యా! మీకు గురుదక్షిణ యిచ్చి పోవలయును. లేకున్ననాకు శ్రేయస్కరముకాదు. కావున నేమికోరెదరో సెలవిండు" అనఁగా గురువు శిష్యుని జూచి "నాకేమియు నవసరములేదు. నీవెవరో నిజముగా చెప్పిపొమ్ము" అని యడుగ "గురువర్యా! నాపేరు శనైశ్చరుఁడు. నేను సూర్యపుత్రుఁడను, మాతండ్రి సెలవు ప్రకారము మీయొద్దకువచ్చి విద్యనేర్చుకొంటిని" అనఁగా విని యాశ్చర్యపడి శిష్యునిజూచియిట్లనెను. బాబూ! ఇప్పుడు నిన్ను గురుదక్షిణగా నొకటడిగెదను. నా యీ జన్మమందు నీదృష్టి నాపై పడకుండ వరము ప్రసాదింపుము, గురువర్యా! అది

యసాధ్యముకాదా ! ఇట్టివిషయమున నన్ను మీరు కోరినను నేనేమిచేయగలను ? అదినాకు సాధ్యముకాదే. గ్రహచారము నెవరు తప్పింపఁగలరు? బ్రహ్మాదులకైన తప్పదే ? కాని మఱి యొకటి చెప్పెదను. నాదృష్టి మీపై బడునపుడు మీకాపద కలుగకుండునట్లు మాత్రము చేయఁగలను" అని శనియనెను. అంతేచాలుననిగురువు చెప్పెను.

పిమ్మట నొకనాఁడు వాచస్పతి పూలసజ్జ చేతఁబట్టు కొని పువ్వులతోటకుఁబోయి పుష్పములు కోసి తానొకచోట నుంచిన సజ్జలో వేయుచుండెను. ఇట్లుండ నీదేశపురాజు వేటకుఁ బోయి మృగములను వేఁటాడియలసి యాయుద్యానవనమునకు వచ్చి బడలికదీర్చుకొనుచుండెను. ఆయనతోకూడ భార్యయు పసిపిల్లడునుండెను. ఆ బసిబిడ్డను నొక డోలికలోనుంచి దాస దాసీలు కాపలాయుండిరి. కొంతసేపటికి నకస్మాత్తుగా నాబిడ్డడదృశ్యుడయ్యెను. అప్పుడు పరిజనులవలన నాసంగతి విని రాజు మిగులవిచారించి వెదకితీసికొని రండని భటులకాజ్ఞా పించెను. భటులంతటను వెదకి బిడ్డను గానక తిరిగివచ్చి విచా రించుచు నాతోటలో నొకచోట కూర్చుండిరి. అప్పటికిపూల సజ్జ నిండినందున వాచస్పతిగారు దానిని తీసికొని చుండెను. అందుండి రక్తపు చుక్కలు పడుచుండుట భటులు జూచి, యాయనను ననుమానించుటకు వీలులేని మనిషి యయి నను, సజ్జను వెదుకగా నందు బాలునిమొండెము కనఁబడెను. అదిచూచి వారాయనను రాజు మ్రోలకు తీసికొనిపోయి కనపఱచిరి. ఆరాజు మంత్రులనుజూచి యతనికి శిక్షవిధింపు మనెను. వారు వాచస్పతి నెఱిఁగియుండుటచే నాయనయందు

నేరము సాధింపలేక విచారించుచుండిరి. వాచస్పతి బ్రహ్మజ్ఞానవేత్త కావున యిది యంతయు శనిదృష్టివలన కలిగెనని యెఱింగి తనహృదయమున శనిని స్తోత్రము చేసెను. అప్పుడు శనైశ్చరుడు కరుణించెను. అంతట నాకసమునుండి యీమాటలు వినబడెను. ఓరాజా! ఈ బ్రాహ్మణుడు నిర్దోషి. నీ బాలుడు కేయింట హంసతూలికయందు నిద్రించుచున్నాడు" అని చెప్పగా సేవకులు వెంటనే పోయి బాలుని తీసికొనివచ్చిరి. రాజు మిగులానందించి బ్రాహ్మణునిజూచి బహుమర్యాదచేసి యనేక బహుమానము లొసంగి క్షమింపుమని వేడుకొని యింటికి పంపెను. కావున నెట్టివారికైనను గ్రహచారము తప్పదు. అని సనత్కుమారుడు చెప్పగా విని శౌనకాదులు సంతసించిరి.

---

# అష్టాదశపురాణసారము

## 1. శ్రీస్కాంద పురాణము

శివుని మహిమ

పూర్వము నైమిశారణ్యమున శౌనకాది మహా మునీంద్రు లందఱు దీర్ఘసత్రయాగముచేయుచుండఁగా, నచ్చటికి శ్రీ వేదవ్యాసుని శిష్యుఁడైన సూతమహాముని రాఁగా నామునులందఱాయనను జూచి దిగ్గున లేచి వాని కెదురుగాఁ బోయి తోడుకొని వెళ్ళి యుచితాసనమున గూర్చుండఁబెట్టి యర్ఘ్యపాద్యాది విధులవిధ్యుక్తముగా పూజించి "ఓఋషి పుంగవా! తమకు తెలియని పురాణములులేవు. మీరు శ్రీ వ్యాస మునీంద్రునివలన నీసమస్త విషయములు గ్రహించితిరి. తమవంటి జ్ఞానులదర్శనము లభించుట కష్టము. తమముఖమునశివధర్మములు సవిస్తరముగా వినితరింపఁగోరుచున్నాము. కావున నాసదాశివుని మహిమమామూలాగ్రముగా మాకు సెలవిచ్చి మమ్ముఁగృతార్థులఁజేయుడని మిక్కిలి వినయముతో ప్రార్థింపఁగా నాఋషిపుంగవుడు వారికి ప్రసన్నముఖుఁడై చూచి యిట్లనెను. 'ఓ మహా ఋషులారా! శ్రీ సదాశివుని మహిమపూర్తిగా చెప్పుటకు తగిన సమర్థులు పాండిత్యము గలవారెవరున్నారు? వారిచరిత్రమే యష్టాదశమహాపురాణ

ములు ఘోషించుచున్నవి. అవి యన్నియు శివశివా యని ఘోషించుచున్నవి. శివా యను రెండక్షరములు సదాస్మరించు వానికి స్వర్గము మోక్షము రెండును కరతలామలకములై యుండును. ప్రపంచమందలి సమస్త పదార్థము లాయనవలన మనకొఱకివ్వబడినవే. అందుచేతనే యాయనను పూజింపక విడిచి మోక్షము నపేక్షించు వారు మూఢులు. హాలాహలమును భక్షించి లోకములను సంరక్షించినట్టియు మన్మథుని భస్మము చేసినట్టియు నామహాదేవుని సేవ ప్రతినరునికత్యావశ్యకము" అని రోమహర్షణుఁడను మారుపేరుగల సూతుఁడు చెప్పఁగా మునులందఱువిని యిట్లనిరి. ఓసూతమహామునీంద్రా! దక్షప్రజాపతి శివునికి మామగారుకదా ? మామగారు చేయు కార్యమున కల్లుఁడు విఘ్నముచేయుటకు కారణమేమి? ఇట్టి యనుచితమైన పని శివుడేలచేసెను. ఈ వృత్తాంతము సవిస్తరముగా నానతిం"డనఁగ సూతుఁడు వారలతో నిట్లు నుడువనారంభించెను.

## దక్షునికి శివునిపై కోప కారణము.

ఓ మునివరులారా! వినుండు. పూర్వము దక్షప్రజాపతి బ్రహ్మ చెప్పినమాట ప్రకారము తన కొమార్తె యయిన సతీదేవిని, నీశ్వరునికిచ్చి వివాహముచేసి తనకు మంచి యల్లుఁడును, తనకూతునకు తగినభర్తయు లభించెనని మిక్కిలి సంతోషించుచుండెను. తరువాత కొంతకాలము జరిగిన పిమ్మట నొకనాఁడు నైమిశారణ్యమున సమస్తదేవ బృందములతోను, మహర్షులతోను, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్వురు సభ

చేసి కూర్చుండియుండఁగా దక్షప్రజాపతి యచటికిఁబోగాచూచి యందఱును లేచి యాయన కెదురేగి నమస్కరించి తీసుకొని వెళ్ళి యున్నాసనమునకూర్చుండఁబెట్టి యర్ఘ్య పాద్య విధులఁ బూజించిరి. కాని శివుఁడు మాత్రమాయనను నిరాకరించి కూర్చుండియుండెను. కాని లేచి మర్యాదచేయలేదు. అది చూచి దక్షుఁ డిట్లనెను. చూచితిరా! ఇచ్చటనుండు వారం దఱు లేచినాకు మర్యాదచేసిరి గాని, నాయల్లుఁడు నన్ననా దరణ చేసెను. ఇతఁడు భూతప్రేత పిశాచములకు తానధిపతి నన్నగర్వముచేత నిట్లు నన్ను నవమానించెను. కావున నేఁడు మొదలుకొని యితఁడు యజ్ఞభాగమును పొందుట కర్హతలేని వాఁడగునుగాక యని శాప మొసంగెను. ఆ శాపము విని యచ్చటనున్న నందికేశ్వరుఁడు కోపించి యిట్లు దక్షునితోఁ జెప్పెను. ఎవరినామము నుచ్చరించుటవలన సమస్త యజ్ఞములు ఫలించునో, సమస్త దానములు, ధర్మములు, తపములు, తీర్థయాత్రలు సఫలమగునో యెవని యాజ్ఞవలన సృష్టిప్రళయములు కలుగుచుండునో యట్టి జగత్కర్తయగు మహేశ్వరుని శపింపకారణమేమి? ఈ దక్షుఁడు మిగుల దుర్బుద్ధి గలవాఁడు, అజ్ఞానుఁడు, బ్రాహ్మణుఁడై చపలబుద్ధి గలవాఁడగుటచే నిట్టి శాపమొసంగెను. అనఁగా విని దక్షుఁడు మిగుల కోపించి నందిని జూచి యిట్లనెను. ఓపాపీ! శివునితో నీవు కూడ యజ్ఞభాగము పొందుట కర్హత లేనివాఁడ వగుదువు గాక! నాస్తికుఁడ వగుదువుగాక! ఇట్లు శపించుట విని నంది దక్షునిచూచి "ఓ మూర్ఖుఁడా! నేను నిర్దోషుఁడను. శివుని సేవకుఁడను. నిర్మలమైన మనస్సుగలవాఁడను. నన్ను వృథాగా

శపించితివి. బ్రాహ్మణులను, నిన్ను నేను శపించెద వినుమని యిట్లనెను. వేదవాదము చేయుచుందురుగాక! స్వర్గఫలము నిచ్చు యజ్ఞములందు మనభిలాష హెచ్చునుగాక! కాలపరవశుడవై గర్వించుదువుగాక! మీ బ్రాహ్మణులు శూద్రపురోహితులై దానములు పుచ్చుకొందురుగాక! ఎల్లప్పుడును దరిద్ర మనుభవింతురుగాక! మీలో కొందఱు బ్రహ్మరాక్షసు లౌదురుగాక! ఇందు మొదటి మూడు శాపములు దక్షునికి తక్కిన మూడు బ్రాహ్మణుల కుద్దేశించినట్లు కానబడుచున్నవి. ఈ శాపము లీశ్వరుడు విని నందినిజూచి బ్రాహ్మణుల నేల శపించెదవు. వేదాధ్యయనపరులైన బ్రాహ్మణులు గురుతుల్యులు. వేదము మంత్రములతోను, సూక్తములతోను, నిండియున్నది. ఆసూక్తముల చేతనే ప్రతి దేహమందు నాత్మ ప్రతిష్ఠింపబడినది. ఆత్మజ్ఞానులు నిందనీయులుగారు. ఆత్మయే నేనని వారు తెలిసికొని నిర్మలమయిన మనస్సుకలవారై తత్త్వజ్ఞానమును పొందుదురు. క్రోధమును విడిచి బ్రాహ్మణులను శపించుట మానుము. అని శివుడు చెప్పిన బోధన విని నందీశ్వరుడు శాంతినొంది శివ సాయుజ్యమును పొందగోరి మనస్సు దృఢపఱచుకొనెను. పిమ్మట దక్షప్రజాపతి కోపముగలవాడై మునులతో తన నిజ నివాసము చేరెను. అది మొదలు దక్షుడు శివుని, శివగణములను దూషించుచుండెను.

### దక్షుడు యజ్ఞమారంభించుట

దక్షప్రజాపతి యజ్ఞమొకటి సేయుట కుద్దేశించి శుభ దినము నిర్ణయించుకొని యానాటికి వచ్చునట్లు సమస్త దేవతా

లకు, ఋషులకు, మునులకు సగ్రమానమంపెను. అది విని వశిష్ఠుడు, కశ్యపుడు, నత్రి, భృగువు, వామదేవుడు, భరద్వాజుడు, దధీచి మొదలగు సమస్తఋషులు, నష్టదిక్పాలకులు నవగ్రహములు, ద్వాదశాదిత్యులు, దేవతలు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, నప్సరసలు, విద్యాధరులు, బ్రహ్మ, విష్ణువు మొదలగు వారందఱు నా దినమునకికి విచ్చేసిరి. శచీదేవితో నింద్రుడును, రోహిణితో చంద్రుడును, భార్యతో వరుణదేవుడును, పుష్పకమెక్కి పత్నీసమేతుడై కుబేరుడును, లేడివాహనుడై వాయుదేవుడును, మేకవాహనుడై అగ్నిదేవుడును, ప్రేతవాహనుడై నైఋతియు నందఱును దక్షుని పట్టణమునకు వెళ్ళి యదివఱకే తమకొఱకు యమునిచే నిర్మింపబడిన సువర్ణ రత్నఖచితములైన దివ్య భవనముల యందు దిగిరి. ఇట్లు సమస్త బంధు, మిత్ర, దేవ, ఋషి, గణ పరివృతుడైన దక్షప్రజాపతి పత్నితో కూడ దీక్షావస్త్రములను ధరించి తపస్వి వేషముతో యజ్ఞవాటికను చేరి యుచితాసనమున గూర్చుండెను. యాజ్ఞికులు, ఋషులు, మునులు దేవతలు వారివారికి నియమింపబడిన యాసనముల యం దాసీనులైరి, అప్పుడా సభలోనున్న వారందఱిని కలయజూచి శివుడందు లేకుండుట కనిపెట్టి దక్షునివైపు దిరిగి దధీచి మహాముని యిట్లనెను. "ఓ దక్షప్రజాపతీ ! నీ గొప్ప యజ్ఞమునకు దేవఋషులు, బ్రహ్మఋషులు, దేవతలు, బ్రహ్మ, విష్ణువు వచ్చి యున్నారు గాని శ్రీ సదాశివుడిందు గానరాడు. ఆయన యశుభమును శుభముగా మార్చగలవాడు ఆతడే పరమ పురుషుడని వేదములు చెప్పుచున్నవి. ఇట్టిమహా

సమయమందట్టి మహాపురుషుని సాన్నిధ్య మవసరము. కావున బ్రహ్మ, విష్ణువులను బంపించి యాయనను వెంటనే పిలిపింపుము. పత్నీ సహితుండై యాయన విచ్చేసినగాని నీయజ్ఞము నిర్విఘ్నముగా నెరవేరదు. నేను దివ్యదృష్టిచే చూచితిని" అని చెప్పఁగా విని దక్షుఁడు నవ్వుచునిట్లు బదులుచెప్పెను. "ఓముని వర్యా! అందఱిలో ప్రధానులైన బ్రహ్మ, విష్ణువు లున్నారు గదా? దేవతలకు రాజైన యింద్రుఁడుకూడ పత్నీసహితుఁడై వచ్చియున్నాఁడు. కల్మషరహితులు నతిపవిత్రులు నగు మునిశ్రేష్ఠు లెందఱో యుండఁగా శివుఁడు లేకున్నలోప మేమి? అతఁడిందుండఁ దగినవాఁడు కాడనియే నేనుపిలుచుటమానితిని. అతఁడుభూతప్రేత, పిశాచ గణములతో సదా సంచరించుచుండును. ఇంతేకాక, మూఢుఁడు. కడునహంకారి, కావున పిలుచుట యుక్తముకాదు. ఆయనపేరు! తలంచుటమాని మీరందఱుకలిసి మెలసి నా యజ్ఞము నెరవేర్పుడనఁగా దధీచి మహర్షి కోపించి యీశ్వరుఁడు రాకున్న నీకు నవశ్యమాపద సంభవించుననిచెప్పి దిగ్గునలేచి సభ విడచిపోయెను. అట్లు లాయనపోవుటచూచి దక్షుఁడు సభవారిని కలయవీక్షించియిట్లు చెప్పెను. "ఈముని శివప్రియుఁడు. శివుఁడులేని సభనుండఁడు" పోనిండు విఘ్నమునకు భయపడక మీరందఱును కార్యమారంభింప నెరవేర్పుఁడు." అని ప్రార్థింపగా యజ్ఞమారంభించిరి.

## సతీదేవి తండ్రియజ్ఞమునకుఁబోవుట

అంతకు పూర్వ మొకరోజున సతీదేవి కొందఱు చెలికత్తెలతో కూడి గంధమాదన పర్వతముపై కేళికందుకము

లాడుచుండఁగా రోహిణీ సమేతుఁడై చంద్రుఁడు తనవిమాన ముపై పోవుచుండుట చూచి తన ప్రియసఖులలో నొకతైన విజయను జూచి చేరఁబిలిచి "సఖీ! హిమకరుఁడెందుఁ బోవు చున్నాఁడో తెలిసికొని రమ్ము, అనగానామె పోయితిరుగవచ్చి సతీదేవియొద్దకేగి "అమ్మా! దక్షప్రజాపతి" చేయుయజ్ఞము చూచుటకు బోవుచున్నారఁట" అనిచెప్పఁగాసతీదేవి విని యాశ్చర్య విషాదములతో చలితోనిట్లనెను. ఓ సఖీ! దక్ష ప్రజాపతినాకు తండ్రిగారు. ఆయన చేయుచున్న యజ్ఞమునకు మమ్ము పిలువకుండుట కారణమేమి? అట్లు పిలువకుండ నిట్టి గొప్పకార్యము జేయునా? నేనిందుండుటచే నాకు తెలియక పోవచ్చునుగాని నాభర్తయొద్దకు వర్తమానమంపి యుండును. కావున నేను వెంటనే కైలాసమునకుఁ బోవలయును. అచ్చటికి బోవునిమిత్తము నాపతి నారాక కెదురుచూచుచుండును. మన మతిసత్వరముగ నయ్యెడకు బోవుదము రండని విమానముపై కూర్చుండి వెంటనే వారు కైలాసమును జేరి యందు సభా సీతుఁడై యున్న మహేశ్వరుని దర్శింపఁబోయిరి. శివుఁడు పేరోలగముమధ్యముననుండెను. ప్రమథగణములు భూత,ప్రేత, పిశాచగణములు భూతనాథుని బరివేష్టించి యుండెను. వారిలో ముఖ్యులు కాలుఁడు,మహాకాలుఁడు,చండుఁడు,మహాచండుఁడు, నంది, భృంగి, మొదలగువారు. వారందఱును జటాజూటము లను చర్మాంబరములను ధరించి శరీరమంతటను విభూతిపూసి కొని యుండిరి. ఇట్టి సభలోనికివచ్చి యెదుట నిలిచియున్న సతీదేవిని చూచి నివ్వెఱపడి యీశ్వరుఁ డామెతో నిట్లు సంభాషించెను.

శివుఁడు:—దేవీ ! ఇటువచ్చుటకు కారణమేమి ?

సతీ :— స్వామీ ! ఒకవార్త విని యిటు దేవరను దర్శింపవచ్చితిని.

శివుఁడు:—ఎవరు చెప్పఁగా వింటివి ?

సతీ:—నే నీ దినంబున గంధమాదనమున సఖులతో కలిసి కేళీకందుకము లాడుచుండఁగ రోహిణీ సహితుఁడై శర్వరీశ్వరుడు విమానమున బోవుట చూచితిని.

శివుఁడు:—అంతమాత్రమున నీవార్తనీకెట్లు తెలిసెను ?

సతీ:—అప్పుడు విజయను బిలిచి వారెందు బోవుచున్నారో తెలిసికొని రమ్మంటిని. ఆమె పోయి తిరుగ నాయొద్దకు వచ్చి యీ వార్త విన్నవించెను. వారు దక్షుని యజ్ఞమును జూడఁబోవుచున్నారఁట.

శివుఁడు:—సరే బాగుగనున్నది. అయిన నీవేమనెదవు?

సతీ:—నాథా ! మనమెప్పుడు పోవుదము ?

శివుఁడు:—మనము బోవుట యెచ్చటికి ?

సతీ:—ఏమట్లు సెలవిచ్చుచున్నారు ? మా తండ్రిగారు చేయు మహోత్కృష్ట కార్యమునకు పోవలదా ?

శివుఁడు:—అవును. మనలను వారు పిలిచినగదా ?

సతీ:—ఏమీ? పిలువనే లేదా?యజ్ఞభోక్తలగుమిమ్మును విడచిన యజ్ఞ మెట్లగును? పోనిండు, మాతండ్రియింటికిమనము పోవుట తప్పా ? వారు మరచియుందురు.

శివుఁడు:—మరచి మానినను, బుద్ధి పూర్వకముగా మానినను. [illegible]వబడక పోవచ్చునా ? లోకములోఁ "పిలువని

పేరంటము, పెట్టని భోజనము" అను సామెత వినలేదా! పిలువకుండపోవుటచాలతప్పు. తమకిష్టమువచ్చినవారిని దక్షుఁడుపిలిచి యుండును. మన మందుఁబోవుట తగదు. అవమాన మగును. అవమానము మరణముకన్న నీచము. కావున మన మందు లకుఁ బోవద్దు.

సతీ:—పోనిండు. మిమ్ముని పిలువకున్న మాననీయులు కావున పోవుటయుచితము కాకపోవచ్చును. నేను పుట్టినింటికి బోవుట కూడదా? తమరు సెలవిచ్చిన పోయిచూచి వెంటనే వచ్చెదను.

శివుఁడు:— నేనెంత బోధించినను వినకున్నావు. నీవు పోయిన పరాభవము కాకమానదు. పోవలెనన్నపొమ్ము. నే నభ్యంతరము చెప్పువాఁడనుకాను, ఇట్లుభర్తయొద్ద సెలవుతీసి కొని కతిపయ ప్రమథగణములను వెంటతీసికొనియనేక రత్నా భరణములను పట్టించుకొని, నందివాహనారూఢురాలై సతీ దేవి బయలువెడలెను. అంతట సతీదేవి పరివార సహితముగా తండ్రియిల్లుజేరి తనవెంట వెళ్ళినవారిని తగుస్థలమున విడిచి కొందఱు సఖులతో లోపల ప్రవేశించి యజ్ఞవాటికకు బోగా నచ్చట నున్న దేవతలు. ఋషులు నామెనుజూచి లేచి యెదు రేగి యామెను తీసికొని లోనికిపోయిరి. సతీదేవి తనతండ్రి భవనముయొక్క శృంగారమును సభామండపమును జూచి యాశ్చర్యమును, సంతోషమునుపొందుచు తలిదండ్రులకునమ స్కరించెను. వా రామెరాకకు మనస్సున మాత్రమానం దించిరి. అప్పుడామె తండ్రితో నిట్లనెను.

సతీ:—జనకా! ఈమహాయాగమునకు శివుఁడు రాకుం డుటకు కారణమేమి? ఎందుకాయనను పిలుచుట మానితిరి? ఆయనలేని యజ్ఞము నిష్ఫలముగదా? యీశ్వరబహిష్కృతిగల యజ్ఞమున కెల్ల దేవతలు, ఋషులు ప్రభృతులు లెట్లువచ్చిరి?

దక్షుఁడు:—అమ్మా!నీభర్త యిందుండదగ్గుఁడు కాఁడు.

సతీ:—నాయనా! ఎందుచేతను.?

దక్షుఁడు:—ఆయనభూతప్రేతపిశాచముల కధిపతిగదా!

సతీ:—భూతప్రేత పిశాచములకే యననేల? చతుర్దశ భువన రక్షణాధ్యక్ష పదవీ దక్షుండయిన యమ్మహాత్మ జుహులరాకుం డందఱికిని యధిపతియే. ఎల్లరిలోను మిన్నయని వేదములు వాక్రువ్వనేటికి.

దక్షుఁడు:—(అసూయతో)శ్మశాన వాటికలయందుండు వారు యజ్ఞవాటికలలో నుండరాదు.

సతీ:—(విషాదముతో)జనకా! ఆయన సర్వవ్యాపికదా?

దక్షుఁడు:—సర్వవ్యాపియే యయిన నిందేలలేడు?

సతీ:—మీరు పిలువకుండుటచే నిందు రాకమాని యుండును.

దక్షుఁడు?—సర్వత్ర యుండువానిని పిలుచుట యేల? క్షుద్రులతో సహవాసము చేయువానిని యిట్టి కార్యములకు నెవరుపిలుతురు?

సతీ:—నాయనా! అంతనీచుఁడని తెలిసి యుండియు నన్నేలయాయనకిచ్చి వివాహమొనరించితిరి?

దక్షుఁడు:—అమ్మా ! యిట్లని తెలిసియుండిన నిన్ను నీ యుదునా ? యీ చతుర్ముఖుని మాటలువిని యట్లు చేయ వలసివచ్చెను. విధివశమెవరు తప్పింపఁగలరు !

సతీ:—నాయనా ! చేసినపనికి తగవేల ! ప్రాజ్ఞుల లక్షణమట్లుండునా ? బాంధవ్యము మసిచుక్కవంటిది కాదు గదా, తుడిచిన మాత్రమున పోవునా? అల్లునికి మర్యాదచేయ వలయునుగదా !

దక్షుఁడు:—మర్యాదయేమో తెలియని వారికిమర్యాద చేయుటయేల ?

సతీ:—ఏమీ ? జగదీశ్వరునకు మర్యాద తెలియదా ?

దక్షుఁడు:—తెలిసియుండిన నాఁడు నైమిశారణ్యమున విష్ణుసభలో నాకు పరాభవము చేయునా ?

సతీ:—ఆయన మిమ్మెట్లుపరాభవించెను. ఇది క్రొత్తగా వినుచున్నానే ?

దక్షుఁడు:—సమస్త దేవతలతోను, ఋషులతోను, మునులతోను, త్రిమూర్తులు సభయందుండఁగా నేనందులకు పోవునపుడు నీభర్తయొక్కరుడుతప్ప మిగలిన వారందరుకును లేచినాకునమస్కరించిరి, ఏపాటి మర్యాదస్థుఁడో చూచితివా?

సతీ:—నాన్నగారూ ! ఆయనకు మర్యాద తెలియక యట్లు చేసిరనుకొంటిరా? ఆయన తన శిరస్సునందు ధరించిన చంద్రునికి క్షయరోగము కలుగునట్లు మీరు శపించితిరిగాదా అది మొదలు మీ మీద కోపము... ...

దక్షుఁడు:—ఏమి నేను చంద్రుని శపించిన నతని కేమి?

సతీ:—ఆయన లోకరక్షణార్థము హాలాహలమును భక్షించుటవలన కలిగినవేడి చల్లార్చుకొనుటకు కదా చంద్రుని, గంగను, శిరస్సున ధరించుట ?

దక్షుడు:—బాగుగ చెప్పితివి. నీచులకు గొప్పబుద్ధి యెట్లు కలుగును ?

సతీ:—నాభర్తనీచుడా ?

దక్షుడు:—కాని యెడల బూడిదబూసికొనుట పునుకలను మెడలో మాలికగా వేసికొనుట, పిశాచములతో సహవాసము, శ్మశానములయందు నివాసమ దేమి? నీచుడే కాదు. లజ్జామర్యాదలు లేనివాడు.

సతీ:—సిగ్గులేని వారనుచున్నారు. అది యెట్లు ?

దక్షుడు:—బట్టకట్టుకొనక దిగంబరిగా నుండునుగదా ! పిగ్గేయుండిన నట్లు చేయునా ? ఎందుకీ వృథాలాపములు ? మానుము.

సతీ:—ఈ చరాచరములైన సమస్త లోకములను సృజించినట్టియు దన యవయవములందు సమస్త దేవతలను పుట్టించినట్టియు, సృష్టి, స్థితి, లయములకు కారణభూతుడైనట్టియా సర్వేశ్వరుని మీరిట్లు దూషించుట తగదు. వారి మహిమ మీకు దెలియదు.

దక్షుడు:—తెలియకపోలేదు. బ్రహ్మయొక్క శిరస్సు తెగకొట్టియు, మన్మథునిభస్మముచేసియు బ్రహ్మహత్యా పాతకి యనియే యిట్టిగొప్ప కార్యమునకు నతనిని పిలుచుట మానితిని. అట్టివానికి నిచ్చుటచేత నేను బుద్ధిహీనుడ

వజ్ఞానుడనై తిని. ఆ శివుడు బ్రహ్మహత్యాపాతకి. దుర్మతి, వేద బాహ్యుడు. కాబట్టి ఈ యజ్ఞసలమున నుండుట కనర్హుడని పిలుచుటలేదు. అట్టి చండాలుని వివాహమాడుటచే నీవును చెడితివి. కావున నిన్నును పిలువలేదు. అయినను వచ్చితివి కనుక కొన్నాళ్లుండుము. ఇష్టములేకున్న పొమ్ము. హెచ్చు మాటలాడుటవలన లాభములేదు.

అనగా సతీదేవి విని కోపఘూర్ణిత మానసురాలై తనలో తా నిట్లనుకొనెను.

"అయ్యో! ఎంతపాపము! ఈ తెలివిమాలిన నాతండ్రి శివుని నిందించుట నాచెవుల వినవలసి వచ్చెనుగదా! ఏమి చేయుదును?" అని విచారించి ప్రకాశముగా తండ్రితో "తండ్రీ! వినుము. యజ్ఞపురుషుడును, యజ్ఞభోక్తయు, యజ్ఞరూపియునైన శ్రీ సదాశివుని పిలుచుట మానితివి సరేకదా, ఆయనను దూషించితివి. నీవుచేసిన కర్మఫలము నిచ్చువా రెవరు? ఆయన కోపించిన నిన్ను రక్షించువారెవరు? ఇప్పుడిచ్చటనున్న, బ్రహ్మగాని, విష్ణువుగాని, మరేదేవుడుగాని నిన్నాయన బారినుండి తప్పించి కాపాడజాలరు. శివునినిందించు వారు చంద్రసూర్యులుండునంతకాలము నరక కూపములలో బడి యాతనలు పొందుచుందురు, కావున నీయజ్ఞము విఘ్నమగును. నీవు శివునికోపాగ్ని పాలగుదువు." అని తాను ప్రాణములను విడువ సాహసించి నిమీలితలోచనయై యీశ్వరుని మనసారధ్యానించి పునర్జన్మయందుకూడ తా నాయనకే భార్యకావలెనని [illegible]వి నడుముబిగించుకొనిహోమ

గుండమునదుమికి ప్రాణములు విడిచి భస్మమయ్యెను. అచ్చటి నుండువారు అందఱు హాహాకారములుచేసి దుఃఖించిరి. ఆవెం వెంటవెళ్ళిన ప్రమథగణము లందఱు కత్తులు చేబూని తమ శిరస్సులను తామే నరుకుకొని సుమారు రెండువేలమంది వెంటనే మరణమొందిరి. ఆ యజ్ఞవాటికంతయు రక్తముతో నిండెను. ఈ ఘోరకృత్యములు చూచి యచ్చటనుండు దేవతలు, ఋషులు, స్తంభీభూతులై నిశ్చేష్టత నొందిరి. వారిలో కొందఱు శ్రీమహావిష్ణువు నొద్దకుఁబోయి "మహాప్రభూ! ఈ ఘోర విపత్తునుండి మమ్ము దప్పించి రక్షింపు" మని ప్రార్థించిరి.

నారదుఁడు శివునితో సమాచారమును చెప్పుట.

దేవఋషియైన నారదుఁడదంతయు జూచి భయమొంది జరిగినదంతయు శివునితో మనవిచేయఁదలఁచి వెంటనే గగనమార్గమున కైలాసమునకుఁబోయి చెప్పఁగా నయ్యీశ్వరుఁడు కోపాటోపసమాటీక సముత్కట రూక్షవీక్షా జాజ్వల్యమాన నిటలలోచనుడై పండ్లు పటపట గొరికి తన తలనుండి యొకజట నూడబెరికి కొండపై వేసి కొట్టఁగా పిడుగు పడినట్లు గొప్పధ్వని కలిగెను. ఆ వెంటనే భయంకరాకారము గల వీరభద్రుఁడు పుట్టెను. ఆయన విడిచిన శ్వాసమునుండి మహాకాళి యను శక్తి, కోటానకోట్లు సంఖ్యగల భూతగణములు నూఱు రకముల జ్వరాది భూతములు, పదమూఁడు సన్నిపాతములు పుట్టెను. అప్పుడు ఘోరాకారముగల వీరభద్రుఁ డీశ్వరుని యొద్దకుఁబోయి ప్రదక్షిణ నమస్కారములు చేసి, చేతులు జోడించుకొని యెదుట నిలుచుండి, "ఏమిసెలవు" అని యడు

గంగా, నాతనితో శివుఁడిట్లనెను. "ఓయీ! నీవు సమస్త పరివారములను వెంటఁగొనిపోయి, యా దక్షునియజ్ఞము ధ్వంసము చేసివచ్చి యాసంగతి నాతోఁ జెప్పుము." నావుడు వీరభద్రుఁడు తదాజ్ఞాప్రకారము రౌద్రాకారము దాల్చి సమస్త భూతగణములను వెంటఁబెట్టుకొని పోవుచుండఁగా ప్రళయమారుతవిసరమోనాగ కరువలి విపరీతముగా వీవ నారంభించెను. మేఘములు దట్టముగా నల్లుకొని ఘూర్ణమానములగుచు రక్తవర్షము కురియుచుండెను. నక్షత్రములు తెగిపడుచుండెను. రోదసీకుహరమంతయు గాఢాంధకారబంధురంబయి కంపించుచుండెను. అది యంతయు జూచి దేవతలు, ఋషులు భయముచే కండ్లు, చెవులు మూసికొనిరి. దక్షుఁడు భయముచే వణఁకుచు శ్రీ మహావిష్ణువునొద్దకు పోయి వాని పాదములపై బడి రక్షింపు రక్షింపుమని శరణుజొచ్చెను. అప్పుడు శ్రీహరి నీకభయమిచ్చితిని, భయపడకుమని యిట్లు చెప్పెను. "దక్షా! ధర్మాధర్మములు తెలియక శివుని నవమానించితివి. అందువలన సమస్త కార్యములు విఫలమగును. పూజనీయులను పూజింపకుండుట, యపూజ్యులను పూజించుట యెచ్చట జరుగునో యచ్చట దర్భిక్షములు, అకాల మరణములు మొదలగు దుర్భర భయంబులు సంభవించును. ఈశ్వరునికి నీవు చేసిన యవమానమువలననే యీ యాపద సంభవించినది. నీవలన మాకుకూడ విపత్తు కలిగినది. కావున నిప్పుడు నీవు భక్తిపూర్వకముగా నాశివుని మనసార వేడుకొనుము." అనఁగా, విని దక్షుఁడు స్తంభీభూత వచనుడై కంపమానస్వేదస్విన్నగాత్రుడగుచు స్థాణువోనాగ నిలువబడి నెవ్వెఱ నిరీక్షించు

చుండ నా సమయమున ప్రమథగణసహితుఁడై వీరభద్రుఁడు దక్షుని యజ్ఞవాటిక పటాపంచలు సేయ నుంకించి కాళి, భద్ర కాళి, శిరోమర్దని, త్వరిత; చాముండ, కాత్యాయని, ఈశాని, శాకిని, ఢాకిని యను నవదుర్గలతోను, ప్రమథ గణములతోను ముట్టడించెను. శివుని యనుచరులను వీరు శివునివలె గనఁబడు చుండిరి. ఏలనన, వీరికి పంచముఖములు దశబాహులు శిరస్సున జడలు, దేహమంతటను విభూతి, వృషభవాహనములు, త్రినేత్రములు నొదలలయందు నర్ధచంద్రులు మెడలయందు రుద్రాక్షమాలికలు, కలిగి వ్యాఘ్రచర్మములు ధరించినవారై శూలములు, పాశములు మొదలగు మహాయుధములు పట్టుకొని యుద్ధసన్నద్ధులై భయంకరరూపములు కలిగియుండిరి. వారిలో కొందఱు పలువిధములైన వాయిద్యములను వాయించుచు నాడుచు, పాడుచు నప్పుడప్పుడు భయంకరముగా గర్జించుచు, వచ్చిచేరఁగా ధూళి యెగసెను. నలుదిక్కులచీకటి క్రమ్మెను. వీరిలో కొందఱు భూమిమీఁదుగాను కొందఱు విమానముల పైని, యాకాశమార్గమునకు వచ్చిరి. వారిని జూచి యచ్చట నున్న దేవతలు కలవరమొంది తామేమేమిచేయవలయునో తెలిసికొనలేక కొంతత త్తరపాటుఁగిన పిమ్మట యుద్ధముచేయ నిశ్చయించి వివిధాయుధములను ధరించి తమతమవాహనము లపై నెక్కి పోవుచుండగా దక్షుఁడు దీనుఁడై వారిని వేఁడు కొనెను.

"ఓ దేవోత్తములారా! మీ బాహుబలమును నమ్ముకొనియే నేను యజ్ఞమునకు పూనుకొంటిని. దీనికి విఘ్నము లేకుండ మీరు కాపాడవలెను. మిమ్ము శరణుజొచ్చు

-చున్నాను. ఓ శ్రీహరీ ! నీ పాదములపై బడుచున్నాను. రక్షింపుము" అనఁగా విని శ్రీమన్నారాయణుఁ డిట్లనెను. "ఓ దక్షుఁడా ! ఆశివుని కోపాగ్నినుండి నిన్ను కాపాడుశక్తి యెవరికి గలదు ? అయినను మాచేత నైనంతమట్టుకు ప్రయత్నము చేసెదము. నీకర్మఫలమెట్లున్న నట్లగును. ఇదినీవు కోరి తెచ్చుకొనిన యాపదకదా ? అందఱికిని యన్ని కర్మఫలములనిచ్చువాఁడాయనేకదా ? ఆయనతప్ప వేరు రక్షకులులేరు. అని యుద్ధమారంభించిరి. ఆ యుద్ధములో దేవతలు భృగుమహా మునియొక్క మంత్రబలమువలన మొదట కొందఱు శత్రువులను చంపిరి. వీరభద్రుఁడు తనపక్షమువారు చచ్చుటచూచి విక్రమించి తన గణంబులను పురికొల్పి దేవతలతో తలఁపడి వారిలో ననేకులను చంపెను. అందుకు దేవతలు భయపడి పాఱిపోవుచు, బృహస్పతిని దర్శించి యాయనకు నమస్కరించి చేతులుజోడించుకొని ముందునిలిచి తమకు జయమెట్లు లభించునని యడిగిరి.

ఇంద్రాది దేవతలకు బృహస్పతి హితోపదేశము.

ఇట్లు జయాపేక్షులై యున్న దేవతలను జూచి బృహస్పతి కొంతసేపాలోచించి యిట్లనెను. ఓ "శచీపతీ! వినుము, పూర్వము శ్రీమహావిష్ణువు చెప్పినది నిజమయినది. ఈశ్వరుఁడు కర్మఫలము నిచ్చువాఁడు. కావున కర్మచేయువారికే యాయన ఫలమునిచ్చును. తాంత్రికులు, మాంత్రికులు,చికిత్సకులు, వైదికులు నా శివుని తెలిసికొనఁజాలరు. భక్తులు శాంతచిత్తులు, సంతుష్టులు వానిమహిమ తెలిసికొందురు. ఈ సంసారము

సుఖ దుఃఖములతో కలిసినది. దీనికి ప్రభువు మహేశ్వరుఁడు. నీవు దిక్పాలురను తీసికొని యేలవచ్చితివి ? ఆ రుద్రుని ప్రమథ గణముల యెదుట నీవనఁగా నెంత ? మీ రేమి చేయఁగలరు ? అనగా దేవతలు మాఱు పడలేక యూరకుండిరి. ఆ సమయము నందు వీరభద్రుఁడు తన సైన్యములతో వారియొద్దకు నిర్గమించి యమోఘకనక పుంఖ ప్రేంఖితంబులగు బాణములు ప్రయోగింప దేవతలు తమ లోకమునకు పారిపోయిరి. అదిచూచి వీరభద్రుఁడు యజ్ఞ వాటికకుఁబోయి ఋషులపై బడఁగా వారు శ్రీహరిని జూచి "ఓ ప్రభువా! నీవు యజ్ఞమూర్తివి కావున యజ్ఞమును రక్షింపుమని శరణు వేడఁగా నా శ్రీహరి యుద్ధమునకు సిద్ధమగుచుండెను. అంతట వీరభద్రుఁడా హరికి నమస్కరించి యిట్లుచెప్పెను. "శ్రీహరీ ! నీవు దక్షుని పక్షమున మాతో యుద్ధముచేసి గెల్చెదవా ? అట్లైన తిరుగ వైకుంఠమునకు పోగలవా ? పూర్వము దాక్షాయణి యీయజ్ఞస్థానమున నాడిన మాటలు నీవువింటివిగదా !. మీకు నమస్కారము. ఈశ్వరుఁడు నాకెట్లు పూజ్యుఁడో మీరును నాకట్లే. నేనిప్పుడు చేయవలసిన దేమో సెలవిండు. నేను తమ సేవకుఁడను. నాయందు దయయుంచి చెప్పుడు."

నాపుడు విని శ్రీహరి చిఱునవ్వునవ్వి వీరభద్రునితో నిట్లనెను.

"బాబూ! నీవు శివభక్తుఁడవు. నన్ను దక్షుఁడు యజ్ఞ సంరక్షణము కొఱకు పిలిచెను. ఇతడు నాభక్తుఁడు. శివుని వలె నేనును భక్తపరాధీనుడను భక్తుల కోరికలను నెరవేర్తును. నీవు శివుని కోపమువలన పుట్టితివి. నేను యాగ రక్షణార్థము వచ్చితిని. కావున యుద్ధము చేయకపోవుట నీతికాదు. నీవు

నా పై బాణములు వేయుము. నేను వైకుంఠమునకు పోయె దను" అని శ్రీహరి సెలవియ్యఁగా వీరభద్రుఁడు సింహ నాదముచేసి యుద్ధమారంభించెను. శ్రీమన్నారాయణుండును మహా ఘోషమను శంఖమును పూరించెను. దాని ధ్వని విని దేవతలు తిరుగవచ్చి యుద్ధము చేయనారంభించిరి. అప్పు డింద్రుఁడు నందికేశ్వరునితోను, మహాకాలుఁడుయమునితోను, మహాబలుఁడు వరుణునితోను, కూష్మాండల రాజుతో కుబే రుఁడును, చంద్రునితో నైఋతియు తలఁబడి ఘోరయుద్ధము చేసిరి. దేవతలు రోగములచే పీడింపఁబడి వ్యాధిగ్రస్తులై విష్ణు మూర్తితో చెప్పుకొనఁగా నాయన యశ్వనీదేవతలను పిలిచి వారిని నిరోగులుగా చేయుఁడని యాజ్ఞాపింపఁగా వారు దేవతల జ్వరముల బాగుచేసిరి. శ్రీహరి వీరభద్రునితో పోరుచు సుద ర్శనమును వానిపై ప్రయోగించెను. కాని యది వృథాయగుట చూచి వైకుంఠమునకుఁ బోయెను. ఇంద్రాదులు స్వర్గము నకు పారిపోయిరి. సూర్యునికి ప్రమథగణములు పండ్లన్నియు నూడఁగొట్టిరి. అది మొదలు సూర్యుఁడుభగ్నదంతుఁ డయ్యెను. అందుచేతనే యతనికి క్షీరాన్నమన ప్రీతి. ఇట్లే మిగిలిన ఋషులు మొదలగువారిని పరాభవించిరి. యజ్ఞకుండలముల యందు మలమూత్రములను విడచిరి. దాని ప్రక్కను డాగి యున్న దక్షునితల వీరభద్రుఁడు శూలముతో నరుకఁగా నది యగ్నిలోపడి భస్మమయ్యెను. అదిచూచి యందఱును పారి పోయిరి. యుద్ధము సాంతమయ్యెను. తన కుమారుడైన దక్షునిచావు చూచి పుత్త్రశోకముచే దుఃఖించుచు బ్రహ్మ సత్యలోకమునకుఁ బోయెను.

దక్షుఁడు పునర్జీవితుఁడగుట

తరువాత నేమి జరిగెనని ఋషులు సూతునడుగఁగా సూతుఁడిట్లువారితో చెప్పెను. ఇట్లు పుత్త్రశోకము నొందిన బ్రహ్మ తనతావునకుఁబోయి యొకచోట కూర్చుండి దక్షుని తలంచుకొని యాతఁడు తన దుర్మార్గమువలననే నశించెనని నిశ్చయించి యపారదుఃఖసాగర తీరంబు చేరఁజాలమినిఁక నీశ్వరుని ప్రార్థించిన, యాయన పరమదయాళుఁడు గావున తప్పక తనయందు కరుణించి దక్షుని బ్రతికించునని యెంచి దేవతలతో కూడ బయలుదేరిహంస వాహనారూఢుఁడై వెంటనే కైలాసమునకుఁబోయెను. అచ్చట సతీదేవి మరణమునకు విచారించుచు నొంటరిగా కూర్చుండియున్న యీశ్వరుని బ్రహ్మ దర్శించి యాయనకు సాష్టాంగ దండప్రణామాదు లొనరించి యిట్లుప్రార్థించెను, "ఓ సర్వేశ్వరా! విశ్వవ్యాపీ! విశ్వాత్మా! మహేశ్వరా! విశ్వరూపా! ఆపద్బాంధవా! జగద్రక్షణా! నీపాద పద్మముల కనంతకోటి నమస్కారములు. అనుగ్రహింపుము. ప్రపంచకమందలి సమస్త ప్రాణులను సృజించుటకు, పోషించుటకు లయింపజేయుటకు నీవేకర్తవు. పుత్త్రశోకపీడితుఁడనై మీవద్ద శరణుపొందుట కిటువచ్చితిని. నాతప్పులను క్షమించినన్ను రక్షింపప్రార్థించెదను. నావుడా దయామయుఁడుకరుణించియిట్లు సెలవిచ్చెను. "ఓ చతుర్ముఖుఁడా? దక్షునిచావుకు నేనుకర్తను కాను. వానికర్మవలననే యీతఁడు నశించెను. ఇతరులకు హాని చేయ వలయునని తలఁచువాఁడు తానే హానిపొందును." అని వెంటనే వృషభవాహనారూఢుఁడై బయలుదేరి వారితో యజ్ఞస్థానమునకు పోయి తలలేని దక్షుని మొండెమును చూచి నీగ

భద్రుని బిలిచి యిట్లనెను. "ఓయీ! వీని శిరస్సు తీసికొని రమ్ము. బ్రహ్మ మొఱవినఁజాలను. కావున వీనిని బ్రతికించె దను. అనగా వానిశిర స్సగ్నిగుండములోపడి భస్మమయ్యెను. మేషశీర్షమొకటి యున్నది. మీరు సెలవిచ్చిన తెచ్చెదను." అని దానిని తెచ్చి మొండెమునకు తగిలించెను. ప్రాణప్రతిష్ఠా పనమంత్రముతో శివుఁడు దానిని వెంటనే బ్రతికించెను. పున ర్జీవితుఁడైన దక్షుఁడు మిక్కిలి సిగ్గుపడి యీశ్వరుని నిట్లుస్తుతిం చెను. "ఓసర్వేశ్వరా! దేవాదిదేవా! సనాతనా! సమస్త దేవతలలోను, నీవే శ్రేష్ఠుఁడవు. ఈవిశ్వమంతటికి నధిపతివి. కావున విశ్వేశ్వరుఁడను నామము నీకేసార్థకమయ్యెను. అందఱిపాపములను పోగొట్టువాఁడవు నీవే కనుక హరుఁడను పేరు పొందితివి. చంద్రుని శిరస్సున ధరించుటచే చంద్రశేఖ రుఁడవని నీకు పేరు వచ్చినది. అట్టినీకు కోటినమస్కారములు చేయుచున్నాను. నాదోషములన్నియు క్షమింపుము" అని ప్రార్థింపఁగా శివుఁడు మిగులసంతోషించి దక్షునితోనిట్లనెను. "ఓ దక్షప్రజాపతీ! వినుము. లోకములో నాభక్తులు నాలుగు విధములు. వారెవరనఁగా నార్తులు, జిజ్ఞాసులు, నర్థాతురులు జ్ఞానులు, వీరందఱిలో జ్ఞానులు శ్రేష్ఠులు. జ్ఞానములేకుండనన్ను పూజించుటగాని స్మరించుటగాని చేయువారు మూఢులు. కేవలము కర్మచేసి నీవు సంసారమునుండి తరింపఁదలంచితివి. మూర్ఖులు కర్మఫలములు కోరువారై యజ్ఞములు, దానములు తపములు చేయుదురు. అంతమాత్రమున వారు నన్ను పొందఁ జాలరు. జ్ఞానముకలిగి కర్మ చేయవలయును. సుఖదుఃఖములు సంభవించునపుడు సమభాగము కలిగియుండవలయును" అని

చెప్పి యీశ్వరుఁడు కైలాసమునకు పోయెను. అచ్చటనుండు భృగుమహాముని మొదలగువారందఱు దక్షునికి శివుఁడు చేసిన యుపదేశము విని జ్ఞానులైరి. బ్రహ్మయు తన కుమారుఁడైన దక్షునికి కొన్ని బుద్ధులుచెప్పి సత్యలోకమునకు వేంచేసెను. పిమ్మట జ్ఞానముకలవాఁడై దక్షుఁడు ప్రాసాద పంచాక్షరీ శివ పంచాక్షరీ మంత్రములను జపించుచుండెను.

ప్రాసాద పంచాక్షరీ మహిమాను వర్ణనము

అఖండ భూమండల మండనాయమానంబైన భరత ఖండంబున మస్కార పురస్కృతంబగు గౌతమ్యంతర్భూత భరద్వాజ నదీతీరంబున వింధ్యారంబను పేర నొప్పారుచు, విద్వత్కుంజర పంజరంబై నృసింహదేవాలయాది దేవతాయతన యుతంబై యష్టాదశ పీఠశక్తులకు మూలభూతంబునాదగు పరి దేశాంబయను పరాంబకు నిలయంబై శ్రౌత స్మార్తనిధులు. షట్కర్మ నిరతులు వరివస్యారహస్యవేదులుకుట్టీ మహామంత్ర వేదులు, కాళీరహస్య పారగులు, చతురామ్నాయగేయులు స్నాన సంధ్యానుష్ఠాన నిష్ఠాగరిష్ఠులు, పరస్త్రీ పరాఙ్ముఖులు, నిత్య సత్యనిరతులు, హింసాయాగ నిరాసులు, దేవీయజ్ఞవిజ్ఞులు పరోపకార ధురీణులు, శమదమోపేతులు, జితేంద్రియులు, స్కంధత్రయ పరీత కార్తాంతికులునగు విప్రపుంగవుల కునికి పట్టయి యేకవింశతి వారంబులు ధరణీధరుల శిరంబులు నఱికిన దమువప్రతీకాశ తేజుఁడగు భార్గవరామునినైన పోరాటమునకు భర్గయుంకువకుఁ బిలువ నుంకించు విక్రమచక్రులగు క్షాత్రా న్వయ రత్నములకు నుత్తలంబయి, యలకాధినేతను మించు

భాగ్యంబునకు కొటారులైన వైశ్యోత్తములకు నిలయంబై బలరామ భాగ్యావళులకు జేయూత యొసగజాలు త్రైవర్ణిక జన భక్తియుక్తమగు పాదజ నికురుంబమునకుఁ దావలంబయి మఱియు తంతువాయ, చార్మిక, కార్మిక, తక్షక, సువర్ణకార, రజక, దాస, భృత్య నియతంబయి నిరతి శయసతీవితానపూత భూతంబయి యెల్లరి మన్ననలకు మిన్నయై రాణించుచుండె. అప్పురభేదంబున సముత్కటసదాచారనిరతుండును, షడ్దర్శన పారంగతుడు, నుభయ కవితానికేతనుఁడు, పరదేవతా పాద పద్మ పూజా విభ్రాజితుఁడు, సకల వరారోహామాన సమాదరా కారుఁడు, పరస్త్రీపరాఙ్ముఖుడు, సకల మంత్రాగమ సంగతుఁడు నియతగాయత్రీజపనిష్ఠుడు కాత్యాయనీ కమనీయుడు. మిత భాషి - వాఙ్మయభూషి - నిత్యసంతోషి - గతరోషిసత్యభాషి రామలక్ష్మీకాంతాయత్త మహావ్రతుడు - నగు అనర్ఘనారా యణ శర్మనామంబున బరఁగుచు సకలసుగుణ వర్మనాదగు నొండొక భూసురసత్తముండు కలండు. అతడు దైనందినము ప్రాసాదపంచాక్షరీ మంత్రరాజంబు జపించుచు కాలంబు గడపుచుండె - అట్టిడు పేదయు, మిగులభాగ్య శాలియు కాడు. యథాలాభద్రవ్య సంతుష్టుడై సంసరణభరము భరించుచు కాలము గడపుచుండెను. ఇట్లుండ పరేతాలయో న్ముఖులగు కూళలు కొందఱు తదీయ మహోన్నతికి నసూయ జెంది పరాభవింపదలఁచి పలుగాకులమాదిరి పలుదొసంగు లెసంగ జలుప నవి గణుతింపక నిజపథంబున నిర్గమించు చున్న యస్సుమహామనీషి పుంగవుని తపోతేజంబు బహిర్భా తంబై యత్తులువలనెల్ల సదమద మొనరించె. కావున

మహానుభావులగు తపశ్శాలురనిరాకరింప నిరీక్షించుచో పరాభూతులై రెంటికిం జెడిన రేవణలగుటయుదా! మహాత్ముల మానసంబులనైనఁ బరాభవింప దలంపువలదు.

శ్రేయస్కామము లెన్నడట్టులొనరింప బూనరు. పదంపడి య త్తపోధన స త్తముఁడు స్నానసంధ్యానుష్ఠాన ధ్యాన ప్రభృతుల నోలలాడుచు పరా స్తదారిద్ర్యుఁడై యతిథ్యభ్యాగతి పూజాతత్పరుఁడై ప్రాసాద పంచాక్షరీ మహామంత్రాది భాగ్యభాజియై సత్కుటుంబియై ప్రసన్నవదనారవింద మందహాస చంద్రికల వినతులతాపంబులని స్తరించుచు ప్రణవ – రమా – మాయా – కామరాజ – శ క్తిబీజాది సంపుటితంబైన యమ్మహామంత్రంబు జపించుచు నుండ నంతనొకపుణ్య దినంబగు మహాశివరాత్రాహంబున సాయంతనంబునందు పరదేవతా స్వరూపాంశకాంతాయుతి భాగ్యభోగావళులు పొసంగిసత్సంతానప్రాప్తినాపాదించివామదేవస్వామినైజికవందారుమందార బిరుదంబునస్వరభూతంబుసేసె కాఁబట్టి మహేశ్వర పాదారవిందభజనంబు తన్నిష్ఠయుతధ్యానతత్పరతయు నూరకబోవని యిమ్మహామహుని కథానకంబున తేటతెల్లంబయ్యె. నిత్యము పూజించుటకు వీలులేనివారు కార్తీక–మార్గశిర, ధనుస్సంక్రమణాది పుణ్యదినములనైన నమ్మహేశ్వరుని యారాధించనొప్పు. దాన జారచోర బాధలుడిగి విశూచి, మశూచి, మారి, మహామారి, దుర్భిక్ష, క్షామ, డాంబరాది సర్వోపద్రవనిర్ముక్తులై యిహలోకంబునందణ మాద్యష్టైశ్వర్యంబులప్రాప్తింజెంది యవసానసమయంబున కైలాసమహాపదవి నందుదురనుటకు సంశయంబేసుమంతయు జూపట్టదు. ఇట్టులక్కథనుండు సూత

మహర్షి వక్కాణించిన దంతయు శ్రద్ధాభక్తి పురస్సరంబుగా నాలించి వినయవినమిత గాత్రులై యమ్మహామునులు. మహాభాగా! మహర్షిసత్తమా! ఇంతతోఁదనివిజెందనేరము. అదివిరాట్టనదగు త్రిమూర్తులలో లయకారుఁడు ధ్యానమాత్ర మహైశ్వర్యప్రదాతయగునద్దేవుని స్థానభూతమగు శివపంచాక్షరీ మహామంత్ర విధానంబు సవిస్తరంబుగా నానతీయవే యని వేడుటయు

## శివాలయ మహత్తు.

నావుడుతరువాత సూతమహామునిబుుషులనుజూచియిట్లు జెప్పెను. "ఓ బుుషులారా! ప్రతిదినమును శివాలయముతుడిచి నీళ్ళు చల్లువారు తాము జీవించునంత కాలమందటి వలన పూజింపఁబడి మరణము నొందిన తరువాత కైలాసమును పొంది సుఖింతురు. శివునికి మంచియద్దము నిచ్చువార లనాయాసముగ శివసామీప్యమును పొందుదురు. వింజామరలతో నీశ్వరునికి విసరువారికి ముల్లోకములవారు వీవనలతో విసురుదురు. ఈశ్వరాలయమున నిత్యము దీపము పెట్టువారు శరీర కాంతి గలవారై నెల్లతావుల చీకటిలేక తిరుగుదురు. ధూప దానముచేయు వారు చక్కనివారై యుభయవంశముల వారికి మోక్షసాధనమును కలుగఁజేయుదురు. హరిహరులకు నైవేద్యముచేయు వారు వెంటనే యజ్ఞముచేసిన ఫలమును పొందుదురు. పడిపోయిన శివాలయమును బాగుచేయించు వారు క్రొత్తగా ఆలయము గట్టించు వారికంటె రెండురెట్లు ఫలమును పొందుదురు. శివాలయమును కట్టించువారికి స్వర్గమున యిల్లు

దొరకును. వారికి నిర్మలమైనట్టియు క్షీణింపనట్టియు కీర్తి కలుగును. అందుకు సందేహములేదు. శివునికి భూమినిచ్చు వారికి తప్పక మోక్షము లభించును. తాను కట్టించి నటువంటిగాని యితరులు కట్టించినట్టిగాని దేవాలయమునకు సున్నము వగైరాలు వేయించి యలంకరించువారు కైలాసమును పొంది సుఖముగా సంచరింతురు. ఈశ్వరునికి వాహన మిచ్చువారు కులము నందఱిని నుద్ధరించి యంతమున శివ సాయుజ్యమును పొందుదురు. శివాలయమున మంచిఘంట కట్టువారు ముల్లోకముల కీర్తిపొంది తేజస్సు గలవారగుదురు. ప్రతిదినము నొకమారుగాని రెండుమార్లుగాని ముమ్మారుగాని శివుని దర్శించువారు ధనవంతులైనను, బీదవారైనను క్షుద్బాధ నొందరు. శ్రద్ధాభక్తులతో శివునిధ్యానించువారు కులములోకోటిమందిని తరింపచేసి శివసాయుజ్యమును పొందుదురు. ఇందువిషయమై పురాత నేతిహాస మొకటి యున్నది. వినుండని సూతుఁడు శౌనకాది మహాఋషుల కిట్లువాక్రువ్వంగడంగె!

### ఇంద్రసేనమహారాజుకథ.

పూర్వము సత్యయుగమునందు ప్రతిష్ఠాన నగరమునందు నింద్రసేనుఁడను మహారాజుండెను. ఇతఁడు పరమ మూర్ఖుఁడు. వేఁటయందాసక్తిగలవాఁడు. అతఁడు మిక్కిలి క్రూరుఁడు దురాచారుఁడై తనతృప్తి కొఱకు నితరజీవులను బాధించువాఁడు. పరస్త్రీలను భంగపరచుట, పరధనము నపహరించుట, త్రాగుట, బ్రాహ్మణులను బాధించుట, చోరత్వము చేయుట, మొదలగు దుష్కార్యములుచేయువాఁడు, వాని పరి

చరులుగూడ నట్టి వారేయనిచెప్ప నవసరములేదు. ఇట్లుచాల కాలము రాజ్యముపాలించి యతఁడు మరణము నొందెను. యమదూతలు వచ్చి వానిని కట్టికొట్టి బాధించుచు తీసికొని పోయి యమధర్మరాజునెదుటబెట్టిరి. అప్పుడు ధర్ముఁడు వానిని జూచి పాశములను విప్పించి వానితో నెమ్మదిగా నిట్లనెను.

ధర్మ—“ఓ ఇంద్రసేనా! నీవు చిరకాల మార్జించిన పుణ్య ఫలమును పొందుము.

ఇంద్ర—ఓ ధర్మరాజా! నేనేమి పుణ్యమొనర్చితిని. పాపమే గాని పుణ్యముచేసి యెఱుఁగనే!

ధర్మ—నీ వే యే పాపములు చేసితివి?

ఇంద్రి:—ఒకటి గనుక చెప్పనా? అన్నియు పాపకార్యములే చేసితిని పుణ్యమనునది యొకటియులేదు.

ధర్మ:—నీవుచేయునవి పాపకార్యములైనను నీవవిచేయు నప్పుడు శివుని తలంచుచుంటివి, ఆహార విహారాదులందు శివుని నామ ముచ్చరించుచుంటివి.

ఇంద్ర:—అదియేమో నాకు తెలియదు. అట్లుచ్చరించినను నది బుద్ధిపూర్వకముగాదు.

ధర్మ:— కాకపోయినను దానిఫల మనుభవింపవలెను.

ఇంద్ర:—అయితే నేనిప్పు డేమిచేయవలయును?

ధర్మ:—నీవు కైలాసమునకు పోయి యుండవలయును?

ఇంద్ర:—ఎంతకాలమువఱకు?

ధర్మ:—సూర్యుఁడు చంద్రుఁడు నెంతకాలము ప్రకాశించు చుందురో యంతకాలముదనుక.

ఇంద్ర:—అబ్బా! ఒకచోటనే యంతకాలముండఁగలనా? నాకాలు నిలువదే?

ధర్మ:—అచ్చట నీకే బాధయునుండదు. అతికుశలివై ప్రమథగణములతో విహరించుచుందువు, అని చెప్పు సమయమున శివదూతలచ్చటికి వచ్చియిట్లనిరి.

శివదూతలు:—ఓ శమనా! ఇంద్రసేనుఁడిట నున్నాఁడా?

ధర్మ:—అయ్యా! మీరెవరు?

శివదూతలు:—ధర్మరాజా! మేము శ్రీసదాశివునిదూతలము.

ధర్మ:—ఆయన యిందు విచ్చేయుటకు కారణమేమి?

శివదూత:—ఇంద్రసేనుఁడు మరణించిన సంగతి మాప్రభువు విని వానిని తోడితెమ్మని యాజ్ఞాపింపఁగా ప్రతిష్ఠాననగరమునకుఁబోయి చూచి యచ్చటలేకుండుటచేనిటువచ్చితిమి.

ధర్మ:—ఇతఁడే యింద్రసేనుఁడు. ఇతని నెట్లు కొనిపోయెదరు?

శివదూత:—ఇదియే విమానము. దీనిపైనుంచి తీసికొనిపోదుము.

ధర్మ:—సరే మంచిది. ఆలాగుననే సేయుఁడు. ఇంద్రసేనా! నీవు వీరితోపోయి సుఖింపుము.

అటుపిమ్మట శివదూతలు వానిని విమానము మీఁద కూర్చుండఁబెట్టి కైలాసమునకు కొనిపోగా, శివుఁడు వానిని యెదుర్కొని కౌఁగిలించుకొని తీసికొనిపోయి నిజాస్థానము ప్రక్కను కూర్చుండ బెట్టుకొని. కుశలములడిగి నీకేమి కావలయునో యడుగుము. అనఁగా నతఁడు గద్గదస్వరముచే మాట్లాడలేకపోయెను. ఈశ్వరుఁడు వానికి శివచండుఁడని పేరు పెట్టి సర్వదా తన సమ్ముఖమున నుంచుకొనెను.

బహుపాపాత్ముఁడైన యింద్రసేనుఁడప్రయత్నపూర్వక ముగనైన శివనామ ముచ్చరించుటవలన శాశ్వతసుఖమును పొందెను. అనిచెప్పి సూతుఁడు ఋషులను జూచియిట్లనియెను. హరిహరుల నామమును స్మరించువారు సమస్తపాపములను నశింపజేసికొని మోక్షమును పొందుదురు.

కావున శివునికన్న హెచ్చుదైవము పదునాలుగు భువనములయందు లేడు. వాని పాదపద్మములందు నిశ్చలమయిన భక్తియుంచుడు. ఆయనకు పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని, జలముగాని, గన్నేరుపువ్వుగాని సమర్పించి పూజించువారు స్వల్పకాలములో ముక్తినొందుదురు. గన్నేరు పువ్వులకన్న జిల్లేడుపువ్వులవలన పదిరెట్లు ఫలమధికము. శంకరుఁడు విభూతి ప్రియుఁడు గాన వాని భక్తులు భస్మలేపనము చేసికొనుట మంచిది. అట్టివారు సమస్తపాపములచే విముక్తులగుటయేగాక నిత్యము పుణ్యమును సముపార్జింతురు. విభూతి నొసటను శరీరమందును ధరించి శివపంచాక్షరీ మంత్రజపము చేయువారును, రుద్రాక్షమాలలను ధరించువారును కేవలము శుద్ధులేయనవలయును. ఉదయమున శివుని దర్శించువారు రాత్రిచేసిన పాపములను నశింపచేసికొందురు. మధ్యాహ్నకాలమందు దర్శించువారికి నేఁడుజన్మములపాపమునశించును. సాయంకాలమున దర్శనముచేయువారు నిష్పాపరులగుదురు. శివాలయమందు భేరీవాయించువారుజీవన్ముక్తులు. దానిశబ్దమువినువారందఱుపాపవిముక్తులగుదురు. ఏజంతువు చర్మభేరికి వేయఁబడియుండునో యాజంతువు సంసారమునుండి తరించును. చామరమును వీచుట, సంగీతము, ఆట, పాట మొదలగువానివలన

మహేశ్వరుఁడు తృప్తినొందును. వీనివలనమహాపాపములు చేసిన వారు కూడ తరింతురు. ఏజాతివారైనను చండాలుఁడైనను శివభక్తుఁడు తప్పక తరించును. వేదములు, శాస్త్రములు, పురాణములు, నుపనిషత్తులు మొదలగు నన్ని గ్రంథములందును శివుఁడే యాది దేవుఁడుగా చెప్పఁబడి యున్నాఁడు. మఱియొక పురాతనే తిహాసమును చెప్పెద వినుఁడని సూతుఁడు నైమిశారణ్యముననున్న మునులతో నిట్లనెను.

కిరాతుఁడు శివభక్తుఁడై తరించుట.

పూర్వ మవంతీపట్టణమున నందియను పేరుగల కోమటి మిక్కిలి శివభక్తి కలవాఁడై యుండి యొక కొలనియొద్దన నున్న దేవాలయమునకు నిత్య ముదయమున పోయి యందలి లింగమును పంచామృతములతోను, పుష్పములతోను, రత్నములతోను పూజించుచు బ్రాహ్మణుల కనేక దానములు, ధర్మములు, చేయుచుండెడివాఁడు. ఇట్లు చాలకాలమునుండి జరుగుచుండఁగా నొకదినమున నొక కిరాతుఁ డడవికిఁబోయి యనేకమృగములను జంపి యలసి. వేసవికాలమగుటచే జల మెందును గానక, యీ కొలనికివచ్చి స్నానముచేసి కావలసి నంత నీరుద్రాగి పైకివచ్చి యచ్చటిదేవళమున విశ్రమింపఁ బోయి యందున్న లింగమును జూచి పూజింపఁదలచి దానిపై నున్న రత్నములను పుష్పములను తీసిపారవైచి, తననోట నున్న నీరు లింగముపై విడచి, మారేడుపత్రి కొంతదెచ్చి, దానిపై వైచి, తనయొద్దనున్న పచ్చిమాంసము నివేదనచేసెను. తరువాత నాలింగమునకు దండముబెట్టెను. వాఁడు ప్రతిరోజు

నట్లుచేయ నిశ్చయించుకొని తన యింటికిబోయెను. మరునాఁడుదయమున కోమటి యెప్పటివలెనే కోవెలకుఁబోయి తాను తొలిదినమున పూజించిన రత్నములు మున్నగునవి క్రిందఁబడి యుండుటయు, బిల్వపత్రి మహేశ్వరుని శిరస్సున నుంచుటయు చూచి యా స్థలమును పరిశుద్ధిచేసి వెంటనే యింటికిఁబోయి మనస్సుస్థిరపఱుపలేక తన పురోహితుని యింటికిబోయి యాయనతో జరిగినదంతయు చెప్పఁగా విని యా పురోహితుఁ డతనితో దేవళమునకుఁబోయి సంప్రోక్షణ వగైరాలుచేయించి రుద్రాభిషేకము పంచామృతములతో చేయించి రత్నపుష్పములతో పూజచేయించి నివేదనచేయు సమయమున కిరాతుఁ డచ్చటికిబోయి గుడిలో ప్రవేశించి తొలినాఁడు తాను చేసిన ప్రకారమే పూజించెను. పిమ్మట కిరాతుఁడు తన యింటికిఁబోయెను. ఆ కోమటివాఁడు చేసిన దురాచారమంతయు చూచి తనతో యచ్చటనే యున్నపురోహితునితో నాలోచింపఁగా నా బ్రాహ్మణుఁడు వానితో నిట్లనెను: "ఓ వైశ్యోత్తమా! వీఁడుకిరాతుఁడు కావున మూర్ఖుఁడు. మనము వానితో నెంతచెప్పినను వానికి తెలియదు. ఈ దురాచారము వాఁడుమానడు. కావున నీవీలింగమును నీగృహమునకు తీసుకొనిపోయి శుచియైన స్థలముననుంచి యెప్పటివలెనే పూజింపుము." ఆ కోమటి పురోహితుఁడు చెప్పిన ప్రకారము లింగము నూడఁదీసి యింటికి తెచ్చి యెప్పటివలె పూజించుకొనుచుండెను. ఆ మరుసటి దినమున మధ్యాహ్న కాలమున కా కిరాతుఁడాగుడికిఁబోయి యందు లింగము కనబడనందున మేదురంబుగ రోదించుచు "ఓ శంభూ! దయా

మయా ! ఎందుబోతివి ? నిన్ను పూజించుటకు నేనిందు వచ్చితిని. నీవు నాకు దర్శన మివ్వకున్న నిచ్చట నా శరీర మును విడితును" అని మొఱబెట్టెనను శివుఁడు ప్రత్యక్షము కాకుండుట చూచి నిరాశనొంది తన శిరస్సు కత్తితో నఱకు కొని యా తలను లింగముండుచోట వానికి మారుగా బెట్టెను. అంతలో వానికెప్పటివలె శిరస్సు మొలచెను. పిమ్మట వాఁడు మామూలు ప్రకారము పూజాభిషేకములు నిర్వర్తించి నివేదనముచేసి క్రింద సాష్టాంగపడి ధ్యానము చేయఁగా వానిభక్తికి మెచ్చి ఈశ్వరుఁడు ప్రత్యక్షమై వానిని లేవనెత్తి వానితో నిట్లనెను. "ఓయీ! నీవు నాకు పరమ భక్తుఁడవు. నీవు గొప్ప వీరుఁడవు. నీ ఇష్టానుసారము వరము కోరుము. తప్పకయిచ్చెద ననఁగా కిరాతుఁడు విని సంతోషించి చేతులు జోడించుకొని యిట్లనెను. "ఓ శంభూ ! మహాదేవా! నన్ను నీదాసునిగా నేలుకొనుము. జన్మ జన్మాంతరముల యందును నీపాదపద్మములయందు నాకు భక్తియుండునట్లువర మిమ్ము" అని వేడుకొనఁగా శివుఁడువానిభక్తికిమెచ్చి తన యొద్ద వానినిద్వారపాలకునిగా నుండుమనెను. అప్పుడు ప్రమథ గణము లందఱు నీశ్వరునిదయకు సంతసించి, ఘంటా, కాహళీ భేరీ, మృదంగాదిధ్వనులు చేయుచు, పాడుచు, నాడుచునుండిరి. ఆధ్వనివిని కోమటి యచ్చటికిచేరి యీశ్వరుని, తదీయపార్శ్వ-భాగములనుండి స్తుతిచేయుచున్న కిరాతుని చూచి తాను కూడ కిరాతుని ప్రక్కజేరి స్తోత్రముచేయఁ నారంభించెను. పిమ్మట నంది యను కోమటి కిరాతుని జూచి "ఓయీ ! నీవు ధన్యుఁడవు. నీమూలముగ నన్ను తరింపనిమ్ము. ఆ శంభునకు

నన్నుజూపి నాయందనుగ్రహించునట్లు చేయుమనఁగా నా కిరాతుఁడతనిచేయి పట్టుకొని శివునిసన్నిధిని జేర్చి యిటు విన్నవించెను. "ఓశంభో! ఉమానాయకా! ఇతఁడు మాభక్తులలో శ్రేష్ఠుఁడు. త్రికాలములయందును తమ పూజ షోడశోపచారములతోను ప్రతిదినము చేయుచున్నాఁడు, ఇతనిని గటాక్షించి తమ సన్నిధిని దాస్యమొసంగుడు" అనఁగా కరుణించి దయామయుఁడగు మహేశ్వరుఁడంగీకరించి వారిద్దఱిని తోడుకొని తన నిజపరివారముతో కైలాసమునకు వేంచేసెను. అచ్చట వారిద్దఱిని శివుఁడు ద్వారపాలకులుగ నుంచుకొనెను. అనిచెప్పి సూతమహాఋషి మునులను జూచి వింటిరా శివుని మహాత్మ్య మెవ్వారుగాని భక్తిశ్రద్ధలతో నీ మహాదేవుని పూజించినను లేక స్మరించినను తదీయదయవలన సమస్తపాపములచే విడువఁబడి దేహాంతమున కైలాసమునకుఁబోయి శివసాయుజ్యము బొందుదురు. పార్థివలింగము చేసి యందు శివుని యావాహనము చేసి షోడశోపచారములను పూజించుట శ్రేష్ఠమని సూతుఁడు వారి కుపదేశించెను.

### లింగము నెందుకు పూజించవలెను

పిమ్మట శౌనకాదిమహామునులు సూతుని జూచి శివుని పూజించుటకు మారుగా ఆయన లింగమును పూజించుట కారణమేమని యడుగఁగా రోమహర్షణుఁడు వారితో నిట్లు చెప్ప నారంభించెను. ఒకదినమున నీశ్వరుఁడు దిగంబరుఁడై జుట్టువిప్పి దిగజారవిడిచి, శరీరమంతటను భస్మము పూసికొని, దారుకావనమున ప్రవేశించి యందున్న ఋషిపల్లెకు, భోయి

భిక్షాటనము చేయుచుండెను. ఆ సమయమున ఋషులు తమ గృహమునందు లేకుండిరి. ఆ దినమున గొప్ప పర్వమైనందున సమీపముననున్న తీర్థమున స్నానము చేయఁబోయిరి. అప్పుడు ఋషిపత్ను లతనిని చూచి వారిలో వారిట్లు సంభాషించిరి.

కామాంబ:—ఓ అక్కా! ఆ వచ్చుచున్న పురుషుని చూచితివా?

సుబ్బాంబ:—ఓ చెలీ! ఏమీ? దిగంబరుఁడై మన ఋషిపల్లెలో చొరఁబడుచున్నాఁడు! వెఱ్ఱివాఁడా ఏమి?

విశాలాక్షి:—వెఱ్ఱివాఁడు కాడమ్మా! వెఱ్ఱివాని లక్షణములు కానరావే?

కామాంబ:—ఆహా! అంత చక్కనివానికి వెఱ్ఱి యేలయుండును? జుట్టు విప్పుకొన్నంత మాత్రమున వెఱ్ఱివాఁడన వచ్చునా? వాని శరీరచ్ఛాయ చూచితిరా? పదియాఱువన్నె బంగారువలె జిగి కలిగి మెఱమెఱ మెఱయుచున్నది.

సుబ్బాంబ:—అంతే కాదమ్మ? తిరిగియున్న వాని నల్లనిమీసములు చూచితిరా? వాని నేత్రములు విశాలమై కళలు కలిగియున్నవి. మంచి యౌవనవంతుఁడై యున్నాఁడు. ఇతఁడు దిగంబరియై వచ్చుటకు గతమేమి?

విశాలాక్షి:—అతఁడు ఇటేవచ్చుచున్నాఁడు. రానీయండి. అడిగి తెలిసికొందము. అంత చక్కని పురుషుని ఇది వఱకు చూచి ఎఱుఁగమే?

శివుఁడు:—(కామాంబఇంటికివచ్చి) భవతిభిక్షాందేహి! అనెను. ఆమె తన దోసిలినిండ బియ్యము వేసెను.

కామాంబ:—అయ్యా! మీ రెవరు? భిక్షుని వేషముతో నిటు వచ్చితిరి.

శివుఁడు:—ఓ సులక్షణీ! నేను త్రిలోచనుఁడను.

సుబ్బాంబ:—ఔను. మీకు మూఁడు నేత్రములున్నవి. ఒక్క శివునికే మూఁడు నేత్రములున్నవని విందుమే? మీ కెట్లు కలిగెను.

శివుఁడు:—ఔను నేనే శివుఁడను.

సుబ్బాంబ:—అట్లయిన కైలాసముననుండక భిక్షాటనమేమి?

శివుఁడు:—సనాతన ధర్మవృత్తి ఇదే గదా?

విశాలాక్షి:—మీరే శివుఁడైన మీభార్యయైనదాక్షాయణి ఏదీ?

శివుఁడు:—ఆమె దక్షుని యజ్ఞగుండమునబడి భస్మమయ్యెను. ఆ విరక్తిచేతనే ఇట్లు తిరుగుచున్నాను.

విశాలాక్షి:—ఔను, ఆమె మరణించిన సంగతి వినియుంటిమి. అంతమాత్రమున విరక్తి పొందనేల? మీవంటి సుందరాంగులకు స్త్రీలుకఱువైరా!

శివుఁడు:—లేరు. ఆమెవంటివారు మఱిదొరకరు. కావుననే తిరిగి వివాహము మానితిని.

కామాంబ:—స్త్రీలు, పురుషులకు, సంతోషమునిచ్చువారు కదా? వివాహము మానిన ఎట్లు? మీవంటి యుక్తవయస్సు కలవారు తప్పక తిరిగి వివాహము చేసికొన వలెను.

సుబ్బాంబ:—మాది ఋషిపల్లె. ఇందుకొంతకాలము విశ్రాంతి పొందరాదా !

శివుడు—"నేనొకచోట నుండువాడను కాను". ఇట్లనుచు స్త్రీలు ఇష్టానుసారము భిక్షము పెట్టగా పాత్ర నిండినందున శివుడు కైలాసము వైపు తిరిగిపోయెను. ఆయన వెంటనే స్త్రీలందఱు పోయిరి. అంతట ఋషులందఱు తమపల్లెకు వచ్చి, తమ స్త్రీ లిండ్లయందు లేకుండుట చూచి యెందుబోయిరో యని నలుదిక్కుల వెదకుచుబోయి శివుని వెంటబోవువారలను జూచి యతడు వారిని మరులుగొల్పితీసికొని పోవుచున్నాడని యెంచి వారిని బోధించి మరల్చి శివుని నపుంసకుడగునట్లు శపింపగా వెంటనే శివుని లింగము తెగి క్రిందబడెను. అది క్రమక్రమముగా పెరిగి యూర్ధ్వలోకములు నేడు, నధోలోకములేడింటిని వ్యాపించెను.

బ్రహ్మవిష్ణువులు లింగమును శోధించుట

ఇట్లు పదునాల్గు భువనములందును వ్యాపించిన లింగమును బ్రహ్మ, విష్ణువు, అష్టదిక్పాలకులు, దేవతలు, ఋషులు, చూచియద్భుతాశ్చర్యనిమగ్నులై ఒకరిముఖములొకరుచూచుకొనుచు నాలింగముయొక్క మొదలుగాని కొసగాని కనిపెట్టలేకపోయిరి. పిమ్మట వారు బ్రహ్మ విష్ణువుల యొద్దకు నాలింగముయొక్క యాద్యంతములెందున్నవో చెప్పుడని ప్రార్థింపగా వారు తమకు తెలియదనిరి. సృష్టి, స్థితులకు కర్తలైన మీరే యిట్లనిన మఱి యీవింతను కనిపెట్టువారెవరని చెప్పి మీరీవిషయము బాగుగ పరిశోధింపవలయునని

దేవతలనఁగా, విష్ణువు క్రిందుగాను, బ్రహ్మమీదుగాను పోయి దానిమొదలు, కొస కనిపెట్టఁదలంచిరి. తరువాత వెంటనే వారు బయలుదేరి వెయ్యి సంవత్సరముల వఱకు పోయిరి గాని, బ్రహ్మకు కొసగాని విష్ణువుకు మొదలుగాని కన బడక బ్రహ్మ మిక్కిలివిచారించుచు పోయినత్రోవనే తిరిగి వచ్చుచు, మేరువు పర్వతమునొద్దనున్న కేతకీవృక్షమును, దాని నీడను పరుండి విశ్రమించుచున్న కామధేనువును చూచెను. ఆ సురభి బ్రహ్మను చూచి యచ్చటికి విచ్చేసిన కారణమడుగఁగా "లింగముయొక్క కొసను చూచివచ్చుటకు నన్ను దేవతలు పంపిరి. నేను దాని యంతము చూడలేనందున వారితో నేమి చెప్పుదునని విచారించుచున్నాను. కొసను చూచినట్లు చెప్పిన వారు నన్ను నమ్మకపోవచ్చును. అప్పుడు మిమ్మను సాక్షులుగా నెంచుకొందును. అప్పుడు మీరు నాపక్షమున సాక్ష్యమియ్యవలయును" అనఁగా "మేమట్లు చెప్పుదుము" అనిరి. పిమ్మట బ్రహ్మ దేవతలతో, నూర్ధ్వ లోకము లేడును చూచి వచ్చితిని. లింగముయొక్క శిరస్సు అత్యద్భుతముగా నున్నదనియు, కేతకిపువ్వులతో పూజించితి ననియు వారితో చెప్పెను. దేవతలాశ్చర్యపడి యూరకుండిరి. ఈ సమయములో పాతాళమునుండి విష్ణువు వచ్చి దేవతల యెదుట కనఁబడెను. తానెంత ప్రయత్నించినను లింగము యొక్క మొదలు కానరాలేదని చెప్పెను. ఏడు పాతాళలోక ములును చూచితిని. ఇంకనెంతదూరమున్నదో నాకు తెలి యదు" అని శ్రీహరియనెను. ఆ లింగము సర్వేశ్వరునిరూపమే యని నాకు తోచుచున్నది. అనఁగా దేవతలు, ఋషులు సంత

సించిరి. తదనంతరము విష్ణువు బ్రహ్మనుజూచి లింగముశిరస్సు నీవుచూచినట్లు సాక్షులెవరనఁగా, కేతకి, సురభి నాకు సాక్షులనెను. వారిని పిలిపించి యడుగఁగా బ్రహ్మ లింగముశిరస్సుపైని కేతకీపుష్పములు పూజచేసెను, 'మేము చూచితిమి' అని అవిచెప్పెను. అప్పుడాకాశవాణి ఇట్లనెను. "బ్రహ్మ లింగముయొక్క శిరస్సును చూడలేదు. కేతకీ సురభు లబద్ధ సాక్ష్యమిచ్చిరి" ఆ మాటలు విని దేవతలు క్రోధము కలవారై సురభిని చూచి నీవబద్ధమును చెప్పితివి కావున నీముఖమపవిత్రమగుగాక'! కేతకిని చూచి 'నీవు శివుని పూజకు పనికిరాకపోదువు గాక' అని శపించిరి. అప్పుడాకాశవాణి బ్రహ్మను జూచి నీవసత్యమాడితివి కావున, నీకు పూజలేకపోవునుగాక' అని శపించెను. అది విని భయపడి యందఱు నా లింగమునకు శరణుజొచ్చిరి.

### శ్రీమహావిష్ణువు లింగముయొక్క విశ్వరూపమును సంహరింపఁజేయుట

తరువాతకథ నానతీయరే ? అని మునులు సూతు నడుగఁగా నాయన యిట్లు చెప్పెను. పిమ్మట బ్రహ్మాది దేవతలు నాలింగము నెదుట నిలబడి బహు స్తుతులొనరించి శరణువేడి క్షమింప వేడుకొనఁగా శివుఁడు వారిపై కరుణించి యిట్లు చెప్పెను. "ఓ దేవతలారా! మీరు శ్రీహరిని ధ్యానింపుడు. ఆయన కరుణించి మీ యాపదనుండి కాపాడును. అనఁగా బ్రహ్మాది దేవతలాయన యొద్దకుఁబోయి ప్రదక్షిణ నమస్కారములు చేసి చేతులు జోడించుకొని నిలుచుండి, ఓ దేవాదిదేవా! దీనరక్షకా! మా మొఱవిని మమ్ములను కృపఁజూడుము.

మీరలితః పూర్వమనేకసార్లు రాక్షసుల బాధనుండి మమ్మును కాపాడి రక్షించిరి. ఇప్పుడు మీబల మెందుఁబోయెను ? ఈ విశ్వమంతయు వ్యాపించిన లింగమువలనకలిగిన భయము పోగొట్టి మమ్ము రక్షింపవలె ననఁగా నాచేతకాదని శ్రీహరి సెలవిచ్చెను. ఆ మాటవిని దేవతలు విచారించుచుండిరి. అంతట గగనమునుండి యిట్లు శబ్దము వినవచ్చెను. "ఓవిష్ణూ! నీవు శక్తిరూపమును పొంది యాలింగమును ధరింపుము. అనఁగా పానువట్ట మగును. అప్పుడాలింగమును దేవతలందఱును పూజించి ధ్యానించిన దానిబాధ యెవరికిని గలుగదు. అది శివునియొక్క రూపమే యనఁగా విని శ్రీహరి యాప్రకారము చేసెను. తరువాత బ్రహ్మాదిదేవతలు ఋషులు దానిని భక్తి యుక్తులై షోడశోపచారములచే పూజించి యనేకస్తోత్రములు చేయఁగా నాలింగమనేక లింగములుగా నేర్పడి సత్యలోకమున బ్రహ్మేశ్వరుఁడనియు, వైకుంఠమున సదాశివుఁడనియు, నమరావతియందు నమరేశ్వరుఁడనియు, యమునిపట్టణము నందు కాళేశ్వరుఁడనియు, వరుణునిపట్టణమున వరుణేశ్వరుఁడనియు నైఋతిపురమున నైఋతేశ్వరుఁడనియు. వాయు లోకమున పవనేశ్వరుఁడనియు, నర్మదాతీర్థమున కేదారేశ్వరుఁడనియు, ప్రయాగయందు లలితేశ్వరుఁడనియు, కాశీలో విశ్వేశ్వరుఁడనియు, బ్రహ్మాచలమందు త్ర్యంబకేశ్వరుఁడనియు, గంగా సాగర సంగమమున ద్రాక్షా రామేశ్వరుఁడనియు, సౌరాష్ట్రదేశమున సోమేశ్వరుఁడనియు, వింధ్యాచలమున ఓంకారేశ్వరుఁడనియు, శ్రీశైలమున శిఖరేశ్వరుఁడనియు, పాతాళమున హాటకేశ్వరుఁడనియు, నిట్లు లోకములో ననేక

స్థలములయందు పలువిధములగు నామములతో జనులను తరింపఁజేయుటకా శివలింగము వెలసెను. ఈ లింగముయొక్క మహాత్మ్యము బాగుగా తెలిసినవారు నందీశ్వరుఁడు, కుమారస్వామి. కుమారస్వామిని సేవించి యగస్త్యమహాముని శివపంచాక్షరీ మంత్ర ముపదేశము నొందెను. ఆయన ద్వారమున ననేకులామంత్రమును పొంది జపించి ముక్తులైరి. శివునికి మారుగా లింగమును పూజించుటకు కారణ మిది యని సూతుఁడు మునులకు చెప్పెను. ఇంద్రాది దేవతలును, రాక్షసులును, శ్రీమహావిష్ణువును, ఋషులును, మునులును, యావన్మందియు లింగరూపులై యున్న హరిహరులను పూజింతురు. పూర్వము రావణాసురుడాలింగమును పూజించుట చేతనే ముల్లోకములను జయించి దేవతలకే కాక త్రిమూర్తులకున జేయుఁడయ్యెను. కావున లింగపూజవలన గలుగుమహత్మ్య నెంతో యూహింపవచ్చును. కాని చెప్పుటకు వీలులేదని సూతుఁడు శౌనకాది మహామునులకు చెప్పఁగా విని పరమానందమునుపొందిరి.

## ఇంద్రునికి బ్రహ్మహత్యా దోషము

పిమ్మట ఋషులు సూతునిజూచి యింద్రుఁడు బ్రహ్మహత్యాదోషమువలన చాలబాధలుపొందెనని చెప్పగావింటిమి. అతనికా మహాపాతక మెట్లు కలిగెనో యందువలన నాతడెట్టి యిక్కట్లుపడెనో యాపాపపరిహార మెట్లుకలిగెనో వినవలయును. మీరు శ్రీ వేదవ్యాసునివలన సమస్త పురాణములను విని సమస్త విషయములు గ్రహించినవారు కావున మాయందు

దయయుంచి యీ సంగతి సవిస్తరముగా చెప్పవలెనని ప్రార్థింపఁగా నాయన వారిని శ్రద్ధతో వినుడని యిట్లు చెప్పనారంభించెను. పూర్వమొకనాఁడింద్రుఁడు సభచేసి యప్సరసలైన రంభ, ఊర్వశి నాట్యము చేయుట చూచుచుండఁగా దేవగురువైన బృహస్పతి యాసభకు వెళ్లెను. అప్పుడు ఇంద్రుఁడు తప్ప మిగిలిన సభలోనున్న వారందఱు లేచి యాయనకు ప్రత్యుత్థానము చేసిరి. ఇంద్రుఁడు వారు చేయుచుండు నాట్యమునందే దృష్టిగలవాఁడై యాబృహస్పతికి మర్యాద చేయకుండెను. అదిచూచి కినుకచెంది బృహస్పతి వెంటనే సభ విడచిపోయి మర్యాదలేని రాజు పట్టణములో నుండకూడదని యమరావతి పట్టణమును విడచిపోయెను. నాట్యము ముగిసిన పిమ్మట యింద్రుఁడు సభవారిని కలయజూచి "మాగురువులైనబృహస్పతులవారు వచ్చియుండిరి. వారిప్పుడెందేగిరి." అని యడుగఁగా సభలో కొందఱిట్లు మనవిచేరి. "ఓరాజా! నేఁడు నీవుచేసిన యవమానము సహింపలేక క్రోధబుద్ధితో తమ పట్టణమును విడిచి పోవలెనని చెప్పి యిటనుండి లేచిపోయిరి. మీరు వెంటనే వెళ్ళి క్షమాపణ వేడుకొనుడు. లేకున్న నశుభములు కలుగఁగలవు" అని చెప్పఁగా నింద్రుఁడు వెంటనే సింహాసనమునుండి లేచి కొందఱ అనుచరులతో గురుగృహమునకుబోయి చూడఁగా బృహస్పతి యింటనున్న భార్యనుచూచి నమస్కరించి మా గురువులైన బృహస్పతుల వారెక్కడ? అని యడుగఁగా తనకు తెలియదని యామె చెప్పెను. ఆమాట విని దుఃఖితుఁడై యింటికిఁబోయెను. అటుపిమ్మట ననేకములయిన యశుభములు, కష్టములు, నింద్రునికి తటస్థించెను. అది

చూచి గురువులేకుండ రాజ్యము చేయుట మంచిదికాదని విశ్వకర్మ కుమారుడైన విశ్వరూపుడు బృహస్పతితరువాత గొప్ప పండితుడని యెంచి యాయనను పిలిపించి తనకు పురోహితునిగా నియమించుకొనెను. ఈ విశ్వరూపునికి త్రిశిరుడని నామాంతరముకలదు. ఇతడు రాక్షసులయందు హెచ్చు ప్రేమగలవాడగుటచే యజ్ఞములయందు హవిర్భాగమిచ్చునపుడా పక్షపాతబుద్ధి యింద్రుడుకనిపెట్టి తనకు పురోహితుడై యుండియు రాక్షసులయందు నధిక ప్రీతికలవాడని కోపించి తన జేతనున్న వజ్రాయుధముతో వాని శిరస్సులు నరికెను. అందువలన నింద్రునికి బ్రహ్మహత్యాదోషము సంభవించెను.

### నహుషుడు దేవేంద్రుడగుట

ఆ బ్రహ్మహత్య భయంకరాకార మగు రూపమును దాల్చి యింద్రునికి ప్రత్యక్షముకాగా దానినిచూచి యాయన భయపడి పరుగెత్తసాగెను. ఆ బ్రహ్మహత్యయు నాతనివెంట నతని చాయవలె పరుగెత్తి యొకచోట నిలిచిన పట్టుకొనుటకు కాలోచించెను. అందుచే నింద్రుడు లోతుగలజలములో ప్రవేశించి మూడువందల సంవత్సరములందుండెను. స్వర్గమునందింద్రుడు లేనందున యరాజకమై దేవలోక మల్లకల్లోల మగుట చూచి దేవతలు విచారగ్రస్తులైరి. బ్రహ్మహత్యాపాతకి యొకడు రాజ్యములో నున్న ప్రజల కనేక బాధలు సంభవించును. అవి యేవంటేని అకాల మరణములు, దుర్భిక్షము, అతివృష్టి, అనావృష్టిదోషములు, మారి, మహామ్మారి, విషూచి, మశూచి, సన్నిపాత - విషము, విషజ్వరాది మహా

వ్యాధులు, మొదలగు నుపద్రవములు యెన్నో కలుగును. కావున రాజు ధర్మపరిపాలన పరుడై యుండుటయే కాక రాజ్యమునందలి ప్రజలుకూడ పాపకార్యములు చేయకుండ చూచుచుండవలయును. ఇంద్రుడు చేసిన బ్రహ్మహత్యవలన ముల్లోకములవారు బాధలను పొందుచుండిరి. అదిచూచి మిగి లిన వారష్ట దిక్పతులు బృహస్పతిని వెదకుచుంబోయి యాయ నను జూచి సాష్టాంగ నమస్కారములుచేసి యింద్రుడు, తాము, దేవతలు, ఋషులు పడుచున్న బాధలాయనతో మనవిచేయగా విని కర్మఫలము ననుభవింపక తప్పదు గదా అని యాయన యనెను. అంతట వారందరు లేచి యాయన నిట్లు ప్రార్థించిరి. 'ఓ దేవగురూ ! నాడు సభ యందు దేవేంద్రుడు మిమ్ము నవమానించిన కారణము వలననే యిట్టి యిక్కట్టులపడి మూల్గుచున్నాడు. అతనితో మేమును మాతోబాటు మూడు లోకములవారును బాధలు పొందుచున్నారు. ఇకనైన తమరు మాయందు కరుణించి మాతో కూడ దయచేసి కొంతోక సాధన మాలోచించి మా బాధలను బోగొట్టవలె ననగా విని బృహస్పతి వారితో బయలుదేరి, యింద్రుడు జలములో దాగియున్న హ్రదము నొద్దకుబోయి యింద్రుని పిలువగా నతడు జలములోనుండి లేచి కొంతమేరదరి జేరి బృహస్పతికినమస్కరించి గురువర్యా నేచేసిన కర్మఫలమునుభవించు చున్నాను. ఈ మహాపాపము నుండి నన్ను రక్షించుటకు మీరు తప్ప వేరు గతిలేదు. కరు ణింపుడు" అనగా "ఓ దేవరాజా ! కర్మఫల మెవరికైనను తప్పింప వశమగునా అనుభవించి తీరవలయును. అజ్ఞానము

వల్ల చేసినపాపమునకు ప్రాయశ్చిత్తమున్నదిగాని తెలిసి చేసిన దానికి లేదు.

నీవు విశ్వరూపుని పురోహితునిగా వరించి బ్రాహ్మణుండని కూడ ఆలోచింపక నతనిని చంపితివి. బ్రహ్మహత్యవలన సంభవించిన పాపమును నీవామరణాంతము జలముననుండి యనుభవింపవలెను. దీనికి ప్రాయశ్చిత్తము లేదు. ఈ ఘోర పాపమువలన నీవుచేసిన నూరశ్వమేధయాగముల ఫలము పోయినది. రంధ్రముగల కుండలోని నీళ్లు కారిపోయినట్లుపాపాత్ముల పుణ్యములు క్షీణించును. కావున నీకు ప్రతీకారములేదు.'' అనిబృహస్పతి చెప్పఁగావిని దుఃఖించి యింద్రుఁడు గురు వుతో నిట్లు చెప్పెను. "ఓగురువర్యా! నే నొనర్చిన పాపఫలము నేను పొందుచున్నాను. రాజ్యమరాజకముగానున్నది. దేవతలు, సాధువులు బాధపడుచున్నారు. కావునమీరు వీరంద ఱితో నమరావతికి బోయి మీయిష్టానుసారమొకరిని యింద్రునిగా ప్రతిష్ఠచేయుఁడు.'' అనఁగా బృహస్పతి దేవతలతోను, ఋషులతోను కలిసిపోయి శచీదేవితో నింద్రునివృత్తాంత మంతయుచెప్పి రాజ్యమెట్లుజరుగునని యాలోచించు సమయమున దేవర్షియైన నారదమహాముని యచ్చటికి విచ్చేసెను. ఆయన కందఱుకలిసియర్ఘ్యపాద్యాదిసత్కారములుచేయఁగాసంతసించి యాఋషి దేవతలనుజూచి ఇట్లనెను. "మీరందఱొకచోట కూడుటకు కారణమేమి?'' అని యడుగఁగా వారాయనతో దేవేంద్రుని వృత్తాంతమునవిస్తరముగాజెప్పి క్రొత్తయింద్రుని నెంచుకొనుట కాలోచించుచున్నామనిరి. అదివిని నహుషుని యభిషేకింపుఁడని యాయనచెప్పెను. అప్పుడు దేవతలు వెంటనే

భూలోకమునకు వెళ్ళి నహుషుని యమరావతికి తీసికొనిపోయి యింద్రుని సింహాసనమున ప్రతిష్ఠించి గొప్పయుత్సవము చేసిరి. ఋషులు, దేవతలు, నందఋాయనకు మర్యాదచేయుచుండిరి. ఇట్లుండ పరమ సంతోషముతో నున్న నహుషుఁ డొక రోజున బృహస్పతిని జూచి శచీదేవి తన యొద్దకురాకుండు టకు కారణమేమి ? అమెను వెంటనేతీసికొనిరమ్మని చెప్పఁగా నా దేవగురువు తత్ క్షణమే యామెయొద్దకుబోయిచెప్పెను. ఆ మాటలువిని శచీదేవి యిట్లనెను. "ఓ గురువర్యా ఈ క్రొత్త యింద్రుఁడు తొంబదితొమ్మిది యశ్వమేధములనే జేసెను. నూఱుచేసినగదా శతక్రతుఁడగును. అప్పుడుగదా నేనాయనకు పత్నియగుదును. ఇట్టియనుచితపుమాట తమముఖమునుండి యెట్లువచ్చినది? నహుషుఁడు నన్నుపొందుట కర్హుఁడుకాఁడు. అయిన నింకొకమాట చెప్పెదను. ఆయన జ్ఞానహీనుఁడై పరస్త్రీ నయిన నన్ను 'పొందవలెనన్న యనుచితమైన వాహనముపైని వారు నాయొద్దకు వచ్చినయెడల నాకభ్యంతర ముండదని వారితో చెప్పుఁడు" అనఁగా విని బృహస్పతి నహుషుని యొద్దకుఁబోయి యామె చెప్పిన సంగతులు చెప్పెను. ఆ మాటలు విని సంతసించి తగిన విమానమేదగునో యని యాలోచించి సప్త మహర్షులను తన సవారి మోయుటకు నిశ్చయించెను. వారెవరనఁగా కశ్యపుఁడు, అత్రి, భరద్వా జుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు అగస్త్యుఁడను వారిని పిలిపించి తానుసవారిలో కూర్చొని మోయుటకు విని యోగించెను. వారుమోసికొని పోవుచుండగా "సర్పసర్ప"అని తొందరపెట్టినందున వారిలో నొకఁడైన యగస్త్యుఁడు నహు

షుని జూచి యిట్లనెను. "ఓ మదోన్మత్తుఁడవైన నహుషా! కొండచిలువ వవుదువుగాక!" అని శపింపఁగానే పెద్ద కొండచిలువయై భూమిపైపడెను. ఇంద్రుడు లేనందున తిరిగి అరాజక బాధలు కలిగెను. చూచితిరా! నహుషునికి ఇంద్రపదవి రాఁగానే గర్వించి మహాత్ములైన సప్తఋషులను అవమానించి తన పూర్వపుణ్యము లన్నియు నశింపఁజేసికొని కొండచిలువయై మహారణ్యమునఁ బడెను.

నీచులకు ఉన్నతపదవిలభించిన గర్వించిదానిని నిలుపుకొనలేరు.

యయాతి యింద్రుఁడగుట

పిమ్మట దేవతలు, బృహస్పతి, నారదుఁడు ఆలోచించి యయాతిని పిలిచి తీసికొనివెళ్ళి ఇంద్రపదవి యొసంగిరి. అందుకు యయాతి మిక్కిలి సంతోషించెను. అప్పుడు మునులతనిని జూచి తమరే మహాపుణ్యములు చేసిరో యీ మహదైశ్వర్య మనుభవించుచున్నారు. అనఁగా విని తాను చేసిన పుణ్యకర్మములనేకములు కలవని యన్నియు వారితో చెప్పెను. తానుచేసిన పుణ్యకార్యములు తానే చెప్పుకొనుటవలన వాని ఫలము వెంటనే నశించి యయాతి స్వర్గమునుండి దేవతలు చూచుచుండఁగా క్రింద భూలోకమున పడెను.

నీతి:—తనకు తానే పొగడుకొనఁ గూడదు.

ఇంద్రుఁడు బ్రహ్మహత్యచే విడువఁబడుట

తరువాత స్వర్గలోక మెప్పటివలె నరాజకమగుట చూచి దేవతలు బృహస్పతి శచీదేవియుకలిసి యాలోచించుచుండఁగా శచి వారిని చూచి మీరు బాగుగ విచారింపుఁడు. నాభర్త

మీయందఱకును తన పురోహితుఁడైన విశ్వరూపుని చంపి బ్రహ్మహత్యాపాపము నొంది యింతకాలము దనుక దుఃఖమనుభవించెను. ఈ బృహస్పతిని నాయింద్రుఁడవమానించుటయే యిందులకు కారణము. కావున వీరలింద్రునియెడల నభిముఖులైన నాతనిపాపమును పరిహరింపఁగలరు. అనిబృహస్పతిని చూచి "ఓ గురువర్యా! మీరు మాదంపతులయందు కోపము చాలింపుఁడు. మీకు మంచి పుత్త్రుఁడుకలిగియతఁడు మీకంటె గొప్పపండితుఁడై మీరు చేయుచున్న కార్యములన్నియు మీరు జీవించియుండగానే తాను సహాయము చేయుటకు సమర్థుఁడగునట్లు వరమిచ్చుచున్నాను. కావున మీరీ దేవతలను తోడుకొనివెళ్ళి యింద్రుని పాతకమును పరిహరించియాయనను తెచ్చియెప్పటివలె నింద్రపదవి యొసఁగుఁడు. మీకనేకనమస్కారములు చేయుచున్నాను," అనిచెప్పఁగానే బృహస్పతి దేవతలతో బయలుదేరి యింద్రుఁడున్నహ్రదమునొద్దకుబోయివారులింద్రుని బిలువఁగా నతఁడు జలమధ్యమునుండిలేచి వారితో నిట్లనియె. "ఓగురువర్యా! దేవతలారా! ఏలమీరిటువచ్చితిరి. నేనుజలములో నుండి తపస్సుచేసికొనుచున్నాను." అనఁగా బృహస్పతిమెల్లగా నతనితోనిట్లు చెప్పెను. "దేవరాజా! నీవు పరోపకారము నిమిత్తము విశ్వరూపుని చంపితివి. అతఁడు యజ్ఞమునందు దేవతలకు ఋషులకు, కీడుచేసెను. వాని చంపుటవలన నీవువారికి మేలు చేసితివి. అందువలన కొంతపుణ్యము కలిగినది. అందువలన నీపట్టణమునకు నిన్ను తీసికొనిపోవుటకై మేమిచ్చుటికి వచ్చితిమి" అనఁగా విని బ్రహ్మహత్య మూర్తీభవించి (అనఁగా భయంకరమగు మనుష్యాకారమును పొంది నిలిచి)

10—(1)

యిట్లనెను. "నేనింద్రుని యాక్రమించుకొని యున్నాను. ఆయనను మీరు తీసికొనిపోయిన నేనెట్లుందును." అనఁగావిని బృహస్పతి దానితో "నీవుండుటకు తావు నేను చూపుదును." అని దానిని నాలుగు భాగములుచేసి యొకభాగము భూమి యందు రజోరూపమునను, రెండవది జలమందు ఫేన రూపమునను, మూఁడవది వృక్షములందు జిగురురూపమునను, నాలుగవది స్త్రీలయందు రజోరూపముననుండునట్లు పంచెను. అప్పుడు భూమి, జలము, వృక్షములు, స్త్రీలు, ఆ పాపము భరింపలేమని మొఱ్ఱవెట్టగా, ద్వాపరమున శ్రీహరి కృష్ణావ తారమున నవతరించి తన పాపమును హరింపఁజేయుననియు భూదేవితోను, నన్నిటిని పవిత్రముచేయు శక్తి కలుగునని జలముతోను, నరకబడినను ననేకశాఖలుగలగి వృద్ధినొందు శక్తి కలుగునని వృక్షములతోను, రజోదర్శనము వలన వ్యభి చారదోషము పోవునని స్త్రీలతోను బృహస్పతి సెలవిచ్చెను. ఇట్లు ఇంద్రుని బ్రహ్మహత్యాపాపము పంచిపెట్టి యమరావతికి తీసికొనిపోయి యెప్పటివలె సింహాసనముపై ప్రతిష్ఠించెను. దేవర్షి యింద్రుని నతనిభార్యయైన శచీదేవితో కూడ సుధర్మాసనమున నభిషిక్తుని చేసెను. పిమ్మట దిక్పాలకులు. గ్రహములు, నక్షత్రములు, మునులు క్రమప్రకారము వారి విధులను వారు సరిగా చేసికొనుచుండిరి. అరాజకమునందుండు బాధలు మొదలు ముట్ట నశించెను.

## వృత్రాసురుని జన్మము

ఇట్లు తిరిగి పట్టాభిషిక్తుఁడై రాజ్యవిభవము లనుభవించుచున్న యింద్రునిజూచి విశ్వకర్మ తనకుమారుఁడైన విశ్వరూపుని మరణమునకు మిగుల దుఃఖించుచు చేయునది లేక బ్రహ్మను గుఱించి తపస్సుచేయుటకై మందరపర్వతమునకు పోయి చాలకాల మందు ఘోరమయిన తపముచేయఁగా నందుకు తృప్తినొంది బ్రహ్మ యతనికి ప్రత్యక్షమయ్యెను. అప్పు డాచతుర్ముఖుని చూచి విశ్వకర్మ దిగ్గునలేచి ప్రదక్షిణ నమస్కారములు చేసి మిగుల ప్రార్థింపఁగా పితామహుఁ డతనితో నిట్లనెను. "ఓవత్సా ! నీభక్తికి మెచ్చితిని. కోరిన వరమిచ్చెదను వేఁడు" మనఁగా "తాము ! దేవతలకు శత్రువు కాదగిన కుమారుని ప్రసాదింపుము" "తథాస్తు" అని బ్రహ్మ యంతర్థానమయ్యెను. తరువాత కొద్దికాలములో విశ్వకర్మకు పుత్రుఁడుద్భవించెను. వానికి వృత్రాసురుఁడని నామకరణము చేసెను. ఆపిల్లవాఁడు దినమునకు నూఱుబాణముల యెత్తు పెరుగుచుండెను.

## వృత్రాసురుఁడు విజృంభించుట

పూర్వము జగన్మోహినీ రూపమున శ్రీహరియమృతము పంచిన పిమ్మట దేవాసురయుద్ధమున దైత్యులు చాలమంది నశించిరి. వారిలో కొందఱుమాత్రము శుక్రాచార్యుని మృత సంజీవనీ విద్యాప్రభావమున బ్రతికిరి. మరికొందఱు వారివలన పుట్టిరి. వీరందఱును పాతాళమున దాఁగియుండిరి. ఇదివఱకు వారికి తగిన మొనగాడు లేకుండెను. కావున వారొక మూల

నణంగియుండిరి. ఇప్పుడువారు వృత్రునితో చేరిరి. వారి సహాయమున నితఁడు విజృంభించి దేవతలను, ఋషులను, మునులను, బాధించుట కారంభించెను.

అంతకంతకు వారి బాధలధికమగుటచే దేవతలు, భరింపఁజాలక నింద్రునితో కలిసి బ్రహ్మయొద్దకుఁ బోయిఁ చెప్పుకొనఁగా నాపితామహుఁడు వారిని చూచి యిట్లనెను. "ఓ యింద్రాది దేవతలారా! వినుండు. వృత్రాసురుఁడు సామాన్యమాత్రుఁడు కాఁడు. వానిని చంపుట కష్టసాధ్యము గాని సులభముకాదు. కావున నేనొకయుపాయము చెప్పెదను. మీరు దధీచిమహామునియొద్దకు బోయి యాయనను ప్రార్థించి యతని యస్థికలను సంపాదింపుఁడు. దానితో చేయఁబడిన యాయుధములచేకాని వాఁడు మృతినొందఁడు" అనఁగా వినియింద్రుఁడు భయపడెను. "ఓపితామహా! ఆయన యెముకలు మాకెట్లు లభించును? వారు ప్రాణత్యాగము చేయక దొరకవుగదా! ఆయన ప్రాణమునే త్యజించునట్లు చేసిన యెముకలతో పాటు బ్రహ్మహత్యాపాతకముకూడ నాకు లభించును. దాని బాధలు మొన్న మొన్నటివఱకనుభవించుచునుంటినిగాదా! కావున నాకు భయమగుచున్నది. నామేను వణఁకుచున్నది. అబ్బా! ఆ పాపము మఱిచేయఁజాలను" అనఁగా విని బ్రహ్మ వాని భయమును పోగొట్టెను. "ఓయింద్రా వినుము. నీవు భయపడకుము. ఆ మహాఋషి చాల గొప్పవాఁడు. పరమశాంతుఁడు. నీవాయనయొద్దకుఁబోయి వృత్రుని వలన కలుగు బాధలుచెప్పి వానిని వధించుటకు నేను చెప్పిన యుపాయముచెప్పి వినయముతో ప్రార్థింపుము.

ఆయన తనయస్థులు తప్పక నిచ్చును. అందువలననీకుపాపము కలుగదు."

దధీచి మహాముని యొక్క దాతృత్వము

అని బ్రహ్మ చెప్పఁగా విని, యింద్రాది దేవతలు దధీచి మహాముని యాశ్రమమునకుఁబోయిరి. అది మిగుల విశాలమై యనేకవిధములగు ఫలపుష్పములతో నిండియుండెను. అందున్న పలువిధములగు మృగములు పరస్పరమైత్రితో కలిసి మెలసి యుండెను. అది ఎట్లనఁగా పరస్పర విరోధముగలపిల్లులు, యెలుకలు, ముంగిసలు, పాములు, పులులు, మేకలు, ఏనుఁగులు, సింహములు, కలిసి స్వేచ్ఛగా నాడుకొనుచుండెను. ఆముని యెంతగొప్పవాఁడో యిందువలనస్పష్టమగుచున్నదీ. తపస్సేయన్నిటి కన్నమిన్న- యేలనంటేని నిర్గమింపజాలని దుర్గములనైన సమ్మార్గింపనోపును. తరింపరాని పారావారమునైన దాటవచ్చును. పొందరాని యెట్టి ఫలప్రాప్తులనైన నందుకొనవచ్చును. కావున తపోధనమునకు సమానమగునది వేరొండు లేదు. ప్రతివ్యక్తియు సమున్నతపదవి నందవలెనంటే స్త్రీపురుషులెల్లరునట్లుకర్తవ్యమునకుగడంగవలయును. విపులతపోనిష్టాత్ముడగు తన్మునిపుంగవవల్లజని తపోమహిమదెలిసి తన్నికటంబున కరుదెంచి దేవళ్ళపిండు కన్నారనిరీక్షించి యాశ్చర్యపడుచుపోయి నిజాశ్రమమున కూర్చుండి తపస్సుచేసికొనుచు సూర్యునివలె ప్రకాశించుచున్న యాదధీచి మహామునినిజూచి ప్రదక్షిణపూర్వకముగా సాష్టాంగనమస్కారములు చేసిరి.

దేవతలు:—"ఓ మునిసార్వభౌమా! మీరు ముల్లోక

ములలోను ప్రసిద్ధినొందిన దాతలని మీదర్శనార్థము దేవతల మందఱమిటువచ్చితిమి.”

దధీచి:—మీకు కుశలమా? మీరు వచ్చినపనియేమి? సంశయింపక చెప్పుఁడు. నేను దానిని తప్పక చేయుదును. ఆలస్యము చేయక చెప్పుఁడు.”

దేవతలు:—“ఓ స్వామీ! శత్రుభయముచే మేమిటకు మిమ్ములను దర్శింపవచ్చితిమి. మీరు మమ్ము రక్షింపవలెను. బ్రహ్మపంపున వచ్చితిమి. మేమడుగునది యిచ్చి మమ్ము కాపాడవలెను.

దధీచి:—మీ కేమి కావలయునో త్వరగా చెప్పుఁడు.

దేవతలు:—వృత్రాసురుని గుఱించి తమరు వినియే యుందురు.

దధీచి:—ఔను వినియున్నాను. వాఁడుమహాక్రూరుఁడు. బలవంతుఁడు.

దేవతలు:— వాని బాధలవలన మేము స్వర్గమున నుండఁజాలక బ్రహ్మయొద్దకుఁబోయి చెప్పుకొనఁగా నాశతధృతి మీయొద్దకు మమ్ము నంపెను.

దధీచి:—సరే! మీకు కావలసినదేమో చెప్పుడు.

దేవతలు:—అయ్యా! ఆ తులువ రక్కసుఁడు మీ యెముకలతో చేయఁబడిన యాయుధములచేగాని చావడఁట. కావున మీ సన్నిధికి వచ్చితిమి.

దధీచి:—సరే! కొంచెముసేపు తాళుఁడు. మీరు కోరినవి లభించును. అనివారితో చెప్పి తన ప్రియపత్నిని జూచి,

యామెత్తో మహాముని యిట్లు చెప్పెను. సువర్చలా ! దేవతలు వృత్రునివలన చాలబాధలుపడి నాయొద్దకు వచ్చిరి. వానిని చంపుటకు నాయెముకలు వారికి కావలెనట. కావున నేను దేహము చాలించుచున్నాను. సమాధియోగమువలన బ్రహ్మలోకమునకు పోవుచున్నాను. నేను పోయిన పిమ్మట నచ్చట నీవు నన్ను చేరగలవు వృథాగా విచారింపక యాశ్రమము లోనికిపోయి యందుండుము, అని చెప్పి దధీచిమహాముని సమాధిలో ప్రవేశించి కళేబరమును విడచి బ్రహ్మలోకమును పొందెను. ఈయన మునులలో శ్రేష్ఠుడు. శివునికి ప్రియభక్తుడు. శివమంత్రోపాసకుడు. కావున శివమయుడు పరోపకారులలో శ్రేష్ఠుడు. ముల్లోకములలో నెల్ల నుపకృతికి నీ మహాభాగుడే.

నీతి:—పరోపకారబుద్ధి దీనివలన మనము నేర్చుకొనవలెను.

## ఇంద్రుడు వృత్రునితో యుద్ధము చేయుట

దధీచిమహాముని దేహమును విడచిన పిమ్మట ఇంద్రుడు సురభిని స్మరింపగా అదివెంటనే అచ్చటసిద్ధమయ్యెను. దానిని జూచి ఇంద్రుడు ఆముని దేహమును నాకి ఎముకలు మాత్రము మిగిలియుండునట్లు చేయుమనెను. అది అట్లేచేసెను. అప్పుడు అతనియొక్క వెన్నెముకలతో వజ్రాయుధమును, శిరస్సునందలి యెముకతో బ్రహ్మశిరోనామకమును తక్కిన ఎముకలతో ఇతరాయుధములను తయారుచేయించెను. ఆమహాముని భార్యయగు సువర్చల తనకు వైధవ్యదుఃఖమును కలి

గించినందుకు కోపించి దేవతలకు సంతానము లేకుండునట్లు శపించెను. తరువాత నామె యశ్వత్థ వృక్షము మొదటికి బోయి తానదివఱకే గర్భము ధరించియుండెను. గాన నవమాసములు నిండినందున నొక కుమారుని గనెను. ఆ పిల్లవాఁడు శివునివలె తేజశ్శాలియై యుండెను. వానినిజూచి నాయనా! నీవిచ్చటనే యుండి సుఖముగా జీవించుచునందరికి మేలుచేయుచు వారికోరికలు సఫలము చేయుచుండుమని చెప్పి వానికి పిప్పలాదుఁడని పేరు పెట్టితాను పతియొద్దకు బోయెను. ఇటు లాయుధములు సిద్ధపఱచుకొన్న యింద్రాది దేవతలుయుద్ధసన్నద్ధులై వృత్రాసురునిపైకి పోయిరి. వారితో ముందుగా బృహస్పతి కూడ పోయెను. అప్పుడు దేవతలకు రాక్షసులకు ఘోరమయినయుద్ధమయ్యెను. అనేక రాక్షసులు చనిపోయిరి. వృత్రుని మంత్రియైన నముచిపై యింద్రుఁడు వజ్రము, శూలము మొదలగు వివిధాయుధములు ప్రయోగించినను నవి వృధాయగుటచూచి, విచారించుచుండెను. అంతట నాకాశవాణి యింద్రునితోనిట్లు చెప్పెను. "ఓ ఇంద్రా! వీఁడు ఆయుధములచే చావడు. సముద్రపుతీరముననున్న నురుగుతో కొట్టినవెంటనే మృతినొందును. నావుడువిని నురుగు తెచ్చి కొట్టగా వెంటనే వాఁడు చచ్చెను. అందుకు సంతసించి యింద్రుఁడు వృత్రుని జూచి వానిపై బడి యుద్ధముచేయ నారభించెను. కాని వాఁడుసులభసాధ్యుఁడుకాకుండెను. వానినిజూచి దేవతలుభయపడుచుండిరి. ఇంద్రాది యష్టదిక్పాలకులు వానితో ఘోరయుద్ధము చేయగా రాక్షసులు వెనుదిరిగి పారఁజొచ్చిరి. వారిని పురికొల్పి మరలించి వృత్రుఁడు విక్రమించి యుద్ధము చేయుచుండెను.

దానిని చూచిభయపడి యింద్రుడు తన గురువైన బృహస్ప తిని చూచి వీనిబలము హెచ్చుగా నున్నది. సంహారించుట యెట్లులనియడుగఁగా "ఓ దేవరాజా! భయపడకుము. నేనొక వ్రతము నుపదేశించెదను. దానిని భక్తి శ్రద్ధలతో చేసిన వీనిని వధించుట సులభమగును. అది సర్వకామ్య ప్రదంబు" అనఁగా విని సహస్రాక్షుఁడు గురునితో నిట్లనెను, "ఓ గురువర్యా! ఆ వ్రతమును దాని జేయు క్రమమును సవిస్తరముగా చెప్పుడు. దానిని తప్పక నాచరించెదను." అనిమిగుల ప్రార్థింపఁగా బృహస్పతి యిట్లు చెప్ప నారంభించెదను.

### ప్రదోషవ్రత విధానము

ఓస్వర్గరాజా! శ్రద్ధతో వినుము. కార్తికమాసమున శుక్ల పక్షమున త్రయోదశి శనివారమగునపుడు మధ్యాహ్న కాల మందుశివునిపూజించువారికి శివుఁడు ప్రసన్నుఁడై యెల్లకోరికలు నెరవేర్చును. అందుకు ఎంతమాత్రము సందేహము లేదు. ఆ పూజ దేవాలయమునగాని, తపోవనమందునగాని, నిర్జన ప్రదేశ మునగాని వనమందుగాని చేయవలెను. లింగమును నిశ్చలమైన భక్తితో పూజింపవలెను. గ్రామములోనున్న దేవాలయమందలి లింగమును పూజించుటకంటె నన్యగ్రామములలోని లింగమును పూజించుటవలన నూఱురెట్లు ఫలముకలుగును. అరణ్యములో లింగమైన దానికి నూఱురెట్లును పర్వతముపైనున్న లింగ మయిన దానికి నూఱురెట్లును తపోవనమందలి లింగమయిన పదివేలరెట్లును ఫలమధికము. ఆ దినమున ప్రాతస్నానము చేయవలయును. నూతియొద్ద స్నానముకంటె చెఱువులోను

నదులలోను మహానదులలోను గంగయందును స్నానము చేయుట యొకదానికంటె నొకటి నూఱేసిరెట్లు హెచ్చు ఫలము నిచ్చును. ఆ ప్రకారము స్నానముచేసి నిత్యకర్మ చేసి కొని మధ్యాహ్నమున లింగమునొద్దజేరి షోడశోపచారము లతో పూజింపవలయును. స్నానము చేయించునప్పుడు పంచా మృతములచేత నారికేళములచేతను నమక చమకములతో నభిషేకము చేయ వలయును. వస్త్రయుగ్మము యజ్ఞోపవీతము మంచి సువాసనగల చందనము నర్పించి, గన్నేరు, జిల్లేడు, తుమ్మి, మొదలగు పుష్పములచేత మారేడు, తులసి, మున్నగు దళములచేతను పూజించి గోఘృతము నిండుగపోసిన దీపములు సమర్పించి నైవేద్యము, తాంబూలము, నీరాజనము మంత్రపుష్పముసమర్పించిన పైనినూట ఎనిమిదిప్రదక్షిణములు జేసి యష్టోత్తర శతనామము గాని సహస్రనామముగాని పారా యణ చేయవలయును. ఇట్లు నీవు వ్రతమాచరించిన నీశ్వరుఁడు సంతసించి ఎల్లకోరికలు నెరవేర్చును. అప్పుడు నీవు శత్రువును తప్పక జయింపఁగలవు. లేకున్న వీనిని జంపుట యసాధ్యము.

### వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతము

ఆ మాటలు విని ఇంద్రుఁడు గురువును చూచియిట్లడి గెను. "ఓస్వామీ! వీఁడు రాక్షసుఁడై యుండియు నిట్టిబలపరాక్ర మములు గలవాఁడగుటకు కారణమేమి?" అనఁగా బృహస్పతి యిట్లు చెప్పెను. "ఓ దేవరాజా! వీఁడు పూర్వము చిత్ర రథుఁడు అను గంధర్వుఁడు. గంధమాదన పర్వతముననుండెను. వాఁడు మిక్కిలి భక్తుఁడగుటవలన శివుఁడు వీనికి స్వేచ్ఛగా

మనగల మనోహరమగు విమానమును ఇచ్చెను. దానినెక్కి ఇష్టానుసారముగ ముల్లోకములయందు సంచరించుచుండెను. వాఁడు ఒకదినము తిరిగి తిరిగి కైలాసమునకు పోయి సభలో కూర్చుండియున్న ఈశ్వరుని దర్శింపఁబోయెను. అప్పుడు శ్రీ సదాశివుఁడు ప్రమథ గణసహితుండై తన నిజాంకమున పార్వతినికూర్చుండ బెట్టుకొని యుండెను. అదిచూచి వాఁడు ఈశ్వరునితో ఇట్లనెను, "ఓ సర్వేశ్వరా! మేము పామరులము విషయాసక్తులము. అయినను మంత్రులతో కార్యాలోచనము జేయువేళ స్త్రీలను చేరరానియ్యము. మీ రన్ననో సర్వజ్ఞులు. తమకు తెలియని ధర్మములు లేవుగదా! ఇంత స్త్రీలోలతఏమి? అనఁగా విని ఈశ్వరుఁడు చిఱునవ్వు నవ్వి యూరకుండెను. కానిపార్వతి కోపించి వానివైపు చురచురఁజూచి, ఓమూర్ఖుఁడా! నీవు మమ్ము పరిహసించుచున్నావు. సాధువులను వృథాగా అపహాసించువారు తప్పక దానిఫలము పొందుదురు. ఈసభ యందున్న మహామునులకన్న నీవు గొప్పవాఁడవా? ఈసంసారములో నీవుమాత్రమే జ్ఞానివా? నిన్ను శపించుచున్నాను. నీవు రాక్షసుఁడవై దేవతలతోగాని, జ్ఞానులతోగానికలిసియుండక పోదువుగాక! ఆ మాటలు చెవినిఁపడఁగానే, వాఁడు తల క్రిందుగా భూలోకమునఁబడి యింద్రునిపై కోపముచే బ్రహ్మకొఱకు తపస్సుచేసి వరముపొందిన విశ్వకర్మకు కుమారుఁడై పుట్టెను. ఆ చిత్రరథుఁడే యీ వృత్రుఁడై జన్మించెను. ఇట్లు పుట్టి విశేష తపస్సుచేసి తిరిగి యీశ్వరునివలన వరమును పొందెను. కావున వీఁడు సామాన్యుఁడుకాఁడు. వానికంటె హెచ్చు భక్తుఁడవు. నీవయితేనే తప్ప నీవు వానిని చంపలేవు-

కాఁబట్టి ప్రదోషవ్రతము యథావిధిగాఁ జేయుము. ఆ లింగ పూజన వ్రత ముద్యాపనచేయువిధము వినుము.

ప్రదోషవ్రతోద్యాపన క్రమము

వెండితోయెద్దును, సువర్ణముతోఁగాని, తామ్రముతోఁగాని శివుని గిరిజను చేయించవలయును. ఆ శివుని విగ్రహముకు మూఁడు నేత్రములు, నయిదుముఖములు, పదిభుజములు నుండవలయును. ఆయెద్దుమీఁదను తగిన యాసనమువేసి యుమామహేశ్వరుల విగ్రహముల నందు గూర్చుండఁబెట్టి పురుష సూక్త విధానమున పూజించి యర్ఘ్యమిచ్చి యారాత్రి నృత్యగీతాదులతో జాగరణము చేసి మరునాఁడు తిరుగ పూజించిభక్ష్య,భోజ్య లేహ్యాపానీయములతో మహానివేదనము చేసి యావిగ్రహమును వాహనముతో కూడ బ్రాహ్మణునకు దాన మియ్య వలయును. మంటపముపైని ప్రథమ గణములను ముందుగా నావాహనముచేసి, పిమ్మట పై ప్రకారము శివుని గిరిజను వృషభముపై నుంచి పూజింపవలెను. మంటపదానము చేసి బంధువులు, స్నేహితులు, బ్రాహ్మణులు, వీరందఱితో-భుజింపవలయును. అనఁగా విని యింద్రుఁ డా వ్రతము చేయుటకు నిజలోకమునకు పోయియున్నందున, వృత్రుఁడు మహేంద్రుఁడు వీఁగి పారిపోయెనని తలంచి సంతోషించెను.

ఇంద్రుఁడు వృత్రుని సంహరించుట

బృహస్పతి చెప్పిన ప్రకారము ప్రదోషవ్రతము చేసి తృప్తిపొంది, దేవసైన్యమును వెంటతీసికొని యింద్రుఁడు వృత్రునిపై యుద్ధసన్నాహముతో వెళ్లెను. వృత్రుఁడును తన బల

ములను చేరఁబిలిచి సంగ్రామమునకు బయలువెడలెను. అప్పుడు వారికి ఘోరయుద్ధమయ్యెను. రాత్రికాలమున నీ సంగ్రామము జరిగినందున రాక్షసుల బలము హెచ్చుగానుండెను. వృత్రుఁడు గొప్ప గర్జనచేసి సురపతి కెదురేగి నోరుతెరచి యిందుని మ్రింగివేసెను. అదిచూచి దేవతలు మొఱలిడుచు పోయి బ్రహ్మతో చెప్పఁగా బ్రహ్మ యీశ్వరుని మిక్కిలి స్తుతించెను. అందుకు శివుఁడు సంతసించెను. పిమ్మట కొద్దికాలములో వృత్రుని కడపు చీల్చుకొని యింద్రుఁడు పైకివచ్చెను. అప్పుడు దేవతలందఱుకోలాహలములను చేయుచు దుందుభులు మ్రోగించి జయ జయ ధ్వనులుచేసి నిజలోకమునకు పోయి సుఖముగా ఉండిరి. ఈతి బాధలన్నియు నివర్తింప దేశము సుఖముగా నుండెను. వృత్రుని మృతశరీరము పడినచోటు పాపభూమి యగుటఁచేత దానికి మాల్వాదేశమని పేరు.

### రాక్షసులు బలితో స్వర్గమాక్రమించుట

వృత్రుఁడు చనిపోయిన పిమ్మట రాక్షసులు బలిచక్రవర్తితో కలిసి దేవలోకముపై బడఁగా దేవత లాకస్మికముగ వచ్చిన రాక్షసులను జూచి భయపడి యేమిచేయుటకు తోచక బృహస్పతి యొద్దకుఁబోయి యుపాయము చెప్పుఁడని యడుగఁగా వాచస్పతి బాగుగ నాలోచించి "ఈ అమరావతీ పురము విడిచి పారిపోదము రండు" అని చెప్పెను. అప్పుడింద్రుఁడు మొదలగు దేవతలు తమ కుటుంబములతో పారిపోయిరి. ఇంద్రుఁడు నెమిలి, యముఁడు కాకి, యగ్నిదేవుఁడు కపోతము నిట్లందఱు నన్నిరూపములుదాల్చి కశ్యపుని యాశ్ర

మమును చేరి తమతల్లియైన యదితిని దర్శించి యిట్లనిరి. "అమ్మా! రాక్షసుల బాధ పడలేక మాలోకమును విడచి యిట వచ్చితిమి." అనఁగా విని యామె మిగుల దుఃఖించి తన భర్త యైన కశ్యపబ్రహ్మ యొద్దకుబోయి తనకొమాళ్ళు పడుచున్న కష్టముల జెప్పఁగా విని యిట్లనెను. "ప్రాణ నాయకీ! రాక్షసులు తమ తపోబలముచేత నంత పరాక్రమ వంతులైరి. దేవతలుకూడ తపస్సు చేసిన వారిని యోడింపఁ గలుగుదురు. ఇంతేకాక వారికి సహాయముగా భృగుమహా ముని వారి పక్షమున నున్నాఁడు. నేనుపదేశించు ప్రకారము నీవొక వ్రతమనుష్ఠించిన నీకొమరులుయెప్పటియట్లు తమ లోక మున నిశ్చింతగా నుందురు. అది యేమనఁగా భాద్రపదశుద్ధ దశమినాఁడు చప్పిడి యన్నము (అనఁగా నుప్పువెయ్యని పదార్థ ములతో) నొకసారి భోజనముచేసి యేకాదశి దినమున నిరా హారియై యుండి ద్వాదశినాఁడు బంధుమిత్రులతో ద్వాదశి యుండగా భుజింపవలయును. ఇట్లు ప్రతిమాసమున శుక్లపక్ష మున నొకసంవత్సరము చేసిన శ్రీమహావిష్ణువు నీయందు కరు ణించి దర్శన మొసంగును. అప్పుడు నీకోరిక లన్నియును నెరవేరును" అని కశ్యపుఁడు చెప్పఁగా నదితి యట్లుచేసెను. సంవత్సరము పూర్తికాఁగా శ్రీహరి యామెకు ప్రత్యక్ష మయ్యెను. అప్పు డదితికశ్యపు లిద్దఱును శ్రీహరిని బహుస్తోత్ర ములుచేసి తమపుత్త్రులగు దేవతలు స్వర్గమున స్థిరముగా నుండునట్లు చేయుమని మిక్కిలి ప్రార్థింపఁగా శ్రీహరి తన గదను బిలిచి "ఓగదా! నీవుత్వరగాబోయి బలిని నశింపఁజేసిరమ్ము" అనఁగా తనకంతశక్తిలేదని గద చెప్పెను. పిమ్మట చక్రమును

బిలిచి యామాటలే చెప్పఁగా నదియు నట్లే యనెను. అదివిని యాశ్చర్యపడి కొంత సేపాలోచించుచుండఁగా నదితి శ్రీహరితో నిట్లనెను. "ఓజగదీశ్వరా! ఆపని మఱియెవరును చేయఁజాలరు. నీవే నాగర్భమున నవతరించి దేవతలకు రాక్షసులబాధ లేకుండచేయుము" అని వేడుకొనెను. "సరే" యని శ్రీహరి యంతర్ధాన మొంది పిమ్మట వామనావతారము నొంది బలి యజ్ఞముకుఁబోయి మూఁడడుగుల దాన మడిగిపుచ్చుకొని ముల్లోకముల నాక్రమించి యింద్రునికిచ్చి, బలిని పాతాళమున కణగ ద్రొక్కెను.

## బలిచక్రవర్తియొక్క పూర్వజన్మ చరిత్ర

దేవతలిట్లు కశ్యపుని యింటికి బోఁగా అమరావతిలో జొచ్చిన దేవత లేమిచేసిరని శౌనకాది మునులడుగఁగా వారికి సూతుఁడిట్లు చెప్పెను. "ఓ ఋషులారా! వినుండు. అట్టు లింద్రాదులు పక్షిరూపులై పారిపోగా వారికొఱకు రాక్షసులు వెదకి, కానరానందున పట్టణమాక్రమించుకొనిరి. బలియింద్రుని సింహాసనమున నభిషిక్తుఁడై దాన ధర్మములు చేయుచుండెను. అనఁగా విని ఋషు లిట్లనిరి. "ఓపౌరాణికోత్తమా! ఇదివఱ కింద్రుఁడెప్పుడును దానధర్మములు చేయుట వినలేదే! బలి యింద్రపదవినొంది దానములేల చేయుచుండెను?" అని యడుగఁగా సూతుఁడిట్లనెను. "అదివాని పూర్వజన్మవాసనవలన కలిగినది. అదియెట్లనఁగా పూర్వమొకమహాపాపి యుండెను. వాఁడు చేయని పాపములు లేవు. దేవ బ్రాహ్మణనింద, పర దార పరత, పరద్రవ్యాపహారణము మొదలగుదుష్కార్యములు

చేయుచుండువాఁడు, వాఁడొక రోజున చోరత్వము వలన కొంత ధనము సంపాదించి కొన్ని సుగంధ ద్రవ్యములు, పుష్పములు, తాంబూలము, కొని చేతులో నుంచుకొనిరాత్రి వేశ్యయింటికి పోవుచు చీఁకటిచే మార్గమున కాలికి రాయితగిలి పడిమూర్ఛనొంది కొంతసేపటికి తెలివొంది లేచి బ్రతికినందుకు సంతసించి దేవుని ధ్యానించుచు దరినున్న లింగముపై యా తాంబూలాదులు పడవేసి నమస్కరించెను. తరువాత కొద్ది కాలములో నతఁడు చనిపోగా యమదూత లతనిని తీసికొని పోయి ధర్మరాజు సభలో నిలువఁబెట్టిరి. అప్పుడు యముఁడు చిత్రగుప్తులనుజూచివాని పాపపుణ్యములు చెప్పమనఁగా వారి ట్లనిరి. "అయ్యా! ఇతడనేకపాపములు చేసెనుగాని, గొప్ప పుణ్యమొకటి చేసెను. అదియేమనఁగా సుగంధ ద్రవ్యములు, పుష్పములు, తాంబూలము శివునికర్పించెను." అనిచెప్పఁగా యముఁడు "ఇది గొప్పపుణ్యకార్యము. ఇందుకితఁడు మూఁడు ఘడియలు ఇంద్రుని సింహాసనముపై కూర్చుండి స్వర్గలోకము నందధికారి యగుట హక్కుకలిగినది." అని చెప్పి అతనిని విమానముపై నింద్రలోకమునకు తీసికొనిపోయి యింద్రాధి పత్యమునిప్పించెను. ఆకాలములో నైరావతము నుచ్చైశ్శ్రవ మును, కామధేనువును, కల్పవృక్షమును, మఱికొన్ని విలువ గల పదార్థములునచ్చటనున్న యగస్త్యాది మహాఋష్యులకు దానమిచ్చెను. ఆమూఁడుఘడియలు పూర్తికాఁగానే సింహా సనము విడిచి తాను యముని లోకమునకు బోయెను. ఇంద్రుడైరావతము మొదలగు వానిని గానక యముని యొద్దకుబోయి చెప్పఁగాయముఁడువానినిబిలిచి ఘోరనరకము

లనుభవింపుమని చెప్పెను. అదివిని యాతఁడిట్లనెను 'అయ్యా! నేనేమి నేరముచేసితిని మీరు నాకింద్రాధి పత్యమిచ్చితిరి. ఆకాలములో నాపదార్థములు నేను నాయిష్టప్రకారము దానమిచ్చితిని. ఇందు తప్పేమి యనెను. అదివిని యముఁడింద్రునిఁ జూచి దేవరాజా ఆపదార్థములు నీయొద్దనున్న ఋషులకేగదా యిచ్చెను. వారినడిగితీసికొనుము. అనఁగా నింద్రుఁడట్లుచేసెను. ఆపురుషుఁడు మఱియొకజన్మమున ప్రహ్లాదుని కుమారుడైన విరోచనునికి భార్య యయిన సురుచియందు కుమారుఁడై పుట్టెను. అప్పుడతనికి బలియనిపేరుంచిరి. ఈబలితల్లి గర్భమున నుండఁగా నిందుృఁడు విప్రవేషమున విరోచనుని యొద్దకుబోయి యాచింపఁగా "ఏమికావలెను" అనివిరోచనుఁ డడిగెను. కిరీటముతో నీశిరస్సు కావలెనని విప్రుఁడు చెప్పెను. అది వినిన వెంటనేతనతల తానేనరుకుకొని బ్రాహ్మణునికిచ్చెను. పిమ్మట కొద్దికాలములో బలిని ప్రసవించి తల్లి దేహత్యాగము చేసి భర్తను చేరెను. పెద్దవాఁడయిన తరువాత బలి రాక్షసరాజ్యముకు చక్రవర్తి యయ్యెను. కావున పూర్వజన్మ వాసనవలన దాన పరుఁడయ్యెను.

## తారకాసురుని కథ

వృత్రాసురునియొద్ద నముచి, విప్రజిత్తు మొదలగు మంత్రులుండిరి. వారిలో నముచి కుమారుఁడు తారకాసురుఁడు. వృత్రాసురునితో యుద్ధముచేయునపుడు నముచిని యింద్రుఁడు చంపెను. ఆ కారణముచే తారకుడింద్రాది దేవతలను సాధింపవలయునని గొప్ప తపస్సుచేసి బ్రహ్మను

మెప్పించెను. బ్రహ్మ ప్రత్యక్ష మయ్యెను. అప్పుడితఁడాయనను చూచి నమస్కరించి పలువిధముల స్తోత్రములుచేసి తనకు మరణము లేకుండవరమిమ్మని వేడెను. అందుకుచతుర్ముఖుఁడిట్లు చెప్పెను. "ఓ తారకా! అది యసాధ్యము. పుట్టిన ప్రతిజంతువు నకును చావు నిశ్చయము. కావున నదివిడచి మఱియొక వరమడుగుము." అదివిని యింద్రుని సాధించునట్లు వరము పొందెను. పిమ్మట యితఁడు దేవతలను బాధించి వారి రాజ్యము తీసికొనెను దేవతలు బ్రహ్మయొద్దకుఁబోయి తమ బాధలను చెప్పుకొనఁగా తాను వారికి సహాయము చేయలేక వారిని తోడుకొని క్షీరసాగరమందున్న విష్ణువునొద్దకుబోయి వారి యవస్థ చెప్పుకొనఁగా నాయన యేమిచేయవలెనో తెలియక విచారించు సమయమున నాకాశవాణి యిట్లనెను. "తారకుఁడీశ్వర పుత్త్రునివలన గాని చావఁడు" అదివిని "మీరీశ్వరుని ప్రార్థించి యాయన తపము చాలించునట్లును వివాహమాడునట్లును, చేయవలయును." అటు లానర్చువారై దేవతలు మన్మథుని యతని పరివారముతో నీశ్వరసన్నిధి కంపిరి. మన్మథుఁడు బాణములు వేసెను. వానివలన నీశ్వరుని చిత్తము చలించి మన్మథుని భస్మము చేసెను.

## కుమారస్వామి జననము

దక్షునియజ్ఞగుండమున బడి భస్మమైన సతీ దేవి హిమవంతునికి కొమార్తెయై పుట్టెను. కొన్నాళ్ళు పెరిగి పెద్దదయిన తరువాత వివాహమునకు తగిన వయస్సు రాగానే యామె తల్లి దండ్రులామెకు పెండ్లి చేయుటకాలోచింపఁగా

నామె శివుని తప్ప యితరులను వివాహముచేసికొనుట కంగీక రింపలేదు. ఈమె హిమవంతుని కొమార్తె కావున పార్వతి, గిరిజ యను నామములను పొందెను. ఆమె యడవికి పోయి శివుని నిమిత్తము ఘోరమయిన తపస్సు చేయుచుండెను. అంతల కీశ్వరుఁడు నంతసించి బ్రహ్మచారి వేషమున నామె యెదుటకి పోయి యామెమనస్సు పరి శోధింపవలెనని యీశ్వ రుని నిందించుచు ననేక సంగతులు చెప్పెను. ఆమె వాని మాటలు వినక తిరస్కరించి పొమ్మనెను. పిమ్మట కొన్నా ళ్ళకే ఈశ్వరుఁడు తన నిజరూపముతో నామె సన్నిధికి నేగి పెండ్లాడెదనని చెప్పెను. అప్పుడు కొందఱు మహా ఋషులను హిమవంతుని యొద్దకు పంపి ప్రసంగించు మనఁగా వారిరువురకు వివాహము నిశ్చయమయ్యెను. అప్పుడు శివునితో బ్రహ్మ, విష్ణువు, నింద్రాది ముప్పదిమూఁడుకోట్ల దేవతలు హిమవంతునియింటికిపోయి శివునికి పార్వతిని వివా హాము చేయించిరి. పిమ్మట పార్వతితో శివుఁడు కైలాసము నకుఁబోయి చిరకాలము సురతసుఖము లనుభవింపుచుండఁగా కొన్నాళ్ళకు కుమారస్వామి జన్మించెను.

### తారాకాసురునివధ

కుమారస్వామి క్రమక్రమముగా పెరిగి యుక్తవయ స్సును పొందఁగా నింద్రాది దేవతలు శివునియొద్దకు బోయి ప్రార్థించి తారకుని చంపుటకు సెలవడిగి, కుమారుని తమతో పంపుమని ప్రార్థించిరి. సరే యని యుమామహేశ్వరులతనిని దీవించి పంపిరి. అతనిని తమ సైన్యమునకధిపతిగా చేసికొని

దేవత లందఱును, భూలోకమునకు వచ్చి గంగా యమునా నదుల మధ్యనున్న బయలున విడసిరి. పాతాలము నుండి రాక్షసులందఱు నచ్చటకే వెళ్ళి యుద్ధ మారంభించిరి. ఆ రెండు సైన్యము లందలి వీరులు బహుపౌరుషముతో పోరిరి. వీరభద్రుని త్రిశూలముతో తారకాసురుఁడు మూర్ఛ నొందెను. కొంచెము సేపులో లేచి వీరభద్రునిపై శక్తి ప్రయోగించెను. దానినతఁడు సంహరించి శూలమును ప్రయోగింపఁ బోఁగా నారదుఁడు వీరభద్రునికడ్డముపోయి "నీవలన వీఁడు చావఁడు" అనెను. తరువాత నింద్రుఁడు తారకునితో తలపడెను. అప్పుడు తారకుఁడు సింహముపై నెక్కి యుద్ధమారంభించెను. వారిరువురు మహాఘోరయుద్ధము చేయుచుండ శ్రీహరి వలన ప్రేరేపింపఁబడి కుమారస్వామి వానిపైపు పోయి యింద్రుని తప్పించి తాను తారకునితో యుద్ధముచేసిచేసిశక్తి ప్రయోగించి వాని శిరస్సు నరికెను. అప్పుడు యుద్ధభూమి యందు వాని తలయు, మొండెమును కొంతసేపు నాట్యమాడె నఁట. పిమ్మట దేవతలు కుమార విజయోత్సవము చేసిరి. ఈ గొప్ప యుత్సవము ముగిసినపిమ్మట త్రిమూర్తులు, దేవతలును తమతమ నివాసమునకు పోయిరి. ఇంద్రుఁ డెప్పటి వలె తన రాజ్యమును సుఖముగా పాలించుచుండెను.

### ఉమామహేశ్వరులు కలహించుట

తరువాత నొకరోజున పార్వతీ పరమేశ్వరులు కైలాసమున కులాసాగాకూర్చునియున్న సమయమందు వారిని దర్శించుటకు దేవర్షి యయిన నారదుఁ డందుఁ బోయెను. అతనికిఁ

తగిన మర్యాదజేసి వచ్చినపని యేమని యడిగిరి. అప్పుడాయన వారిని మిగుల ప్రశంసించి, మీరుభయులు నాడుట చూడ వలెనని వచ్చితిననెను. ఏమియాటచూడ మీకిష్టమనిపార్వతి యనెను. ఆటలలో చూడదగినది జూదము గదా! అని యాత డనెను. అది విని వారలాయనను సంతోషపెట్టుటకు పందెములువేసి సొగటాలాడుటకారంభించిరి. ఆయాటలలో మొదట శివుఁడుగెల్చి పార్వతిని హేళనచేసెను. రెండవసారి పార్వతి గెలిచినది. కాని యదిసరికాదని శివుఁడనెను. మూఁడవసారి పార్వతి శివునిగెల్చెను. ఆయన పందెముగాయొడ్డిన నాగాభర ణములను, గజచర్మాంబరమును వ్యాఘ్రచర్మమును తీసి కొనెను. అప్పుడీశ్వరుఁడు దిగంబరికాగా ప్రమథగణము లతనినిచూచి నవ్విరి. అందుకాయన సిగ్గుపడి పార్వతిని చూచి యన్నియు తీసికొంటివి. నాకౌపీనము మాత్రము నా కిమ్మని యడుగఁగా నామె శివునిజూచి "ఏమీ! దిగంబరివై ఉండుటమీకు సహజధర్మమేగదా? మీరు నాఁడు దారుకా వనమునయున్న ఋషిపల్లెకు దిగంబరివై పోయి ఋషులస్త్రీలను మోహింపలేదా? కౌపీనమెందుకు?" అనెను శివుఁడు మిగుల కోపించి కైలాసమున నుండుట తగదని యడవికిబోయి తపస్సు చేసుకొను చుండెను. అప్పుడు గిరిజ మిక్కిలి ఖిన్నురాలై తనలో తానిట్లు తలపోయుటకు మొదలు పెట్టెను. "ఏమి! నాతలవ్రాత! ఆ కలహప్రియుఁడగు నారదుని మాటలకులోనై నాభర్తను చేజేతులను విడచితినే! ఎంతబేలను! ఆయన కొఱకే గదా చిన్ననాఁడు కఠోరమయిన తపస్సు చేసితిని. అయ్యో! నిద్రాహారములను విడిచి శీతోష్ణములకు సహించి యెంత

కాలమో ప్రయాసపడితిని. ఇప్పుడు నిష్కారణము నిమిషములో నా ప్రాణప్రియుని యెడఁబాసితినే! అని, విచారించుటవలన ప్రయోజనము లేదని నిశ్చయించి యెట్లయినను మాయోపాయములచే తనవిభుని మరలింపఁ దలఁచి చెంచుదానివలె వేషమును ధరించి శివుఁడు తపముచేయుచోటికిఁబోయి యావనమున పుష్పములు కోయుచు పాటలు పాడుచు నా శివుని దృష్టిని యాకర్షించుటకు తగినట్లు నటింపఁగా నాయన తపస్సుచాలించి లేచి యామె దరిఁబోయి తన్నువరింపుమని మిక్కిలి ప్రార్థింపఁగా, నామె శివునితో నిట్లనెను. "స్వామీ మీరుపరమశివులు చపలచిత్తులు. నాఁడు మీభార్యఅయిన సతీదేవిని తల్లిగా భావించి ఉపేక్షించిరి. అందువలననే కదా ఆమె విముఖత నొంది దక్షుని యజ్ఞకుండమున బడిమడిసెను. ఇంతేకాక మీరు శీఘ్రకోపులు. మన్మథుని నిమిషములో భస్మము చేసితిరి గదా! అట్టి మీతో కాపురమెట్లు చేయఁగలను" అనెను. అదివిని శివుఁడు ఆమెకు కొన్ని సమాధానములు చెప్పి ఆమె మనస్సు కలిగింపఁగా ఆమె ఇట్లనెను. "అట్లయిన నేను కన్యకను, తలిదండ్రుల చాటుదానను, స్వతంత్రురాలను కాను, మీరు మా జననీజనకుల యనుమతిని నన్ను వివాహమాడవచ్చును." అనఁగా "మీ గృహమెక్కడ ? నాకు కనపరచుము" అనెను. నావెంట రమ్మని యామె కైలాసమునకుఁబోయి తన నిజరూపమునుపొందెను. శివుఁడది చూచి మోసపోతినని తెలిసికొని, సిగ్గుపడి తన భార్యతో కూడి కైలాసాగా నుండెను. శ్రీ పార్వతియు తన భర్తను మోసపుచ్చి, నిజనివాసమునకు దీసికొని రాఁగలిగినందుకు సంతోషించెను.

## శివుని పట్టాభిషేకము.

ఈ వింతవృత్తాంత మంతయు నారదునివలన విని బ్రహ్మ, విష్ణువు, అష్టదిక్పాలురు దేవతలు, సప్త మహాఋషులు, నవగ్రహములు, నందియును కైలాసమునకుఁబోయి యుమా మహేశ్వరులను దర్శించి శివునికి పట్టాభిషేక మహోత్సవము జరిగించిరి. దేవతల దుందుభినాదంబులు దిక్కులు పిక్కటిల్లు నట్లు మ్రోగెను. శ్రీ పార్వతీ పరమేశ్వరులు సింహాసనమున కూర్చొనియుండఁగా ప్రమథగణంబులు వారివారి విధులయందు నియుక్తులై యుండిరి. బ్రహ్మాది దేవతలు పరివేష్టించి యుండిరి. అభిషేకోత్సవానంతరము శివుఁడు వారికి తగిన సత్కారములు చేసి పంపఁగా వారు తమ నిజనివాసములకు వేంచేసిరి.

అని సూతుండు చెప్పఁగా శౌనకాదిమహామునులు సంతసించిరి.

# అష్టాదశపురాణసారము

## శ్రీ పద్మపురాణము.

ఈ పద్మపురాణమును శ్రీ పార్వతీదేవికి శ్రీ పరమేశ్వరుఁడు చెప్పినట్లు శ్రీ వేదవ్యాసులవారు వ్రాసియున్నారు.

పూర్వకాలమున నొకదినమందు శ్రీ సదాశివుఁడు పార్వతితోఁ గూడి కైలాసమునందున్న యుద్యానవనమున నుండఁగా పార్వతి శివునిజూచి కర్మయోగము తనకు బోధింపుమని ప్రార్థింపఁగా శ్రీ పరమేశ్వరుఁ డామెతో నిట్లని చెప్ప నారంభించెను. ఓ ప్రేయసీ! వినుము. దేనిని వినుటవలన సంసారమందు పుట్టుక చావు లేక సమస్తప్రాణులు తరింతురో యట్టి పరమ పవిత్రమైన విష్ణుకథను చెప్పుచున్నాను. శ్రద్ధతో విని సమస్త పాపములను నశింపఁజేసికొని ముక్తిని పొందుము. ప్రళయాంతమందు ప్రపంచకమంతయు నీటిలో మునిగియుండఁగా శ్రీ పరబ్రహ్మ యా జలమునందు శయనించియుండఁగా వారి నాభీకమలమునుండి చతుర్ముఖ బ్రహ్మ పుట్టెను.

### మధుకైటభుల వధ.

తరువాత నా పరబ్రహ్మయొక్క చెవి గూబలోనుండి మధుకైటభులను నిద్దఱు రాక్షసులు పుట్టిరి. వారు బ్రహ్మను

జూచి యతనిని కొట్టఁబోగా నాయన తన తండ్రిని స్తోత్రము చేయఁగా నతఁడు ప్రసన్నుఁడై, వారు బ్రహ్మను చంపుదురని తెలిసికొని వారితో యుద్ధముచేయ నారంభించెను. అంతరాళ మునవారయిదువేల సంవత్సరములవఱకు ఘోరముగా పోరిరి గాని వారిని శ్రీహరి జయింపలేక పోయెను. వారు శ్రీహరి యుద్ధనిపుణతజూచి సంతోషించి యాయనతో నిట్లనిరి. "స్వామి మీయుద్ధమునకు మెచ్చితిమి. మీరు కోరిన వరమిచ్చెదము. అడుగుమనఁగా విని వారిని తన మాయచే మోహింపఁజేసి యిట్లనెను. "ఓరాక్షసులారా! మీరునాకువరమిచ్చెదమంటిరి. అదే నిశ్చయమైన మీరుభయులు నాచే చచ్చునట్లు వరము దయసేయుఁడు. ఆ మాట విని వారు భీతినొంది కొంతసేపాలో చించి యాడినమాట తప్పలేక శ్రీహరితో నిట్లనిరి. "స్వామీ! మేమాడినమాట తప్పువారము కాము. నీరులేని చోటమీరు మమ్ముఁ చంపినమీచే తప్పక చచ్చెదము." అనఁగా విని శ్రీహరి యెల్లెడజలముండుటచూచి యుపాయమాలోచించి తన తొడ లను పెంచి వారిని వానిపైనుంచి తనచక్రముచే వారికంఠము లను నరికెను. అప్పుడు బ్రహ్మ తన భయము విడచి శ్రీహరి నిట్లు స్తుతించెను. "ఓ పరమేశ్వరా! భయమును పోగొట్టిన వాఁడా! త్రిగుణోపేతా! అపారపరాక్రమా! సంసారదుఃఖ మును నశింపఁజేయువాఁడా! శ్రీలక్ష్మీముఖమనెడుపద్మము నందలి మకరందపానము చేయువాఁడా! నీపాదపద్మములను సేవించువారిని రక్షించు స్వామి! ఈమహాభయమునుండినన్ను కాపాడితివి. దేవా! నీ దాసుఁడను రక్షింపుమని ప్రార్థించి యా శ్రీహరి యాజ్ఞను పొంది సృష్టిచేయ నారంభించెను.

దేవ, రాక్షస, మానవాదుల పుట్టుక.

అప్పుడా చతుర్ముఖబ్రహ్మ 1 భూలోకము 2 భువర్లోకము 3 సువర్లోకము 4 మహర్లోకము 5 జనోలోకము 6 తపోలోకము 7 సత్యలోకమను నేడు లోకములున్న (వీనినే యూర్ధ్వలోకములందురు.) 1 అతలము 2 వితలము 3 సుతలము 4 తలాతలము 5 మహాతలము 6 రసాతలము 7 పాతాలము అనుసప్తపాతాళములను (వీనినే యధోలోకములందురు) సృజించెను. వీనికే చతుర్దశ భువనములని పేరు. పిమ్మట సప్త కులపర్వతములను పుట్టించెను. అవి యేవనఁగా 1 ఉదయాచలము 2 అస్తాచలము 3 హిమాచలము 4 వింధ్యాచలము 5 మేరువు 6 త్రికూటాచలము 7 లోకాలోక పర్వతము. తరువాత బ్రహ్మసప్త ద్వీపములు అనఁగా 1 జంబూద్వీపము 2 ప్లక్షద్వీపము 3 శాల్మలీ ద్వీపము 4 కుశద్వీపము 5 క్రౌంచ ద్వీపము 6 శాకద్వీపము 7 పుష్కర ద్వీపము లను ఒక దానికంటె రెండవది రెండింత లుండునట్లు చేసెను. తరువాత ప్రజాపతి సప్త మహాసముద్రములను కల్పించెను. అవి యెవ్వి యనఁగా 1 ఉప్పుసముద్రము 2 చెఱకుపానకసముద్రము 3 కల్లుసముద్రము 4 నేతిసముద్రము 5 పెరుగుసముద్రము 6 పాలసముద్రము 7 మంచినీటి సముద్రము. పిమ్మట నా చతుర్ముఖుఁడు తొమ్మండుగురు బ్రహ్మలను (1 భృగు 2 అత్రి 3 దక్షుఁడు 4 క్రతువు 5 కర్దముఁడు 6 పులస్త్యుఁడు 7 మరీచి 8 పులహుఁడు 9 అంగీరసుఁడు) అను వారిని సృజించెను. బ్రహ్మకుమారుఁడు కశ్యపుఁడు. ఇతనికి నలుగురు భార్యలు. వారిలో 1 అదితి. ఈమెకు పుట్టినవారే దేవతలు. 2 దితి..

ఈమెకు పుట్టినవారే రాక్షసులు. 3 వినత. యీమె కొమాళ్ళు గరుత్మంతుడు. అనూరుడు. 4 కద్రువ. ఈమెకు వాసుకి మొద లగు సర్పములు జన్మించెను. పిమ్మట వర్ణసంకరముచేత బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు జాతు లేర్ప డెను. హిమాచలపర్వతమునకు దక్షిణమున యుప్పునీటి సము ద్రమున కుత్తరముననున్న భూమికి భరతఖండమని పేరు. దీనికే పుణ్యభూమియని పేరు. కావున దేవతలు తామిందు పుట్టవలెనని కోరుచుందురట. ఇది కర్మభూమి యగుటచే పుణ్యమును చేసి సులభముగా మోక్షమును సాధింపవచ్చు నని చెప్పుదురు. పాపమును చేసినవా రధోలోకములను పొందుదురని వేరుగ చెప్పవలసిన యవసరము లేదు. సమస్తజను లును పైని చెప్పబడిన ప్రజాపతుల సంతతి వారనుట స్ఫురించు చున్నను వారి వారి వృత్తులవలనను తినుపదార్థముల వలనను, అభ్యాసముల వలనను, వివాహాదులవలనను, జనులు పలు తెగలుగ క్రమక్రమముగా యేర్పడినట్లు కనబడుచున్నది. తరువాత నా చతుర్ముఖుడు పశు, పక్షి, కీటకాదులను స్థావ రములైన వృక్షలతా గుల్మాదులను సృజించెను.

## విష్ణుభక్తుల లక్షణము

ఒక దినమున శ్రీహరితో సంభాషించుచుండగా బ్రహ్మ విష్ణుభక్తులను పోల్చుట యెట్లని యడుగగా నాయన చెప్పినది వినుమని పార్వతితో నీశ్వరుం డిట్లు చెప్ప నారంభించెను. కలి యుగమునందు సమస్తజనులు పాపము హెచ్చుగా జేయు దురు. వేదమునందు చెప్పిన కర్మలు చేయుట మానుదురు. దేవ

తలను పూజించుట, స్తుతించుట, వేదములను పఠించుట మొదలగు సర్వకర్మలనువిడచి డంబాచారము చేయుదురు. అందువలన కొందఱు దరిద్రులగుదురు. మఱికొందఱు స్వల్పకాలమే జీవింతురు. మిగిలినవారు పలువిధములగు పాపములు చేయుటంజేసి దుఃఖములను పొంది నశింతురు. దుఃఖపరంపరలచేత పుణ్యముచేయుటకు వారి కవకాశముండదు. పాపమునందు బుద్ధి వ్యాపించుటచే నదివఱకు చేసిన పుణ్యము నశించును. హరికథ వేదకర్మములను పరిహాసింతురు. బ్రాహ్మణులు వేదనిందచేసి, నాస్తికులగుదురు. బుద్ధిమంతులు మాత్రము జ్ఞానలాభమును పొంది మోక్షము నొందుదురు. దేనిని స్మరించుటవలనగాని, వినుటవలనగాని సమస్తపాపములు నశించునో యట్టి శ్రీహరినామమును సర్వదా మనస్సున ధ్యానించుచుండువారే విష్ణుభక్తులు. వారేవైష్ణవు లనిపించుకొందురు. వారు శ్రీహరి గుణానుభవము చేయుచుందురు. అనగా వారు, కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములు లేనివారై యసత్యమును విడచి సత్యమునే పలుకుచు మాతాపితృలయందు, భక్తికలిగి, బంధువులను, ఆశ్రితులను పోషింతురు. హరిహరబ్రహ్మలయందు సమభావముకలిగి, యతిథులను, బ్రాహ్మణులను, పూజించువారును, సమస్త జీవులయందు దయగలవారును పరస్త్రీలను తల్లివలె చూచువారును తులసి పూసలుగాని, రుద్రాక్షలుగాని కంఠమున ధరించువారును, దేవాలయములు మంటపములు కట్టించియందు భోగరాగాదులుచేయించువారును, అనాథలైన అనగా దిక్కులేని రోగులకు నౌషధము లిప్పించిబాగుచేయించువారును నూతులు చెఱువులు త్రవ్వించు

వారును, తమకంటె పెద్దలను మన్నించువారును, బీదలను సంరక్షించువారును, ప్రాణహాని చేయనివారును, విష్ణుభక్తులని తెలిసికొనుము. వారిని కలియుగము బాధించదు. వారిని పాపములంటవని బ్రహ్మతో శ్రీహరిచెప్పెనని శివుఁడుపార్వతితో చెప్పఁగా విని పార్వతి శివుని జూచి,

### గంగామాహాత్మ్యము.

గంగ పరమపావన మైనదని వినుచున్నాను. దాని మహిమ సెలవిండని యడుగఁగా నీశ్వరుఁడిట్లు చెప్పుచున్నాఁడు. గంగ యనిపేరు ముమ్మారు స్మరించినమాత్రమున నే సమస్త పాపములను నశింపఁజేసికొని జనులు స్వర్గమును పొందుదురు. ఆ గంగ మహిమ చెప్ప నెవరితరము. అయినను నేను క్లుప్తముగా చెప్పెదను. అంత్యకాలమున (అనఁగా ప్రాణము పోవు నప్పుడైనను) గంగను శ్రీహరిని స్మరించువారు వైకుంఠమును పొందుదురు. అది వఱకు అభ్యాసమున్న వారికి గాని యానావమములా సమయమునకు మనస్సునందు స్ఫురించుట దుర్లభము. గయ, ప్రయాగ గొప్ప పుణ్యతీర్థములు. ప్రమాదము చేతనైనను మానవులుగాని యితర జీవులుగాని గంగలోఁబడిచచ్చిన తప్పక స్వర్గమును బొంది యందలి భోగము లనుభవింతురు. ఇందుకు దృష్టాంతముగా ననేక కథలున్నవి వినుము.

### వీరభద్ర సోమభద్రుల చరిత్రము.

పూర్వము జంబూద్వీపమున మనోభద్రుఁడను నొక చక్రవర్తి పాలించుచుండెను. అతఁడు దిగ్విజయముచేసి శత్రు

వుల సందటిని జయించి తన మంత్రులనుజూచి తనకొమాళ్ళ యిన వీరభద్ర, సోమభద్రులకు రాజ్యము భాగించియిచ్చెద నని చెప్పఁగా వారందుల కంగీకరించినందున మంచిరోజున పట్టాభిషేకము చేయ నిశ్చయించెను. జంబూద్వీపమును రెండు భాగములుగాచేసి వారికి పట్టముగట్టెను. ఆ రోజున సభలో తండ్రి కొమరులు తమ మంత్రివర్గము మొదలగు పరివారముతో కూర్చునియుండఁగా రెండు రాబందులచ్చటికి యెందుండియో హఠాత్తుగా వచ్చి వ్రాలెను. వానిలోనొకటి పురుషపక్షి, రెండవది స్త్రీ పక్షి. అవి సభలోనికివచ్చికూర్చుండుటను అందఱును ఆశ్చర్యము పొందిరి. మనోభద్రుఁడు వానిని జూచి యిట్లనెను. "మీరు యెందుండి వచ్చితిరి ? ఏ కారణముచేత వచ్చితిరి ? పక్షులు భయము గల జంతువులుగదా ? సభలో కూర్చుండుటకు మీరెట్లు సాహసించితిరి ? "అని అడుగఁగా ఆ పక్షులిట్లు చెప్ప నారంభించెను."ఓరాజేంద్రా ! మేము నీకొమరులజూడ వచ్చితిమి. పూర్వము మేమందరము నొక్క నరక కూపములో బాధలు పడుచుండువారము. ఆ పరిచయముచే నిప్పుడు వీరిని జూడవచ్చితిమి. మీరు బహుపుణ్యము చేయుట వలన వారిపాపము నశింపజేసికొని యీ గొప్పజన్మమును పొందితిరి. పూర్వజన్మమందు వీరు సత్యకేతుఁడను రాజకుమారులు. పరసగరులని వీరికిపేరు. వీరు బహుపాపములు చేసి యుండిరి. అందులో ముఖ్యమైనది బ్రాహ్మణుల సొమ్ము నపహరించుట. అందువలన వారు నరకకూపములో వేయఁబడి యందు ఘోరమైన బాధలుపొందుచుండిరి. ఆ మాటలు

విని చక్రవర్తి వారితో "మీరెవరు? పూర్వజన్మమున మీరేమిచేసి నరకమునఁబడి"రని యడుగఁగావారిట్లు చెప్పిరి.

ప్రమాదముననైన గంగలో పడి చచ్చుటవలన కలుగు ఫలము.

సర్వేశ్వరశర్మ- మంజుకళా చరిత్రములు.

పూర్వజన్మమున నేను సౌరాష్ట్రదేశమున సర్వేశ్వర శర్మయను బ్రాహ్మణుఁడను. నేను వేదములు, శాస్త్రములు చదివి యుంటిని. ఈమె నాభార్యగాయుండెను. అప్పు డీమె పేరు మంజుకళ. మేము విద్యచేతను ధనముచేతను మదించి యుండుటచే నాతల్లిదండ్రులను సేవింపలేదు. ఏలననఁగా మాతండ్రి మిక్కిలిమూర్ఖుఁడై యుండి దొంగతనముచేసిజీవించు చుండెను. ఆ పని చేయవద్దని యెన్నివిధముల బోధించినను విననందున వానిని మేము సేవించలేదు. తల్లికూడ ఆయనతో నుండుటచే ఆమెనుకూడ మేము సేవించలేదు. ఇట్లుకొంత కాలమైన పిమ్మట మేమిరువురము నేక సమయమందే మృతి నొందితిమి. అప్పుడు యముని దూతలువచ్చి మమ్ము యపాశ ములచే బంధించి యనేక విధముల త్రోవలో బాధింపుచు యమునియెదుట బెట్టఁగా నా యముఁడు మాపాపపుణ్యముల చిఠా చూడుమని చిత్రగుప్తునితో చెప్పెను. అప్పు డతఁడు తల్లిదండ్రుల సేవచేయక బహుపాపులైరని మనవిచేయఁగా పరసగరులతో మమ్మును నరక కూపమున వేసి బాధింపుఁడని యమధర్మరాజాజ్ఞ యొసంగెను. మేము నలువురమం దనేక వేల సంవత్సరములు మిగుల బాధల నొందితిమి. తరు వాత మేము దంపతుల మిద్దఱము రాబందులమై జన్మించి కుళ్ళిన శవములను దిని బ్రదుకుచున్నాము. ఈ పరసగరులు

మిడుతలై జన్మించిరి. ఒకరోజునవీరు గంగానదీతీరమున నెగురు చుండఁగా గొప్ప వాయువు వీచినందున గంగలో పడి మృతినొందిరి. అప్పుడు వారిజీవులను విమానముపై కూర్చుండఁ జేసి వైకుంఠమునకు తీసికొని పోయిరి. అందు వీరు చాల కాలము సుఖమనుభవించి శ్రీమహావిష్ణువునాజ్ఞ వలననీకు కుమారులై జన్మించిరి. ఇందుకొంతకాలము సుఖముగారాజ్యసుఖము లనుభవించి తిరిగి వైకుంఠమునకు పోదురు. ఈ సంగతి విని రాజు నమ్ముటకు వీలులేదనఁగా ఆకాశమునుండి "నిజమే నిజమే" అని శబ్దము వినఁబడెను. అచ్చటి వారందఱును నమ్మిరి. గంగనుస్మరించుటవలన స్త్రీహత్యా, శిశుహత్యా, బ్రహ్మహత్యాది పాపములు, నశించుటకు సందేహములేదు. తల్లి దండ్రులను సేవింపకపోవుటచే మాకీపాప మెంతకును విముక్తి కాకున్నది. తల్లిదండ్రులకన్న వేరుదైవము లేదు. అని చెప్పు చుండఁగా నాపక్షులు మృతినొందెను. విష్ణుదూతలు విమానముపై వానిని కూర్చుండఁబెట్టుకొని వైకుంఠమునకు దీసికొని పోయిరి.

### మరణకాలమున గంగాపాన ఫలము

### కాలకల్పుఁడు తరించిన కథ

పూర్వము త్రేతాయుగమునందు మధురాపట్టణములో ఒక బ్రాహ్మణుఁడుండెను. అతనిపేరు సోమశేఖరశర్మ. అతఁడు వేదవేదాంగాది విద్యలునేర్చి సత్యశీలుఁడు. దయామయుఁడు నక్రోధనుఁడునై యుండెను. అతనికి సత్యశీలయు, పతివ్రతయు సత్కులమునందు జన్మించినదియునైన విశాలాక్షి యను పేరు

గల భార్యయుండెను. ఆ దంపతులు మిగుల ప్రశంసనీయమైన ప్రవర్తన గలవారై విష్ణుభక్తులై అతిథి, అభ్యాగతులనుపూజించుచు చక్కఁగా కాలము గడపుచుండిరి. వారు మోక్షమును పొందఁగోరి గంగాయాత్రకు పోయి గంగలో స్నానముచేసి గంగను శ్రీహరిని పూజించి గంగను కలశములలో పట్టుకొని మార్గమున తిరిగి బోవుచుండిరి.

అప్పుడు పశ్చిమదేశస్థుఁడైన రత్నాకరుఁడను కోమటి వ్యాపారము నిమిత్తము కొన్ని దినుసులను పోసిన గోనెసంచులను యెద్దుపైని వేసికొని పోవుచుండఁగ అందులో నొక యెద్దుభారముచే నడువలేక వెనుకయుండుట చూచెను, వానిలో నొకర్లలో నొకడైన కాలకల్పుఁడనువాఁడా యెద్దునుజూచి కోపించి తనచేతనున్న కఱ్ఱతో గట్టిగా కొట్టెను. అందువలన నావృషభము క్రిందపడి గింజుకొనగా దానివీపున నున్న బరువు క్రిందఁబడెను. అంతటాయెద్దులేచి కోపముచే వానిని పొడువఁగా దానికొమ్ము వానిహృదయమున గుచ్చుకొని కాలకల్పుడు క్రిందపడి మూర్ఛనొంది రోజుచుండెను. అట్టి యవస్థలో త్రోవను బోవుచున్న సోమశేఖరశర్మ వానిని జూచి కనికరము కలిగి, వానిచెంతకు పోయి తన యొద్దనున్న గంగలో కొంచెము వాని ముఖముపై జల్లి, మఱికొంత గంగ వాని నోటిలో పోసెను. తా నదివఱకు శ్రీవిష్ణువును పూజించి చెవియందు ధరించియున్న తులసిదళమును, వానిపై వేసి బ్రాహ్మణుఁడు తన త్రోవను బోయెను. అంతటకాలకల్పుఁడు మరణించెను. ఇట్లు బ్రాహ్మణుఁడు పత్నిసహితుఁడై కొంత దూరముపోగా మార్గములో కొందఱు భయంకరాకారము

గల భటులను జూచెను. వారిలో కొందఱు కాళ్లు విరిగి చేతులు తెగి ముక్కులు చీల్చబడి రక్తము కారుచు జుట్టులు విరియ బోసికొని వికలాంగులై చేతులయందు చర్మముతో చేయఁబడిన త్రాళ్ళు పలువిధములగు ఆయుధములు పట్టుకొని కొట్టుచుండుట జూచి భయపడి మీ రెవరని వారి నడుగఁగా వానితో వారిట్లు చెప్పిరి. "అయ్యా! మేము యముని దూతలము. ఘోరపాపములు చేసి తుదకు నెద్దును కొట్ట, దాని కొమ్ముహృదయమున తగులుటచే చచ్చిన కాలకల్పుని దెమ్మని యముని యాజ్ఞపొంది వానిని యీ పాశములతో బంధించి తీసికొనిపోవు సమయమున విష్ణుదూతలు మా కెడ్డముగా వచ్చి వానిని విడువుమని మమ్మునడిగిరి. అందుకు మేము వారితో నిట్లంటిమి. "అయ్యా! వీఁడు మహాపాపి. వీనిని దెమ్మని మా ప్రభువైన ధర్ముని యాజ్ఞవలన మేము వచ్చి వీనిని గట్టి తీసికొనిపోవుచున్నాము.

విష్ణుదూతలు:—వీఁడేమి పాపము లొనర్చెను?

యమదూతలు:—అయ్యా! వీఁడనేకపాపములు చేసెను. వానిని మేమెంత చెప్పఁగలము.

విష్ణుదూతలు:—చెప్పలేకున్న వీని నెట్లు తీసికొనిపోఁగలరు? మేము విడువమే!

యమదూ:—విడువరా! అయిన వినుండు. వీఁడనేక జీవహింసలు చేసెను.

వి_దూ:—ఏమీ! అది పాపమా? బ్రహ్మ సమస్త పశులను మనుష్యుల యుపయోగముకొఱకేగదా పుట్టించెను.

య-దూ:—ఔను. వానివల్లను మనకు లభించు పదార్థముల నుపయోగించుకొనవచ్చును. కాని, వానిని బలవంతముగా జంపి తినవచ్చునా ? బ్రహ్మయొక్క యభిప్రాయమది కాదు. మనకు మనప్రాణమునం దెంతప్రీతియో చీమకుకూడ నట్లేకదా ?

య-దూ:—ఔను, సరిగా చెప్పితిరి. వీఁడు మఱియేమిచేసెను ?

య-దూ:—పరధనమును, పరస్త్రీల నపహరించెను.

వి-దూ:—ఏమీ! లోకమున జనులందఱును చేయు పనులే అవి. అందు తప్పేమి ?

య-దూ:—జనులు తాము కష్టపడి పనిచేసి ధనమును సంపాదింపవలెను. కాని దొంగతనముచేసి కాదుగదా! వీఁడు సంపాదించినది చోరవృత్తిచేతనే. లోకమున స్త్రీలను వారి తలిదండ్రులు తగిన వరునికిచ్చి వివాహము చేయఁగా వారి భర్తలు వారిని తీసికొని పోవుచున్నారు. కాని వీఁడు బలవంతముగా ననేక స్త్రీలను భంగపఱచెను. అది పాపముకాదా ?

వి-దూ :—సరే. ఇంతేనా మఱియేమైనా చేసెనా !

య-దూ :—ఇంతేకాదు, అనేక పాపములు చేసెను. స్త్రీలను చంపుట, పిల్లలను, బ్రాహ్మణులను చంపుట, ఇండ్లు కాల్చుట మొదలగు క్రూరకృత్యములు మెన్నో చేసెను.

వి-దూ :—పుణ్యకార్యము లేమైన చేసెనా ?

య-దూ :— యేమియు చేయలేదు. పుణ్యమన్న మాటయే వాఁడు చెవిని విని యెఱుగఁడు.

వి_దూ :— బాగుగ నాలోచింపుడు. వీడు చనిపోవు చుండఁగా నొక బ్రాహ్మణుఁడు వీనినోట గంగపోసి, శరీరమున తులసితో గంగచల్లి తులసి వానిపైనవేసి నారాయణుని పేరు వాఁడు వినునట్లు పలుకలేదా ? అదే వాఁడుచేసిన పుణ్యము. అందుకు మాప్రభువైన విష్ణువు సంతసించి విమానముపై వీనిని తీసికొని వైకుంఠమునకు తెమ్మనెను. వీనిని విడువుఁడు.

యమ-దూ :—మే మెట్లు విడుతుము? మా ప్రభువైన ధర్ముఁడు వీనిని కట్టి కొట్టి బాధింపుచు తన యెదుట బెట్టు మనెను. వారి సెలవు నతిక్రమింపఁగలమా? మీ ప్రభువు మీ కెంతో, మా ప్రభువు మా కంతకాదా?

వి_దూ :—మీరు విడువనియెడల మేము మిమ్ములను కొట్టి వానిని విడిపించి తీసికొని పోయెదము.

అని వారు మాపైబడి మాతో యుద్ధము చేయఁగా మాలో కొందఱు చచ్చిరి. మిగిలినవారము వారిచే దెబ్బలు తిని చాలలేక యిట్లు పారిపోవుచున్నామని సోమశేఖరశర్మతో చెప్పి పోయిరి. వారి మాటలువిని సోమశేఖరశర్మ గంగయొక్క మాహాత్మ్యము ప్రత్యక్షముగా చూచినవాఁడై మోక్షమును పొందదలఁచి గంగాతీరమున స్థిరముగా వసింపగోరి తన స్వదేశ మును, గృహమును విడిచి కుటుంబముతో గంగాతీరమున జన్మాంతమువఱకు నివసించి నిత్యము గంగలో స్నానము చేయుచు ప్రార్థించుచుండి మోక్షము నొందెనఁట. వింటివా పార్వతీ! గంగ మహిమ.

పద్మగంధి చరిత్రము

## ఎముకలు గంగలో పడుటవలన కలుగు ఫలము.

ఆ కథవిని పార్వతి మిగుల సంతోషించి, స్వామీ! గంగాదేవి మహిమ విన్నకొలందియు వినుటకే మనస్సునం దుత్సాహము కలుగుచున్నది. దాని విశేషము మఱి యేమైనను వినఁగోరెదను. సెలవిచ్చి నా జన్మ పావనము చేయుడనఁగా నీశ్వరుఁ డిట్లనెను. గౌరీ! వినుము. ఆ గంగయొక్క మహిమ అత్యద్భుతము. గంగతో విష్ణుపూజ చేయువారు సమస్త పాపములను పోఁగొట్టుకొని విష్ణువుతో సమాను లగుదురు. గంగలో స్నానముచేసి గంగాజలము పట్టుకొనివచ్చు యాత్రికు లను సత్కరించువారు యజ్ఞఫలమును పొందుదురు. గంగా యాత్రకు పోవువారిని వద్దనువారు నూఱు జన్మములవఱకు నరక మనుభవింతురు. మరణకాలమున గంగామాహాత్మ్యము విన్నను సమస్తపాపములు నశించి వైకుంఠమును పొందుదురు. ఏ మనుజుని గోళ్లుగాని, చర్మముగాని వెండ్రుకలు గాని గంగలో పడునో వాని సమస్తపాపములు నశించి, వాఁడు విష్ణులోకమును పొందును. ఎముకల్లు గంగలో పడుటవల్ల కలుగు ఫలము చెప్పెద వినుము. అవి గంగలో నున్నంత కాలమామనిషిగాని, జంతువుగాని స్వర్గాదిభోగము లనుభ వించుచుండును. ఇందుకు తార్కాణముగా నొక కథ చెప్పెద వినుమని శివుఁడు పార్వతితో నిట్లనెను. "పూర్వము గంగా తీరమున గొప్ప విశాలమైన వటవృక్షముండెను. అందొక బొఱ్ఱెలో నొక కొంగ వాసము చేయుచుండెను. కొంతకాల

మట్లు జరుగఁగా నొకరాత్రి నాగసర్పమొకటి యాకోటరమున ప్రవేశించి యాబకమునుజంపి మాంసమంతయుదిని యెముకలను మాత్రము విడిచి పోయెను. పిమ్మట మఱికొంత కాలమునకు పెద్దగాలి వీచుటవలన నావృక్షము గంగలో పడెను. అప్పుడు దాని బొఱ్ఱెలోనున్న కొంగయొక్క అస్థిపంజరము గంగలో పడెను. అందువలననే యాకొంగయొక్క సమస్త పాపములు నశించి యప్సరసయై యింద్రలోకమునుపొందెను. ఆమెమిక్కిలి చక్కనిదై త్రిభువనములను మోహించుసంత లావణ్యము గలదై యుండెను. ఆమె శరీరము పద్మవర్ణము, పద్మవాసన కలిగియున్నందున నింద్రుఁడు దానికి పద్మగంధియని నామధేయ మొనర్చి, సర్వకాల సర్వావస్థలయందును నామె నెడబాయక సరససల్లాపములొనర్చుచునుండి రంభ, యూర్వశి, మేనక, తిలోత్తమ ఆదిగాగల యప్సరసలను, తన పట్టపురాణియైన శచీదేవిని మరచియుండెను. ఆ కొంగయొక్క అస్థులు గంగలోఁబడి యుండుటవలన దానికెంత స్వర్గసుఖము లభించెనో చూచితివా" అని శివుఁడు చెప్పగా విని పార్వతి యత్యాశ్చర్యము నొందెను.

గంగయొక్క పుట్టుక

మఱియొక రోజున పార్వతి యీశ్వరునిఁజూచి, నాథా! మీ రిదివఱకు చెప్పిన కథలవల్ల గంగ పరమపావనియనియు, మహాఘోర పాతకములను పోగొట్టి మానవులకే గాక యితర హీన జంతువులకు సైతము తాము పూర్వజన్మములయందు చేసిన సమస్త పాపములు నశింపఁజేసి పుణ్యలోకము లిచ్చు ననియు స్పష్టమగుచున్నది. అట్టి పవిత్రమైన గంగయొక్క

జన్మవృత్తాంతము వినవలెనని యున్నది. సెలవిచ్చి నన్ను కృతార్థురాలను జేయఁ బ్రార్థించుచున్నాను. అట్టి మహాత్మ్యమది కెట్లు కలిగెను. అని యడుగఁగా శ్రీ సదాశివుఁడామెతో యిట్లు చెప్ప దొడంగెను. "ఓ సఖీ! వినుము. పూర్వము కృతయుగము నందీ గంగ శ్రీ మహావిష్ణువు యొక్క పాదకమలములనుండి పుట్టి నాగలోకమున ప్రవహించుచుండెను. ఇందుండు దేవతలా తీర్థమున స్నానపానాదులు చేయుచు ముసలి తనము, చావు లేక యారోగ్య భాగ్యము లనుభవించు చుండువారు. శ్రీ విష్ణుపాదమున బుట్టుట చేతనే దానికట్టి మహత్తు కలిగినది" అని చెప్పఁగా స్వర్గమున ప్రవహించుచుండు గంగ భూలోకమున కెట్లు వచ్చినదని పార్వతి ప్రశ్న వేయఁగా నీశ్వరుఁడిట్లు చెప్పుచున్నాఁడు.

### సగరుని యశ్వమేధము.

త్రేతాయుగమున నీ భరతవర్షమును పాలించు చక్రవర్తులలోనాఱ్వురుబహుప్రసిద్ధినొందిరి. వారిలో మొదటివాఁడు శ్రీ సత్యహరిశ్చంద్రుఁడు 2. శ్రీ నలమహారాజు. 3. పురుకుత్సుఁడు 4. పురూరవుఁడు 5. సగరుఁడు 6. కార్తవీర్యార్జునుఁడు. వీరందఱు నీ దేశమంతయు నేకచ్ఛత్రాధిపత్యముగాఁ బాలించిరి. వారు బహుధర్మముగా ప్రజలను పాలించుచుండుటచే ధర్మము నాలుగుపాదములను క్రమముగా నడచుచుండెను. పంచభూతములు (అనఁగా భూమి, ఆకాశము, అగ్ని, జలము, వాయువు) ఉత్పాతములను కలిగించకుండ క్రమప్రకారము సంచరించుచుండెను. వర్షము యుక్తకాలమున కురియుచుండెను. భూమి

యందు పాడిపంటలు సమృద్ధిగా నుండుటచే జనులితర జంతువులుశరీరబలాయు రారోగ్యములు కలిగిరోగములు లేక చిరకాలము జీవించుచుండిరి. కావుననే వారి సేవలిప్పటికిని జనులు జ్ఞాపకముంచుకొని పొగడుచున్నారు. వారిలోనొకడైన సగరమహాచక్రవర్తి యశ్వమేధయాగముచేయసమకట్టి తాను యజ్ఞములందు విడిపింపవలసి పసువుగావేయ దలంచి గుఱ్ఱము తన బిరుదాంకములతో విడచి దాని వెంట కొందఱు భటులను పంపెను. ఇట్లు యజ్ఞముచేయునప్పుడు ముందుగా నశ్వమును విడుచువాడుక యేమనఁగా గుఱ్ఱమును స్వేచ్ఛగా విడిచి పెట్టఁగానే యే రాజ్యములలో తిరుగునో నారాజులలో నెవరైనను గుఱ్ఱమును విడిచిన రాజునకు లోబడియుండుట కిష్టములేని యెడల దానినిపట్టి కట్టవలెను. అపుడు వారిరువురకుయుద్ధమగును. యందు గెలిచి అశ్వమును విడిపించుకొనిననే తప్ప యజ్ఞము చేయకూడదు. అందునిమిత్తమే సగరచక్రవర్తి యశ్వమునువిడచెను, గుఱ్ఱము హఠాత్తుగా నదృశ్యమయ్యెను. దానివెంటఁబోయిన భటులువచ్చి యీ సంగతి తెలియఁజేయ చక్రవర్తి తనకొమాళ్ళ నఱువదివేలమందిని పిలిపించి వారితో నిట్లనెను. "కుమారులారా! గుఱ్ఱము కానరాకుంట, యజ్ఞము విఘ్నమగును కావున మీరంఱునుపోయి వెదకి స్వర్గ, మర్త్య పాతాళములలో నెందున్నను దానిని తీసుకొని రావలెను. అనఁగా విని వారు బయలుదేరి భూలోకమంతటను వెదకి యశ్వము కానరానందున స్వర్గమునకుఁబోయి యందును లేనందున పాతాళమున జూడనెంచి భూమిని త్రవ్వి త్రోవఁజేసికొని పోయి యచ్చట తపస్సు చేసుకొనుచున్న యొకఋషిని, వానిదరిని

మేయుచున్నయశ్వమునుజూచిరి. ఆఋషిపేరు కపిలమహాముని. ఆయన గుఱ్ఱమును దొంగిలించెననియు, ఆయననునడిగి దానిని తీసుకొని పోవలెనని యెంచి, ఆయనను అడుగఁగా సమాధిలో నుండుటచే మాటాడడయ్యె! అది జూచి చప్పట్లు చరిచి, కేకలు వేయఁగా నాఋషి సమాధిచాలించి కండ్లుతెఱచి కోపముతో చూడఁగా, వాని కోపాగ్నివల్ల వారందఱును నేకకాలమున భస్మమైరి. గుఱ్ఱమును వెదుకఁబోయిన తన కుమారులెంత కాలమైనను తిరిగిరాకుండుటకు నాశ్చర్యమునొంది వారేమైరో యను విచారముతో తన మనుమఁడైన, యంశుమంతుని రావించి సగరుఁడిట్లుచెప్పెను. "బాబు ! నీ పినతండ్రులు లశ్వమును వెదకఁబోయి చాలకాలమయ్యెను. ఇంకనురాలేదు. ఏమైరో తెలియదు. కావున నీవు బోయి మీా పినతండ్రు లను గుఱ్ఱమును వెదకి తోడుకొనిరమ్మనఁగా, నా యువకుఁడు తగిన సన్నాహముతో బయలుదేరి వెళ్ళి ముల్లోకములను వెదుకగా, పాతాళమున, ఋషిని, వానిప్రక్కనున్న యశ్వ మును జూచి సంతసించి, యామునిని ప్రార్థించి, వాని యనుగ్ర హమును బొంది గుఱ్ఱము నిమ్మని యడుగఁగా, ప్రసన్నుఁడైన యా ఋషియాతనితో నిట్లనియె. "ఓవత్సా ! నీవు బాలుఁడ వయ్యును, బుద్ధిమంతుఁడవు. నీ శాంతమునకు వినయమునకు మెచ్చితిని. ఈ గుఱ్ఱము నాదికాదు. ఇచ్చోటికెట్లు వచ్చె నదో నాకు తెలియదు. నీవైన దానిని తీసికొని పోవచ్చును. నీపినతండ్రులైన వీరు బహు ధూర్తులు. నా తపోభంగము కావించి నాకోపాగ్నిచేత భస్మమైరి. వీరికి పుణ్యగతులు లేవు. అనవిని యంశుమంతుఁడు, మిక్కిలిఖిన్నుఁడై మునిని స్తోత్రములు

చేసి, యిట్లు మనవిచేసెను. "స్వామీ! వారు చేసిన తప్పు క్షమించి వారికి, ఉత్తమలోకములు కలుగునటు లనుగ్రహింపుడు. అని ప్రార్థించఁగా" మందాకినీ జలంబుల వారి భస్మరాసులను దడిపిన, వారు స్వర్గస్థు లగుదురనెను. ఆ మాటలకు నతఁడుసంతోషించి,యాఋషియొద్ద సెలవుదీసికొని గుఱ్ఱమును దోడుకొని యింటికిఁబోయి, తాతకొప్పగించి జరిగిన వృత్తాంతమంతయు మనవిచేసెను. అది విని సగరుఁడు చింతాక్రాంతుఁడై తనయులకొఱకు మిగుల దుఃఖించి చేయునది లేక వారి యవివేకతయే వారి నట్లు చేసెనని యూరడిల్లెను. పిమ్మట నశ్వమేధ యాగమును చేసి విశేష దానములు, ధర్మములు చేసి, దానిని సమాప్తి నొందించెను. ఆ వెనుక మందాకినీ జలంబును దెచ్చి, కొమరులకు పుణ్యలోకము కలిగింపవలెనని యెంచి, మనుమనికి రాజ్యమిచ్చి బ్రహ్మను ప్రార్థించుటకై తపస్సుచేయఁబోయెను. కాని యాపని నెరవేర్చలేకమరణించెను. పిమ్మట నంశుమంతుఁడును, నతని కుమారుఁడగు దిలీపుఁడును తమజీవితకాలమంతయు నందుకొఱకే తపస్సు చేసిరి. కాని వారికోరిక నెరవేరదయ్యెను.

### గంగ భూలోకమునకు దిగుట

దిలీపుని కుమారుఁడైన భగీరథుఁడుకూడ తండ్రిమరణించిన పిమ్మట గంగను తెచ్చుటకై గొప్పతపస్సు చేసెను. అందుకు బ్రహ్మ తృప్తి పొంది వానికి ప్రత్యక్షమై వరమడుగుమనఁగా నతఁడాయనకు ప్రదక్షిణ నమస్కారములు చేసి బహుస్తోత్రములు చేసియిట్లు ప్రార్థించెను. "ఓచతుర్ముఖుఁడా

మామూత్తాతలు కపిల మహర్షి శాపమువల్ల భస్మమైరి. వారి భస్మరాసులు మందాకినీ జలంబుల దడిపినగాని వారికి పుణ్యలోకములు కలుగవటు. కావున యానదినినను గ్రహింపవలయు ననగా బ్రహ్మ సంతసించి యిట్లు చెప్పెను. ఓ భగీరథా! నీ తపంబునకు మెచ్చితిని. ఆనదిని నీ వెంట బంపెదను. కాని స్వర్గమునుండి భూమిపై పడునప్పుడు భూమిచిల్లులుపడును. అందువల్ల న నేకులు నశింతురు. జంతువృక్ష సముదాయమునకు కూడ బాధ కలుగును. కావున దానిని తనశిరస్సున పొందునట్లు శ్రీసదాశివుని ప్రార్థింపుము. ఆ యన త ప్ప మఱివేరు సమర్థులులేరు. పొమ్ము. అ న గా విని భగీరథుఁడీశ్వరునిగూర్చి చాలకాలము తపముచేయఁగా నాయనకరుణించి భగీరథునికి ప్రత్యక్షమై గంగను తన జడల యందు ధరించుట కంగీకరించెను. అంతట మందాకినీ జలము కైలాసముపై నున్న ఈశ్వరుని తలయందు పడుట కారంభించెను. అందుండే యాయనవిడువఁగా భూమియందు బడి భగీరథుఁడు ముందు నడువఁగా నతనివెనుక పోవుచుం డెను. అట్లు పోవుచున్న గంగను జహ్నుమహాముని పానము చేయుచుండెను. అందువల్ల దాని ప్రవాహము తనవెనుక రాకుం డుటచే వెనుకకు బోయిచూచి యామునిని స్తోత్రముచేసి ప్రస న్నునిచేసి కోరఁగా నాతడు దానిని విడచెను. ఇంత ప్రయాసపడి భగీరథుఁడా నదీజలముతో పాతాళముననున్న భస్మరాసు లను తడుపఁగా వానిపితృలు స్వర్గమును బొందిరి. ఇటులా నది స్వర్గమున మందాకినీ యనుపేరున, భూలోకమున గంగ యనియు పాతాళమున భోగవతియనియు నామములతో ప్రవ

హించుచున్నది. భగీరథునివల్ల తేబడ్డది గనుక భాగీరథియనియు జహ్నునివల్ల విడువబడ్డదికావున జాహ్నవి యనియుదానికిపేర్లు గలవు. మఱియొక నది యిట్టిది లేదు. ఇదియు సముద్రమున బడుచున్నది. సగరుని కొమాళ్ళచేత్రవ్వబడ్డది కాబట్టి సాగర మని సముద్రమునకు పేరు కలిగినది. ముల్లోకములపారు చుండుటచే గంగకు "త్రిపథగ" అని పేరు.

నీతి:—చూచితివా యెంత అసాధ్యమైన పని సాధింప బడినదో! పూనికతో విడువక ప్రయత్నించినచో, నన్ని కార్య ములిట్లే నెరవేరును. కొన్ని పనులునెరవేరుటకితరుల సహా యమావశ్యకము.

గంగా యాత్రకు పోయెదనన్న కలుగుఫలము

పూర్వము త్రేతాయుగాంతమున సత్యధర్ముడను చక్ర వర్తియుండెను. ఆయన రాజ్యమును అందలి ప్రజలను బహు న్యాయముగా పాలించుచుండెను. ఆయన భార్యపేరు విజయ. ఆమె మిక్కిలి పతివ్రత. వారు అన్యోన్యప్రీతి కలిగి చాల కాలము రాజ్యముచేసి, ఉభయులు ఒక్కదినముననే చనిపోగా యమదూతలు వచ్చి, వారిని కట్టి యమునియెదుటకు తీసికొని పోగా, ఆయన వారిని జూచి, చిత్రగుప్తుని బిలిచి వారి పాప పుణ్యములను చెప్పుమనెను. అప్పుడు వారు చిఠాలు తీసి చూచి, ధర్మజునితో నిట్లు విన్నవించిరి. "ఓ ధర్మరాజా! వీరు బహు పుణ్యములుచేసిరి. అవి యేవనగా, యజ్ఞములు, యాగ ములు అనేకము చేయుటయేగాక, అన్నసత్రములు వేసియు విష్ణు పూజించియు, బీదలను సంరక్షించియు విశేషపుణ్యము

సంపాదించిరి. కాని ఒక్క పాపకార్యమువల్లనే అవి యన్నియు వృథా యయ్యెను. అది యేదన, అడవిలో పులిభయమువల్ల నొక లేడి యితని సభ జొచ్చి శరణుపొందగా దానిని చంపెను. ఇంతే ఈయన చేసినపాపము మఱి యేమియు లేదు. అది విని యముడు ఇట్లనెను. సరే, మృగము పులికి భయపడి తన ప్రాణరక్షణ నిమిత్తము తన పట్టణమునకువచ్చి శరణుచొరఁగా దానిని అజ్ఞానముచేత రాజు చంపెను. ఇది అన్ని పాపముల కన్నను అధికము. ఆ మృగము దేహముమీద నెన్ని రోమము లుండెనో అన్నివేల యుగములు, ఇతఁడు నరకబాధ లనుభవించుచుండవలెను. శరణుజొచ్చినవానిని రక్షించువారు ప్రాణదానము చేసినట్లగును. కాఁబట్టి వాఁడు బ్రహ్మహత్యాది పాపములు చేసినను, వానిని నశింపఁజేసికొని దేహాంతమందు విష్ణులోకమును పొందును. కావున వీరిని అసిపత్రనరకములో వేయుఁడని యముడు దూతల కాజ్ఞయిచ్చెను. దూత లా ప్రకారమే చేసిరి. అచ్చట వారు నూరుకోట్ల యుగములు బాధలుపడుచుండిరి. పిమ్మట వారిని పెద్దపులి చంపి తినెను. తరువాత వారు మగకప్ప ఆడుకప్పయై పుట్టి పురుగులను తినుచుండిరి. వారికి పూర్వజన్మజ్ఞానముండెను. అవియున్నత్రోవను కొందఱు గంగయాత్రకుఁ బోవుచు గంగను స్మరించుట విని మగకప్ప ఆడుకప్పతో యిట్లనెను. ఓ సఖీ! నేను పూర్వజన్మమందు రాజునై యుండి శరణుజొచ్చిన లేడిని జంపి నరకములోబడి ననేక బాధలుపొంది పెద్దపులిచే మ్రింగబడి తుదకు మన కీ జన్మ లభించెను. ఈ బాధలు మఱి పడలేము. మనము గంగకు బోయి అందులో మునిఁగి ప్రాణములు

విడుచుట మంచిదని తోఁచుచున్నది. అట్లయిన నైకుంఠమును పొందుదుము. అనఁగా ఆడుకప్ప విని ఆలాగే చేయుదము పదండి అనెను. ఇట్లు ఆలోచించి కప్పలు రెండును బయలుదేరి పోవుచు గంగను శ్రీమన్నారాయణుని స్మరించుచుండిరి. వానిని మ్రింగుటకు వాని వెనుక నొక నాగుపాము పోవుచుండెను. అప్పుడాపాము కప్పలను చూచి యిట్లనెను. "ఓ భేకములారా! నిలువుడు ? నిలువుడు ! నేను చాలకాలమునుండి ఆకలిచే బాధపడుచుండుటచే నడువజాలను. కావున మిమ్ములను పట్టుకొనఁజాలకున్నాను. దయచేసి నిలువుడు. మిమ్ములను దిని నాయాకలిదీర్చుకొందును. అనఁగావిని కప్పలు భయపడి మఱి నడువఁజాలక నిలిచిపాముతో తమ పూర్వజన్మవృత్తాంత మంతయు చెప్పి, తాము గంగలోఁబడి ప్రాణత్యాగము చేయ బోవు చున్నామనియు, పుట్టుకతోనే చావు ఉన్నది, తప్ప దనియు చెప్పెను. జ్ఞానులు జీవులను హింససేయవు. అజ్ఞానులు జీవులనుహింసించివిష్ణుద్రోహులగుదురు. ఓసర్పరాజా! వినుము. ఈ సంసారము విష్ణుమయము. ఆయన అందఱిహృదయము లందు నివసించు చున్నాఁడు. జ్ఞానముగలవారు శత్రుమిత్రు లను భేదము పాటింపరు. అందఱిని సమానముగాఁజూతురు. ఆయనే మూఁడుగుణములచేతను, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లను, నామములతో పుట్టించుట, పెంచుట నశింపఁజేయుటయను మూఁడు పనులను చేయుచుండును. జంగమ స్థావరాత్మకమైన ప్రపంచమునందు అంతటను ఆయనే అన్నిరూపములతో వ్యాపించియున్నారు. ధర్మాత్ములైనపండితులు పరులను హింసిం పరు. నరకబాధలను పొందరు. నీవుమమ్మును భక్షించినంత

మాత్రమున నీయాఁకలితీరునా? మేము గంగకుపోయి అందు మునిగి ప్రాణములను విడచి వైకుంఠమును బొందఁగోరు చున్నాము. కావున కరుణించి మమ్మును పోనిమ్ము. అనఁగా విని సర్పము వారితో నిట్లనెను. "ఓ భేకములారా! మీరు చెప్పినవన్నియు వేదాంతవాక్యములు. అవి వినుటవల్ల నాయాఁకలి దీరునా? మీరు చెప్పిన ఆ సృష్టికర్తయే అందఱిని పుట్టించెను గదా? ఆయన కొన్ని జంతువులను మఱికొన్నిటికి ఆహారముగా నేల నియమించెను? మీయందు దయదలఁచి విడిచిపెట్టిన, నాకడుపెట్లు నిండును? ఆకలిబాధచే నే నిప్పుడే చని పోవుదును. కావున విడువనని చెప్పి ఆ కప్పలను బట్టి మ్రింగెను. అప్పుడవి గంగను, శ్రీమన్నారాయణుని స్మరించుచు ప్రాణములను విడచెను. ఆ తత్క్షణమే ఇంద్రుఁడు వానినితన విమానమున కూర్చుండఁబెట్టుకొని, తన స్వర్గమునకు తీసికొనిపోయి తగిన మరియాదలు చేయుచు కొంతకాలమందుంచి పిమ్మట విమానములపై వారిని వైకుంఠమునకు పంపెనఁట. అచ్చట వారు సుఖము లనుభవించుచు కల్పాంతమువఱకు ఉండిరఁట. అని శివుఁడు చెప్పెను.

నీతి—గంగలోఁబడి ప్రాణములను విడువఁదలఁచి పోవుచు తోవలోఁబలనస్మరణము నొందినను వానికి యెంతమంచి గతి లభించినదో చూచితిరా?

## గంగ యొక్క మహిమ

గంగాతీరమున తపస్సుచేయువారు మోక్షము నొందుదురు. ఈశ్వరుఁడు పార్వతిని జూచి వింటివా! భవాని! గంగ

యొక్క మహిమ. ఎంతచెప్పినను తరుగదు. ఈ మహానది భరతవర్షమున నుండుటచేతనే దేవతలు, ఋషులు, మునులు, సైతము ఈ దేశమునందు జన్మింపవలె నని కోరుచుందురు. ఇది అంత పవిత్రమయినది. పూర్వము జంబూద్వీపమునందు తాళధ్వజ మను పట్టణమున విక్రముఁడను చక్రవర్తియుండెను. అతఁడు గొప్పవివేకమును కలిగి పండితుఁడై యుండెను. అతనికి పతివ్రతయు మిక్కిలి సౌందర్యము గలదియునై నహిరావతి యను భార్య యుండెను. ఆ దంపతులు మిగుల అనురాగము కలవారై దానధర్మములు చేయుచుండఁగా కొన్నాళ్ళకు వారి కొక్క కుమారుఁడు గలిగెను. వానికి మాధవుఁడని పేరు పెట్టిరి. ఆ పిల్లవాఁడు శుక్ల పక్షపు చంద్రునివలె క్రమ క్రమముగ వృద్ధినొంది, వేద వేదాంగ విద్యలును శాస్త్రము లును అభ్యసించి ధనుర్విద్యాపారంగుఁడై యుండెను. ఒక నాఁడు ఆ విక్రమ మహారాజు మంత్రులను జూచి వారితో నాలోచించి కుమారునికి మంచి సుముహూర్త మందు పట్టాభిషేక మొనర్చెను. ఆ బాలుఁడును రాజ్యమును చక్కగ పాలించు చుండెను. ఆ మాధవ చక్రవర్తి ఒకరోజున ఉదయ మునలేచి వేఁటకుఁబోయి అడవియందు అనేకక్రూరమృగము లను వేటాడి రెండుజాములవేళ తన పట్టణమున జేరఁబోవుచో తనపురమందున్న సరోవరములో స్నానముచేసినీళ్ళబిందె పట్టుకు పోవుచున్న ఒక చక్కని స్త్రీని జూచిఆమెయొద్ద జేరి ఇట్లనెను. "ఓ నారీరత్నమా! నీ వెవరవు? ఇంతసుందర మయిన నిన్ను పుత్రికగాఁబడసిన భాగ్యవంతులెవరు? ఇట్టి జగన్మోహినివైన నిన్నుభార్యగ పొందు భాగ్యముఎవరికిలభిం

చెను. లావణ్యవతివైన నీ వింత భారముగల నీళ్ళబిందె మోయుటయేమి ? కోమలమయిన నీ శరీరము నెండపాలు చేయుచున్నావేమి ? ఇట్టి సుకుమార శరీరముగల నిన్నుఁగష్ట పడి పనిచేయునట్లు లా విధి యేలచేసెను ? నీవు నన్నువరించిన నీ పరిచర్యచేయుట కనేక దాస దాసీజనములుందురే ? నేను నీ జంబూద్వీపము నేలు చక్రవర్తిని. జగత్ప్రసిద్ధుఁడైన శ్రీ విక్రమమహారాజుగారి కుమారుఁడను. నాపేరు మాధవసింహుఁడు. నీవు నన్ను చెట్టబట్టుము. నీ రూపురేఖావిలాసములను చూచి నీయందు మరులుగొంటిని. అన్యకాంతలనొల్లను. అనఁగా నా కాంతాతిలకమిట్లు తనలో నాలోచించెను. ఇతఁడు రాచబిడ్డఁడు. పౌరుషముగలవాఁడు, నేఁడు విధివశమున నితని యెదుటబడితిని. తప్పించుకొను వెరవు కానరాకున్నది. ఇతఁడిప్పుడు మోహపరవశుఁడై యున్నాఁడు. ఏమిప్రమాదము రానున్నదో ! కాని దైవమే గలఁడు. అని బహిరంగముగా యిట్లు చెప్ప నారంభించెను. "ఓ రాజశిఖామణీ ! వినుము. నామాట లిదివఱకు నా భర్త వినియెఱుఁగడు. నేను సత్కులమందుఁ బుట్టితిని. పతివ్రతను. నాతండ్రి క్షత్రియ వంశజుఁడైన వీరబాహుఁడు. నాతల్లి పేరు సులక్షణి. నాభర్తపేరు సుబాహువు. నాపేరు చంద్రకళయందురు. నే నింతవఱకు నా భర్తను తప్ప నితరపురుషుల ముఖమును చూచియెఱుఁగను. ఈ రోజున నేను కులదేవతను పూజించు నిమిత్తము జలము తీసికొని పోవుట కీ సరోవరమున స్నానము చేయవచ్చితిని. పాపపుణ్యములు చేసినవారే యనుభవింపవలెను. కాని యితరులు కాదు గదా ! మీరు రాజులుకావున పితృసమానులు. ప్రజలమయిన

మేము మీకు బిడ్డలతో సమానము. మీవంశజులయిన రాజు లందఱును పరస్త్రీలను తల్లివలె పాలించుచుండిరి. కనుక వారు కీర్తిప్రతిష్ఠలు సంపాదించిరి. వారికులమున బుట్టిన మీరు కులమునకు మచ్చతేగూడదు గదా? పరస్త్రీనిచూచి నపుంస కునివలె నుండువాఁడు ఇహలోకమున కీర్తియు పరలోకమున వైకుంఠమును పొందును.

పరస్త్రీని యపేక్షించువారు స్వల్ప సుఖముకొఱకు నాసించి సర్వధర్మములను నశింపజేసికొని నరకకూపమునబడు దురు. కావున బుద్ధిమంతులైన మీరు పరస్త్రీల నపేక్షింపఁ గూడదు. ఇంతేకాక నేనొంటరిని. ఈ నిర్జనమైన ప్రదేశమున మీయెదుట బడితిని. మీరు మహావీరులు. మీరు నన్ను సాధింపవలెనన్న నేమిచేయఁగలను. ఈశరీరమురక్తము. మాం సము, చర్మము, ఎముకలతోనిర్మింపబడి మలమూత్రములతో నిండియున్నది. ఇందేమియున్నది. ఇదియు స్థిరమైనదికాదు. క్షణ భంగురము. ఇట్టి శరీరమునుజూచి అజ్ఞానులుమోహించి భ్రమ లోఁబడి శాశ్వతమైన పరలోకసుఖమును గోలుపోయి చిరకా లమునరకబాధలను బొందుచుందురు. మీరు జ్ఞానులు గొప్ప బుద్ధికలవారు, కావున నే మనవిచేసిన సంగతులు హృదయ మున నిల్పి పరస్త్రీవాంఛ విడువుడు,"అనిచెప్పఁగా మాధవ సింహుఁడు కామజ్వర పీడితుండగుటచే ఆమెమాటలుచెవికెక్క నందున తిరిగి ఆ కోమలాంగితో ఇట్లు చెప్పెను. "ఓ సుందరీ మణీ! నిన్ను చూచిన నిమిషము మొదలు మన్మథుఁడు నన్ను పీడించుచున్నాఁడు. వాని బాధనుండి నన్ను రక్షిం పుము. నిన్ను శరణుజొచ్చి నీపాదములపైఁ బడుచున్నాను.

నీవు నన్ను నిరాశనొందించిన విషము మ్రింగి ప్రాణపరిత్యాగము జేసెదను. ఆపాపము నిన్ను చుట్టుకొనును. యౌవనము స్థిరమైనది కాదుగదా? వృద్ధావస్థలో నిన్ను చూచువారెవరు? మంచుపడి పద్మములు నశించు కాలములో సదా వాని మధుపానముచేయు తుమ్మెదకూడవానివైపునుపోవునా? నీ నిష్ఠురవాక్యములవలన నాతాపము హెచ్చుచున్నది? నన్ను కరుణతో మోహసముద్రమునుండి దరిజేర్చుము” అని వేడుకొనగా ఆచంద్రకళ ఆ రాచకొమారుని మనోవైకల్యమును చూచి విచారించి సులోచన సంగతి మనస్సున స్ఫురింపగా ధైర్య మవలంబించి యామెను గుఱించి రాజుతో “ఓ రాజశేఖరా! వినుము. నీ విచారమును విడువుము. నీరూపలావణ్య విలాసములకుఁ దగినచిన్నది యొకతెయున్నది. నే ననఁగా నెంత? ముల్లోకములయందును అట్టిసుందరి లేదు. ఆమె తనకుతగిన వరుని గానక వివాహములేక యున్నది. మీకొఱకు ఈమధ్యనే యొకదూతికను పంపినది. ఆ దూతికే పట్టణమునకు వచ్చి మిమ్ములను చూచి మీ గుణాతిశయములను విని నాతో చెప్పిపోయినది. అనఁగా విని రాజామెతో నిట్లు ప్రసంగించెను.

రాజు:—ఏమి చెప్పినది?

చంద్రకళ:—ఆమెనుగుఱించిమీతో మనవిచేయుమని.

రాజు:—ఆమె యెచ్చట నున్నది?

చంద్రకళ:—ఆమె ప్లక్ష ద్వీపమున నున్నది.

రాజు:—ఎవరి కొమార్తె.

చంద్ర:—ఆ ద్వీపపు చక్రవర్తి కొమార్తె.

రాజు:—ఆమె పేరేమి ? తల్లిదండ్రు లెవరు ?

చంద్ర:—ఆమె పేరు సులోచన. తండ్రి గుణాకరుఁడు తల్లిపేరు సుశీల.

రాజు:—వారుండు పట్టణమేది ?

చంద్ర:—దీప్తిపురము, సముద్రమధ్యమునున్న ప్లక్ష ద్వీపమునడుమ నున్నది.

రాజు:—అయిన చాల అసాధ్యమే? అచటికిఁ బోవుట యెట్లు :

చంద్ర:—అసాధ్యమేమియు లేదు. మీ గుఱ్ఱపుసాల యందు భద్రాశ్వమున్నది. అదిఉచ్చైశ్శ్రవమునంశ చేజన్మించి నది. అది ఒక్క నిమిషములో పదునాల్గు భువనములను తిరిగి రాఁగలదు. దానిమహిమ మీ కిదివఱకు తెలియక యనాదరణ చేయుచున్నారు. దానిపై నెక్కిపోనలె నన్నచోటికి నిమిషములో బోఁగలరు.

రాజు:—ఈ కార్యమునకు నాకచట సహాయముచేయు వారెవరు ? నే నెట్లు ఆ చిన్నదానిని చూడఁగలను !

చంద్ర:—ఆ పురమున పుష్పము లమ్ముకనది యొకతె యున్నది. దానిపేరు గంధిని. దాని యింటికిబోయిన నామె ద్వారా మీకార్యము చక్కఁగా నెరవేరును. ఆమె మిగుల చతురత గలది, నిమిషములో మీకు సంధానము కాగలదు. సందేహింపకుఁడు,

రాజు:—ఆ రాచకన్య అంతచక్కనిదా ?

చంద్ర:—సంశయమేమి ? ఆమెవంటి సుందరి ముల్లోకములయందును లేదు, చక్కదనమునం దేకాదు, విద్యాబుద్ధుల

యందును, సంగీత,సాహిత్యములయందును నామెతో సరియైన వారు లేరు. ఆమె పద్మినీజాతి స్త్రీ, ఆమెకు యెడమ తొడ యందు నాగింజవలె పుట్టుమచ్చయున్నది. ఆమెను జూచిన మీకే తెలియును. ఆమెకు వివాహము కాలేదు. మీ రామెను పెండ్లియాడి మిక్కిలి సుఖింతురు. ఆలస్యముచేయక పొండు. ఈమాటలు విని మిగుల సంతోషించి రాజు తన నగరునకు వెళ్ళెను. చంద్రకళయు ఆతని బారినుండి తప్పించుకొని తన నిజ గృహమును చేరెను.

## మాధవవర్మ భద్రాశ్వముతో మాట్లాడుట

పిమ్మట పార్వతి శివునిజూచి, స్వామీ! ఆ చంద్రకళ ఎంత నేర్పరి. మాధవసింహుని బారినుండి బాగుగ తప్పించుకొన్నదే! ఏమి ఆశ్చర్యము! తరువాత నా రా జేమిచేసెనో యనఁగా శ్రీసదాశివుఁడు చెప్పెదను వినుమని యిట్లనెను. "తన నగరు చేరినవెంటనే రా జశ్వశాలకుఁబోయి గుఱ్ఱము లన్నిటిని చూచి, యశ్వరత్నములారా! నాకొకగొప్పపని తటస్థించినది. నేను ప్లక్షద్వీపమునకుఁ బోవలసి వచ్చినది. మీరు సముద్రము దాటి నన్నచ్చటికి తీసికొనిపోవలెను. ఆ పనిచేయ సమర్థతగలవా రెవరని యడుగఁగా, నాగుఱ్ఱములన్నియు నొకదాని ముఖము మఱియొకటి చూచుకొనుచు నూరకుండెను. వానిలో నొక్కటి రాజుతో నిట్లు చెప్పెను. "రాజా! నేను మీ పని చేయఁగలను. నన్ను మీ రింతవఱ కనాదరణచేయుచున్నారు. లాతి గుఱ్ఱములు తిని విడిచిన గడ్డి నాకు వేయుచున్నారు. ఉలవలు గాని, మినుములుగాని నే నిదివరకు రుచిచూచి యెఱుఁ

గను. నా శరీరము చుప్పూటలేదు. నన్నిట్లు లనాదరణచేయ చున్నారు. ప్రభు వాదరణ లేకున్న నెవరును పెద్దవ రనిపించుకొనరుగదా? నాయదృష్ట మిట్లున్నది. నేనేమి చేయ గలను. అనఁగా విని ఓ అశ్వేరత్నమా క్షమింపుము. అది న అజ్ఞానమువలన కలిగిన దోషము. జ్ఞానులు, బుద్ధిమంతుల నిగురుకప్పిన నిప్పునలె నుందురు. వారిని పోల్చుట కష్టము నేటినుండి నీవె నా పట్టపుగుఱ్ఱమగుము. అని చెప్పి దాని ముఖమున మకుటము కట్టెను.

## మాధవవర్మ ప్లక్షద్వీపము చేరుట

తరువాత మాధవవర్మ మంచిరోజున బయలుదేరి ప్రచేష్టుఁడను పేరుగల సేవకుని, కావలసినంత ధనమును వెంట దీసికొని భద్రాశ్వము నెక్కఁగా నాగుఱ్ఱము మిగుల సంతోష ముతో నాకాశమార్గమున సముద్రముదాటి ప్లక్షద్వీపముననున్న దీప్తిపురమును జేరెను. గంధిని వాకిటదిగి యామెనుజూచి తనతో చంద్రకళ చెప్పిన వృత్తాంతమంతయు చెప్పఁగా నామె విని తనలో తా నిట్లనుకొనెను. "బ్రహ్మ యెంతనేర్పరి! వీరిద్దరిని యొకలాగున సృష్టించెను. ఆసులోచనకు తగినవరుఁడితడే. ఇత నికి తగిన భార్య ఆమెయే. ఆమె పూర్వజన్మమునందు మంచి తపస్సు చేసియుండిన నీ సుందరాంగుఁ డామెకు లభించి యుండును. మించిన దాని కేమి చేయవచ్చును? అయినను చూతము అని రాజకుమారునిజూచి "రాజశేఖరా! దురదృష్ట వంతుఁడవు. నీవు వృథాగా రాజ్యము, కోట, పేట, తలిదండ్రు లను విడచి వచ్చితివి. ఈ రాక ఆయిదారు దినములు ముందట

తటస్థించిన నీ కోరిక తప్పక నెరవేరియుండును. ఇప్పుడు మించి నది. ఆ సులోచనకు నిన్ననే వివాహము నిశ్చయమైనది. కుశ ద్వీపపు చక్రవర్తి కుమారుడైన విద్యాధరునకు నామె నివ్వ నిశ్చయించిరి. ఆమెయు అతనిని వరించెను. 'రేపే వివాహము' అనిచెప్పగా విని మాధవవర్మ నిజాశాభంగమైనందుకు మూర్ఛ నొంది కొంతసేపటికి తెలివొంది లేచి యిట్లు విచారించెను. "ఓ పాపపుదైవమా! ఏల యిట్లుచేసితివి? నే నేమి పాపము చేసితిని? ఎవరి యాశ పడగొట్టితిని? నే నెవరికొఱకు నింత ప్రయాసపడి సముద్రముదాటివచ్చితినో యామెనుమఱియొకడు తీసుకొనిపోవుచున్నాడు. అది చూచుటకావచ్చితిని. అయ్యో విధి! ఎంతపాపము! ఏమిచేయుదును!" అని దుఃఖించి గంధిని చేతులు పట్టుకొని కొంత ధనము కొన్ని రత్నము లామె చేతులనిండ పోసి సంతోషము కలిగించి నన్ను రక్షింపుమని దీనతతో ప్రార్థించి యిట్లనెను. "ఓ మాలినీ! ఇచ్చట నీకంటె నాకు వేరు దిక్కు లేరు. నీవే నన్నుద్ధరింపవలెను. కావున నాయందు దయయుంచి దూతికవై పోయి నే నిచ్చు చీటి యెవరికి కనపర్చకుండ తీసికొనివెళ్ళి యామెకు రహస్యముగా నిచ్చి యామె నన్నువరించునట్లుచేయుము. నీమేలు మరువను." అని బ్రతిమాలెను.

## గంధిని చీటి సులోచన కిచ్చుట.

ఆ మాటలు విని మనస్సు కరిగి గంధిని తనచేత నైనంతమట్టుకు ప్రయత్నింపవలెనని యెంచి తాను తయారు చేసిన పువ్వుల బంతులతో మాధవవర్మ యిచ్చిన చీటి

సులోచన కివ్వగా నామె పువ్వులు శిరస్సున ముడుచుకొని చీటి రహస్యముగా చదువుకొని తన ప్రియసఖిని పిలిచి రహస్యముగా నామెతో నిట్లనెను. "సఖీ! నీవు నాఁడు జంబూ ద్వీపమునకుబోయి చూచివచ్చిన మాధవవర్మ యిచ్చుటికివచ్చి గంధిని యింట నున్నాఁడు. చంద్రకళతో నీవు చెప్పిన నా వృత్తాంతమంతయు నామెవలన తాను విని తల్లిదండ్రులను రాజ్యమును విడిచి, సముద్రము దాటి, చాల కష్టపడి నా యందలి మోహముచే వచ్చినాఁడు. ఇప్పుడేమి చేయుదుము. అని చెలికత్తెతో నాలోచించి చీటివెనుక జవాబువ్రాసి గంధిని చేతికి రహస్యముగా యిచ్చి పంపెను. దానిని చదివి రాకుమారుఁడు సంతోషముగా నుండెను. అందు వ్రాయఁబడిన సంగతు లేమనఁగా "రాజశిఖామణీ! మీరు నాయందలి ప్రేమచే చాల శ్రమపడి విచ్చేసితిరి. మీవంటి సుందరాకారులకు స్త్రీరత్నములు దొరకుట యసాధ్యమా? మీ రాక యాలస్యమగుటచే మా తండ్రిగారు నన్నిదివఱకే కుశద్వీపచక్రవర్తి కుమారుడైన విద్యాధరునకిచ్చి వివాహము రేపే చేయ నిశ్చయించిరి. తరుణము మించినది. నేనేమి చేయగలను. తండ్రిగారి మాట విననున్న నపకీర్తిపాలగుదును. ఇంత శ్రమ పడి వచ్చిన మిమ్ము విడిచిన ద్రోహము చేసినదాన నగుదును. ఇందుకు నేనొక్క వెరవాలోచించితిని. అది యేమనఁగా రేపు రాత్రి నన్ను వివాహవేదికయొద్దకు తీసుకొనివచ్చునప్పుడు నా చేతులు మీదికియెత్తి నిలుచుందును. అప్పుడు మీరు నన్ను తీసుకొని వెళ్ళగలిగిన మీ పత్నినగుదును. ఇది నిశ్చయము. అట్లయిన నాకు నిందయుండదు. మన కోరిక నెరవేరును."

సులోచన మాధవవర్మను జూడఁబోవుట.

ఇట్లు చీటి వ్రాసి పంపిన ప్రియసఖిని పిలచి యామెతో నిట్లనెను. "ఓసఖీమణీ! నేను సంకేతమిచ్చి చీటి వ్రాసి పంపితిని కాని నామన సూఁరడిల్లుటలేదు. ఏమి చేయుదును ? ఆయన దూరముననుండిన లేకపోవునుగాని సమీపమున నున్నారు. కావున జూడకుండ ఇంతసాహసము చేసి, నాతండ్రిగారు కోరి తెచ్చిన వానిని విడిచి, యితనిని వరించిన తుదకు మోసపోదు నేమో? ఇతఁడు సముద్రముదాటిగదా యిచ్చటికిరావలెను. ఎట్లు రాగలిగెను, ఓడలు లేవుగదా ? ఆకాశమార్గముననగదా రావలెను. మనుజుఁడెట్లు రాఁగలఁడు ? గంధర్వుఁడో యక్షుఁడో మారు పేరుతో వచ్చి యుండును. మనము పరిశోధించి చూడకుండ వివాహము చేసికొని మోసపోవుట మంచిది కాదనినాకు తోచుచున్నది. ఇందు కుపాయ మాలోచింపుము" అని చెప్పఁగా నామెతో చెలికత్తె యిట్లనెను, "ఓ చెలీ! బాగుగ ఆలోచించితివి. ముందుగాఁ జూచుట మంచిదే. సముఖమున నున్న వారితో రాయబారమేమి ! నేఁటిరాత్రి వేకువజామున మనము కొలనికి స్నానము చేయఁబోవు మిషచే బోయి చూచివత్తము" అనఁగా సులోచన సరేయని బాగుగ నలంకరించుకొని పరుండెను. కాని నిదుర బట్టక విరహవేదన బడుచు నాఁటిరాత్రి గడపి వేకువనే కొందఱు దాసీజనంబులతో బయలుదేరి వారిని వలయాకృతిగ తనచుట్టు నుంచుకొని తాను వారి మధ్యమున నడచుచు గంధిని యింటికిబోయి తన రాకను రాజు కెఱిఁగింపు మనఁగా నామె యటులచేసెను. అప్పుడు వధూవరులు పరస్పరమును జూచుకొని కామశరీరపీడి

తులై హ్లాదయానందము నొందిరి. ఆసమయమున వారి సంతో షమును, అన్యోన్యానురాగములును, ఊహింపవలసినదే కాని చెప్పనలవికాదు, సిగ్గుచే వా రొకరితో నొకరు మాట్లాడ లేకున్నను, చూపులవలన వారి మనోభావములు తేటబడుచుండెను. మన్మథుఁడేమో యని యామె భ్రమ చెందెను. రతిదేవియని యాతఁడనుకొనెను. మాచెలి వ్రాసిన సాంకేతమును మీరుమరువకుడని సఖిచే చెప్పించి యామెకను సంజ్ఞచే సెలవుతీసికొని చెలికత్తెలతో గలిసి యామె యంతఃపుర మునకుఁబోయెను.

సులోచన మాధవవర్మ నౌకరు తీసుకొనిపోవుట.

ఆ మరునాఁడు విద్యాధరుఁడు చాలపరివారముతో వివా హమునకు వచ్చెను. అనేక సామంతరాజులు, బంధువులు, స్నేహితులు కూడవివాహమును చూడవచ్చిరి. గొప్ప యుత్స వముజరుగుచుండెను. రాత్రి యెనిమిదిగంటలకు సుముహూర్త మగుటచే పెండ్లికుమారుఁడు వివాహవేదికపై నుండెను. బ్రాహ్మణులు పుణ్యాహవాచనములు చేయుచుండిరి. ఆ సమ యమునకు మాధవవర్మ విశేష నిద్రలోనుండెను. ఆ దినమున తానురాత్రి తెలివిగా నుండవలెనని మధ్యాహ్నమున కొంత సేపువిశ్రమింతమని పరుండెను. కాని యెంతకును తెలివిరాకుం డుట చూచి సులోచన చెప్పిన సాంకేతమునువినియున్న యతని నౌకరువానిని నెంతలేపినను లేవనందున మిగుల యాలోచించి తానే గుఱ్ఱముపై యాకసమునకెగసి పైనుండిక్రిందికిచూచి వేదిక యున్నస్థలమును కనిపెట్టి, అచ్చట నిలుచుండి దేవుని ప్రారం

చుదానివలె చేతులు మీదికెత్తి ధ్యానించుచున్న సులోచన చేతులు పట్టి మీదికి లాగుకొని తన ముందు గుఱ్ఱముపై కూర్చుండబెట్టుకొని రెప్పపాటు కాలమున గగనమునకెగసి, యదృశ్యుఁడయ్యెను. మొదట తానుబయలుదేరునపుడుసాంకేత సమయముమించిన కార్యముచెడుననియు, తనయజమానుఁడు నిద్రమత్తుచే లేవకుండినను, తరువాత దుఃఖసాగరములో మునుగుననియు, తానైనను సమయముమించకుండపోయి యా స్త్రీని తీసికొనివచ్చి, తనయజమానుని కొప్పగించిన యాతఁడు సంతోషించి తన్నుమెచ్చుననియు నాపనికిపూనుకొన్న,పిమ్మట ద్రోహబుద్ధిగలవాఁడై యాస్త్రీనితానేయపహరింపవలెననియెంచి సముద్రమును దాటించి తీసికొని పొమ్మని యాభద్రాశ్వమున కాజ్ఞాపింపఁగా నది యట్లు చేసెను. పోగా పోగా వారారాత్రి తెల్లవారుజాము సరికి సముద్రముదాఁటి కొంతదూరమేగి యొక నిర్జన ప్రదేశముననున్న తోటలోదిగిరి. అచ్చట ప్రచేష్టుఁడు సులోచననుచూచికామోద్రేకముగలవాఁడై యిట్లనెను! "ఓసఖీ నిన్ను ప్రేమించిన మాధవవర్మ నీవు చెప్పిన సాంకేత సమయమునకుకాలనిద్రచేపరవశుఁడయి నీయొద్దకురాలేకపోయెను. నేను వాని నౌకరును. నాపేరు ప్రచేష్టుఁడు. నిన్ను చాలశ్రమపడితీసికొని వచ్చితిని. నీకుప్రాప్తమున్నట్లు జరిగినది. బ్రహ్మలలాటమునందు వ్రాసినవ్రాత తప్పింపవలెనన్న నెవరివశము! ఇప్పుడందు విషయమై విచారింప లాభములేదుగదా! నేనిప్పుడు మన్మథునిచే పడింపఁబడుచున్నాను. నన్ను నీవాదరింపవలెను. ఈ సమీపముననే కాంచన నగరమున్నది. దానిచుట్టు సముద్రమున్నది. అందు మనము నిర్విచారముగాను, నిర్భ

యముగా నుండవచ్చును. నా యీకామాగ్ని నీయధరామృత మను వర్షముచే చల్లార్పుము. లేకున్న యీయగ్ని నా దేహ మును దహించును. నా ప్రాణముకు రక్షించి పుణ్యమును బొందుము. లేకున్న నా ప్రాణహత్యచేసిన పాతకము నిన్ను పొందును. ఇచ్చట నెవరును లేరు; మన మిద్దఱము యౌవన వంతులము, సమవస్కులము, కావున యాలస్యముచేయక రమ్మని పట్టుకొనఁబోగా, నామె కొంచెము తప్పించుకొని తనలో తా నిట్లు వితర్కించెను. "హా దైవమా! ఏమి యిట్లు విధించితివి! తండ్రిమాట జవదాటినందుకు ఫలమా ఇది! ఏమి చేయుదును! నాప్రాణము లైనను పోవాయెనుగదా! నాతలవ్రాత ఇట్లున్నదా! రాజపుత్త్రికనై యున్నను నేకరు పాలయితిని చక్రవర్తులచే కామింపబడిన నన్ను చాకలవాఁడు కామించుచున్నాఁడు. విధివశము నెవరు తప్పింపఁగలరు! తలిదండ్రు లెక్కడ! అన్నదమ్ము లెక్కడ! ఎక్కడిభార్య! ఎక్కడభర్త! అన్నియు ఆదైవమే, అసనె సంసారమందు గర్వించువారి గర్వమను వృక్షమును ఆ బ్రహ్మ తనకోపమను గొడ్డలితో ఛేదించును గదా! ఓ దైవమా! ఇప్పుడు వీని బారినుండి తప్పించుకొనుట యెట్లు! అని శ్రీహరిని మనస్సా ప్రార్థించి ఈ విచారముతో పనిలేదు. ధైర్యమవలంబించ వలెను." అని ప్రచేష్టునిజూచి మృదుమధుర వాక్యములతో నిట్లనెను, "ఓప్రచేష్టా! నీకంటె వేరుదిక్కెవరు! రాజ్యము, తల్లి, దండ్రి, పెనిమిటి యందఱిని విడచి నీతో నింతదూరము వచ్చితిని యిచ్చట నీవే నాకు నందఱివంతును కనబడు చున్నావు. కావున నే చెప్పునది వినుము. ఈ సంసారము

ధర్మము వలన నడచుచున్నది. ధర్మమును విడచిన నరకము ప్రాప్తించును. నేను రాజపుత్త్రికను, కన్యకను, కావున నీవు నన్ను విధి యుక్తముగ పెండ్లియాడి నాతో సుఖ మనుభ వింపుము. నేను కాదనను. అట్లుగాక నన్ను బలాత్కారముగ పట్టిన నేను నశింతును, నీవు నరకమున బడుదువు. కాంబట్టి నీ వీ రత్నకంకణము తీసికొని యీదరినున్న పట్టణమునకుం బోయి దానిని విక్రయించి వివాహమునకు కావలసిన సామగ్రి తీసికొని త్వరగా రమ్ము. నేను నీరాక ప్రతీక్షించుచుందును," అని చెప్పంగా వాం డామెమాటలు నమ్మి త్వరలో వచ్చెద నని చెప్పి పోయెను. వాండట్లు పోగా నామె యిట్లనుకొనెను. "వీండు మూర్ఖుండు. సులభముగా నన్ను నమ్మెను. నేను వీనిని మోసగించి గంగాతీరమునకీ గుఱ్ఱముపైని బోయి తపస్సు చేసి కొద్దికాలములో నామనోహరుండు నాకు లభింపకున్న గంగలోంబడి ప్రాణత్యాగము జేసికొని ముందు జన్మమందై నను వానినిపొందుదును" అనుకొని గుఱ్ఱము నెక్కి ప్రయాగకు పోవలెనననెను.

సులోచన అప్సరసలయొద్ద యింద్రజాలము నేర్చుకొనుట.

అది విని ఆ గుఱ్ఱము గగనమార్గమున పోవుచుండంగ సులోచన కొందఱుగంధర్వస్త్రీలు విమానమున బోవుచుండుట చూచెను. వా రామెను తన వృత్తాంత మడుగ నంతయు వారితో చెప్పంగా విని యామెతో వా రిట్లుచెప్పిరి. "ఓ నారీ రత్నమా! నీకు భయములేదు. విచారింపకుము. నీకు మే మింద్రజాలమంత్రమును చెప్పెదము. దానిని జపించిన నీ కసా

ర్యము లన్నియు సాధ్యమగును" అని మంత్ర ముపదేశించి వారు తమ లోకమునకుఁ బోయిరి.

పిమ్మట నామె ప్రయాగకుఁబోయి, గంగలో స్నానము చేసి, గంగాదేవిని పూజించి, స్త్రీరూపమున నుండుట కష్టమని యెంచి పురుషవేషము దాల్చి వీరవరుఁడను పేరుతో ప్రయాగదేశమునకు రాజైన సుషేణుని యొద్దకుఁబోయి తగిన మర్యాదతో నాయనను దర్శించి తనకు సమస్తశాస్త్రములు నస్త్రవిద్యలు తెలియుననియు నితరులకు నసాధ్యమైన పనులు తాను చేయుదుననియు చెప్పి యాయనయొద్ద కొలువుండెను. ఆరాజు న్యాయాధికారిగానుండి దోషులను శిక్షింపుమని గంగాతీరముననున్న యొక మేడలోనతనికి బసయిచ్చెను. ఆపనిచేయుచు నతఁడందుండెను. ఇట్లుండఁగా నాదేశములోనికిగండామృగము వచ్చి మనుష్యులను, పశువులను చంపుచు ననేకోపద్రవములు చేయుచుండెను. దానిని నెవరును చంపలేకయుండిరి. దానిని రాజుకూడ చంపలేక యుండెను. అప్పుడు రాజు దానిని చంపిన వానికి తన కొమార్తె నిచ్చి వివాహము చేయుదునని చాటించెను. వీరవరుఁడు దానిని వధించుటకు చేత కత్తిపట్టుకొని తన భద్రాశ్వమునెక్కి గగనమున కెగసియొక్కవేటున దానిని నరకెను. అది చచ్చి క్రిందపడఁగా నందుండి ఒకదివ్య పురుషుఁడు బయలుదేరి వీరవరునితో నిట్లనెను. "ఓయీ! నీచరిత్ర యంతయు నాకు తెలియును. నీవు పురుషవేషమున నున్న స్త్రీవి. నీవృత్తాంత మంతయు నాకు తెలియును. చెప్పెదను. వినుమని యంతయు సవిస్తరముగ చెప్పెను." అదివినివీర వరుఁ డాశ్చర్యపడి నీవెవరవు? నీచరిత్రము చెప్పుము, అనఁగా

అతఁ డిట్లు చెప్పెను. "ఓ సులోచనా! వినుము. నేను ముందు భరతవర్షమునందు సూర్యవంశపురాజును. అప్పుడు నాపేరు ధర్మమూర్తివి. నేను సర్వశాస్త్రములు, విలువిద్య నేర్చి ప్రజలను న్యాయముతో పాలించుచుండువాఁడను. అనేకధర్మ కార్యములు, యజ్ఞములు, యాగములు చేసి గోదానములు, భూదానములు, హిరణ్యదానములు చేసితిని. కాని తుదకు దుర్జన సహవాసము చేసి పాషండులతో గలిసి నాస్తికుఁడనై నే నిచ్చిన దానభూములు నేనే దీసికొని బ్రాహ్మణులను బాధించితిని. అందువలన బహు పాపుఁడనని పేరు పొందితిని. కొంతకాలమునకు నేను మరణించఁగా యమదూతలు వచ్చి నన్ను కట్టి కొట్టి బాధించుచు బహు బాధకరమైన త్రోవను తీసికొనిపోయి యమునియెదుట నిలువబెట్టఁగా నాయన నన్నుఁ జూచి కోపించి నా పాపపుణ్యములెక్క చిత్రగుప్తుల నడుగఁగా, వారు నాచిత్తాలు తీసి ఇట్లుచెప్పిరి. అది విని వీఁడు బహుపాపి. బ్రహ్మస్వము హరించెను. వీనిని పూతిగంధనరక కూపములో కోటియుగములవఱకు వేయుడని తన దూతల కాజ్ఞాపించెను. వారట్లుచేసిరి. అచ్చట నిలుచుటకు వీలు లేనంత కంపుబాధలు పడితిని. వానినితలఁచినంత మాత్రమున నాదేహ మిప్పుడు వణఁకుచున్నది. ఆ ఘోరకాలమును గడిపి గండామృగమునై పుట్టి అనేకజంతువులను మనుష్యులను జంపి తుదకు నీచేగంగాతీరమున చంపఁబడితిని. కావున నా పాపములు కడతేరెను. ఈదివ్యరూపముతో విమానముపై వైకుంఠమునకుఁ బోయెదను. నీవు బహు పుణ్యాత్మురాలవు,

గంగను సేవించుటచే సమస్తపాపములును నశించెను. నన్ను చంపినందుకీ రాజు తన కొమార్తెను నీకు వివాహము చేయును. నీవు నీభర్తయైన మాధవవర్మను త్వరలోనే కలిసికొందువు. మీరుభయులు గంగను సేవించుచు నిచ్చటనే చిరకాలముండి పుత్త్రపుత్త్రీ సంతానము గలవారగుదురు. మీవంశము చాల వర్ధిల్లును. ఈగంగను నిత్యము సేవించుచుండుటచే మీరీ జన్మాంతమున వైకుంఠధామమును చేరుదురు, అని చెప్పి విమానముపై బోయెను. ఆ దివ్యపురుషుని మాటలకు వీరవరుఁడు మిగుల నాశ్చర్యమునొంది తన యజమానియైన సుషేణుని యొద్దకుఁబోయి గండామృగమును చంపితినని చెప్పఁగా నతఁడు సంతోషించి, మంచిముహూర్తమున తన కొమార్తెయైన జయంతి నిచ్చి వివాహము చేసెను. వీరవరుఁడా కన్యను తనభవనమునకు తీసికొనివెళ్ళి యామెతో నిట్లనెను. "ఓ సఖీ ! నేనొక కార్యార్థినై నియమముపూని బ్రహ్మచర్యముతో నున్నాను. కావున నీవు కొంతకాల మోర్చియుండవలెను. తరువాత మనము సుఖింపవచ్చును. అనఁగా నామె సరేయనెను.

ప్రచేష్టుఁడు, విద్యాధరుఁడు మాధవవర్మ ప్రయాగకు పోవుట.

ఇట్లు వీరుండఁగా వివాహసామగ్రి తెచ్చుటకుఁబోయిన నౌకరు, వానిని గొనితెచ్చి, ఆ తోటయందు సులోచన గుఱ్ఱము లేకుండుటచే మిక్కిలి విషాదమునొంది చేయునది లేక నిరాశనొంది, ప్రాణములపై యాశవిడచి ప్రయాగకుపోయి గంగలోబడి ప్రాణములు విడచిన జన్మాంతమందైనను సులో

చన తనకు లభించుననియెంచి ప్రయాగకుఁబోయి గంగలో స్నానముచేసి, ధ్యానించి యాత్మహత్య చేయఁబోఁగా, నచ్చట వీరవరునివలన కావలి యుంచబడిన భటులు వానిని పట్టుకొని తమ యధికారియొద్దకు తీసికొనిపోయి అయ్యా! ఇతఁ డాత్మహత్యచేయ ప్రయత్నించెనని చెప్పఁగా వానిని పోల్చి కారాగృహమున నుంచుమని చెప్పెను. పిమ్మట మఱికొద్దికాలములో విద్యాధరుఁ డట్టి యుద్దేశముతోనే ప్రయాగకుఁబోయి బందీగృహ ములో వేయఁబడెను. ఇతఁడు నాఁడు వివాహమునాఁటి రాత్రి తానుబొందిన యవమాన మును సహింపలేక తనరాజ్యమునకుఁ బోవ లజ్జించి యిట్లు వచ్చెను. తరువాత కాలనిద్రచే విడువఁబడిన మాధవవర్మ సులోచన చెప్పిన సంకేత సమయముమించెననివిచారించిలేచి తననౌకరు, గుఱ్ఱము లేకుండుట చూచి సులోచన యదృశ్య మైన సంగతివిని తన నౌకరే యిట్టి ద్రోహము చేసెనని యెంచి చేయునదిలేక యాశాభంగమునొంది, యట్టిసుందరి తనకులభింప నప్పుడు మఱి తన జీవనముతో కార్యములేదని ప్రయాగయొద్ద గంగలోఁబడి మరణించిన వారికిమఱియొక జన్మలోనైన కోరిక నెరవేరునను మాట లోకప్రసిద్ధముగాన యాప్రకారము చేయ నిశ్చయించి యచ్చటికిఁబోయి గంగలో స్నానముచేసిసూర్యున కర్ఘ్యమిచ్చి,యీశ్వరునిధ్యానించియందుఁబడి ప్రాణములువిడువ బోఁగా భటులు పట్టుకొని వీరవరుని యెదుటపెట్టిరి. అతనిని చూచి పోల్చి వీరవరుఁడు తగినమర్యాదచేసి కూర్చుండబెట్టి వాని వృత్తాంత మడుగఁగా నతడుజరిగిన దంతయు చెప్పెను. ఆయన యచ్చట నుండగనే ప్రచేష్టుని రప్పించి నీవేల యాత్మ

హత్య చేసికొన ప్రయత్నించితి వనఁగా వాఁడు తన వృత్తాంత మంతయు విన్నవించెను. అది విని వానికి తగిన శిక్షవిధించెను. పిమ్మటవిద్యాధరుఁడేపిలిపించివాఁడేలయాత్మహత్య చేయఁబోయె నని యడుగఁగా వారిచరిత్ర యంతయు నతఁడు సవిస్తరముగా చెప్పెను. అప్పు డతఁడు వానికి వైరాగ్యము బోధించిసన్యాసి వేషముతో గంగాతీరమున తపస్సు చేసికొనుచుండునట్లు చేసెను. పిమ్మట వీరవరుఁడు మాధవవర్మను తీసుకొని సుషేణుని యొద్దకుబోయి యతని వృత్తాంతము తనవృత్తాంతము సవిస్తర ముగా చెప్పి తనను జయంతిని మాధవవర్మకిచ్చి యథావిధిగా వివాహముచేయుమని ప్రార్థింపఁగా నారాజట్లు చేసి కొమా ర్తెలకు నల్లునికి తగిన మర్యాదలు కట్నములు కానుకలు నిచ్చెను. వారు మిగుల సంతోషమును పొంది కేళీవినోదములు సల్పుచు నచ్చటనేయుండిరి. సుషేణునికొ కొక్కతె కొమార్తె కావున తనరాజ్యము మాధవవర్మకు పట్టాభిషేక మొనర్చెను. సులోచనకు పన్నిద్దఱు జయంతికి పదిమందికుమారులుకలిగిరి. వారు నిత్యము గంగలో స్నానముచేయుచు పూజించుచు శ్రీమన్నారాయణుని ధ్యానించుచుండిరి. ఇట్లుండ శ్రీహరి కరుణించిమాధవవర్మకు దర్శనమిచ్చెను. అప్పుడతఁడాయనకు ప్రదక్షిణ నమస్కారములుచేసి, అనేకవిధముల స్తోత్రములు చేయఁగా, శ్రీహరి యాతని భక్తికిమెచ్చి, దేహాంతముననాదంప తులకు ముక్తిని ప్రసాదించెను. అని శివుఁడుపార్వతితో చెప్పెను. గంగాతీరముననుండి గంగాదేవిని శ్రీహరినిధ్యానించుచు పూజిం చుచు ఉండుటవలన వారికష్టములు పోయి కోరికలు నెరవేరి జీవించునంతకాలముసుఖించి సిరిసంపదలతో దులదూఁగి, యింత

మందు నైకుంఠమును పొందిరి. గంగామాహాత్మ్య మిట్టిది.

## వాంఛావట మాహాత్మ్యము, పద్మావతి చరిత్రము

పూర్వము ప్రయాగయందు ప్రణిధి యను పేరుగల ధనికుడైన కోమటియుండెను. అతడు దేవబ్రాహ్మణ భక్తి కలిగి దానధర్మములు చేయుచు శ్రీహరియందు చాల భక్తి కలిగి ధ్యానించి పూజించుచుండువాడు. అతని భార్య పేరు పద్మావతి. ఆమె మిక్కిలి సౌందర్యము గల స్త్రీలలో నొకతె. ఆమె పద్మినీజాతి స్త్రీ యగుటచే గొప్ప ప్రతివ్రత. ఆ దంపతులు మిగుల యన్యోన్యానురాగము గలవారై సుఖముగా నుండిరి. అట్లుండగా నా వణిజుడొకనాడు భార్యనుజూచి యిట్లనెను. ఓసఖీ! వ్యాపారమునకుబోయి ధనమార్జించి తేవలెను. అందుకు పైదేశమునకుబోయెద ననగా నామె భర్తను జూచి యిట్లు చెప్పెను. "స్వామీ, మనకు కావలసినంతధనమున్నది. అదియే చాలును. మఱి మీ రన్యదేశములకుబోయి శ్రమ పడవలసిన యావశ్యకము లేదు"అనెను. అదివిని ప్రణిధిభార్యతో నిట్లు చెప్పెను. "ఓసఖీ! ధనమువలననే యన్నియు కలుగును. ధనమువలననే ధర్మము వృద్ధియగును. దానివలననే కీర్తి కలుగును. దానివలన వంశమువృద్ధిపొందును. అది లేకున్న యన్ని కర్మలు క్షీణించును. ధనహీనుని స్నేహితులు, బంధువులు విడుతురు. ధనము గలవారికి పరులు బంధువు లగుదురు. అది లేనివానిని భార్యాపుత్త్రులు సహితము విడతురు. ధనహీనుని కిహమందుగాని, పరమందుగాని సుఖములేదు. కావున నన్ని విధములను ధనము ప్రధానము. నీవు నాకు

సెలవిచ్చి పంపిననే బోయి ధన మార్జించి కొన్ని కాలములో వత్తును. "అనఁగా నామె యనుమతించెను. కొన్ని దినుసుల సామానులు బళ్ళపైని వేసికొని,యతఁడు వ్యాపారమునకుఁబో యెను. తరువాత కొన్నాళ్ళకు పద్మావతి తన దాసిని తీసికొని గంగానదిలో స్నానము చేయఁబోయెను. అచ్చట నామె స్నానము చేయుచుండగా నొకమాలవాఁడామె చక్కదనమును చూచి మోహించి దగ్గరకుఁబోయియామెను కామించెను. ఆమె మహాపతివ్రత కనుక దానిని నిరాకరించెను. అట్టి స్త్రీ తనకు లభింపనందుకు మిగుల దుఃఖించి తనజన్మమును వృథా యని యెంచి గంగలోఁబడి ప్రాణములు విడచి యైనను తిరిగి మఱియొకజన్మమందైనను, నామెను పెండ్లాడవలెనని తలంచి, యచ్చటనే యున్న వాంఛావటముపై నెక్కి యీ కోర్కె నెర వేర్పవలెనని శ్రీహరినిధ్యానించి గంగలోదుమికెను. వెంటనే వాఁడు చావక యామె భర్తయైన ప్రణిధిరూపమును బొంది యప్పుడేపద్మావతి యింటికిఁబోయెను. ఆసమయముననే యామె భర్తయైన ప్రణిధికూడ వ్యాపారమునుండి తిరుగ నింటికి వచ్చెను. వారిద్దఱు నొకటే రూపమును నున్నందున, ఆమె యాశ్చర్యపడి వారిలో తనభర్త యెవరో తెలిసికొనలేక తన యిష్టదేవతయైన శ్రీమన్నారాయణుని బహుభక్తితో ప్రార్థిం పఁగా నాయన ప్రసన్నుఁడై యిట్లనెను. "ఓ పద్మావతీ! నీవును నీభర్తయు నాకు ప్రియభక్తులు. నాఁడు నిన్ను గంగాతీర మున కామించిన మాలవాఁడును నన్ను మిక్కిలి ధ్యానించి గంగలో బడి సమస్తపాపములను పోగొట్టుకొని పవిత్రుడయి నావరమున నీభర్త రూపమును పొందెను. కావున వారిద్ద

త్రిని నీవు భర్తలుగా నంగీకరింపుము.” అనఁగా నిట్టి వింత యెందు గలదు? ఒకపురుషునికిద్దఱుగాని హెచ్చుగానిభార్య లుండుట లోకములో చూచుచున్నాము. కాని ఒకస్త్రీకియిరు వురు భర్తలనుట వినలేదు. ఇది నిందాస్పదముకదా ? పల ుట్లు సెలవిచ్చిరి. అనఁగా భూలోకమున నిది తప్పుగా తలంతురు గాని వైకుంఠమున దోసములేదు. నీకు విమానము వచ్చును. అందు మీముగ్వురును కూర్చుండి నాలోకము చేరుడు. అందు సుఖముగా నుండగలరన వారటులచేసి ముక్తి నొందిరి.

## గయాశ్రాద్ధఫలము

ఆ పద్మావతి చరిత్రను విని పార్వతి మిగుల యాశ్చర్య మునొంది యీశ్వరుని జూచి స్వామీ ! గంగాస్నానమువలెనే, గయా శ్రాద్ధము కూడ గొప్పఫలము నిచ్చునని చెప్పుదురు. కావున గయామాహాత్మ్యము వినఁగోరుచున్నాను. సెలవిచ్చి నన్ను కృతార్థురాలను చేయవలెనని ప్రార్థింపఁగా దేవీ ! వినుమని యా పరమేశ్వరుండిట్లు చెప్పనారంభించెను. పూర్వ పుణ్యము గలవారు గయకుఁబోయి శ్రాద్ధము చేయుదురు. వారికి కోటిపుణ్యములు కలుగును. దాని ఫలమింత, యంత యని చెప్పుటకు వీలులేదు. గయాశ్రాద్ధము యథావిధిగాచేసిన వాని పితరులు వైకుంఠమును పొందుదురు. గయలో నెవరి పేర పిండ ప్రదానము జరుగునో వారందఱు మోక్షమును పొందుదురనుటకు సందేహము లేదు. ఇందుకు దృష్టాంత ముగా నొక పురాతనేతిహాసమున్నది. దానిని చెప్పెద

వినుము. పూర్వము కన్యాకుబ్జదేశమున చిత్రరథుండను బీద బ్రాహ్మణుడుండెను. అతని భార్య పేరు చిత్రసేన. వారిరువురు బహుపాపులు, వారి పాపములెంతిచెప్పినను తరుగవు. వారిలో భర్త గొప్పవ్యాధులచే పీడింపఁబడి ముందుగా చని పోయెను. అంతట యమ దూతలు వాని యొద్దకు వచ్చి పాశములతో కట్టి కొట్టి బహుబాధలు పెట్టుచు తీసికొనిపోయి యముని యెదుటఁ బెట్టఁగా నాయన చిత్రగుప్తులను జూచి వీని పాపములను చెప్పుడనఁగా 'అయ్యా! ఇతఁడు పాపమేగాని పుణ్యము చేసి యెరుఁగడు అనిరి. అది విని వానిని కుంభీ పాకమున వేయుమని యముఁడాజ్ఞ ఇచ్చెను. ఆపాపి యామాట విని వణఁకుచు నేడువసాగెను. అదిచూచి చిత్రగుప్తులు కనిక రించి వాని కిట్లనిరి. "ఓయీ! నీవు భయపడకుము. నీవు బహు కాల మిందుండవు. త్వరలోనే ముక్తినొందెదవు. నీకొమాళ్ళలో నొకఁడు కొద్దికాలములోనే గయలో శ్రాద్ధము చేయును," అనఁగా విని వాఁడు మిగుల సంతోషించెను. తరువాత కొంతకాలములో వాని కుమారులలో నొకఁడు పదిరెండు సంవత్సరములు ప్రాయములో నుండి యాటపాటల యందు శ్రద్ధగలవాఁడై తన ప్రాయపు బాలురతో కలసి భోజనమువకైన నింటికి రాకుండుట జూచి వాని తల్లి వానిని పలువిధముల చీవాట్లు పెట్టినందున వాఁడు ప్రాణము విసిగి వైరాగ్యముపొంది యిల్లు, గ్రామము, దేశమువిడిచి తీర్థయాత్ర లకుఁబోయెను. అనేక క్షేత్రములు, తీర్థములు, సేవించి ప్రయాగకు వెళ్ళి గంగా సాగరసంగమమున స్నానముచేసి శ్రీమాధవమూర్తిని దర్శించి పిమ్మట గయకుఁబోయి తన పితృ

లకు యథావిధిగా శ్రాద్ధముచేసెను. అందువలన వారందఱు సకలలోకబాధలను తప్పించుకొని వైకుంఠమునకుఁ బోయి ముక్తి నొందిరి.

## అశ్వత్థమాహాత్మ్యము

పార్వతి గయాశ్రాద్ధఫలమును విని సంతసించి యీశ్వరుని చూచి నాథా! వృక్షములన్నిటిలో యశ్వత్థము మిగుల శ్రేష్ఠమైన దని చెప్పుదురు. అందుకు కారణ మేమని యడుగఁగా శివుఁడిట్లనెను. ఓ పార్వతీ! జనుల పాపములను నశింపఁజేసి వారిని యుద్ధరించుటకు శ్రీ మహావిష్ణువు వైకుంఠమునుండి వచ్చి యీ భూలోకమున వృక్షరూపమును పొందెను. కావున దానిని దర్శించినను, పూజించి ప్రదక్షిణముచేసి నీరుపోసినను, శ్రీ విష్ణువును ప్రత్యక్షముగా పూజించిన ఫలమును జనులు పొందుదురు. వారు చేసిన సమస్త పాపములు నశించును. నిత్యము రావిచెట్లకు నీళ్లుపోసి పూజించి దర్శించువారు చతుర్వర్గఫల మనఁగా ధర్మ, అర్థ, కామ, మోక్షములు తప్పక పొందుదురు. ఆ చెట్టుమొదట వేదికట్టించినవారికిని, నన్నిపాపములు నశించును. ఆ చెట్టునందు శ్రీహరి సదా వాసము చేయుచుండును. ఇందుకు దృష్టాంతముగా పురాత నేతిహాస మొకటి యున్నది. దానిని చెప్పెదను శ్రద్ధతో వినుము. పూర్వము త్రేతాయుగమున సౌరాష్ట్ర దేశమందు ధనంజయుఁడను పేరుగల బ్రాహ్మణుఁడుండెను. అతనికి సుశీల యను పేరుగల భార్యయుండెను. ఆ దంపతు లిద్దఱును, బహు పుణ్యాత్ములు. దైవభక్తులు. సదా శ్రీహరినే ధ్యానిం

చుచు, వారు బహుబీదవారైననప్పటికిని యతిథి, యభ్యాగతులను పూజించుచుండువారు. ఆ బ్రాహ్మణుడు భిక్షాటనము జేసి కాలమును గడుపుచుండెను. ఏ కారణమువలననో యొక దినమున నతడు భిక్షకు పోనియెడల, నా రోజున పస్తుపడి యుండేవారు. కాని వేరు జీవనోపాధి లేకుండెను. చలికాలములో వారికి బట్టలు లేనందున ఆ బ్రాహ్మణుడడవికిఁబోయి కట్టెలు తెచ్చుకొని రాత్రి నెగడి పెట్టుకొని యాదరిని కూర్చుని చలిబాధను నివృత్తిచేసికొనుచుండువాడు. ఒకరోజున భిక్షమెత్తుకొనివచ్చుటయాలస్యమగుటచే ఆదినమునఁనడవికిబోవుటకు సమయము చిక్కకుండెను. చలిబాధ హెచ్చుగా నుండెను. కట్టెలు లేకుండుటచేతను పెరటిలోనున్న రావిచెట్టునొద్దకుబోయి దానినున్న యెండుకొమ్మనొకదానిని గొడ్డలితో కొట్టెను. అది క్రిందపడెను. కొమ్మక్రిందపడినవెంటనే యందుండి శ్రీమన్నారాయణుడు బయలువెడలి శంఖ చక్ర గదాపద్మములనునాలుగు చేతులందుధరించి, యతనికి ప్రత్యక్షమయ్యెను. అతని శరీరము నుండి రక్తము కారుచుండెను. వానిని జూచి బ్రాహ్మణుడత్యద్భుతాత్మమగ్నుఁడై, గొడ్డలి క్రిందకు జారవిడచియాయన పాదములపై బడి యిట్లు ప్రార్థించెను. ఓ మహాదేవా! శ్రీహరీ! జనార్దనా! వాసుదేవా! జగదీశ్వరా! అనాదిపురుషా! మీకు శత్రుమిత్ర భేదములు లేవు. మీరేగదా బ్రహ్మ విష్ణు, శివుఁడను మూఁడుమూర్తులై, సృష్టిస్థితి లయములను జేయువారు, మీ రెవరితో యుద్ధముచేయుచు నిటువచ్చితిరి. మీకు నెవరి యాయుధములును నాటవుగదా! మీకంటె బలవంతులెవరు! మీశరీరమునుండి యిట్లురక్తము ప్రవహించుటకు

కారణ మేమని యడుగఁగా శ్రీహరియిట్లుచెప్పెను. ఓభక్తశిఖామణీ! ఓ ధనంజయా ! నన్నుకొట్టినవారెవరు ? ఘోరరాక్షసులుండిరి. కాని వారిని నిమిషములో నేను సంహరించితిని. నా భక్తులు తప్ప నన్ను నెవ్వరును శిక్షింపలేరు. నాభక్తులునన్ను నెన్నిబాధలు పెట్టినను నేను సహింతును. అశ్వత్థ వృక్షమును నీవుకొట్టిన దెబ్బవలన నీరక్తము కారుచున్నది. ఆచెట్టే నేను, అనిచెప్పగావిని ఆవిప్రుఁడునిశ్చేష్టుఁడై నేలపడెను. అదిచూచి శ్రీహరి వానిని తన చేతులతో లేవనెత్తి యందునుగురించి విచారింపవద్దనియు నాదెబ్బ తనకు లక్ష్యములేదనియు చెప్పి బోధపఱచి వాని భక్తికి మెచ్చి వరమిచ్చెద నడుగుమనఁగా నీ పాదపద్మములయందు సర్వదా నాకు భక్తియుండునట్లు వరమిమ్మనెను. శ్రీహరి యట్లే యగునని వరము ప్రసాదించి విశ్వకర్మను పిలిపించి యతనికొఱకుకొక దివ్యభవనము కట్టించి యందులోనుండి సిరిసంపద లనుభవించి దేహాంతమున వైకుంఠమును పొందునట్లు వరమిచ్చి శ్రీహరి యంతర్ధానమయ్యెను. తరువాత నా బ్రాహ్మణుఁ డతి సుఖముగా బ్రతికెను. అంతకుముందు దరిద్రావస్థ భరింపలేక పుట్టిన యింటికి బోయిన యాతని భార్య తిరుగవచ్చెను. తరువాత కొందఱు కొమాళ్ళు, కొమార్తెలు కలిగిరి. విశేష ధనము ధాన్యము పాడి గలిగి చాల కాల మశ్వత్థ వృక్షమును పూజించుచు సుఖముగా జీవించి తుదకు వైకుంఠమునకుబోయి ముక్తి నొందెను.

సీ తి:—

అశ్వత్థము వృక్షములలో శ్రేష్ఠము, దానిని పూజించుట శ్రీ మహావిష్ణువును ప్రత్యక్షముగా పూజించుటయనియు అందువలన ఇహము, పరము కలుగుననియు మనము తెలిసికొనవలెను. "మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే అగ్రత శ్శివరూపాయ వృక్షరాజాయ తేనమః" అని ధ్యానించి ప్రదక్షిణములు చేయవలెను.

శ్రీరామ నామమహిమ

ఇట్లు శివుఁడు చెప్పఁగా పార్వతియశ్వత్థమాహాత్మ్యమును విని చాల సంతోషించి భర్తనుజూచి స్వామీ! శ్రీరామనామ ప్రభావము మీవలన సావకాశముగా వినవలెను. మీరు సర్వదా యీతారకమంత్రమునే జపించుదురుగదా! నాయందు దయయుంచి శ్రీరామనామమహిమ సవిస్తరముగా సెలవియ్యవలె ననఁగా నీశ్వరుఁడు చాల సంతోషించి యిట్లు చెప్పనారంభించెను. ఓ ప్రాణనాయకీ! శ్రీ తారకమంత్రమహిమ గాని శ్రీరాముని మహిమగాని చెప్పుటకు నాతరముకాదు! నాకే యననేల వేయినోళ్ళుగల యనంతునకే యసాధ్యము! అయినను నీవు భక్తిపూర్వకముగా నడిగితివి కావున నాకు తెలిసినంతవఱకు చెప్పెదను. శ్రీరామనామము సమస్తపాపములనునశింపఁజేసి మోక్షమునిచ్చును. భక్తిశ్రద్ధలతో "శ్రీరామ" యను మూఁడక్షరములు నొక్కసారి యుచ్చరించుమాత్రమున పోవునంత పాపము యెవరును చేసియుండరని నాకు నమ్మకము, శ్రీరామనామము సదా జపించువారు భక్తులలో

శ్రేష్ఠులు. పాపాత్ములకా నామముసాధారణముగా స్మరించుట లభింపదు. స్మరించువారు తప్పక ముక్తినొందుదురు. చిలుకలు శారికలు మొదలగు పక్షులను పెంచి వానికి మాటలు నేర్పు మిషచేతనైనను తన్నామము నుచ్చరించువారికి సైతము మోక్షముగలదు. అట్టి స్థితిలో ప్రయత్నపూర్వకముగా నా శ్రీ రామనామస్మరణ చేయువారికి కలుగు ఫలము వేరుగాఁ జెప్పనేల? పూర్వము సత్యయుగమునందు కురుక్షేత్రమున నొక వైశ్యుడుండెను. అతని పేరు సత్యవసుఁడు. అతఁడు న్యాయముగా వ్యాపారముచేయుచు ధర్మపరుఁడై యుండెను. అతని భార్యపేరు జయంతి. ఆమెయు మంచి వంశమున బుట్టి యుండుటచే భర్తను ననుగమించుచుండెను. ఆదంపతు లిరువురు నన్యోన్యానురాగముగలవారై యుండిరి. కాని వారి దాంపత్యము హెచ్చుకాలము దైవము కొనసాగింపలేదు. వారికి సంతానము కలుగకముందే సత్యవసుఁడకాల మరణము నొందెను. పిమ్మట జయంతి వైధవ్యదుఃఖమును సహింపలేక తల్లిదండ్రులయొద్ద జేరెను. ఆమె మంచి యౌవనములో నుండుటచేతను, సంతానము లేకుండుటచేతను, కామసుఖముల యందు తృప్తిపొందక యుండుటచేతను తన యీడు మగవారితో కలిసిమెలిసి తిరుగుచుండెను. అదిచూచి యామె తండ్రి సహింపలేక తన వంశమున కపకీర్తి తెచ్చినదని యెంచి యిల్లు వెడలఁగొట్టెను. పిమ్మట యామె స్వైరిణీవృత్తి నవలంబించి కాలనియమముగాని, జాతివిచక్షణగాని పాటింపక తన యిచ్చ వచ్చినట్లు విటులతో సంచరించుచుండెను. ఇట్లున్నను సంతతి లేకుండెను. స్త్రీలకు పిల్లలుకలుగవలెనన్న యాశ మెండు కనుక

యందు కామెమిగుల విచారించుచుండెను. ఇట్లుండగా నొకనాడు కిరాతుండొకడు చిలుక పిల్లల నమ్ముటకు తేగా, ఆమె యొకదానిని గొని, పంజరమున నుంచి ముచ్చటతో దానిని పెంచుచుండెను. కొన్నాళ్ళకు నది పెద్దది కాగా దానికి మాటలు నేర్పునదై రామ, కృష్ణ అని నేర్పుచు ప్రతిదినమును తనకు తీరుబడి యగునప్పుడెల్ల నా మాటలే చెప్పుచు తనకు పిల్లలు లేని లోపమును తీర్చుకొనుచుండెను. ఇట్లు కొంత కాలము జరిగినపిమ్మట యామె కాలముచేసెను. యమదూతలు వెంటనే వచ్చి, కాలపాశములచే నామెను కట్టి తీసికొని పోవుచుండగా, విమానముతీసికొని విష్ణుదూతలువచ్చి యమదూతలతో నిట్లనిరి. మీ రెందు కీమెను కొనిపోవుచున్నారు? ఈమె చిలుకను బెంచి దానికి మాటలు నేర్పుటకై రామ, కృష్ణఅని యెన్నిసారులో ప్రతిదినము పలుకుచుండెను. అందుచే శ్రీ మహావిష్ణువు సంతసించెను. ఈమెకొఱకు విమానమంపెను. ఈమెను వైకుంఠమునకు తీసుకొని పోయెదము. మీరు విడువుండనగా యమదూతలు విడువనందున వారలకు ఘోర యుద్ధమయ్యెను. అందు విష్ణుదూతలు గెలిచి యామెను విమానముపై నుంచి వైకుంఠమునకు తీసికొనిపోయిరి. ఆమె యందు సుఖించుచుండెను. యమదూత లోడిపోయి తాము పొందిన పరాభవము యమునితో చెప్పుకొని మొఱబెట్టగా నాయన విని వారితో నిట్లనెను. ఓ దూతలారా? వినుండు. రామ, కృష్ణ, గోవింద మొదలగు నామముల నుచ్చరించువారు శ్రీహరి భక్తులు. వారిని మనము దండింపఁగూడదు. కావున మీరు వారి కడకు బోకుడు. ఇంతేగాక శ్రీహరిని పూజించు

వారిని, ఏకాదశీ వ్రతము చేయువారిని, శ్రీవిష్ణుపాదోదకమును శిరస్సున ధరించువారిని, ఆయన నైవేద్యమును తినువారిని తులసి ధరించువారిని, మాతా పితృలను గురువులను సేవించు వారిని, ఇతరుల దుఃఖముల చూచి విచారించువారిని, సత్య వాదులను, పరద్రవ్యమునందు లోభము లేనివారిని, అన్నము, జలము, దానము చేయువారిని, దరిద్రుని పోషించువారిని మీరు ముట్టఁబోకుఁడు. వారు వైకుంఠమునకుఁబోవు వారు కావున వారిపై మనకు నధికారము లేదు. అని యముఁడు తన దూతలకు బోధించిపంపెను. కావున వింటివా పార్వతీ శ్రీరామనామ మాహాత్మ్యము ? అని ఈశ్వరుఁడు చెప్పెను.

## శ్రీజగన్నాథ మాహాత్మ్యము

పిమ్మట ఒక నాఁడు పార్వతి శివునిజూచి "ఓ ప్రాణేశ్వరా ! శ్రీహరిమహిమ అను నమృతము నెంత త్రాగినను దాహము శాంతించుట లేదు. ఇంకను వినవలె ననియే యుండును. మీరు పరమ వైష్ణవులు, శ్రీహరిలీల లన్నియు మీకు పూర్తిగా తెలియును. వానిని వినుటవలన సమస్త పాపములు దహించునుగదా ! చెప్పువారును వినువారును ముక్తినొందుదురు. కావున సెలవియ్యవలెను." అని అడుగఁగా శివుఁడది విని "ఓ సఖీ! నీవు ధన్యురాలవు. నీకు శ్రీహరి యందు భక్తిస్థిరముగా నిలిచినది. సావధానమైన మనస్సుతో వినుము. ధర్మ, అర్థ, కామ, మోక్షములిచ్చు శ్రీపురుషోత్తమ మాహాత్మ్యము చెప్పుచున్నాను. పూర్వము శ్రీమన్నారాయణుండు బుద్ధావతారమును ధరించి, యుప్పుసముద్రమున కుత్త

రమున నీలాద్రిపర్వతమున స్థిరముగా నివాసమేర్పఱచుకొనెను. కాబట్టి దానికి రెండవ వైకుంఠమని పేరు. అదియన్నితీర్థముల లోను క్షేత్రములలోను ముఖ్యమైనది. దానిమహిమనర్ణించు టకునాలుగు ముఖములుగల బ్రహ్మకైనను తరముగాదు. గాని శ్రీహరియనుగ్రహమువలన నాకు తెలిసినంతచెప్పెదను. పురుషు లందఱిలోను శ్రీహరియుత్తముఁడుకావున, ఆయనయచ్చటనుం డుటచే దానికి పురుషోత్తమ క్షేత్రమని పేరు. అచ్చట హరి కొఱకు శ్రీలక్ష్మీదేవిచేవంటచేయఁబడియాయనసమారగింపఁగా మిగిలిన శేషము ప్రసాద మనఁబడును. దానిని జాతి మతభేద ములు, మైల, మడి, విచక్షణ లేకుండనందఱును. భుజింతురు. అట్లు చేయుట దూష్యముగా నెనరును నెంచరు. ఈయాచార మాక్షేత్రమునతప్ప హిందూదేశమున మఱియొకచోట లేదు. అచ్చటిదేవాలయము విశ్వకర్మచే నిర్మింపఁబడినది. అందుబల భద్రసుభద్రా సహితుఁడై శ్రీబుద్ధదేవుఁడు శ్రీజగన్నాథుఁ డను పేరిట వేంచేసి యున్నాఁడు. అచ్చట తీర్థములలో మార్కండేయము, ఇంద్రద్యుమ్నము, రోహిణీ గుండము, సముద్రము, శ్వేతగుండము అనునయిదుతీర్థములు ముఖ్యములు. వీనియందు స్నానముచేసి పైనచెప్పిన శ్రీమూర్తులను పూజించి

క్షేత్రమాహాత్మ్యమును చెలుపుకథ.

పిమ్మట లక్ష్మిని, విమలాదేవిని దర్శించి, వటవృక్షమును మార్కండేయుని, మాధవుని, యముని, హనుమంతుని, పాతా ళేశ్వరుని, వినాయకుని దేవళములకుఁబోయి దర్శింపవలెను. సముద్రతీరమున తీర్థశ్రాద్ధము చేయవలెను. ఇట్లు యాత్ర

చేయువారు ఈ సంసారములో తిరుగ జన్మనొందకనై కుంఠము జేరి మోక్షమునొందుదురు. బ్రహ్మాది దేవతలు కూడ శ్రీ జగన్నాథుని దర్శించుటకు బోదురు. ఇచ్చట నిత్యకల్యాణము పచ్చలతోరణము లెల్లప్పుడు జరుగుచుండును. ఎందుచేత ననగా పండ్రెండు మాసములలోను పదమూడుయాత్రలు జరుగుచుండును. చైత్రమాసమున వారుణీయాత్ర, వైశాఖమున చందనయాత్ర, జ్యేష్ఠమాసమున నభిషేకము, ఆషాఢమున రథయాత్ర, కార్తీకమున దామోదరయాత్ర మాఘమాసమున మకరయాత్ర ముఖ్యమైన రథయాత్రలలో రథముపై నున్న బలభద్రస్వామిని జూచు గొడ్రాలికి తప్పక సంతానముకలుగును. పుష్యమాసములో అభిషేకము, మార్గశిరములో ఒఢణషష్ఠి యాత్రలగును. అన్నిటిలో రథయాత్ర గొప్పది. ఫాల్గునమాసమున డోలోత్సవముజరుగును. ఈ క్షేత్ర మహిమ యెంతచెప్పినను తరుగదు. ఆస్థలమునందు చేయఁబడిన దానము, ధర్మము మొదలగునవి కోటిగుణితములై ఫలమిచ్చును. దీనినే శ్రీజగన్నాథ క్షేత్రమందురు. ఈ దేవాలయముపై నున్న చక్ర మహిమ నారదపురాణమున వ్రాయఁబడినది.

ఈ క్షేత్రమందు పూర్వమొక ధర్మతత్త్వుఁడను పేరుగల శూద్రుడుండెను. అతఁడు చాల మంచి ప్రవర్తనగలవాఁడై యుండెను. వానికొక కుమారుఁడుండెను. వానిపే రుద్విజ్ఞుఁడు. వాఁడు నాస్తికుఁడై దేవబ్రాహ్మణులనిందించుట, పరస్త్రీ, పరధనములను హరించుట, కల్లుత్రాగుట, గోమాంసముభక్షించుట, యిండ్లలోఁజొరఁబడియు త్రోవలుకాచియుదొంగతనము

జేయుటయు, స్త్రీహత్య, శిశుహత్య, నరహత్య చేయుచుండువాఁడు. వానితల్లిదండ్రులు, స్నేహితులు బంధువులు మొదలగువారెన్నివిధముల బోధించినను మానకుండెను. ఒకరోజున వీనిని రాజునెదుట బెట్టఁగా నాయన వీనిని బహువిధముల శిక్షించి దేశమునుండి వెడలఁగొట్టెను. అదిమొదలు వాఁడు పట్టణములో నుండక, యడవిమార్గములను కాచియుండి మార్గమున పోవువారిని బాధించుచు చంపుచు దోచుకొనుచు నుండువాఁడు. ఇట్లు జీవనముచేయుచు, నొకరోజున గొప్పపర్వకాలమునందనేకమంది జనులు సముద్రమున స్నానము చేయఁబోగా వీఁడును సముద్రతీరమును జేరెను. అందు స్నానముచేయు జనులు పలువిధములగు పదార్థములను దానము చేయుచుండుటచూచెను. తినుబడి పదార్థమేదైన నొకటి దానముచేసి, ఆపదార్థము మఱివారు జీవించుకాలములో తినకవిడుచుట వాడుకగానున్నది. అచ్చటికి పోయినవారిలో నొకఁడు, మామిడిపండు శ్రీహరికి ప్రీతిగా బ్రాహ్మణునికిచ్చితిని దానిని నేనుమఱి యీజన్మలో తిననని యు, మఱి యొకడు నేరేడుపండు విడచితినని. ఇంకొకఁడు పనసపండు విడచితిననియు ననుకొనుచుండుటవినెను. ఈ చోరుఁడు కూడ సముద్రమున స్నానముచేసి తన కెప్పుడునుదొరకనివస్తువును తానువిడువదలఁచియోజింపఁగా బెల్లము తనకు లభింపదని యెంచి, యెుకప్పుడు లభించినను దానినివిడచి పంచదారయే తాను తినవచ్చు ననియు ఆలోచించి బెల్లము దానమిచ్చెదననియు నా బెల్లము తాను తన జీవితకాలమున తిననని యు నిశ్చయించుకొని యడవికిబోయి మార్గము కాచియుండెను. తరువాత కొంతకాలమునకు బండితో బెల్లముతీసి

గొని యొక కాఁపు సంతలో నమ్ముటకు బోవుచుండెను. ఆ చోరుఁడా బండివానిని జంపి బండిని బెల్లముతోఁగూడ తీసికొని యొక బ్రాహ్మణుని పిలిచివానికిదానమిచ్చెను. మఱికొంత కాలమునకు వాఁడొక ధనికుని యింటకన్నము వేయఁగా వారతనిని పట్టుకొని చంపిరి. ఇట్లు మృతినొందిన చోరుని తీసికొని పోవుటకు యమదూతలు వెళ్ళి పాశములతో వానిని బాధించుచుండఁగా విష్ణుదూతలందు బోయివానిని విడిపించి విమానముపై కూర్చుండబెట్టి వైకుంఠమున శ్రీహరి సన్నిధానమున బెట్టిరి. కరుణాంతరంగుఁడైన శ్రీమన్నారాయణుండు వానిని సత్కరించి తనయొద్ద నుంచుకొనెను. వింటివా భవానీ, వాఁడు పరమ దుర్మార్గుఁడైనను నా పుణ్యక్షేత్రమున మనస్ఫూర్తిగా శ్రీహరికి ప్రీతిగా వాఁడు చేసిన దానమువలన వాని సమస్త పాపములు నశించి వానికి మంచిగతి గలిగినది. ఇట్టిధర్మసూక్ష్మములెన్నోగలవు. అని శివుఁడు చెప్పెను.

### హరిశర్మయను బ్రాహ్మణుఁడు, ఆర్త్రాణపరాయణి యను వేశ్య, విశాలాక్షియను బ్రాహ్మణస్త్రీల చరిత్రములు.

పిమ్మట పార్వతి శివుని జూచి బెల్లము దానముచేయుటచే బ్రహ్మహత్యాది మహాపాతకములు చేసిన చోరునికి కైవల్యము లభించెనని చెప్పితిరి. మిగుల నాశ్చర్యముగా నున్నది. దానములు చేయువారికి కలుగు పుణ్యఫలములు చేయనివారికి కలుగు కష్టములు సెలవియ్యవలెననఁగా శ్రీపరమేశ్వరుఁ డిట్లు చెప్పెను. ఓపార్వతీ వినుము. ధనముండియు దానధర్మంబులు చేయనివాఁడు పరజన్మయందు మిగులదరిద్రుఁడగును. దాచ

నుండ కావలసినది తానుతిని, యితరులకు దానముచేయువాఁడు తిరిగి ధనవంతుఁడై పుట్టును. ధనమార్జించి తానుతినక యొకరి కివ్వక యుండువాఁ డిహపరలోకములందు నానాదుఃఖము లను పొందును. వాఁ డిహమందు పెరిదుఃఖననుభవించుకొని పరమందు నరక బాధలు పొందును. వాఁడు తేనెటీఁగవలె కూడబెట్టినధనము నితరు లనుభవింతురుగాని తనకు ప్రాప్త ముండదు. మిగిలినదానిలో కొంతసొమ్ము నిలువలో చేర్చి కొంతదానము చేయువా రిహమందును బరమందును సుఖ మనుభవింతురు. అట్లుచేయక తాను తినక యింటనుండు తన వారికైనను బెట్టక పరమలోభులై నిలువ చేయువారు వంగ పెరటికి కాఁపుంచబడిన దిష్టి బొమ్మవంటివారు. ఇందుకు తార్కాణముగా నొక యితిహాసము చెప్పెదను వినుము. పూర్వము సత్యయుగమున హస్తినాపురమందు నొక బ్రాహ్మ ణుఁడుండెను. అతనిపేరు హరిశర్మ. అతఁడు గొప్పభాగ్యవం తుఁడై యుండియు తాను తినక భార్యపిల్లలకైనను కడుపు నిండపెట్టక జీమ, యెలుక మొదలగు గృహజంతువులకైనను నొకగింజ దొరకనియ్యక జాగ్రత్తగా కాపాడుచుండెను. అనా థలకు ముష్టికూడ వేయువాఁడుకాఁడు. ఇతఁడును గొప్ప విష్ణు భక్తుఁడు కావున శ్రీహరివిగ్రహమును భక్తితో పూజించుచు, పలువిధములగు నలంకారములు చేయించి యలంకరించెను. కాని మహా నైవేద్యము భక్ష్యభోజ్యలేహ్య పానీయములతో చేరిన యన్నముఁ నివేదనచేసి యెఱుఁగఁడు. ఎప్పుడును ఒకనికి నన్నము పెట్టనేలేదు. ఆకాలముననే యాం పట్టణములో నొక వేశ్యయుండెను. ఆమె మిగుల చక్కనిది. ఆటపాటల

యందు బహు నేర్పరి. ఆమె విటులతో గూడి యహోరాత్రులు కామసుఖము లనుభవించుచు బహుధనము సంపాది వృద్ధురాలయి వైరాగ్యము నవలంబించి తానదినఋకు నిలువచేసిన ధనమంతయు, బీదల కన్యాదానము చేయుటయందు ఖర్చు పెట్టి, బహు ధర్మాత్మురాలై యాత్రతాని పరాయణియని పేరు పొందెను.

ఆ పట్టణమున నొక బ్రాహ్మణ స్త్రీ విధవయై యుండెను. ఆమె భర్త చిన్నతనముననే చనిపోయినందున యీమెకు ప్రపంచ సుఖములందు మనసుతీరక జారపురుషులతో జేరివిషయసుఖము లనుభవించుచు, సందు మూలముగా దినచర్యలు జరుపు కొనుచుండెను. ఆమె పేరు విశాలాక్షి. ఆమె మంచి వేసవి కాలమున నిర్మలమైన జలము తృషాతురులకు దాహమిచ్చుచుండెను. ఈపైని చెప్పబడినముగ్గురునుచనిపోయిన తరువాత యమదూతలు వారిని తీసికొనిపోయి, యమునియెదుట బెట్టగా నాధర్ముడు చిత్రగుప్తులను జూచి వీరి పాపపుణ్యములు చెప్పుడనగా వారు చిఠాలు చూచియిట్లనిరి. అయ్యా వీరు పుణ్యాత్ములు. వీరిని తగినమర్యాదచేసి వైకుంఠమున విడువవలెను. అదివిని యముడు వారిని సత్కరించి తన విమానమున గూర్చుండబెట్టి వైకుంఠమునకు తీసికొనిపోగా, శ్రీహరి వారి కెదురేగి తోడుకొనిపోయి యా స్త్రీలను తనకు దాసులై పరిచర్య సేయుచుండుడని నియమించెను. హరిశర్మకు హెచ్చు మర్యాదచేసి తనతో సమానముగా నన్నిభోగము లనుభవించు చుండుమనెను. కాని దూతలతో "వీని కాహార మివ్వనల దనెను" అట్లు రెండు రోజులు బ్రాహ్మణుడు నిరా.

హారుఁడై సమస్తభోగములనుభవించుచుండె నాఁకలిబాధకోర్వఁ లేక శ్రీహరినిజూచి యిట్లుమనవి చేసికొనెను. "మహాప్రభూ! వైకుంఠనాథా! నాకిచ్చట నన్నిసుఖములు కలవుగాని భోజనము లేదు. అది దొరకునట్లులాజ్ఞాపింపుడు, అనఁగా శ్రీహరి వినియు విననట్లూరకుండెను. ఆ బ్రాహ్మణుఁడు తిరిగియడుగఁగా నీసంగతి మీరు చతుర్ముఖుని నడిగి తెలిసికొనుఁడు, అని చెప్పి, విమానము తెప్పించి సారథితో నతనిని సత్యలోకమునకు దీసికొనిపొమ్మ"అనెను సారథి యట్లుచేసెను. అచ్చటికి పోగా బ్రహ్మ యెదుర్కొని తోడుకొనిపోయి విష్ణువునకుఁ మర్యాద చేయునటులర్ఘ్యపాద్యములిచ్చి కూర్చుండఁజేసి. ఇట వచ్చుటకు కారణమేమని యడుగఁగా. నతఁడుతనయాఁకలిబాధ చెప్పుకొనెను. అదివిని బ్రహ్మ యిట్లనెను. "అయ్యా! మీరు విష్ణుభక్తులలో శ్రేష్ఠులు. పూర్వజన్మమున పెట్టనిది యిప్పుడెట్లు కలుగును? మీరు శ్రీహరిని షోడశోపచారములచేతను పూజించితిరి. కాని పిడికెడన్నమైనను యెన్నడును నివేదన చేసినవారుకారు. ఇతరులకుదానధర్మములు మొదలేచేయలేదు, కావున మీశరీరమును మీరే కోసికొని తినుడు" అనెను. ఆమాటలువిని బ్రాహ్మణుఁడు వణఁకుచు"ఓ చతుర్ముఖుఁడా! యెంత యాశ్చర్యమైనమాట సెలవిచ్చితిరి! ఇది యసాధ్యము కాదా! ఎవరి శరీరము వారు కోసుకొని తినుట యెట్లు? నొవ్వదా! అట్లు తిన్న నెన్నిదినములకు సరిపడును. "అనఁగా బ్రహ్మవిని "ఓబ్రాహ్మణుఁడా! నేఁడు నీవు కోసికొనునది రేపటికి తిరుగ పెరుగునట్లు వరమిచ్చెదను. అది విని బహుదీనుఁడై ప్రార్థించి తన యాఁకలిబాధ తీర్చుమని వేడ

కొనఁగా బ్రహ్మయిట్లు చెప్పెను. నీవు నిలువజేసిన ధనము నీ యింటివద్ద నిలువయున్నది. నేఁటిరాత్రి నీవు నీకుమారునికి స్వప్నమందు కనబడి దానధర్మములు చేయుమని చెప్పుము. ఆధనము దినమునకు నొక బ్రాహ్మణునికైనను తృప్తిగా నన్నదానము చేయనియెడల, వాని తల పేలిచచ్చునని చెప్పుము. ఆమరణమునకు భయపడియైనను వాఁడట్లుచేయును. అదినీకిచ్చుట లభించును. ఇంతకుతప్ప నీకు మఱివేరు సాధనములేదు.'' అనెను. ఆ బ్రాహ్మణుఁడు బ్రహ్మచెప్పి నట్లు చేయఁగా కుమారుఁడట్లు తండ్రిపేర ప్రతిదినమన్న దానముచేయుచుండెను. అది వైకుంఠముననున్న తండ్రికి జీవనాధారమయ్యెను. అన్నదానము, ఉదకదానము శ్రేష్ఠములు. మొదటిదానముకన్న రెండవది మఱియు నుత్తమము. అని శివుఁడు పార్వతితో చెప్పెను.

## బ్రాహ్మణ మహిమ.

పిమ్మట పైకథలో చెప్పఁబడిన హరిశర్మబ్రహ్మనుజూచి దానమెవరి కివ్వవలెను? అనియడుగఁగా నాయన వారితో నిట్లుచెప్పెను. ఓ ప్రియభక్తుడా! బ్రాహ్మణులకు దానమియ్యవలెను. నాలుగు జాతులవారిలో బ్రాహ్మణులు శ్రేష్ఠులు. కాఁబట్టి వారుసంసారములో జనులందఱినితరింపఁజేయఁగలరు. భూలోకములో వారు శ్రీమన్నారాయణునితో సమానులు. చదువుకున్న పండితుఁడు, చదువురాని మూర్ఖుఁడు నితరులకు సమానులే. వారినివిష్ణుస్వరూపులనిపూజింపవచ్చును. బ్రాహ్మణుఁడశుచిగానున్నను, నితరులకు దానితో పనిలేదు. శుచి

గానుండని దోషములని దేగాని ఇతరులను బాధింపదు. బ్రాహ్మణుడనాకారియైనను నాచారములేని వాడైనను నితరజాతివారు సుందరాంగులాచారవంతులైనను గాబ్రాహ్మణుని ముట్టుకొనఁగూడదు. గోవులు, బ్రాహ్మణులు, దేవతలు తినఁగూడని పదార్థములు తిన్నను పాలేత్రాగుచు జీవించు శూద్రుఁడు వారినిముట్టుకొనుటకుతగినవాఁడుకాఁడు. బ్రాహ్మణులలో నొకరికిమఱియొకరు గురువులుగా నుండఁదగును. వారి శరీరము శ్రీహరి శరీరముతో సమానము. భక్తితో బ్రాహ్మణునికి నమస్కరించువారు ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములను పొందుదురు. కాని యోగ్యసమయముచూచి నమస్కరింపవలెను. ఆయన దేవపూజచేయునప్పుడును, జలములో స్నానము చేయునప్పుడును, నూనెరాచుకొనునప్పుడును, మలమూత్రములువిడుచునప్పుడును వేదాధ్యయనము చేయునప్పుడును, దంతధావనము భోజనము చేయునపుడును నమస్కారము చేయఁగూడదు. ఆ సమయములలో నున్నట్లు తెలిసి నమస్కరించువారికి పూర్వపుణ్యములు నశించును. సమూహములో నున్నప్పుడు నందులోనొకరికినమస్కరించినను అట్లు నమస్కరించు వారిపూర్వపుణ్యములునశించును. శూద్రుఁడు నమస్కారమని బ్రాహ్మణునికి చెప్పగూడదు దండమనవలెను. బ్రాహ్మణుఁడు బ్రాహ్మణునికి నమస్కారము చేయనియెడల వానిపుణ్యములు నశించి చండాలుఁడై పుట్టును. బ్రాహ్మణుఁడైనను గురువునెడల ద్వేషబుద్ధిగలవాఁడు శ్రీహరికిశత్రువగును. యాచించు బ్రాహ్మణుని బాధించువాని కండ్లు యముఁడు ఊడబెరుకునఁట. కోపముచేత బ్రాహ్మణుని

తిట్టిన వారిని కోటిలోయములను కాల్చినరోకలిపెట్టును. బ్రాహ్మ ణులు భుజింపగా దేవతలను తృప్తినలుగును. ప్రభాతకాలమున లేచి నిత్యము బ్రాహ్మణదర్శనము చేయువారికి వైకుంఠము ప్రాప్తించును. విప్రునిపాదధూళి తలయందు ధరించువారి కప మృత్యువునశించి సమస్తతీర్థస్నానఫలము లభించును. బ్రాహ్మ ణుల పాదతీర్థము శిరస్సున ధరించు వారికిబ్రహ్మహత్యాపాప ములునశించును. ప్రపంచమందలి సమస్తతీర్థములువిప్రునిపాద మునయుండును. కావున దానిని శిరస్సునధరించుటవలనసమస్త తీర్థములలో స్నానముచేసిన ఫలమువారికిలభించును. అందు వలన సమస్తవ్యాధులు నశించును. ఆ జలములతో తర్పణము చేసిన పితృదేవతలుతృప్తిపొందుదురు. బ్రాహ్మణునిపాదములు కడిగి గంధపుష్పాదులతో పూజించి యాప్రసాదము శిరస్సున ధరించిన వాని పాపములన్నియు నశించును. బ్రాహ్మణుని పాదములు కడిగి పూజించి ప్రదక్షిణముచేసి నమస్కరించి చక్రవర్తియైపుట్టును. ఆ పాదోదకమును పూజించిన వారికి ధనము, పుత్రులు, విద్య, కీర్తిగలిగి యంతమున వైకుంఠమును చేరి ముక్తినొందుదురు. గొడ్రాలు సంతానమును పొందును. అని బ్రహ్మహరిశర్మతో చెప్పెనని యీశ్వరుడు పార్వతితో చెప్పెను.

విప్రపాదోదక మాహాత్మ్యము, భద్రాత్ముఁడను బ్రాహ్మణుని చరిత్రము.

కురుక్షేత్రమందుపూర్వముభద్రాత్ముఁడనుబ్రాహ్మణుఁ డుండెను. అతడుసమస్తవేదములు, వేదాంగములు, శాస్త్రములు చదివి కర్మలు విధ్యుక్తముగా చేయుచుండువాఁడు, అతడు

ఒకానొకనాఁడు నదిలో స్నానముచేసి యింటికేఁబోయి కాళ్లు కడుగుకొని యింటిలో ప్రవేశించి జపము చేసికొనుచుండెను. అప్పుడు గ్రీష్మకాలమై యెంతో వేడిగా నున్నందున యొక కుక్క యెండవేడి భరింపలేక చల్లని స్థలముకొఱకు వెదకుచు వచ్చి కాళ్లుకడుగుకొన్న స్థలమున నీరుండుటచే నచట పరుండెను. ఆ నీటితో దాని శరీరము తడిసి చల్లగా నుండెను. వారింటి నౌకరు దానినిజూచి గుమ్మముముందు పడియున్నందున దానిని వెడలగొట్టకున్న తన యజమానుడు కోపించునని దానిపై నొక ఱాయి రువ్వెను. ఆ ఱాయి దానికి ప్రమాదస్థలమున తగిలి నందున నాకుక్క వెంటనే యఱచిచచ్చెను. దాని యఱపువిని లోన జపము జేసికొనుచున్న బ్రాహ్మణుఁడు పైకివచ్చి చూచు సరికి నొక దివ్యపురుషుఁడా కుక్క పడియున్నచోట నిలిచి యుండెను. అతనినిజూచి "అయ్యా, మీ రెవరు? ఎందుండి వచ్చితిరి? మీవృత్తాంతమంతయు సవిస్తరముగా చెప్పుడు" అనఁగా, ఆ దివ్యపురుషుఁడిట్లు చెప్పనారంభించెను. "ఓ విప్రో త్తమా వినుము. నేను పూర్వజన్మమున జంబూద్వీపచక్రవర్తిగా నుండిన సత్యకేతుఁడనువాఁడను. నేనుసోమవంశమునబుట్టినాలుగు వేల సంవత్సరములు రాజ్యపాలనము జేసియుంటిని. అనేక దాన ములు, ధర్మములు, యజ్ఞములు, యాగములు చేసియుంటిని. అనేకదేవాలయములుకట్టించి యగ్రహారములు దానమిచ్చితిని. ప్రజలను బిడ్డలవలె పాలించితిని. ఇట్లుండ నొకదినము రాత్రి ప్రజలేమనుచుండిరో కనిపెట్టుటకు పట్టణములో తిరుగుచుండఁగా నొక సందు వీథిలో మంచి వయస్సులోనున్న చక్కని స్త్రీ యొకతె కంటబడియెను. ఆమెనుజూచి కామమోహితుఁడనై

ఆమెనుపట్టి సుఖించితిని. పిమ్మట నా కోటకు పోతిని. ధర్మా ధర్మములు విచారింపక చేసిన పనికి విచారించి పశ్చాత్తాపము నొందితిని. కాని యా పాపము నన్ను విడువలేదు. తరువాత నా సంపద నశించెను. శత్రువులు నా కోటపై బడి, దానిని తీసికొని నన్ను తరిమివైచిరి. నే నరణ్యమునకుపోయి యందు దాఁగి యుండఁగా కొన్నాళ్లకు మరణించితిని. యమునికూతలు నన్ను కట్టి, కొట్టుచు తీసికొనిపోయి యమునియెదుట బెట్టఁగా నా పాపపుణ్యములు విచారించి వా రిట్లు చెప్పిరి. "ధర్మరాజా! ఈయన జంబూద్వీప చక్రవర్తియైన సత్యకేతు మహారాజు. మనుజుఁడు చేయవలసిన పుణ్యకార్యములన్నియు చేసెనుగాని పరస్త్రీని బలిమిని చెఱబట్టెను, అనిరి. అదివిని ధర్ముఁడు దానికి తగిన నరకబాధ లనుభవింప శిక్ష విధించెను. యమదూతలు నన్ను వెంటనే తీసికొనిపోయి యెఱ్ఱగా కాలియున్న పరుపుగల యినుపమంచమున పరుండఁబెట్టి రాగితో చేయబడి యెఱ్ఱఁగా కాల్చిన స్త్రీని నా ప్రక్క పరుండఁబెట్టిరి. అప్పుడు నేను పడిన బాధ తలఁచుకొన్న నిప్పుడు భయముచే శరీరము కంపించు చున్నది. ఇట్లు కొంతకాలము గడచిన పిమ్మట మఱికొంత కాలమువఱకు నితర నరకబాధ లనుభవించి పిమ్మట చాతక పక్షినై జన్మించితిని. తరువాత నీ కుక్కనై పుట్టి యనేక జంతువులను హింసించి చంపుటవలన బహుపాపము చేసితిని. ఈ మండు వేసవి బాధపడలేక మీపాదోదకము పడియున్న యీచల్లని తావున పరుండితిని. అది నా శరీరమున సోకుటచే సమస్తపాపములు నశించినవి. మీనొకరు ఱాతితో కొట్టుటచే ప్రాణములను విడచి దివ్యశరీరమును పొందితిని. తమసెలవైన

యీ విమానమున వైకుంఠమునకు పోయెను. అని బ్రాహ్మ ణునితోఁ జెప్పి యతఁడు ముక్తినొందెను.

ఆహా! విప్రపాదోదక మహిమ యెంత గొప్పది!

## ఏకాదశీ మాహాత్మ్యము

అని చెప్పఁగా విని పార్వతి సంతోషించి యీశ్వరుని జూచి దేవా! ఏకాదశీ వ్రతమహిమ వినవలెనని యున్నది. ఆ వ్రత మెట్లు పుట్టినదో దానికి విధానమెట్లో దానివలన ఫలమేమో దానివలన యేదేవతకు ప్రీతియో దానినిచేయకున్న పాపమేమో సెలవిచ్చి నన్ను గృతార్థురాలను చేయవలయు ననఁగా విని శివుఁడు చెప్ప నారంభించెను. ఓ కాత్యాయనీ, చెప్పెద వినుము. ఆయేకాదశీ మహిమ శ్రీమన్నారాయణునికి తప్ప యితరులకు పూర్తిగా తెలియదు. ఆయన తప్ప మఱి యెవరును బాగుగ చెప్పజాలరు. ఐనను నాకు తెలిసినంత వఱకు నీతో చెప్పెదను. సంసారములోని జనుల నుద్ధరించు టకు శ్రీహరి యేకాదశిని పుట్టించెను. ఆ వ్రతముచేయువారు సమస్తపాపములను నశింపఁజేసికొని స్వర్గమును పొందుదురు. ముందుగా పాపపురుషుని యాహరి పుట్టించెను. ఆ పాపపురుషు నికి శిరస్సు బ్రహ్మహత్య, కల్లుత్రాగుట నేత్రములు, బంగా రము దొంగిలించుట వానిముఖము, గురుపత్నీ హరణమువాని చెవులు, స్త్రీహత్య వాని ముక్కు, గోహత్య వానిచేతులు, గోబ్రాహ్మణ ద్వేషము వానిపెదవులు, పరస్త్రీ హరణము వానికంఠము, శిశుహత్య వాని హృదయము, సమస్తపాప ములు వాని మధ్యభాగము, గురునింద వానిగుండె, కన్యా

విక్రయమువాని స్తనద్వయము, అసత్యమువానికాళ్ళు, ఇట్లు సమస్తపాపములతోను వానినిపుట్టించి పాపము చేయువారిని శిక్షించుటకు యముని పుట్టించెను. ఆ యముఁడు జనుల పాప పుణ్యములను విచారించి వారికి తగినశిక్ష విధించును. పిమ్మట సమస్తరోగములను పలువిధములగు నరకములను కల్పించెను. ఎవరేపాపములు చేయుదురో వారికిదగిన నరక బాధలు విధించును. ఇవి యన్నియు శ్రీహరియొక్క సృష్టియే కాని వేరు కాదు. ఇట్లు సృష్టిచేసి కొంతకాల మయిన పిమ్మట శ్రీమహావిష్ణువు తాను సృజించిన లోకమును యముఁ డెట్లు పాలించు చున్నాఁడో చూడవలెనని తలఁచి గరుడ వాహనారూఢుండై యమలోకమునకు వేంచేయఁగా ధర్మరాజు డాయనకు యెదురేగి తనసదనమునకు తోడ్కొని పోయి రత్నసింహాసనముపై కూర్చుండఁజేసి షోడశోపచారములచే పూజించెను. షోడశోపచారములేవనఁగా 1. అర్ఘ్యము, 2. పాద్యము, 3. ఆచమనము, 4. పంచామృత స్నానము, శుద్ధోదక స్నానము. 5. వస్త్రద్వయము, 6. యజ్ఞోపవీతము, 7. గంధము, 8. అక్షతలు, 9. ఆభరణము, 10. పుష్పములు, 11. ధూపము, 12. దీపములు, 13. నివేదనము, 14. తాంబూలము, 15. నీరాజనము, 16. మంత్రపుష్పము, సమర్పించుచు పూజించి ప్రదక్షిణపూర్వక సాష్టాంగ నమస్కారములు చేసి చేతులు జోడించుకొని యెదుట నిలిచి తమ రాకకు కారణమేమనియడుగఁగానీలోకము చూడవచ్చితిమని విష్ణువు సెలవిచ్చెను. అంతట గొప్ప వ్యాకులమైన పెద్దధ్వనులు విన బడఁగా శ్రీహరి యముని జూచి యదియేమని యడిగెను.

అందుకు యముఁడిట్లు మనవి చేసెను. స్వామీ ! ఈ దక్షిణపువైపున నరకకూపము లన్నియు నున్నవి. అం దనేక మంది పాపులు గుంపులు గుంపులుగా నున్నారు. వారు పూర్వ మనేక పాపములుచేసి మదోన్మత్తులై యిప్పుడు వానికి శిక్షలనుభవించుచు మొఱపెట్టుచున్నారు. దూతలు చేయు శిక్షలుభరింపలేక వారు కేకలువేయుచు రోదనము చేయు ధ్వనులే యవి. అనఁగా విని, కరుణార్ద్రహృదయుఁడైన శ్రీహరి వారినిచూచి వారి బాధలు నివారింపఁజేయ దలంచి పాపులను జూడఁబోయి వారు పడుశ్రమ, యమదూతలు వారికి చేయు శిక్షలు, కనిపెట్టి వారియెడల కనికరము కలిగి, తనచే సృజింపఁబడియున్న ప్రజ లింతబాధ పడుచున్నారని వారికి తరణోపాయము కలిగింపవలెనని తానొక వ్రతము కల్పించి, యా వ్రతము చేయువారు సమస్త పాపములను నశింపఁజేసికొని స్వర్గమును పొందుదురని వారందఱితో చెప్పి వారిచే నా వ్రతము చేయించి వారి నందఱిని తరింపఁజేసి స్వర్గమునకు పంపెను. శ్రీహరి స్వయముగ నా వ్రతము కల్పించిన దినము, ఆపక్షములో పదునొకండవ దినమగుటచే దాని కేకాదశి యని పేరు. ఆదినమున చేయఁబడు వ్రతముకావున దాని కేకాదశీ వ్రతమని పేరుపెట్టెను. ఆ వ్రతవిధాన మేమనఁగా, యా నాఁడుదయము సూర్యుఁడుదయించకముందు లేచి కాలోచితకృత్యములు దీర్చుకొని స్నానసంధ్యాది నిత్యకర్మలు చేసికొని విష్ణుమందిరమునకు పోయి శ్రీహరిని విధ్యుక్తముగా షోడశోపచారముల పూజించి ప్రదక్షిణ నమస్కారములచేసి తా నాదినమున నేకాదశీ వ్రతము చేయనిశ్చయించు కొంటిననియు దానిని నిర్విఘ్న

ముగా కొనసాగింపుమనియు ప్రార్థింపవలెను. పిమ్మట శ్రీమన్నారాయణుని ధ్యానించుచు నా దినమున కాలము గడుపవలెను. మధ్యాహ్నమందును, సాయంసంధ్యాసమయమునను తిరుగ నట్లే పూజింపవలెను. సంతానము గలవారేమియు తినకుండ నుండకూడదు. సన్న్యాసులు, సంతానహీనలైన విధవలు తప్ప తక్కిన వారందఱును పాలు, పండ్లు, మొదలైనవి ఫలహారము చేయకుండ శుష్కోపవాసము చేయకూడదు. శరీరదార్ఢ్యముగల యెడల సన్న్యాసులు, గొడ్డువిధవలు ఏమియు తినకున్నను దోషములేదు. ఆదినము రాత్రిపగలు పురాణపఠనముగాని, వినుటగాని యాటపాటలతోగాని శ్రీహరి నామమంత్రజపము చేయుచుగాని జాగరణము చేయుట శ్రేష్ఠము. మరునాఁడుదయమున లేచి మామూలుగా నిత్యకర్మలు చేసుకుని ద్వాదశి గడియలుండఁగా శ్రీహరిని పూజించి నివేదన చేసిన ప్రసాదము నతిథి, యభ్యాగతులతోను, బంధుమిత్రాదులతోను భోజనము చేయవలెను. తమ శక్తి ననుసరించి యన్నదానము చేయుటమంచిది. త్రయోదశి గడియలు ప్రవేశించిన పిమ్మట భుజించిన వ్రతము నిష్ఫలమగును. ఈవ్రతము శ్రీవిష్ణు ప్రీతియైన వ్రతములన్నిటిలో మిక్కిలి శ్రేష్ఠమయినది. కావున నియమముగా చేయువారికి తప్పక పాపములన్నియు నశించి వైకుంఠ ప్రాప్తి కలుగును. భార్యాభర్తలు కలిసి యీవ్రతముచేయుట శ్రేష్ఠము. అన్ని యేకాదశులు పాలించలేనిచో యాషాఢశుద్ధమున వచ్చు, తొలి యేకాదశి, భాద్రపద శుద్ధమున వచ్చు పరివర్తనైకాదశి, కార్తిక శుద్ధమున వచ్చు బోధనైకాదశి,

మాఘ శుద్ధమున వచ్చు భీష్మైకాదశి, యీనాలుగు ముఖ్యముగా చేయవలసినది. రోగులు బలహీనులు, బాలురు, గర్భిణీస్త్రీలు వీరికి కఠినమైన నియమములనుసరణము లేదు. కాని యీ దినమునందన్నము తినకూడదు. ఏలనుచేత ననగా నాదినమున పైనిచెప్పబడిన పాప పురుషుడన్నమున నుండును. అని శ్రీహరి చెప్పెను. ఈ యేకాదశీ వ్రత ప్రభావమునుచూచి భయము పొంది పాపపురుషుడు శ్రీహరి పాదములపై బడి నాకేమి దిక్కు? నేనెందు బోదును. ఏకాదశి నన్ను బాధించుచున్నది. ఎందును నిలువ నెయ్యదని ప్రార్థింపగా వానితో శ్రీహరి యిట్లులానతిచ్చెను. "నీ వేకాదశీదినమున నన్నమునందు దాగియుండుము. అక్కడ నీకు ప్రమాదముండదు. దానిని భుజించువారు నీబారినిపడుదురు" అనిచెప్పి శ్రీహరి వైకుంఠమునకు వేంచేసెను. అనిశివుడు పార్వతితో చెప్పగా విని సంతసించెను.

## పూజావిధానము

ఏ దేవతనుగాని షోడశోపచారములచే పూజించునపుడు వారిభార్యను కూడ కలిపి పూజింపవలెను. అది యెట్లంటేని శ్రీమన్నారాయణుని పూజించునపుడు లక్ష్మిని కూడ చేర్చి శ్రీలక్ష్మీనారాయణాయని పూజింపవలెను. ప్రతి దేవునికిని యాగమ మంత్రములున్నవి. వానినే మూల మంత్రములందురు. ఆమంత్రములనుతగినగురువువలన నుపదేశమును పొంది నిత్యము జపించుచుండువారు, ఆ మూల మంత్రముచేత పదియారుపచారములు సమర్పింపవలెను.

ఇదియే శ్రేష్ఠము. అట్టి యుపదేశము లేనివారు పురుష సూక్త శ్రీసూక్త మంత్రములసంపుటీకరణముతో పూజించవలెను. కేవలము పురుషదేవతనే పూజించువారు పురుషసూక్తము చేతను, స్త్రీదేవతనేపూజించువారు శ్రీసూక్తముచేతనుపూజింపవచ్చును. పుష్పములను సమర్పించునప్పుడు, ముందుగాగణేశ ద్వాదశనామములు చెప్పి, తరువాత కేశవాదినామము లిరువదినాలును చెప్పి, తరువాత తాను పూజించు దేవతాసంబంధమైన 108 నామములుగాని సహస్రనామములుగాని చెప్పుచు పుష్పములు దేవునిపై వేయుచుండవలెను. ఏ దేవుని బూజించినను ముందు వినాయకుని పూజించుట అవసరము. కావున నాతని పండ్రెండు నామములైనను చెప్పవలెను. ఏ దేవుడైనను, శ్రీ మహావిష్ణువుయొక్క రూపాంతరమే. కావున కేశవాది నామములు చెప్పవలెను. ఇది శాస్త్రసమ్మతము. పూజారంభమున చేయు ధ్యానము దేవతా రూపమున మనస్సున నిలుపుకొనుటకును పూజాంతమందుచేయు ధ్యానము ప్రార్థనయనియు తెలియవలెను. పురుష దేవతలను పూజించునపుడు నామముల యంతమందు "ఓం, చేర్చియు స్త్రీ దేవతను పూజించునపుడు నామాంతమందు "శ్రీం" చేర్చియు చెప్పవలెను. వేదోక్తముగా పూజచేయుటకు వీలులేనివారు పురాణోక్తముగా పూజింపవలెను. ఇట్టి విషయములో వృద్ధాచారము ప్రకారముచేయుట యావశ్యకము. పైనిచెప్పఁబడిన సంగతులు ప్రత్యక్షముగాచేయు పూజలకేగాక . మానసికముగాఁ జేయు పూజలకును చెందును. ఇట్టి పూజలు చేయునపుడు మనస్సును చెదరనీయక యారాధించు దేవతనే ధ్యానిం

చుచు భక్తిశ్రద్ధలతో చేసిన, కోరిన ఫలమును పొందుటకు సందేహముండదు.

అతిథి పూజాఫలము.

పిమ్మట పార్వతి యీశ్వరునిజూచి స్వామీ! మీవలన యనేక పుణ్యకథలు వింటిని. ఎంత విన్నను మనస్సు తృప్తి నొందుటలేదు. ఇంకిను మఱియొక్క సంగతి దయచేసి సెల విచ్చిన నిప్పటికి తృప్తి నొందెదను. అది యెద్దియనిన నాలు గాశ్రమములలోను గృహస్థాశ్రమము శ్రేష్ఠమని చెప్పుదురు. అందుకు కారణమేమో వినఁగోరెదను. అనఁగా విని శివుఁడు మిక్కిలి సంతోషించి దేవీ! నీవడిగిన యీ ప్రశ్న చాల గొప్పదియు లోకోపకారమునునై యున్నది. సారమైన ప్రశ్న వేసితివి. కావున సంతోషముతో చెప్పెదను. శ్రద్ధతో వినుము. నాలుగాశ్రమములలోను గృహస్థు శ్రేష్ఠుఁడు, ఎందుచేత ననఁగా నాతఁడితరాశ్రమములవారికి నుపాధి కలుగఁజేయ గలఁడు. బ్రహ్మచారి, వానప్రస్థు, యతియనువారితరులను సత్కరింప లేరు సరేగదా తమమట్టుకు తామైనను పోషించు కొనలేరు. అది యెట్లనఁగా బ్రహ్మచారి గృహస్థులయిండ్ల మధూకరముచేసికొని జీవించుట ధర్మము. వానప్రస్థు లరణ్యముననుండి కాయలు, పండ్లుతిని జీవింతురు, వారును తమక్షుత్తును నివారింపఁజేసికొనుటకు గృహస్థులనే చేరుదురు. వీరేకాక గృహస్థులలో కొందఱు దరిద్రావస్థచేత తినుటకు లేక గృహస్థులనే యాశ్రయింతురు. కావుననెల్లయాశ్రమముల వారికి నాధారమైనది గృహస్థాశ్రమమేకదా! కావుననే దాన

శ్రేష్ఠత్వము కలిగినది. అట్టి గృహస్థులను తరింపజేయునది యతిథిపూజ. దానిని చేయువారు గొప్పపుణ్యాత్ములు. వారితో సరియైన పుణ్యవంతులు లోకములో లేరు. దానిని చేయని గృహస్థులు నరక మనుభవింతురు. వారికి ముఖ్యమైన ధర్మ మతిథిపూజయే. అది చేయనివారికి యితర ధర్మము లన్నియు నశించును. నిత్యమతిథిపూజ చేయువారితో సమాన మైన పుణ్యాత్ములు ముల్లోకములలోను శ్రేష్ఠులు. ఇందుకు దృష్టాంతము వినుము. పూర్వము భరతవర్షమున యార్యావర్త పుణ్యభూమియందు నొక బ్రాహ్మణుడుండెను. అతడు సత్య వ్రతుడు. ధార్మికుడు, పండితుడునై యుండుటచే నతని పేరు వినినంత మాత్రముననే సమస్త పాతకములు నశించును. ఆయన యొకరోజున రోమహర్షణ మహామునిని దర్శించి, గృహస్థు తరించుటకు తగిన ముఖ్యధర్మ మేమని యడుగగా నామహాముని యాయనతో నిట్లనెను. ఓ బ్రాహ్మణోత్తమా! గృహస్థులు ముక్తినొందుటకతిథిపూజకంటె హెచ్చుధర్మము లేదు. అదే సర్వధర్మములలో సారమైనది. అతిథి యెవరనగా మనయింటికి వేళకు భోజనమునకు వచ్చినవాడే. అతడే జాతివాడైనను సరే. బ్రాహ్మణుడు మొదలు చండాలునివఱకు గల జాతులలో నే జాతివాడైనను నింటికి వచ్చినప్పుడు వానిని కూర్చుండబెట్టి కుశలమడిగి వానికి భోజనముపెట్టి యాదరింప వలెను. రాత్రికాలమునందైనను పరుండుటకు తగినస్థల మియ్య వలెను. భోజనము పెట్టుటకు శక్తి లేనియెడల తనకుగల శక్త్యనుసారము ఫలహారము పెట్టవలెను. అందుకును శక్తి లేని యెడల తనదరిద్రావస్థ యతనితో చెప్పుకొని యేడ్చి క్షమింపు

మని ప్రార్థింపవలెను. ఈ పై మూడువిధములలో నేదియు చెయ్యనియెడల యా గృహస్థుడు చేసిన పుణ్యఫలమతడు తీసికొని వాని పాపమా గృహస్థులకు విడిచి పోవును. అతిథిని పూజించుటవలన శ్రీహరిని పూజించిన ఫలము లభించును. శక్తి కలిగియుండియు నతిథిని పూజింపనివారికి సమస్తము నశించును. అని రోమశ మహాముని యా బ్రాహ్మణునితో చెప్పి పోయెనని యీశ్వరుడు పార్వతితో చెప్పెను. ఈపద్మపురాణము నందు చెప్పబడిన మఱికొన్ని విషయము లితర పురాణము లందు చెప్పబడినవి. విపులముగా చెప్పబడి యున్నందున వానిని యందు వ్రాయదలచి యీ పురాణము నింతటితో ముగించడమైనది. ఈ పురాణము పార్వతితో నీశ్వరుడు చెప్పిన ప్రకారము శ్రీ వేదవ్యాస మహర్షి వలన వ్రాయబడి యున్నది.

---

# అష్టాదశపురాణసారము

# శ్రీ మ హా లిం గ పు రా ణ ము.

ఈ మహాపురాణము జైమినికి వ్యాసమహర్షి చెప్పినది.

## పార్వతి శ్రీరాముని పరీక్షించుట

పూర్వకాలమున త్రేతాయుగమునం దొకనాఁడు సతీ పరమేశ్వరు లుద్యానవనమునందుండి వినోదించుచుండఁగా, సీతను వెదకుటకై సుగ్రీవునిచే దక్షిణదిక్కునకు పంపఁబడిన హనుమంతుఁడు మొదలగు వానరులు వారి యొద్దకుఁబోయి వారిని దర్శించిరి. వారుహనుమంతుని సమాచారమునడుగఁగా సీతను రావణుఁడెత్తుకొని పోయెననియు, నందుకు విచారించుచు, శ్రీరామ లక్ష్మణులు మాల్యవంత పర్వతమున నున్నారనియుచెప్పెను. అదివిని శివుఁడుతానువెళ్ళివారిని చూచివచ్చెదనని పార్వతితో చెప్పిబయలుదేరెను. ఈశ్వరుఁడుమాల్యవంతమునకుఁబోయి యొక శమీవృక్షముక్రిందనున్న రామలక్ష్మణుల యెదుటనిలిచెను. కాని వారు దుఃఖముతోనున్నందున మాటాడరైరి. అది చూచి శివుఁడు తిరుగనింటికివచ్చి సతితో జరిగినదంతయుచెప్పెను. ఆమాటవిని యామె శ్రీరాముఁడునారాయణాంశజుఁడు కాఁడనెను. ఎందుచేతననగా నతఁడే జగదీశుడైనచో భార్యకొఱకు నంతగా నేలవిచారించును? వాని భార్యను రాక్షసుఁడేల యెత్తుకొనిపోవును? ఇట్లు కొంత వాదించి

తానుపోయిన రాముని పరీక్షించి వచ్చెదననెను. అది విని శివుఁడు రాముఁడు విచారముతో నున్నాఁడు నీవునీ వెళ్ళ వద్దనియు వెళ్ళిన తప్పక పరాభవము కలుగుననియుఁజెప్పెను. ఆ మాటలకు లక్ష్యపెట్టక "మీరు సెలవిచ్చిన పోయివచ్చెద" నని సెలవుతీసికొని పోవుచు త్రోవలో యోజించి సీతరూపమున వారి సన్నిధికేగఁగా రాముఁడామెను జూచి యిట్లనెను. "ఏమమ్మా దాక్షాయణి! వచ్చి కూర్చుండుము. శివుని భార్యవయ్యును సీతవేష మేల దాల్చితివి" ఆ మాటకు సిగ్గుపడి యామె వెంటనే తొందరగా నింటికి వెళ్లెను. ఆమెనుచూచి యేమిజరిగినదని శివుఁ డడుగఁగా, "ఏమియు లేదు. వారు మాటాడనందున నేను తిరుగవచ్చితిని," అని చెప్పెను. ఆ మాటలువిని సంశయించి యోగధ్యానమున చూడఁగా సర్వ మాయనకు తెలిసెను. అంతట శివుఁడు పార్వతితో నిట్లనెను. "నీవు పోవుచు మార్గమున నాలోచనమార్చి సీత రూపముతో పోయితివి. అది తెలిసికొని యేమమ్మా దాక్షాయణీ కూర్చుండుము. నీవు శివుని భార్యవయ్యును సీత రూపు నెందుకు దాల్చితివి?" అనెను. నేను చెప్పెదను వినుము, "మేమనఁగా బ్రహ్మ, విష్ణువు, నేను, మువ్వురము నన్నదమ్ములము. రాముఁడే విష్ణువు, అతఁడు నిన్ను తల్లి యనెను. కావున నేఁటినుండి నాకును తల్లివే యని, తపస్సు నారంభించెను. అది చూచి సతి మిక్కిలి దీనురాలై యుండెను.

## దక్షుని యజ్ఞమున సతి దగ్ధమగుట

ఇట్లు మహేశ్వరుఁడు తనయందు విముఖుఁడై చలింపని చిత్తముతో తపస్సు చేయుచుండుట చూచి తాను తెలియక చేసిన తప్పు భర్త క్షమించకపోవునా ? యని భ్రమపడు చుండెను. క్షమించకపోయిన నేమిచేయుదునని భయపడు చుండెను. ఏమిచేయుదును ? ఏమితోచకున్నది. నాకు సహాయము చేయువారు లేరుగదా ! అని విచారించుచుండెను. ఇట్లుండఁగా నాకాశవాణి యిట్లనెను. "ఓసతీ వినుము. నీవు కపటమున నీభర్తతో మాట్లాడితివి ! రాముని యెదుట మాయవేషమును వేసితివి. జగత్తులకు కర్తయైన రాముఁడు నిన్ను తల్లీయని పిలిచెను. ఈశ్వరుఁడు మహాయోగి. ఆయన నిన్ను విడిచినాఁడు. మఱియేలుకొనఁడు. ఈ దేహముతో మరల నీశ్వరుని పొందలేవు." ఈ మాటలు విని యామె మూర్ఛిల్లి నేలబడి కొంతసేపటికి తెలివొంది లేచి విధివశమె ట్లున్న నట్లగును. తప్పింప నెవరివశము ; అని విముఖురాలై యుండెను.

అంతట తనతండ్రియైన దక్షుని యజ్ఞమునకు చంద్రుఁడు విమానముపై పోవుచుండుటచూచి, నీవెందుఁబోవుచున్నావని యడిగి తెలిసికొని తండ్రి, తన్ను తనభర్తను పిలువకుండు టకు కారణము తెలియక, విచారించి తనభర్తయొద్దకుఁబోయి యెదుట నిలిచెను. ఆమెనుచూచి శివుఁడు తన కుడితొడచూపి కూర్చుండుమనెను. అది పార్వతిగ్రహించి యాయన నన్ను తల్లిగా భావించెను. భార్యకు నెడమవైపుగదా కూర్చుండనర్హత

గలదు. నేను మఱేక్కడ నుండెను. తండ్రియింటికిపోయె దను. అని మనస్సులో భావించి, కళ్ళనీరు గారుచుండగా, చెప్పుటకు నోరాడక శివునితో నిట్లనెను. "ఓ త్రిలోచనా! మా తండ్రిగొప్ప యజ్ఞముచేయుచున్నారట. అందుకుబోవలె ననిమనస్సుపుట్టినది. సెలవిచ్చినపోయివచ్చెదను" ఆ మాటలు విని శివుడు పిలువకుండ నెవరియింటికిని బోరాదు. తండ్రి యింటికి పోయెదవా? "ఓ తల్లీ! నీ కవమానము తప్పక జరుగును. వెళ్ళవలెనన్న వెళ్ళుము" అనెను. పార్వతి కోప ముతో బయలుదేరి తండ్రియింటికి పోగా కొందఱు సఖు లామెను చూచి నిన్నెవరు పిలిచినారమ్మా? అనిరి. అది విని లజ్జితురాలై యజ్ఞము జరుగుచున్న స్థలమునకుబోగా తండ్రి యామెనుచూచి "ఓసి దౌర్భాగ్యురాలా! నిన్నెవరు తీసికొని వచ్చినారు. నీపెనిమిటి మతిభ్రష్టుడై శ్మశానములో తిరు గుచు, బూడిదెపూసికొను చుండును. ఛీ! యిక్కడ నుండి పొమ్ము, నీముఖము చూడకూడదు. ఆ మాటలు విని శివుని నిందించుట తన చెవుల వింటినిగదా యని కోప ముచే మండిపడి, యగ్ని కుండములో పడి భస్మ మయ్యెను. ఇదిచూచి యచ్చటి వారందఱు హాహా కారంబులు చేసి యిట్లనుకొనిరి. "ఈ సమాచారము శివుడు విని యుద్ధమునకు వచ్చును. ఘోరయుద్ధమగును. యజ్ఞము విఘ్నమగును."

అంతట అచ్చటనున్న దేవర్షియైన నారదుడు తనలో నిట్లు భావించెను. "ఇది గొప్పయజ్ఞము. దీనిని చూచుటకు దక్షప్రజాపతి ముప్పదిమూడుకోట్ల దేవతలను పిలిచి, తన కల్లుడైన సదాశివుని పిలువకుండుటకు కారణమేమి? అతడు

శ్మశాన వాసియనియు, బ్రహ్మహత్య చేసెననియు, విష్ణుని
సభయందు నాఁడు తనకు నమస్కారము చేయలేదనియు,
కోపించి పిలుచుటకు మానియుండును. పోనీపిలువకున్నను తన
కొమార్తె తనయింటికి వచ్చినపు డిట్టి కఠినపుమాట లాడ
వచ్చునా? శివునియందుకోపముండవచ్చునుగాని యామెయేమి
చేసినది? బాగులేదు. కావున నే నిప్పుడే కైలాసమునకుపోయి
యీశ్వరునితో జరిగినదంతయు చెప్పి యుద్ధమునకు తీసికొని
వచ్చెదను.''అని ఆకాశమార్గమునపోయి శివునితో చెప్పెను.
ఆయన విని వెంటనే మూర్ఛనొంది తెలివిరాగానే తనఢమరు
వాయింపఁగా ప్రమథగణంబులేదో యుపద్రవ మున్నదని
యెఱింగి యుద్ధసన్నాహముతో వచ్చి వారియెదుట నిలిచిరి.
ఈసంగతి వారితో చెప్పి యుద్ధమునకు బయలుదేరివెళ్ళి దక్షు
నిపైబడి ఘోరయుద్ధము చేయుచుండఁగా శివుఁడు తన శూల
ముతో దక్షునితలనరికెను. అప్పుడు విష్ణువు శివునియొద్దకుబోయి
యిట్లుబోధించెను. ''ఓ జగదీశ్వరా! కోపము చల్లార్పుము గతిం
చిన పనికి విచారించినఫలములేదుగదా. సతినినీవు విసర్జించితివి
గదా? ఆమె యీ దేహముతో నీకు బనికిరాదు గదా?
తిరుగ ఆమె నీకు త్వరలో లభింపఁగలదు. ఇప్పుడు మీరు
దక్షుని కటాక్షించి వానిని బ్రతికించవలెను. లేని
యెడల జగత్తునకు చాల నష్టమగును. అని చెప్పఁగా వాని
శిరస్సు తెమ్మని శివుఁడనెను. దానిని యెంత వెదకినను కాన
రానందున మేకతలను తెప్పించి దక్షుని మొండెమున కతికి
ప్రాణప్రతిష్ఠచేసిరి. దక్షుఁడు శివుని పాదములకు నమస్కరించి
తన యపరాధమును క్షమింపుమని వేడుకొనెను. ఈశ్వరుఁడు

సంతసించెను. అందఱును నిజ నివాసములకుఁ బోవుచు నీశ్వరుని పిలువకుండ యజ్ఞముచేయుట గొప్ప తప్పు. అందువల్లనే విఘ్నమైనది యనియనుకొనిరి. శివుఁడు తన యుద్యానవనమున ప్రమథగణములతో చేరి, చాల విచారించి చేయునదిలేక యోగధ్యానమున తపస్సు చేయుచుండెను.

### సతి తిరుగ జన్మించుట

శ్రీ సదాశివుని భార్యయైన సతీదేవి యట్లు దక్షుని యజ్ఞకుండమున భస్మమై తిరుగ వేరు దేహమును ధరించి శివునికి భార్యకావలెనని యెంచి హిమవంతుని భార్యయైన మేనకాదేవి గర్భమున ప్రవేశించెను. కొంతకాలమునకు జనన మై మిక్కిలి ముద్దుగా పెరుగుచుండెను. ఇట్లు క్రమముగా పెరిగి పెద్దదికాఁగా నామె నెవరికిచ్చి పెండ్లి చేయుదుమని తగిన వరుని తెలిసికొనలేక తలిదండ్రులు విచారించు చుండఁగా నొక దినమున రోమహర్షణ మహర్షి హిమవంతునియింటికి వెళ్ళఁగా హిమవంతుఁడా, ఋషి కర్ఘ్యపాద్యములిచ్చి, విధ్యుక్తముగా పూజించి, యాయనకు పరిచర్య చేయుటకు పార్వతిని నియమించెను. ఆ చేయుసేవకు సంతోషించి యాఋషి, యేమి కావలెననఁగా, స్వామీ! కైలాసవాసియగు మహేశ్వరుఁడు నాకుభర్తకావలెనని చెప్పెను. ఆ ఋషి యామెకు నొకమంత్రముపదేశించి దానిని జపించుచు హిమవత్పర్వతమున కుత్తరముననున్న గుహలోనుండి తపస్సుచేయుమని చెప్పిపోయెను, పార్వతి యేకాగ్రచిత్తముతో నుండి-నిశ్చలమైన, మనస్సుతో నాయడవియందు దొరకు పండ్లు దుంపలు తినుచు తపస్సు చేయుచుండెను.

శివుని తపోభంగము.

ఆ సమయమందు తారకాసురుఁడను రాక్షసునిచే బాధలు పడుచున్న దేవతలు బ్రహ్మయొద్దకుబోయి మొర పెట్టఁగా బ్రహ్మ యాలోచించి యీశ్వరునికి పుట్టిన కుమారుని వలన గాని వాఁడు చావడని తెలిసికొని, ఈశ్వరునికి భార్య లేక యాయనవిరక్తి చెంది తపము చేయుచున్నాఁడు. ఆయన కుమారుని కనుటయెట్లు? అని వివరించి తనకు మదినాలో చన తోచనందున శ్రీమహా విష్ణువు నొద్దకు పోదము రండని దేవతలను తోడుకొని వైకుంఠమునకు పోయి యాయనతో చెప్పఁగా విని శ్రీహరి యిట్లనెను. "ఓ సురశ్రేష్ఠా!" ఈశ్వరుఁడు తపస్సు చేయుచున్నాఁడు. ఆయన మహాకోపి. ఆయనను మాట్లాడించుట యెట్లు? సమాధి చాలించినగాని యాయనకు శరీరమందుస్పృహకలుగదు. అది కలిగినగానికామ మోహితుఁడు కాఁడు. మోహితుఁడుకాకున్న వివాహ ప్రయత్నము జరుగదు. వివాహమైనగాని కుమారుఁడు పుట్టడు. ఆ కుమారునివలనగాని తారకాసురుఁడు చావడుగదా? ఇది యంతయు యసాధ్యముగాకనఁబడుచున్నది. అయినను నేనొక్క యుపాయము చెప్పెదను. అట్లు మీరు జరిగించిన, కార్యము సాధ్యమగు"నని చెప్పెను. అది యేమనఁగా లోకమునందలి సమస్త జీవరాసులకు కామావేశము కలిగించువాఁడు కాముఁడు; నా కుమారుఁడైన మన్మథుఁడు. వానిని బ్రతిమాలిపంపి యీశ్వరునిపై పుష్పబాణములను ప్రయోగించిన వానికి తపోవిఘ్నమగును. ఆవెనుక వివాహ ప్రయత్నము చేయనచ్చును. కాని మఱియొకటి చెప్పెదను. ఆ శివుఁడు

మహాకోపి. అతని కన్నియే మూఁడవ కన్నుగా నిటలమున నున్నది. కావున మన్మథునికపాయము రావచ్చును. అందుకు తా నెదురుగా నుండక మాటుననుండి పుష్పబాణములను ప్రయోగింపవలెను. అతనికి సహాయముగా వసంతు, జయంతులను, మలయమారుతుని పంపుడు. అట్లే చేయుదుమని సెలవుతీసికొని బ్రహ్మాది దేవతలు తమ నివాసములకుపోయిరి. పిమ్మట యింద్రుఁడు సభచేసి శ్రీహరి చెప్పిన సంగతుల నందఱకు తెలియఁజేసి అందున్న మన్మథ, జయంత, వసంతులను శివుని తపోవనమునకు పోయి యాయన కామమోహితుఁడై తపస్సుచాలించునట్లు చేయుఁడని ప్రార్థింపఁగా వారంగీకరించిరి.

## కామదహనము

పిమ్మట వారు నలువురుకలిసి శివుఁడున్నచోటికి బోయిరి. ఆ వనమున వసంతఋతువునందలి లక్షణములు కనఁబడెను. చెట్లు చిగిరించి పువ్వులుపూచెను. కోయిలలు కూయుచుండెను. చిలుకలు, శారికలు కలకలధ్వనులు చేయుచుండెను. చల్లని నీలమేఘము క్రమ్మెను. అదిచూచి నెమిళ్లు క్రేంకారములు చేయుచుండెను. మలయమారుతమువీచెను. అట్టి సమయములో మన్మథుఁడు పుష్పబాణములను శివునియురమున నాటనేసెను. అవి తగులగానే శివుఁడు తపముచాలించి తేరిచూడఁగా నెదుట నున్న మన్మథుఁడు భస్మమయ్యెను. అదివఱకే తన పెనిమిటి కేమి యాపద వచ్చునోయని వెంటనే పోయియుండిన రతీదేవి మిగుల దుఃఖించి శివుని బహువిధముల ప్రార్థింపఁగా నాశివుఁడామెపై కరుణించి తనకుమాత్రము తన భర్త దేహముతో

కనఁబడునట్లును, ఇతరులకు కానరాకుండ బాధ కలిగించు నట్లును నరమిచ్చెను. మన్మథుని శరీరము భస్మమైనను నత నికి నాశనము లేనందుననే జగత్తునందలి సమస్త జీవకోటులును పిపీలికాది బ్రహ్మపర్యంతము వానివల్ల మోహపరవశు లగు చున్నారు.

## శివుఁడు పార్వతిని పెండ్లియాడుట

ఇట్లు శివుఁడు కలివొంది మోహోన్మత్తుఁడై సతీ వియోగమునకు చింతాక్రాంతుడై యుండగా శ్రీమహావిష్ణువు నారదుని పిలిచి, నీవు వెంటనే వెళ్ళి సతి హిమవంతుని కూతురై పుట్టి మిమ్మును వివాహమాడుటకై తపస్సు చేయుచున్నదని శివునితో చెప్పి రమ్మని పంపెను. నారదుఁ డాలాగుననే చేసెను. ఆ మాటవిని శివుఁడు సంతసించి సంధాన మెట్లగునని విచారించు సమయమున నగస్త్యుఁడు, విశ్వామిత్రుఁడు, వసి ష్ఠుఁడు మొదలగు మహర్షు లాయనను దర్శింపఁబోయిరి. వారిని గౌరవించి శివుఁడు తనకు గలిగిన సతీవియోగ దుఃఖ మునుతలంచి మాటాడుచు "నామె హిమవంతునికి కొమార్తెయై పుట్టెనని యిప్పుడే నారదుఁడు చెప్పి పోయెను." అని చెప్పెను. ఆ ఋషులు విని యట్లయిన మీ రామెను వివాహమాడుడు. మేమిప్పుడే హిమవంతునియొద్దకుపోయి నిశ్చయించుకొని వచ్చె దము. ఈ వివాహము జరిగినకాని మీకు సంతాపశమనము కాదు. అని చెప్పగా నీశ్వరుఁ డంగీకార మొనర్చినందున వారు వెంటనే హిమవంతునియొద్దకుఁబోయి శ్రీ సదాశివుని మహిమ, నైశ్వర్యములు నభివర్ణించి చెప్పగా విని యాయన

సంతోషముతో కొమార్తె నిచ్చుటకు నిశ్చయించి వెంటనే బృహస్పతిచే వివాహ ముహూర్తము నిర్ణయము చేయించి యానాటికి శ్రీ మహాదేవుని తరలి రావలెనని ప్రార్థించుటకు తగిన సంధానకర్తలను పంపి, తాను వివాహ ప్రయత్నము చేయించుచుండెను. ఆ వార్తవిని శివుఁడు మిగుల సంతోషించి బ్రహ్మ, విష్ణువు, మహేంద్రుఁడు మొదలగు ముప్పదిమూఁడు కోట్ల దేవతలతోను హిమవంతు నింటికి పోయి పార్వతిని వివాహమై మామగారిచ్చిన రత్నములు, కానుకలు, దాసదాసీ జనములను తీసికొని గొప్ప యుత్సవముతో కైలాసమున పార్వతీ సహితుఁడై ప్రవేశించి, సమస్త దేవతలకు తగిన మర్యాదలు చేసి వారివారి నెలవులకు పంపెను, పిమ్మట పార్వతీ, పరమేశ్వరులు వినోదముతో నుండిరి. ఒక దినమున నందవనమున వారుండఁగా నచ్చట గంధ మృగముపిల్ల యా మెకంటఁ బడెను. నది మిగుల కోమలముగాను నందముగాను కనఁబడి నందున పార్వతిదానిని పెంచవలెనని పరమేశ్వరునితో ననఁగా నతడు సరే నసెను. అప్పుడామె దానిని పట్టి తెప్పించి పెంచుచుండెను. దానిని కాచి సంరక్షణ చేయుటకు నాగార్జునుఁడను బాలునికి నప్పగించెను. ఈనాగార్జునుఁ డెవరని జైమిని యడుగఁగా వ్యాసుఁడిట్లనెను.

## నాగార్జున చరిత్రము

పూర్వము పాండవులలో నొకఁడైన యర్జునుఁడు తీర్థ యాత్రలకుబోయి యొకపుణ్యనదిలో స్నానము చేయుచుండఁగా నచ్చటికి నదివలనకే వచ్చియున్న యులూచియను నాగకన్యక

యాతని రూపరేఖా విలాసములను చూచి మోహించియాయర్జు నుని తన నిజనివాసమైన నాగలోకమునకు తీసికొనిపోయి గాంధర్వవిధిచే వివాహమై కొంతకాలము వినోదింపుచుండెను. అంతటయామెగర్భమునుధరించి యుక్తకాలములో నొకకుమా రుని కనెను. ఆశిశువునకు పితృమాతృవంశ బోధకముగా నాగార్జునుఁడని పేరుపెట్టెను, అంతట నర్జునుఁ డామెను విడిచి పోయెను. (ఈకథ విజయవిలాసమను గ్రంథములో పూర్తిగా కానఁబడును) ఈ నాగార్జునుఁడే పార్వతి పెంచిన గండామృగ మును కాయుచుండెను. ఒకరోజున నితఁడు కైలాసముననుండి పోవుచున్న నారద మహామునిని చూచి, యాయన గడ్డము, మీసము, జడలు కలిగి యున్నందున వెఱ్ఱివాఁడని యెంచి పరి హాసముచేసెను. అందుకాముని కినుకనొంది, వానిపై కసిదీర్చు కొనువెరవు నాలోచించుచు ద్వారకకుపోయి శ్రీకృష్ణునిదర్శించి యాయనతో, ఈ నాగార్జునుఁడు తన్ను పరిహాసించిన సంగతి చెప్పెను. అదివిని కృష్ణుఁ డర్జునుని పరాభవము చేయుటకు మంచిసమయము దొరికినదని యెంచి, మునినిజూచియిట్లనెను. "మీరు ధర్మరాజునొద్దకువెళ్ళి గండామృగపు మాంసముతో పితృశ్రాద్ధముచేయుమని చెప్పుడు." అప్పుడా దేవర్షి హస్తి నాపురమునకు బోయి ధర్మరాజును చూచెను. ధర్మరాజాయ నను పూజించికూర్చుండబెట్టెను. అప్పుడు వారిట్లుసంభాషించిరి.

ధర్మరాజు:—స్వామీ! యెందుండి తమరాక ?

నారదుఁడు:—రాజా! ఈ దినమున కైలాసమునుండి ద్వారకకుఁబోయి శ్రీకృష్ణుని దర్శించి పిమ్మట కొందఱు ఋషు లతో యముని సభకు వెళ్ళి యిటు వచ్చితిని.

ధర్మ:—యముని సభయందేమి చూచితిరి ?

నార:- సభలో యముఁడు కాలదండము చేతఁబట్టి కూర్చుండియుండఁగా చిత్రగుప్తులు జీవుల పాపపుణ్యముల లెక్క చెప్పుచున్నారు.

ధర్మ:—స్వామీ ! మాతండ్రిగారైన పాండు మహారాజుగా రందున్నారు గదా ? నారేమి చేయుచున్నారో చూచితిరా ?

నారదుఁడు:—చూడ కేమి సభ యెుమ్మటి పావంచా మీఁదనున్నారు.

ధర్మ:—ఏమీ? పావంచామీఁద నున్నారంటిరి. నిలుచున్నారా యేమి, కూర్చుండుట కాసనములేదా ?

నార:—ఆసనము లేకపోవుట లేదు. దానిపై కూర్చుండుటకు నర్హత లేదు.

ధర్మ:—ఏమీ, నాఁడు మీరు సెలవిచ్చిన ప్రకారము రాజసూయయాగము, బహు ప్రయాసపడి చేసితినే.

నార:—ఔను. చేయుటచేతనే రెండు మెట్లెక్కి మొదటి పావంచామీఁదికి వచ్చినాఁడు.

ధర్మ:—ఏమీ, మాతండ్రికి సభలో కూర్చుండుటకు నర్హత లేదా? నే నేమిపాపముచేసితిని? తులసిచెట్టు పాతి నీరుపోయలేదా? పార్వతీపరమేశ్వరులను సేవింపలేదా? గంగా స్నానముచేయనైతినా ? ఎవరి యిల్లైనను కాల్చితినా? బంగారము దొంగిలించితినా? పురాణములు వినలేదా ? సభలో పెద్దలకు వెనుకత్రిప్పి కూర్చుంటినా? అమావాస్యదినమునం

దావుపాలు పితికించితినా? కల్లు ద్రాగితినా? పరస్త్రీని బలిమిని పట్టితినా ? పండితులను దూషించితినా ? వాగ్దానముచేసి తప్పిపోతినా? గ్రామస్థులతో కక్షపట్టితినా ? ఆంబోతులచే దున్నించితినా? దరిద్రునియాశపడగొట్టితినా? చీకటియుండఁగా దీపమార్పితినా? లేనియెడల మాతండ్రికీ శిక్ష యేమి?

నార:—రాజా! వినుము, నీవు భూలోకవాసులకును పాతాళమునందున్న వారికిని తృప్తికలుగఁజేసితివి. కాని స్వర్గలోకనివాసులకు తృప్తికలిగింపలేదు.

ధర్మ:—అయ్యా వారెట్లు తృప్తినొందుదురు ?

నార:—గండామృగముయొక్క మాంసముతో పితరులకు శ్రాద్ధము యథావిధిగా జరిగించిన వారు తృప్తి నొందుదురు.

ఇట్లు చెప్పి నారదుఁడు గగనమార్గమున పోయెను.

పిమ్మట ధర్మరాజు భీముని పిలిచి గండామృగమును చంపి తెమ్మనెను. భీముఁడామృగమును పోల్చలేనని చెప్పఁగా నర్జునితో చెప్పెను. అదివిని యర్జునుఁడు వేట కుచితమైన వేషమును ధరించి బాణతూణీరములతో బయలుదేరి వెళ్ళి బహుప్రదేశములను నడవులను కొండలను వెతకి యామృగము కనఁబడనందున విచారించుచు నలసి యొకచోట కూర్చుండి యుండఁగా నారదుఁడు కనఁబడి యేమియిట్లు చింతిల్లుచున్నావని యడిగెను. అర్జునుఁడు లేచి నమస్కరించి యయ్యా ! మా యన్నగారు గండామృగమును చంపి తెమ్మనిరి. నేటికి పదిరోజులనుండి వెదకుచున్నను నది కనఁబడ

లేదు." అదివిని నారదుఁడు "కైలాసమునకవతలనున్న రుద్రవనమునకు దక్షిణమున గంధనది పారుచున్నది. అందులో నీరు త్రాగుట కనేకజంతువులు పోవుచుండును. అచ్చటికిపోయిన నీకుమృగము లభించును." అనెను. మునిమాటల ప్రకారమర్జునుఁ డక్కడకు పోయి పొదలచాటున నిలుచుండి యనేక జాతుల మృగములు గుంపులు గుంపులుగా వచ్చుచుండుట చూచెను. కొంతసేపటికి గండామృగ మొక్కటి వచ్చెను. దానిని నర్జునుఁ డొక్క బాణముతో కొట్టెను. కాని దాని శరీరమున పెక్కువిలువగల యలంకారములు రత్నహారములుండుటచే నది పెంపుడుమృగమని యెంచి చాలవిచారించెను. అచ్చట నెవరును లేరు. మృగమును తీసికొని పోవుటకు వీలులేదు. ఏలయనఁగా నలంకారములున్నవి. పరద్రవ్యహరణమువలన పాపము సంభవించును; వస్తువులను తీసి యచ్చటవిడచి పోయిన, యెవరు తీసికొందురో? కావున దానిని పెంచువారు వచ్చునంతకు నచ్చటనే యుండ నిశ్చయించి యర్జునుఁడు పొదల నీడను కూర్చుండెను.

### నాగార్జునుఁ డర్జునుని చంపుట

ఆ మృగరక్షకుఁడైన నాగార్జునున కా దినము పుట్టిన దినమగుటచే నతఁడు దానిని యడవిలో మేయవిడచి, పాతాళలోకమందున్న తనయింటికిబోయెను. వానితల్లి వాని కభ్యంజనస్నానము చేయించునదై, శిరస్సున తైలమంటుచుండఁగా యశుభశకునముల చూచి, భయపడి తల్లితో "అమ్మా! త్వరగా కానిమ్ము నేను పోవలెను, మృగమును

ఒంటరిగా విడిచి వచ్చితిని. దానికేమి యపాయము సంభవిం చునో," అనెను. అంతలోతల్లి త్వరగాస్నానము, భోజనము చేయుచుండగా, కుమారుడు బయలుదేరి అమ్మ! నేపోయివచ్చెద నని, కైలాస కందరమునకుపోయి యందుమృగము కనబడనం దున, రుద్రవనమున జూచి, యందును లేనందున, గంధనదికి నీరు త్రాగబోయి యుండునని యెంచి యచ్చటికిపోయి, చచ్చి పడియున్న మృగమును గని, హా యెవ్వడింత భయము లేక నామృగమును చంపెను? ఆ చంపినవాడెవడైననుసరే నాయెదుటపడిన వదలుదునా? వానినొక్కబాణమున గొట్టి పడ వైతుననెను. ఆమాటలువిని పొదలోనున్న యర్జునుడు సింహ నాదముచేసి పైకివచ్చి "అయ్యా! నే నీమృగమును చంపి తినిగాని దాని శరీరమున పెక్కునగలుండుటచే వానితో తీసి కొనిపోయిన పరవిత్తాపహరణ దోషము కలుగునని యిందు కాచియుంటిని. ఆ యలంకారములను తీసికొని నీవు పొమ్ము" అనగా నాగార్జునుడు కోపముతో మండిపడి పండ్లు పటపట కొరికి, నీవేనా, పార్వతి పెంచిన గండామృగమును చంపితివి. నీ కాయువు నిండినది. ఇదిగో చూడుము. నిమిషములోనిన్ను యమునియింటికి పంపెదననెను. అది విని యర్జునుడు వానితో నిట్లనెను. "నేను పితృకార్యార్థ మీ మృగమును చంపితిని. నీవు బాలుడవు. నిష్కారణముచావకుము. నాప్రతాపమునీకు తెలియక మాటాడుచున్నావు." అనగావినక కోపావేశుడై బాలుడర్జునునిపై బాణములు వేసెను. అప్పుడు వారికిఘోర యుద్ధమయ్యెను. మానవులపై ప్రయోగించు బాణములు నిష్ప్రయోజనమగుట చూచి దేవతలయస్త్రములను బాలుడు

వేయఁగా వానిని ప్రత్యస్త్రములతో నర్జునుఁడు మాన్పెను. అప్పు డాబాలుఁడు మహాకాలానల మను బాణమును స్మరింపఁగా నది కైలాసమునుండి గొప్ప ధ్వనిచేయుచు వచ్చి బాలునిచేత బడెను. దానినిజూచి పైనుండి చూచుచున్న దేవతలు భయ పడి పారిపోయిరి. ఆబాలుఁడు దానిని సంగ్రహించి యర్జునునిపై ప్రయోగింపఁగా వెళ్ళి యతనితో బాణ మిట్లనెను. "అర్జునా! నీవుమహావీరుఁడవు.నీకుప్రతివీరుఁడుముల్లోకములను లేఁడు. నిన్ను నేను చంపిన దేవతలుకూడ నన్ను నిందింతురు. మీరు తండ్రి కొడుకులు. ఎందుకు యుద్ధము చేయుచున్నారు? నాగార్జునుఁ డులూచి యందు నీకు గలిగిన కుమారుఁడు గదా? వాసుకి కొమార్తెను నీవు పాతాళమున వరింపలేదా! ఆమెకు నీవలనబుట్టినవాఁడే వీఁడు. నేను నిన్ను చంపనొల్లను. నాపై నేదైనయొక బాణము వేయుము. నేఁబోయెదను. లేదా నిన్ను చంపకపోను. అనవుఁడర్జునుఁ డామాటలన్నియువిని "ఏమి చేయుదును! నాయొద్ద నొక్క బాణమైనను లేదు. తూణీరము వట్టిదైనది. ఒకరి బాణమును నేను ముట్టను" అనెను. అప్పుడా బాణము తనవలన నేరము లేదని దిక్పాలురను సాక్ష్యముంచి కోపముతో నర్జునునిపై బడిసదుమునొద్దకు రెండు ముక్కలుగా చేసి, కైలాసమునకు పోయెను. నాగార్జునుఁడు తండ్రిపడియున్న స్థలమునకుపోయియతని ప్రతాపమునకుసంతోషము,నాశ్చర్యము కలవాఁడై వానిరక్తము బొట్టుబెట్టుకొని పాతాళముననున్న తనతల్లియొద్దకు పోయెను. గగనమునుండి యుద్ధము చూచు చుండిన చిత్రసేనుఁడను గంధర్వుఁ డర్జునునిపై పుష్పవర్ష మును కురిపించి నందమున యతని శరీరము కుళ్ళి, చెడకుండ

నుండెను. అర్జునుని డిగ్గు చనిపోయిన వార్త చిత్రసేనుఁ డింద్రునితోను, నారదుఁడు శ్రీకృష్ణ బలరాములతోను బలరామస్వామి దుర్యోధనునితోను, శ్రీకృష్ణుఁడు ధర్మరాజు తోను చెప్పఁగా నీ ఘోరవిపత్తునకు వారు చాల విచారించి దేవ. యదు, కురుపాండవ సైన్యములు యుద్ధసన్నద్ధులై యర్జు నుఁడు పడియున్నచోటికి పోయిరి.

ఉలూచీ విలాపము

నాగార్జునుఁ డర్జునుని జంపి తన ప్రతాపమును తల్లితో చెప్పుట కింటికి పోయి "అమ్మా! మిక్కిలి చక్కని యొక్క కిరాతుఁడు నేను వెళ్ళుసరికి పార్వతిచే పెంచబడి నా సంరక్షణలో నున్న గండామృగమును చంపెను. అతనిని నేను చూఁడకముందే వెళ్ళిపోయి యుండును కాని శరీర మనేకాభరణములతో నిండి యున్నందున దాని యధికారి వచ్చినవానికావస్తువులిచ్చి పోవలెనని యచ్చట నున్న మాధవీలతపొదలో దాగియుండెను. అప్పుడు నాతో ఘోరముగా యుద్ధము చేసెను. నేను మానవులపై ప్రయో గించు శరము లెన్నో వేసితినిగాని యతఁడు వానిని లక్ష్యపెట్టనందున దేవాస్త్రములు వేసితిని. వానిని సయి తమతఁడు నిమిషములో సంహరించెను. అదిచూచి మహాకాలాస్త్రమును ప్రయోగించితిని. అదివెళ్లి వానిని రెండు ముక్కలు చేసెను. ఉలూచదివఱ కర్జునుఁడు గండా మృ గము కొఱకు బయలుదేరినసంగతి వినియుండెను. కాన నాచని పోయినవాఁ డర్జునుఁడేయని మూర్ఛిల్లి క్రిందఁబడెను. కొంత

సేపటికి తెలివొంది లేచి యిట్లు విలపించెను. 'హా నాథా! నన్ను విడచిపోతిరా! మీరు లేని యీ జీవనము నాకేల! మిమ్ము నేను మరి యెట్లు చూడఁగలను! మీ సుందర కోమల శరీరము నే నెందు గందును! మహావీరులయిన మీరీ బాలుని చేఁబడితిరే! మీ సాహసము, బలము, పౌరుషము, శూరత్వము, యుద్ధనిపుణత యెందుబోయెను! కాలకేయులను సంహరించి యింద్రునికిస్వర్గమును మీరేగదా యిచ్చితిరి. కిరాతవేషములో నున్న యీశ్వరునివంటి సర్వశక్తుని మోహింపలేదా? ఒక్క బాణముతో నేడుద్వీపములను జయింపలేదా? హనుమంతునితో పందెము వేసి వారధి కట్టినవారు మీరేగదా? అట్టి బాహు శక్తియు బలపరాక్రమము లెటుపోయెను. అయ్యో! నేఁ డీ కాటడవిపాలైతివా?' అని దుఃఖించుచు సుమారుని పై పుత్రిరిగి 'నాయనా కుమారా! మేము నిన్నెందుకా గంటిమి? పితృవధ పాపమని యెఱుఁగవా? ఎంతపని చేసితివి తండ్రీ!' నా విని 'అమ్మా నన్నెందుకు నిందించెదవు. ఆయన నా తండ్రియని నాకెట్లు తెలియును? తెలిసి జేసినగదా పాపముసిద్ధించును" అనెను. పిమ్మట వారిరువురుకలిసి భూలోకమున నర్జునుఁడు పడియున్న చోటికి బోయిరి. అచ్చట తన భర్త శరీరము రెండుముక్కలై పడియుండుటచూచి వెంటనే మూర్ఛపడి లేచి "నాథా! మీతో నేనుసుఖించినది స్వల్పకాలమైనను నీ వైధవ్యదుఃఖము చిరకాల మనుభవింపవలెనుగదా!" అనుచుండఁగా నచ్చటికి గొప్ప సైన్యములు రణభేరులతో నచ్చుటచూచి "నాయనా! కుమారా! నీవు నీ తండ్రియైనయర్జునునిచంపితివి. నిన్ను చంపుటకీ మహాసైన్యములు వచ్చుచున్నవి. నిన్ను వీరు బ్రతుక

నియ్యరు. కావున పారిపోయి వారి బారినుండి తప్పించుకొని బ్రతుకుము. లేదా చావు నిశ్చయము తంత్రీయని యేడ్చుచు పతి శరీరముపై బడెను. తల్లి మాటలువిని నాగార్జునుడు కైలాసమునకు పరుగెత్తి యీశ్వరుని పాదములపై బడి శరణనగా నతడు భయకారణమేమని యడిగెను. అర్జునుడు గండామృగమును చంపుటయు, తా నతనిని చంపుటయు దేవ, యదు, కురు, పాండవులు తమతమ సైన్యములతో నచ్చటికి వచ్చుటయు నాయనతో మనవిచేసెను. అదివిని మేముండగా నీకేమి భయమని యాతండభయ మిచ్చెను.

## హరిహరుల యుద్ధము

అంతట నారదమహాముని తొందరగా శివునియొద్దకు వచ్చి గొప్ప సేనలువచ్చి కైలాసముపై బడుచున్నవి. కాచుకొనుడని చెప్పగా శివుడు కోపావేశుడై పినాకమును, విల్లును, త్రిశూలమును చేతబట్టి వృషభవాహనుడై ఢమరు వాయించుచుపోగా వెనుకయాయన బలములు యుద్ధసన్నద్ధులై పోయెను. ఇట్లు పోవుచున్న యీశ్వరునికి శ్రీకృష్ణుడెదురుగా పోయి నమస్కరింపగా శివుడు నిరాకరించి యిట్లనెను.

శివుడు:—కృష్ణా! గొల్లనికి ఇంత పరాక్రమమా స్త్రీహత్యచేసిన వానికి పాపభీతి యుండునా ?

కృష్ణుడు:—మహేశ్వరా! ఎందుకుఇట్లుఆక్షేపించుట. నీవలె బ్రహ్మహత్యచేసిన వాడగాను గదా! నన్నుచంపుటకు వచ్చిన పూతనను చంపితిని. అందు తప్పేమి ?

శివుడు:—ఓ గోపాలుడా ! నేను బ్రహ్మహత్య చేసితి నంటివి. నేను ప్రాణహాని చేయలేదు. బ్రహ్మయొక్క అయిదు ముఖములలో నొక దానిని ఛేదించితిని. నీవే బ్రహ్మహత్య చేసితివి. గతకాల మాలోచింపుము.

కృష్ణు:—ఔను. నేను రావణుని చంపిన దనుజుడనే. నీవు తెలివిమాలి ముందు వెనుక లాలోచింపక యిచ్చిన వరముల వలన వాడు ముల్లోకముల వారిని హింసించుచుండుట చూచి వారిని రక్షించుటకు రామావతారమెత్తి వానిని జంపి, వానికి కైవల్యమిచ్చితిని. కాని నీవలె చంపిన స్త్రీపురుషుల పుర్రెలను మెడలో వేసికొనలేదు.

శివు:—ఓగొల్లా ! స్త్రీహత్యా పాతకము నాయందారోపించుచున్నావు. నే నే స్త్రీని చంపితిని ?

కృష్ణు:—ఓ శంకరా ! మరచితివి కాబోలు. నీభార్యనే నీవు చంపితివిగదా !

శివు:—ఏమిరా! నేను చంపితినా? అదియెట్లు!

కృష్ణు:—ఓ మహాదేవా! నీవునిరాకరించి యుపేక్షించుటచేతనే గదా సతి దక్షునియజ్ఞకుండమున బడి మడిసెను. మాతృద్రోహులకు ఇది దోషముగా తోచకపోవచ్చును.

శివు:—ఓరి గోహత్యాపాతకీ ! మాతృద్రోహి యనుచున్నావు. అదియెట్లు ?

కృష్ణు:—ఓ త్రిలోచనా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు తల్లి ప్రకృతికదా ? ఆమెయేగదా సతి. నేను గోహత్యా పాతకి నంటివి. రాక్షసుడు మాయావృషభమై నన్ను చంపుటకు రాగా వానిని జంపితిని. నీవలె కపిల గోవును చంపలేదే ?

ఇట్లు సంభాషించుచుండఁగా శివుఁడు కోపావేశుఁడై కృష్ణునిపై బాణవర్షము కురిపింపఁగా నాయన వానిని నివారించి తాను సుదర్శనమును ప్రయోగింపఁగా శివుఁడు త్రిశూలముతో దానిని నివారించెను. వీరిటు పోరుచుండఁగా కృష్ణుని వెనుక బెట్టి, బలరామస్వామి యీశ్వరునితోను, కుమారస్వామి యింద్రునితోను, నందికేశ్వరుఁడు దుర్యోధనునితోను, మహాకాలుఁడు భీమునితోను, వినాయకుఁడు దుశ్శాసనునితోను, యుద్ధము చేయుచుండిరి. మహాకాలుఁడు గోడలితో భీముని కొట్టఁగా నాగోడలియతఁడుతీసికొనివానినివెంటబెట్టుచుండఁగా నాగార్జునుఁ డడ్డముగావచ్చి గొప్ప యుద్ధముచేసెను.

బ్రహ్మ హరిహరులకు సమాధానము చేయుట.

ఇట్లు ఘోరయుద్ధము జరుగుచుండఁగా నాకసమునుండి చూచుచున్న నారదుఁడు ప్రళయము సంభవించునని భయపడి యోగమార్గమున సత్యలోకమునకు పోయి జరుగుచున్న యుద్ధము సంగతి బ్రహ్మతో చెప్పి మీరువచ్చి సంధిచేయవలయు ననఁగా వెంటనే యతఁడు హంసవాహనారూఢుఁడై బయలుదేరి యుద్ధరంగమునకు విచ్చేసివాహనము దిగి మహాదేవుని యొద్దకుబోయి నమస్కరించి బహుస్తోత్రము చేసి వానికోపమును చల్లార్చి, బలరామ కృష్ణుల యొద్దకుబోయి, స్తుతులొనర్చి కోపమువిడువుమని ప్రార్థింపఁగా వా రర్జునుని బ్రతికించినగాని యుద్ధము మానమనిరి. అదివిని బ్రహ్మ యముని స్మరింపఁగా, నతఁడు మహిషముపై నెక్కి కాలదండము చేఁబూని యచ్చటికి విచ్చేసెను. అప్పు డాయనతో

బ్రహ్మ యిట్లు జెప్పెను. "ఓ శనైశ్చరా ! ఈయముని బ్రతికించి యీ ఘోర యుద్ధము చాలింపుము" అనుటకిదే సమయ మని మనస్సులో తలంచి, యిట్లనెను. "ఓ త్రిమూర్తులారా! మీ సెలవు కెదురాడువాఁడనుగాను. కాని, నా మొఱవినరు గదా! అదియేమనిన నేనుచిన్నప్పటినుండియును నీ కుష్ఠుబాధ పడుచున్నాను. మీ మువ్వురు నొకచోట నేకలియుట దుర్లభము. ఇప్పుడు కలిసితిరి కనుక మనవి చేసికొంటిని. నా ప్రార్థన సంగీక రింపుడు." అనఁగా నీ కీ రోగ మెట్లు సంప్రాప్తించెను. బ్రహ్మ యడుగగా యముఁడిట్లు విన్నవించెను.

### యమునికి కుష్ఠురోగము కలిగిన విధము

మార్తాండుఁడైన సూర్యునికి పద్మిని భార్యయైయుండెను. ఆమెకు నేనును నా చెల్లెలు యమునయును, పుట్టిన పిమ్మట, ఆమె మార్తాండునియొక్క కాంతివలన కలిగిన వేడిమి భరింప లేక తన శరీరమునుండి ఛాయ యను కన్యకను పుట్టించి తనకుమారుగా మార్తాండునియొద్ద నుండుమని చెప్పి, తాను తన తండ్రియైన దక్షప్రజాపతి యింటికి పోయెను. ఈ ఛాయ యన్ని విషయములలోను మాకుతల్లి వలెను, మార్తాండునికి భార్యవలెను, మెలఁగుచుండెను. ఇట్లు చాలకాలము గతించిన తరువాత నామెకు శని జన్మించెను. పిమ్మట నొకరోజున యామెకు నాపై కోపమువచ్చి కుష్ఠురోగివికమ్మని నాకు శాప మొసంగెను. వెంటనే యారోగము నాకాళ్ళయందు ప్రవేశించెను. కాళ్ళయందు ప్రవేశించుటకు కారణమేమనగా, యామె బాధ పడలేకను యామె మాటలను [illegible]

కాలితో తన్నితిని. వెంటనే నేను మాతండ్రితో నీ సంగతి మనవిచెయ్యగా, ఆయన కొంత యాలోచించి యామె నాకు తల్లి కాదని తెలిసికొనెను. ఎందుచేతననఁగా తల్లులు పిల్లల ననేకవిధముల తర్జన భర్జనలుచేసి చీవాట్లుపెట్టుచుందురు. కాని వారిట్టిట్లు పిల్లలకుతగులవు. కాఁబట్టి యామెనాకుసవతితల్లి యని దివ్యదృష్టిచే తెలిసి భార్యను పిలిచి నీ వెవరు నిజముగా చెప్పుమని యెన్నివిధముల నడిగినను చెప్పనందున నామెజుట్టు చేతబట్టుకొని, చెంపకాయకొట్టఁగా, నేను మీభార్యనుకాను, యామెఛాయను. ఆమె మీకాంతి భరింపలేక నన్ను పుట్టించి తనకు మారుగా నుండుమని తాను పుట్టినింటికి పోయెను. అప్పుడు మాతండ్రి నన్నుజూచి "నాయనా! ఈ బాధ నీకు కొంత కాలమువఱకు తప్పదు. అనుభవించవలెను. ద్వాపరమున శ్రీహరి కృష్ణావతారమున, కైలాసమునొద్ద త్రిమూర్తులు కలియునపుడు వారితో నీ వీ సంగతి చెప్పి ప్రార్థింపఁగా నీ బాధ వారు నివారింపఁజేయుదురు." అనెను." ఆసమయమునకొఱకు నింతవరకు కాచియుంటిని. కావున నా కీ బాధ నివృత్తిచేయ ప్రార్థించుచున్నాను." అనఁగా విని యీశ్వరుడు తన కమండలములోని నీళ్ళు జల్లగా కుష్ఠురోగ మదృశ్యమయ్యెను.

### అర్జునుడు పునర్జీవితుఁడగుట.

తరువాత నందఱు త్రిమూర్తులతోకలిసి యర్జునిని శరీరము పడియున్నచోటికిబోయిరి. అప్పుడు బ్రహ్మ రెండుముక్కలు చేర్చి మంత్రించి నీరుచల్లఁగా నవి యేకమయ్యెను. యముఁడు

ప్రాణములను విడిచిపుచ్చగా నింద్రుడు అమృతము చల్లెను వెంటనే యర్జునుడు లేచి కూర్చుని [illegible] జరిగిన వృత్తాంతమంతయు జెప్పిరి. అర్జునుడు మిక్కిలి ఆశ్చర్యపడెను. అంతట చచ్చిపడియున్న కౌరవులను తక్కినవారిని చూచి "యిందరు చనిపోయిరి. నాజీవనము మాత్ర మెందుకు" అనగా నింద్రుడు చచ్చి పడియున్న వారిపై నమృతము చల్లెను. అందరు బ్రతికి లేచిరి. గండామృగముకూడ బ్రతికి లేచి కైలాసమునకు పారిపోయెను. ఈశ్వరుడు నాగార్జునుని తెచ్చి యర్జునునికినప్పగించగా కుమారుని కౌగిలించుకొని యర్జునుడు ముద్దుపెట్టుకొని తొడలపై నిడుకొని "నాయనా! నీ పరాక్రమమునకు మెచ్చితిని. త్వరలో నన్ను గెలిచితివి. నేను చాల సంతోషించితిని." అని కుమారుని శివునికి నప్పగించి "మీ పాదసేవ చేయుచుండుము నాయనా!" అనెను. తదనంతరము ధర్మజుడు బ్రహ్మను స్తుతించి, మాతండ్రి దురవస్థను చూచితిరా? ఆయన యముని సభలో నిలుచుండునట, వారికి ముక్తినొసంగుడు. అనిప్రార్థింపగా బ్రహ్మ యముని జూచి పాండుమహారాజునకు నీసభయందు నాసనమిమ్మని చెప్పెను. అందు కతండంగీకరించెను. అర్జునుడు భార్యను చూచి "నీవు మహాపతివ్రతవు. నీకుమారుని యాదరించుచు మరికొంతకాలము పాతాళమున నుండుము. కొద్దికాలములో నన్ను చేరగలవు." అనిబోధించి పాతాళమునకుపంపెను. పిమ్మట త్రిమూర్తులును నింద్రాదిదేవతలును, కురుపాండవ యాదవులును వారి వారి సైన్యములతో సంతోషముగా నిజ నివాసములకుం బోయి సుఖముగా నుండిరి.

అని శ్రీ వ్యాస మహాముని జైమినితో చెప్పి యీ పురాణమును ముగించెను.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకటాక్షజనిత కవితావిచిత్ర వేమూరి వంశ పయఃపారావార పరిపూర్ణ రాకాసుధాకర హారితస గోత్ర శ్రీసూర్యనారాయణాఖ్య తనూజ శ్రీజగన్నాథ శర్మ ప్రణీతంబైన శ్రీమదష్టాదశ మహాపురాణసారము నందు శివ, స్కంద, పద్మ, లింగ పురాణములు సంపూర్ణము.

శ్రీ పరదేవతార్పణమస్తు.

# అష్టాదశ పురాణ సారసంగ్రహము

## మూడవ భాగము.



ఇందు

శ్రీ మత్స్యపురాణము, శ్రీ కూర్మపురాణము, శ్రీ వరాహపురాణము,
శ్రీ వామనపురాణము, శ్రీ భవిష్యత్ పురాణము లేక కలికి
పురాణము, శ్రీ విష్ణుపురాణములు గలవు.

అష్టాదశ వర్ణములవారి ఉపయోగము కొఱకు

గంజాం జిల్లా ఛత్రపురం ఆన్ స్లో హైస్కూలు
సహోపాధ్యాయులు
బ్రహ్మశ్రీ నేమూరి జగన్నాథశర్మ,

విరచితము.



పబ్లిషర్సు:-

**రామా అండ్ కో,**

ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా.

మొదటికూర్పు.

1926 ఏప్రిల్.

 [వెల రు 1—0—0



వేమూరి జగన్నాథశర్మగారు.

# విషయసూచిక.

## శ్రీవామన పురాణము

### శ్రీ భవిష్యన్మహాకల్కి పురాణము.



హరిః ఓం.

శ్రీమద్గురు చరణారవిందాభ్యాంనమః.

శ్రీ మహాలక్ష్మీ గణపతయేనమః

శ్రీ బాలాత్రిపుర సుందర్యైనమః

# అష్టాదశ పురాణ సారసంగ్రహము

## మూడవ భాగము.

ఇష్ట దేవతా ప్రార్థనము.

శ్లో॥ నిత్యానందం పరమసుఖదం । కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం । తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమలమచలం । సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం । సద్గురుంతంనమామి॥

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం । శశివర్ణం చతుర్భుజం
ప్రసన్నవదనం ధ్యాయే । త్సర్వ విఘ్నోపశాంతయే॥

శ్లో॥ అయీ ఆనందవల్లీ అమృతకరతలీ ఆదిశక్తిః పరాయీ
మాయామాయాస్వరూపీస్ఫటికమణిమయీమాతంగీమతంగీ
జ్ఞానీజ్ఞానార్థరూపా నలినపరిమళినాద ఓంకారరూపీ
యోగీయోగాసనస్థా భువన వశికరీ సుందరీ ఐంనమస్తే॥

## శ్రీమూర్తిస్తుతిః.

ఉ. శ్రీకరలీలఁ బ్రాణులసృజింపఁ దలంచి విధాతతానయై
చేకొనివానిఁ బ్రోచునెడ శ్రీవిభుఁడై యవి సంహరింప భీ
మాకృతిఁ దాల్చి ముప్పురకు నవ్వలనొక్కటియై వెలుంగు నా
శ్లోకుఁ బురాణపుణ్యపురుషుం బరమాత్ముని భక్తిఁగొల్చెదన్.

## త్రిశక్తిస్తుతి.

ఉ. శ్రీయనవిష్ణుపేరురముచెన్నువహించి యలంకరించి దా
క్షాయణినాఁగ శంభుమెయి సామున నెక్కొని వాణినాఁగ నా
తోయజగర్భు నెమ్మొగముఁ దాఁగొని యేలెడునాగిశక్తి నా
శ్రీయుతరాయువృన్ సరససిద్ధకవిత్వము మాకు నీవుతన్.

శ్లో॥ వ్యాసంవసిష్ఠనప్తారం । శక్తేఃపౌత్రమకల్మషం
పరాశరసుతం వందే । శుకతాతం తపోనిధిం॥

## కా ల మ హి మ.

క॥ కాలమున బుట్టు జంతువు
కాలమునను వృద్ధిఁబొందు కాలమునఁ జెడుం
గాలము జనులకు దేవత
కాలము సుఖదుఃఖములకుఁ గారణ మధిపా.

కాలము చాల విలువగలది. అంత విలువగల పదార్థము ప్రపంచకమందు వేరొకటిలేదు. కాలములో జరుగని పని లేదు. కాలము లేకుండ జరిగెడు పని లేదు. కొన్ని కార్యములు స్వల్ప కాలములో నెరవేరును మరికొన్నిటికి హెచ్చుకాలము అవసర

మగును గాని కొంచెమయినను కాలము పట్టకుండ ఏపనియు జరుగనేరదు. కాలములోనే సమస్త జీవ జంతువులును పుట్టుచున్నవి. కాలములోనే పెరుగుచున్నవి. కాలములోనే నశించుచున్నవి. కావున కాలమే మనకు దేవత. కాలము ననుసరించియే మనకు సుఖముగాని దుఃఖముగాని సంభవించుచుండును. కాలభేదము ననుసరించియే మనకు కీడుగాని మేలుగాని కలుగుచుండును. శీతోష్ణస్థితులు మారుచుండును. కాలోచితముగానే పనులు జరుగుచుండును. జనులకు సుగుణదుర్గుణములు, మంచి చెడ్డలు, హానివృద్ధులు, లాభాలాభములు, సుఖదుఃఖములు, కలిమిలేములు, మిత్రత్వ శత్రుత్వములు, నీచఉచ్చలు కలుగుచుండును. మనస్సు మారుచుండును. స్వభావములు భేదించుచుండును. కావున మనము కాలమును వృధపుచ్చగూడదు.

కాలము విలువ మరియొక విధముగా కనిపెట్టిన బాగుగ తెలియును. యుద్ధములయందు నిమిషములో ఎన్ని ఫిరంగులు, తుపాకులు కాల్చబడుచున్నవో, ఎందరు చంపబడుచున్నారో యోచింపుడు. రెప్పపాటు కాలములో వెలిగింపబడిన నిప్పువలన ఎన్ని యిండ్లుకాలిపోవునో యూహింపుడు. పరీక్షా దినములలో ఆలస్యముగా పరీక్షకుపోవు విద్యార్థులకు గల్గు నష్టమును గురించి యోచించుడు. కచ్చేరీలలో వాయిదాలు ఉన్నప్పుడు ఆలస్యముగా బోవు వాదిప్రతివాదులకు నష్టమును గురించియు కొంచె మాలోచింపుడు. వివాహాది శుభకార్యములలో సుముహూర్తము

మించు నేమోయని మనలో కొందరు పడు తొందరపాటు అందరి కిని విశదమేగదా ? ఇట్టి సమయములలో కాలము విలువ మనకు బాగుగ గనబడును.

ధనముకన్నను కాలము హెచ్చు విలువగలదని మనము తెలిసికొనవలెను. కాలములో పనులుచేసిగాని, పంటలు పండిం చిగాని, వడ్డీనిచ్చిగాని వ్యాపారము చేసిగాని ధనము సంపాదిం చుచున్నాము. ఆర్జించినధనము వెచ్చించినను తిరుగ సంపాదింప గలముగాని గతించిన కాలమును తిరుగ రాబట్టలేముగదా! కాబట్టి కాలము ధనముకంటె శ్రేష్ఠమయినదని చెప్ప నవస రము లేదు.

కాలపరిమాణమును తెలిసికొనుట మనకు అవసరమని యెంచియే సర్వేశ్వరుడు సూర్యుని, చంద్రుని నక్షత్రములను మనకొరకు సృజించెను. ఇతర సాధనములతో అవసరము లేకయే వీనివలన కాలమును అనగా నెంత వేళఅయినదియు, పగలు ఎంతపొద్దెక్కినదియు, రాత్రి యెంతవేళ అయినదియు, మన పూర్వులలో అందరును కనిపెట్ట గలిగియుండిరి. ఇప్పటికిని అట్టి వారు కొందరుగలరు. జ్యోతిషశాస్త్రము బాగుగ చదివినవారికి గాని అట్టి సామర్థ్యము కలుగదు. ఇటీవల కాలమును తెలిసి కొనుటకు ఇసుక, జలములతో చేయబడిన యంత్రములను, మన వారు కనిపెట్టిరి. ప్రస్తుతము వాచీలు గడియారములు టైంపీ సులు మన దేశముననే గాక ప్రపంచమందలి అన్ని దేశములం

మను ఇంకింటనువాడుకలోనున్నవి. దీనినిబట్టిచూడగా కాలపరిమితి తెలియుటఅందరికిని ఆవశ్యక మన్నమాట స్పష్టమగుచున్నది.

కాలమానములు మూడు విధములు. అవియేవనగా

1 మనుష్యమానము 2 దేవమానము 3 బ్రహ్మమానము.

మనుష్యమానము—60 లిప్తలు 1 విగడియ

60 విగడియలు 1 గడియ

60 గడియలు 1 దినము

30 దినములు 1 మాసము

12 మాసములు 1 సంవత్సరము

$7\frac{1}{2}$ గడియలు 1 జాము

8 జాములు 1 దినము (రాత్రి, పగలు)

7 దినములు 1 వారము

52 వారములు 1 సంవత్సరము

15 దినములు 1 పక్షము

2 పక్షములు 1 మాసము (పితృదినము)

2 మాసములు 1 ఋతువు

3 ఋతువులు 1 అయనము

2 అయనములు 1 సంవత్సరము.

17 లక్షల 20 వేల సంవత్సరములు—కృతయుగము.

12 లక్షల 96 వేల ,, త్రేతాయుగము.

8 లక్షల 64 వేల ,, ద్వాపరయుగము.

4 లక్షల 32 వేల ,, కలియుగము.

ఈ నాలుగు యుగములు కలిసిన కాలము మహాయుగ మనబడును. 2000 మహా యుగములు బ్రహ్మకు 1 దినము. ఇప్పుడు 28 వ మహాయుగములో కలియుగము నడచుచున్నది. ఈ కలియుగమునందు 5025 వ సంవత్సరము జరుగుచున్నది.

దేవమానము:—మనకు 1 సంవత్సరము దేవతలకు 1 దినము. అట్టి దినములు 30 దేవతలకు 1 నెల. అట్టి నెలలు పండ్రెండు దేవతలకు 1 సంవత్సరము.

బ్రహ్మమానము:—2000 మహాయుగములు బ్రహ్మకు 1 దినము. ఒక రాత్రి ఒక పగలు.

| | | |
|---|---|---|
| అట్టి 30 దినములు | బ్రహ్మకు | 1 మాసము. |
| అట్టి 12 మాసములు | ,, | 1 సంవత్సరము |
| అట్టి 108 సంవత్సరములు | బ్రహ్మకు | జీవిత కాలము. |

దీనికే బ్రహ్మకల్పమందురు. ఇది బ్రహ్మ ప్రళయము.

| | | |
|---|---|---|
| 1 బ్రహ్మకల్పము | ఆది విరాట్టునకు | 1 పగలు |
| 2 బ్రహ్మకల్పములు | ,, | 1 దినము |

మనుష్య జీవిత కాలము.

మానవజీవిత పరిమాణము 100 సంవత్సరములని చెప్పుదురుగాని, ఇది గ్రంథములలో కనబడుటయేగాని, తరుచుగా అనుభవము వలన కనబడదు. కొందరు పుట్టగానే మృతినొందుచున్నారు. మరికొందరు బాల్యావస్థలో 12 సంవత్సరములలోనే మరణించుచున్నారు. మరికొందరు యౌవనావస్థయం

దును, కొందరు కౌమారదశయందును దేహాంత మొందుచు న్నారు. కొందరు మాత్రము వృద్ధావస్థవరకు జీవించుట చూచు చున్నాము. కాబట్టి యెవరు ఎంతవరకు జీవించియుండగలరో చెప్ప జాలము. ఈజీవితకాలములో సుమారు సగమునిద్రయందు గతిం చుచున్నది. మిగిలిన సగములో సుమారు నాల్గవ వంతు మల మూత్ర విసర్జనయందును, స్నాన, పాన, భోజనాదులయం దును వినియోగింపబడుచున్నది. మిగత కాలము కుటుంబ పరి పోషణము, కుటుంబ పరిచర్య, జీవనోపాధుల సంపాదించుట యందును వాడుక చేయబడుచున్నది. మనుష్య జన్మ దుర్లభ మనియును, అది క్షణభంగురమనియును, పెద్దలు చెప్పియున్నా రుగదా! ఇట్టిదుర్లభమైన జన్మపొంది బాలారిష్టములు లేక అనగా బాల్యమరణముపొందక వృద్ధావస్థ వరకు జీవించియుండుట దుర్ల భము. జీవించినను ఇహపరములను సాధించుటకు తగిన కాలము చాలతక్కువ. ఏమనగా బాల్యావస్థయందు కొంతకాలము విద్యా బుద్ధులు సంపాదించుటయందును యౌవనావస్థయందు చాల కాలము సంసారమందు అనగా దారేషణ, ధనేషణ, పుత్రేష ణలయందును జరుగుచున్నది. అంతట వృద్ధావస్థ సంభవింపగా ఇంద్రియ పటుత్వము అవయవబలము తప్పి వ్యాధులచే ఆక్ర మింపబడిన శరీరము తనకే స్వాధీనము లేక మనుష్యుడు బాధపడుచుండును. కౌమారావస్థ అని మరియొకటి చెప్పు చున్నారు గాని, అది దృఢశరీరుయందు యౌవనావస్థతోను,

బలహీనులందు వృద్ధావస్థలోను కలియుచున్నది. కావున పై చెప్పబడిన కారణములచేత మనుజులై పుట్టినను జీవులకు పర సాధనమును చూచుకొనుటకు అవకాశము చిక్కుట కష్టముగా కనబడుచున్నది.

## పరము.

పరమనగానేమి! దాని సాధనము మన మెందుకు చూచుకోవలెను అని కొందర డుగవచ్చును. ఏ జీవుడుగాని పుట్టుటకు తన పూర్వజన్మమునందు తాను చేసిన సుకృత దుష్కృత కర్మయే కారణమనియును, అట్టి జన్మలు ఎన్నో యీ జీవుడు పొందినదనియును, శాస్త్రములవలన కానబడు చున్నది. అట్టి కర్మ ఫలము మంచిదైన యెడల జీవుడు స్వర్గాది భోగము లనుభవించు ననియును, నీచమైన యెడల నరకలోక బాధలు పొంది పిదప పశు పక్ష్యాది జంతు వులలో జన్మించుననియును, మధ్యమఫలముగల కర్మవల్లనే మను జులై పుట్టుననియును చెప్పుచున్నారు. ఇదిగాక కర్మఫలము మూడు విధములుగా చెప్పుచున్నారు.

1. సంచితము. 2. ప్రారబ్ధము. 3. ఆగామి.

సంచిత మనగా ఇది వరకు పూర్వజన్మములయందు మనచే జేయబడి మనము అనుభవించుటకు నిలువగా ఉన్న కర్మ.

ప్రారబ్ధమనగా పూర్వజన్మములలో మనచే జేయబడిన కర్మలలో ఈ జన్మయందు మనము అనుభవింప వలసిన కర్మ.

ఆగామి అనగా ఈ జన్మయందు మనచే జేయబడి ముందు మనము అనుభవించుటకు నిలువలో చేరబోవుకర్మ.

ఏడు జన్మములలో ఇంతకు ముందు మనచే జేయబడిన కర్మ మానవులకు నిలువగా నుండుననియు, అందులో మొద టిది అనగా వెనుక ఏడవజన్మము నందలి కర్మ మనకు ఈ జన్మ మందు అనుభవించుటకు ఇయ్యబడెనదనియు, వేదాంతశాస్త్ర ములయందు చెప్పబడి యున్నది. దీనికే ప్రారబ్ధమని పేరు. ఈ ప్రారబ్ధము ప్రతి మనుజుడు అనగా స్త్రీ గాని పురుషుడుగాని అనుభవింపక తీరదు. అనగా తప్పదు అనియును జ్ఞానమును పొందుట వలన ఇదివరకు నిలువయున్న ఆరుజన్మముల కర్మ, అనగా సంచితమును ఈజన్మయందు మనచేజేయబడుచున్నకర్మ అనగా ఆగామియును నశింపజేసికొని మోక్షమును పొందవచ్చు ననియును, వేదాంతము చెప్పుచున్నది. మోక్షమనగా జనన మరణాదులులేక (అనగా చావుపుట్టుకలు మరిలేకుండ) జీవుడు దేవునియందు లయించుట అనగా చేరుట. ఇట్లు మోక్షము పొం దుటకు అనగా అర్హత మనుష్యులకుతప్ప పశుపక్ష్యాదులగుఇతర జంతువులకు లేదు. ఎందుచేతననగా వానిజన్మ అనుభవముకొరకే. అవి అదివరకు ఎవరిజన్మమున పొందిన మానవజన్మమందు చేసిన పాపఫలమును అనుభవించుటకే ఆజంతుజన్మ వానికి ఇయ్యబడి నది. వానికి ఆగామి లేదు. అనగా పశుపక్ష్యాదులుచేసినకర్మవలన గలిగిన పాపముగాని పుణ్యము గాని అవి అనుభవింప నవసరము

లేదు. ఎందుచేతననగా వానికి బుద్ధి లేదు. మానవులకు బుద్ధియున్నది. బుద్ధిపూర్వకముగా చేసిన కర్మఫలమే అనుభవింపవలసి యుండును. కావున మనుష్యులకు సర్వేశ్వరుడు బుద్ధి యిచ్చి యున్నాడు. దానిని వికసింపచేసికొనుటకు వారికి విద్య ఆవశ్యకము. అందుకే స్త్రీపురుషాదులకు విద్య కావలసి యున్నది. బుద్ధిని ప్రకాశింప జేయునదే విద్య. విద్య నేర్చుకొనుట వలన వినయము, దానివలన తగినవారని పించుకొనుట, ధనము సంపాదించుట, కుటుంబపరిపోషణము చేసికొనుట, దానధర్మములు చేయుట, అందువలన ఇహపరసుఖములను పొందుట సంభవించును. ఇట్టి విద్య వలన పాపమనగా నేమో పుణ్యమన నెట్టిదో, మాత్రము తెలిసి యుక్తప్రవర్తనగల వారే పాప కార్యములనువాని చేయనెనంత వరకు పుణ్యకార్యములు చేసి స్వర్గాదిభోగములు కొంతకాలము అనుభవించి తిరిగి మనుష్యులై జన్మింతురు. తిరిగి ఆవిద్యను బాగుగ పొందినవారై జ్ఞానమును సంపాదించి ఇహలోక సుఖము క్షణమాత్రమైనదని యెంచి దానిని కోరక శ్రీసర్వేశ్వరుని యందు నిశ్చలమైన భక్తిగలవారై సేవించి తాముచేసిన పుణ్యకర్మఫలము తాము కోరక శాశ్వతమైన మోక్షమును పొందుదురు.

### పరలోకములు.

జ్ఞానము ప్రతిమనుజునికి అవసరమని పైని వ్రాయబడుట వలనే గాక అందరికి తెలిసియే యున్నది. ఇహలోకమునకు ఉపయో

గించు జ్ఞానము పరలోకమునకు ఉపయోగించు జ్ఞానము ఒకటే అయినను దానిని ఉపయోగించుటను బట్టి ఫలము వేరుగానుండును. మోక్షమును పొందుటకు కావలసినజ్ఞానము వేరు. దానికే ఆత్మజ్ఞానమందురు. పరలోకములు నాలుగు ముఖ్యమైనవిగా చెప్పవచ్చును. అందు మొదటిది స్వర్గము. దీనికే దేవలోకమందురు. అందు రాజు దేవేంద్రుడు. ఇతడు అష్టదిక్కులలో నొకటైన తూర్పుదిక్కునకు అధిపతి. మిగిలిన యేడు దిక్కుల అధిపతులుకూడ దేవతలే.

రెండవది బ్రహ్మలోకము లేక సత్యలోకము. దానికి అధిపతి బ్రహ్మ. మూడవది కైలాసము. దీనికధిపతి ఈశ్వరుడు. నాల్గవది వైకుంఠము. దానికి అధిపతి శ్రీమహావిష్ణువు. ఇందు 2, 3, 4 లోకములకు పోవువారు ఆ మూడులోకాధిపతు లుండునంత కాలము అందుసుఖమనుభవించుచుండి, వారిలోకల్పాంతమునఅంతమొంది తిరిగి కల్పాదియందు మరల భూలోకమున జన్మింతురు. మొదటిదగు స్వర్గమునకు పోవువారు అట్లు ఇంద్రుడుండునంత కాలము అందుండరు. వారివారి పుణ్యఫలము అనుభవము కాగానే మరల భూలోకమున జన్మింతురు. పై నాలుగులోకములందును కర్మ క్రొత్తగా చేయుటకు గాని, దాని ఫలము హెచ్చు చేసికొనుటకు గాని అధికారముండదు. భూలోకమందు తాము చేసికొన్న పుణ్యకర్మముల ఫలమువలన కలిగిన సుఖమును, అనుభవించుటకే అక్కడకు పోవుదురు. అది చెల్లగానే తిరిగి వారిక

చావు పుట్టుకలు కలుగును. కావున శాశ్వత సుఖమును అవి ఇయ్యజాలవు.

## జ్ఞానసాధనములు-మోక్షము.

మోక్షమట్టిదికాదు. మోక్షమనగా ఆదివిరాట్టును, ఆది మధ్యాంతరహితుడును, సర్వశక్తుడును, సర్వజ్ఞుడును, సర్వవ్యాపకుడును, సర్వాత్ముడును, సర్వాంతర్యామియునైనపరబ్రహ్మము నందు లయించుట లేక ఐక్యమగుట. దీనికే శాశ్వత బ్రహ్మలోక నివాససిద్ధి పొందుట అని చెప్పుదరు. ఆత్మజ్ఞానము పొంది, మోక్షమును సంపాదించుటకే ప్రతిమనుజుడు ప్రయత్నము చేయవలెను. ఆత్మజ్ఞానమనగా ఆ పరబ్రహ్మయొక్క ఆత్మయే, మనయందున్నదనియు అట్లే అన్ని జీవజంతువులయందు నున్నదనియు తెలిసికొని తనను తాను ఎట్లు ప్రేమించునో అట్లే చీమలి కాది బ్రహ్మపర్యంతము గల జీవులను ప్రేమించుట. ఏ జంతువు నందును భేదబుద్ధి లేకుండుట. సర్వసమత్వము కలిగి తాను బురదలోని కమ్మరిపురుగువలె సంసారమందుసంచరించుచు కర్మలు చేయుచు వానిఫలము కోరక సర్వేశ్వరునియందు సమర్పించుచు, ప్రారబ్ధమును అనుభవింపవలసినంతకాలము బ్రతికియుండి ఆత్మజ్ఞానమను అగ్నివలన, ఆగామి, సంచితములను దహింపజేసి దేహాంతమందు మోక్షము పొందుటకు ప్రతి మానవుడును ప్రయత్నింపవలెను. అట్లు ప్రతివారును ఈ జన్మ యంతమందే మోక్షమొకప్పుడు పొందకున్నను, జన్మాంతరమందైనను తప్పక

పొందుదురని శ్రీభగవద్గీత మొదలగు జ్ఞానమునిచ్చు గ్రంథములలో చెప్పబడియున్నది. జ్ఞానసాధనములగు గ్రంథములలో ముఖ్యమైన విగా-1. వేదములు 2. ఉపనిషత్తులు 3. పురాణములు4. శాస్త్రములు 5. బ్రహ్మసూత్రములు. 6. భగవద్గీత చెప్పబడియున్నవి. కాని యవి సంస్కృతమున వ్రాయబడి యుండుటచేత ఆ భాషా పాండిత్యము పూర్తిగా గలవారికేగాని ఇతరులకు సులభముగా అర్థముగావు. మన మాతృభాష పూర్వము సంస్కృతమే అయినను ఇప్పుడు సాధారణముగా వాడుకలో లేదు. పూర్వము సామాన్యముగా సంస్కృతమే, కుటుంబములలో స్త్రీలుకూడ మాటలాడుచుండెడివారట. అది నానాటికి అంతరించినది. కావున ఆగ్రంథములు మనంతట మనము అనగా పండితుల సహాయము లేకుండ ఉపయోగించుకొను శక్తి మనలో చాల మందికి లేదు. పై గ్రంథములన్నియు వ్యాఖ్యతో అనగా టీకతో తెలుగు లిపితో ఉన్నను, సులభముగా అర్థముగావు. పురాణములలో కొన్నిమాత్రము దేశభాషలలోనికి భాషాంతరీకరింపబడియున్నవి. అవి పద్యకావ్యములలో నున్నవి. కాబట్టి ఆయా భాషలలో సామాన్యపాండిత్యమైనను గలవారికి తప్ప ఇతరులకు బోధపడవు. అట్టి అర్థజ్ఞానము గలవారు సహితము వానిలో నొక్కొక్కటిని చదివి ముగించుట సులభముగాదు. చాల కాలము పరిశ్రమ ఆవశ్యకము. మహాపురాణములు పదునెనిమిదియు ఏదైనను ఒక్క దేశభాషలో వ్రాయబడి యుండక పోవుటచేత ఒకటె భాష తెలిసినవారికి వాని నన్నిటిని చదివి ముగించుటకు అవకాశము లేదు.

## మోక్షాపేక్ష కలుగు వయసు.

ఎందుచేతననగా సాధారణముగ జనులలో చాల మందికి కాలము మళ్ళిన తరువాతగాని పాపపుణ్యవిచక్షణ కలుగదు. అది కలిగిన పిమ్మటగాని, పాపకార్యములయందు భీతి, పుణ్య కార్యములయందు ప్రీతి కలుగనేరదు. అటుపిమ్మట వారు అదివరకు తాము చేసిన పాపములను తలచుకొని, భయపడి పశ్చాత్తాపము నొంది, చెయ్యి కాలిన తరువాత ఆకులు వెదకుకొను వారివలె, పాపములను పోగొట్టుకొనుటకు సాధనములను వెదకుకొనుచు, నూతులు, చెరువులు మొదలగు జలాశయములయందును పడినవారు తమ ప్రాణములను కాపాడుకొనుటకు తగిన త్రాడు వెదకుకొనునట్లు, పలుదిక్కుల చూచి అనేక విధములుగా పిలుచుచు, ఆలోచించెదరు. అప్పుడు వారు తమంతట తాము సరియైన సాధనమును తెలిసికొనలేక, వారిని వీరిని అడిగి తెలిసికొందమని ప్రయత్నించుచుందురుగాని వారికి తగిన ఉపాయమును చెప్పువారు దొరకుట దుర్లభము. ఏలయనగా సామాన్యముగా అందరును అట్టిస్థితిలోనే యుందురు. ఎవరికిని సరియైన సాధనము తెలియదు. కావున కొందరు ఉపవాసములు మంచి వనియు, మరికొందరు తీర్థయాత్రలు మంచివనియు; ఇంకొందరు పురాణములు చదువుట, వినుట మంచిదనియు, ఇతరులు దానధర్మములు చేయుట మంచిదనియు, అనేకవిధములుగా చెప్పుదురుగాని నిశ్చయించి చెప్పజాలరు. ఇవి అన్నియు మంచివే

కావచ్చును. పాపములను పోగొట్టవచ్చునుగాని యిట్టి సాధనములలో ఎవరికి ఏది అనుకూలముగా నుండునో అది వారే యెంచుకోవలెనుగాని ఒకరికొరకు మరియొకరు వారికి తగిన సాధనమును చూపలేరు. ఏమనగా జనుల స్వభావములు, నడవడికలు, స్థితిగతులు, అవకాశములు, బుద్ధులు వేరుగానుండును. కావున ఎవరికి సదుపాయముగా నుండు పాపపరిహార మార్గములు, తరణోపాయములు వారే యెంచుకొని అవలంబింపవలయును. అట్లు ఎంచుకొని మనస్సు అందుకు స్థిరపరచుకొన్న పైని తామరు ఆ మార్గమున నడుచుటలో సహాయము కావలసినప్పుడు, అదివరకు ఆమార్గము ననుసరించినవారిలో బాగుగా తెలిసినవారిని అడిగి, సరియైన త్రోవను తెలిసికొనవచ్చును.

## జ్ఞానమును పొందుటకు ఆయువు అవసరము.

ఈ పైన చెప్పిన కారణముల నున్న ఇంతకును ప్రధానమైనది ఆయువు. జనులు కొంతకాలము బ్రతికియుంటే మనస్సు పరిపక్వము గలవారై నరలోక భయము, పుణ్యలోకములు పొందవలెనని కోరిక, కలిగినప్పుడు కదా దానికి తగిన సాధనములుగురించి వెదకుకొందురు. ఈ రోజుగా రోగములున్న పీడితులై బలహీనులైనను, చనిపోయినను, అట్టిఅవసరమే తటస్థింపకుండునుగదా! పరమేశ్వరుడు ఎవరికి ఎంత పరమాయువు ఇచ్చియున్నాడో, నిశ్చయముగా ఎవరికిని తెలియదు. కాని ఆరోగ్యమును కాపాడుకొనుటకు కొన్ని మార్గములున్నవి. వాని

నిచ్చట నాకు తెలిసినంతవరకు చదువరుల ఉపయోగముకొరకు క్రింద వ్రాయుచున్నాను.

ఆయువు వృద్ధినొందుటకు ఆరోగ్యము అవసరము.

మనుష్యులకు పశుపక్ష్యాది జంతువులకు సామాన్య ధర్మములునాలుగు. అవియేవనగా 1. ఆహారము 2. నిద్ర 3. భయము 4 మిధునకృత్యము. ఈధర్మములు అనగా పనులయందు మితిమీరక నియమముతో క్రమముగా సంచరించువారికిఆరోగ్యలోపముండదని వైద్యశాస్త్రములో చెప్పబడియున్నది. కాని జబ్బు ప్రవేశించిమందుపుచ్చుకొనునప్పుడుగాని ఆసంగతులుమనకువైద్యులు చెప్పరు. అప్పుడువారుచెప్పు ఈసంగతులకే పథ్యమందురు. ఆ పథ్యాపథ్యములు రోగములు రాకముందే కొంతవరకు మనకు తెలిసి యుండినయెడల రోగబాధ కనబడక పోవచ్చును. పథ్యమనేమాటకు హితవు అనియును అపథ్యమనగ హితవు కానిదనియును అర్థము. పథ్యములు రెండువిధములు 1. ఇచ్ఛాపథ్యము, అనగా తన శరీరస్థితినిబట్టి ఆలోచించి అప్పటికి తనకు ఏమి అవసరమో దానిని ఉపయోగించుట. 2. కఠినపథ్యము అనగా తనకు ఏమి కావలసియున్నను సరేగాని నియమితపదార్థములనే ఉపయోగించుట. మనము నిత్యము వాడుకలో నుంచవలసినది ఇచ్ఛాపథ్యమే. ఎవరినోటికి ఏ వస్తువు మిక్కిలి రుచిగానుండునో అదే వారి శరీరమునకు పడనిది మిక్కిలి బాధించునది అని తెలిసి మితముగా తినవలెను. దానిని తరచుగా తినకూడదు. ఆహారవిషయమై ఈ క్రింది నియమములు పాటింపవలెను.

## ఆరోగ్య సాధనములు.

1. వేళ తప్పక భోజనము చేయవలెను.

2. తన శరీరమునకు అప్పటికి పట్టు పదార్థములు తినవలెను.

3. మితముగా తినవలెను.

4. మన పొట్టలో సగము అన్నము మొదలగు పదార్థములతోను నాల్గవభాగము నీటితోను నింపి మిగిలిన భాగమును వాయువుండుటకు అవకాశము యుంచవలెను.

5. భోజనము చేసిన తరువాత నాలుగు గంటలవరకు మరియే పదార్థమును తినకూడదు. అవసరమైన యెడల మంచి నీరు మాత్రమే త్రాగవచ్చును.

6. ఆకలితో నుండగూడదు. బాగుగా ఆకలికలిగినప్పుడు ఏమియును తినక యున్న పైత్యము ప్రకోపించి ప్రాణమునకుపద్రవము కలుగజేయును. ప్రకోపించుట అనగా పొంగుట.

7. ఆకలి బాగుగకలిగినప్పుడు ద్రవపదార్థములు అనగా నీరు, కాఫీ, టీ, మొదలగునవి మాత్రము చాలవు. పాలు మంచివి అయిన చాలును.

8. మితిమీరి భుజింపకూడదు.

శరీరమునందలి మురికిని పోగొట్టుకొనుటకు స్నానము అవసరము. దీనికి తగిన కాలము సూర్యోదయ సమయముగాని అంతకు కొంచెము ముందు కాలముగాని. చల్లని నీరు శ్రేష్ఠము. లేదా గోరు వెచ్చని నీరు మంచిది. భోజనము చేసిన పిమ్మట లేదా,

యేదైనను ఆహారము పుచ్చుకొన్న పైని అదిబాగుగ జీర్ణమగు వరకు స్నానము గాని కంఠస్నానము గాని కూడదు. అభ్యంజనస్నానము (నూనెమర్దన వగైరాలు) తరచుగా అవసరము.

నిద్ర ఆరోగ్యమునకు ముఖ్యసాధనము. ఇది బాలురకు విశేషముగా అవసరము. వారి నిద్రకు పరిమితి లేదు. యౌవనమందున్న వారికి ఎనిమిది తొమ్మిది గంటల నిద్ర అవసరము. ఆరోగ్యదశలో నుండు వృద్ధులకు సయితము ఆరు లేక యేడు గంటల నిద్రయుండవలెను. ఆరు గంటలైనను నిద్రపట్టకపోయి నపుడు వారికి ఆరోగ్యము లేదని నమ్మవచ్చును. పగటినిద్ర ఆరోగ్యము చెరుచును. మంచి వేసవికాలములో వేడివలన రాత్రి నిదుర వేగము పట్టని దినములలో పగలు ఒకటి రెండు గంటలు ఎండవేళ నిద్రించినను దోషములేదు. రాత్రి ప్రథమ భాగమందు నిద్ర శ్రేష్టము. కావున పెందలకడ పరుండి పెందల కడ లేచుట ఆరోగ్యమును బలపరచును. కోడికూతవేళ నిద్ర నుండి లేచుట ఆరోగ్యమును, బలమును, ధనమును, ఇచ్చునని చెప్పదురు. ఇందుకు కారణములు ఆలోచించి తెలిసికొన వచ్చును.

భయము, విచారము లేక దుఃఖము, కోపము ఈ మూడును ఆరోగ్యమును చెడగొట్టుటకు సమానమైన కారణములే. అవి హెచ్చుగా జనులకు కలిగినప్పుడు వానిని నిగ్రహించుకొనుటకు అన్ని విధముల ప్రయత్నింపవలయును. లేకున్న ఆయా

సమయములందు మన శరీరమందు ఎల్లప్పుడు మితముగాను, ఆరోగ్యదశయందు సమభాగములుగాను, ఉండు వాత, పిత్త, శ్లేష్మములు, భయముగాని, దుఃఖముగాని కోపముగాని మిక్కిలి అధికమగు నప్పుడు పొంగి గొప్ప వ్యాధులను కలిగించును. ఒకానొకప్పుడు వెంటనే మరణమును గాని మూర్ఛనైనను, కలిగించును. కావున తెలివిగలవారు దానిని ఉపయోగించుటకు తగిన సమయము అవి కలుగు నప్పుడే. ఎప్పుడును సంతోషముగా నుండువారికి ఆయుష్షు వృద్ధి యగును.

మిథునకృత్యము పైసూచించినట్లు ఆరోగ్యమును కాపాడుటయందుముఖ్యము. ఎందుచేతననగా ఇంద్రియనిగ్రహమువలనబలవృద్ధియు, శరీరపుష్టియు, కాంతియు కలుగును. వీర్యనష్టమువలన బలహీనతయు, శరీరము క్షీణించుటయు, కాంతివిహీనతయు కలుగును. ఇది పరమ రహస్యమైన విషయ మగుట చే దీనిని గురించి తల్లిదండ్రులుగాని, గురువులుగాని, పెద్దలుగాని, ఎంచుగా మనకు ఉపదేశము చేయరు. ఈ అంశములో స్వాభావికమైన జ్ఞానమును బట్టి స్త్రీ పురుషులు సంచరింతురే గాని వారికి హితోపదేశము చేయువారు లేరు. చేసినను ఇంద్రియవిషయమై పశుపక్ష్యాదులు స్వాభావికనియమములతో సంచరించుచుండుట మనము చూచుచున్నాము. అవి వాని నియమిత ఋతుకాలమునందే సంగమము చేయును. ఈ సంగతి మనము చూచి కనిపెట్టుచున్నాము. పిచ్చుకలు, కాకులు, చిలు

కలు, గోరలు, కుక్కలు మొదలగు జంతువుల పిల్లలను మనము తెచ్చి పెంచవలెనన్న ఆయా కాలములలోనే దొరకును గాని మనము కోరినప్పుడెల్లను దొరకవు. ఏలయన అవి వాని నియమిత ఋతుకాలమునందే సంయోగము జేయును. ఆవులు కూడ అట్లు వానికి అవసరమైన సమయమందు ఒకటి రెండు సారులు జతకూడును గాని గర్భము నిలిచినతరువాత ఆ స్త్రీజంతువును పురుషజంతువు మరి చూడదు. వానికి సరిపట్టి తెలిసికొను శక్తి సర్వేశ్వరుడు ఇచ్చియున్నాడు. ఇట్లు సంచరించుచుండుటచేతనే అవి తరుచుగా బలారోగ్యములు కలిగి యుండును. మనుష్యులకువలె వానికి తరచుగా రోగములు రావు.

## ఇంద్రియనిగ్రహము.

జనులు అట్టి కాలనియమములను పాటింపక రాత్రిపగలు అను విచక్షణ లేక సంచరించుటచేతనే బలహీనులగుటయు, వ్యాధి పీడితులగుటయు, సంతాన నష్టములు కలుగుటయు, దక్కినపిల్లలు బలహీనులై రోగపీడితులు బుద్ధిహీను లగుటయు సంభవించుచున్నవి. జనుల కట్టి కాలనియమములు, ఋతుకాలములు లేవా? వానిని తెలిసికొనుటకు వీలు లేదా? యని కొందర డుగవచ్చును. అన్ని జంతువులకన్న మనుష్యులకే అట్టివి కనిపెట్టుటకు హెచ్చు అవకాశము లున్నవి. ఎందుచేత ననగా స్త్రీల ఋతుకాలము ప్రత్యక్షముగా వారికి తెలి

వారికి ఆయుర్వృద్ధి కలిగి చాలకాలము జీవించి పాపభీతి పుణ్య ప్రీతి కలిగి సత్కార్యము చేయుచు జీవించునంతవరకు ఆయురారోగ్యము ననుభవించుచు పురాణములు, పుణ్యకథలు చదువుచు వినుచు జ్ఞానము వృద్ధిపొందించుకొని తుదకు మంచిలోకములును గాని, మోక్షమునుగాని పొందుదురు. మనపూర్వులు ఇట్టి నియమములతో సంచరించుటచేతనే చిరకాలజీవులును ఆరోగ్యవంతులు నైయుండిరి.

ఇందువిషయమై ముఖ్యనియమములు కలవు.

1. ఇరువదియొకటవ సంవత్సరము వరకు పురుషుడు గర్భాదానము చేయుట కూడదు. ఎందుకనగా ఇంద్రియపుష్టి అప్పటివరకును పూర్తిగా కలుగదు.

2, స్త్రీలు ప్రథమ రజస్వలలైనంత వేగమే వారికి గర్భాదానము కూడదు. వారు క్రమముగా నెలకొకసారి రజస్వల లగుచుండునపుడు యుక్తసమయము.

3. గర్భాదానమైన పిమ్మట, ఒకటి రెండు సంతానములు కలుగువరకు తమ భార్య మూడు ముట్లు అగువరకు అనగా అధమము రెండు మాసములైనను అప్పుడప్పుడు ఎడబాసి యుండుట అనగా ఒకరి నొకరు కలియకుండ నుండుట సంతానము కలుగుటకు, కలిగిన సంతానము ఆయురారోగ్య బుద్ధి బలములు కలిగియుండుటకు ముఖ్యసాధనము. ఇందుకే స్త్రీలను చిన్నప్పుడు తరచుగా పుట్టింటికి తీసికొని పోవువాడుక

యున్నది. అట్లు చేయుని దంపతులకు పిల్లలు కలుగుట అరుదు. కలిగినను దక్కుట కష్టము.

4. సంతానము కలిగిన స్త్రీ తిరుగ ఋతుమతి అగు వరకు సంయోగమునకు పనికిరాదు. అంతకు ముందు తొందర పడిన యెడల తల్లి పిల్లలకు బలహీనత, రోగములు కలుగును.

5. స్త్రీపురుషులలో ఎవరికైనను, తలనొప్పిగాని, నడ్డినొప్పిగాని, జలుబుగాని, జ్వరముగాని, విశేషము కాళ్లుపీకుగాని ఉన్నప్పుడు సంయోగము కూడదు. మూర్ఖతతో చేసిన పాపోపద్రవము వెంటనే కలుగును.

6. జాతాశౌచము, మృతాశౌచము, పక్షిణీ కలుగునప్పుడు అందుముఖ్యముగా తామే కర్తలుగానుండి కర్మచేయ వలసినప్పుడు, సహపిండమయిన మరునాడు తాము అభ్యంజన స్నానము చేసిన నాటిరాత్రిగాని సంగమము కూడదు. ఆకలితో నున్నప్పుడుగాని, భోజనము చేసిన వెంటనేగాని, సంభోగము కూడదు. స్త్రీ గర్భిణియైన 6 మాసముల పిమ్మట సంభోగము చేయుట స్త్రీహత్య, శిశుహత్యతో సరియైన పాపమని గ్రంథములలో చెప్పబడినది. కావున వివేకులు ఈ విషయములందు మెలకువతో ప్రవర్తింపవలెను.



# విజ్ఞాపనము

ఈపైని వ్రాయబడిన సంగతులవలన కొంతజీవితకాలము
చెల్లిన తరువాతగాని మనస్సు పరిపాకమును పొందదనియు,
అటుతరువాత గాని పాపపుణ్య విచక్షణ మనుజులకు కలుగ
దనియు, కలిగిన పైనిగాని పరలోకసాధనములను మనము వెద
కుకొనవలసినను అప్పటికి శరీరము ఆరోగ్యముగా నుండినగాని
అట్టి సాధనములను అనుసరించి పుణ్యమును సాధించుటకు తగిన
సామర్థ్యముండదనియు తెలియుచున్నది. జ్ఞానసంపాదనకు పైని
చెప్పబడిన ముఖ్యమైన ఆరు గ్రంథములలోను ఐదు కేవలము సం
స్కృతములోనే వ్రాయబడి యుండుటచే అందరికిని స్వాధీన
ములు కావనియు, పురాణములు కొన్నిమాత్రము దేశభాషల
యందు వ్రాయబడినందున కొంతవరకు మనకు సాధ్యములని
యెంచి, కొన్ని తెలుగునను మరికొన్ని ఓఢ్రభాషలోను నేను
చదువుచుండగా చూచిన నా స్నేహితులలో కొందరు, ఆపురా
ణములు గ్రంథబాహుళ్యము గలవనియు, అవియు తెనుగున
సులభశైలిని వ్రాయబడి యుండనందున అందరును వానినైన
చదువుటకు వీలులేదనియు, వానిని క్లుప్తముగా తెలుగున వచ
నముగ సులభశైలిని వ్రాసిన అందరకు అనగా తెలుగుభాషను
చదువనేర్చిన ప్రతివారికిని, జాతి మతభేద విచక్షణ లేక చదువ
వచ్చుననియు చెప్పి, నన్నుప్రోత్సాహపరచిరి. వారిలో ముఖ్య

లుగా (బ్రహ్మశ్రీ) మండపాక పార్వతీశ్వర శాస్త్రులుగారిని పేర్కొనవచ్చును.

వీరు నన్ను ఈగ్రంథము వ్రాయుటకు ప్రోత్సాహము చేయుటయేగాక సహాయ సంపత్తియు ఇచ్చెదమని వాగ్దానమొసంగినందున అష్టాదశ పురాణ సారసంగ్రహ మను పేరుతో దీనిని రచించుటకు సాహసించితిని. ఉపోద్ఘాతమునందు వ్రాయబడిన సంగతులు, గ్రంథాంతరములందు కనిపెట్టబడినవియు, పెద్దల వలన విన్నవియు నాఅనుభవము వలన స్థిరపడినవియు గనుక ఆదరణీయములని తలంచెదను. ఇకపైని వ్రాయబోవునవి శ్రీ వ్యాస మహామునివలన సంస్కృతమున మహాపురాణములుగ వ్రాయబడి తెనుగున, ఆంధ్రభాషలో పద్యకావ్యములుగా నగిన కవులవలన వ్రాయబడినవి కావున విశ్వసింపదగినవి. సదుపాయముకొరకు చేయబడిన కొద్ది మార్పులు తప్ప నేను వ్రాయుదానిలో క్రొత్త సంగతులు ఏమియు నుండవు. ప్రతిపురాణమునకు ముఖ్య లక్షణములు అయిదు. అవియేవనగా 1 ప్రళయము 2. సృష్టి 3 వంశము (అనగా సూర్యచంద్ర వంశములు) 4 మను వర్ణనము. 5 ఈశానుచరిత్రము అనగా శ్రీహరియొక్క అవతార చరిత్రములు.

ఈ పైని చెప్పినవానిలో ప్రళయము, సృష్టి, కొన్ని పురాణములలో విపులముగాను కొన్నిటియందు క్లుప్తముగాను చెప్పబడియున్నవి. వానిలో బాగుగా వర్ణింపబడినది ఒక్కొ

కొటి మాత్రము వ్రాసి తక్కినవి విడచిపెట్టుచున్నాను. గ్రంథ బాహుళ్యభీతిచే నరిత్రము నుఘస్త స్తవరచుచు ముఖ్యాంశములు విడచిపెట్టకుండ వ్రాయుచున్నాను. లోపాలోపము లున్నను చదువరులు నన్ను క్షమింప వేడుచున్నాను.

మహాపురాణములు పదునెనిమిది. అవి ఏవనగా,

1. మత్స్యపురాణము. 2. కూర్మపురాణము. 3. వరాహ పురాణము. 4. వామన పురాణము. 5. బ్రహ్మకైవర్తపురాణము. 6. బ్రహ్మాండ పురాణము. 7. లింగ పురాణము. 8. మార్కండేయ పురాణము. 9. అగ్ని పురాణము. 10. నారద పురాణము 11. భవిష్యత్పురాణము. 12. శ్రీమద్భాగవతము. 13. విష్ణుపురాణము. 14. స్కాంధపురాణము. 15. పద్మపురాణము. 16. గరుడపురాణము. 17 శివపురాణము. 18. బ్రహ్మపురాణము.

వీనియందలి సంగతులు వేరువేరుగా వ్రాయుచున్నాను.

ఇట్లు గ్రంథకర్త,
వేమూరి జగన్నాధశర్మ.

---

*

శ్రీరామాయనమః

# గ్రంథకర్త వంశానుక్రమణిక



ఆర్యులారా!

నేను బహు స్వల్పజ్ఞుడను, అవివేకుడను. అయినను ఈ గ్రంథరచనము నాయుద్యమము బహు గొప్పదియగుటచే నా అధిక్యత లేకున్నను నాపూర్వీకులు బహు పవిత్రులని తెలుపుట ఆవశ్యకముగా తోచినందున ఇచ్చట నాకు తెలిసినంతవరకు వారి చరిత్రమును ఇందు పొందుపరచుచున్నాను.

శ్రీ ఆంగిరస, అంబరీష, యౌవనాశ్వులను త్రయార్షేయాత్మికమైన శ్రీహరితసగోత్ర పయఃపారావారంబున, అనేక పుణ్యపురుషులు జన్మించి పెక్కు స్థలములందు సద్వైదిక వృత్తి కలవారై నివసించుచు రాగారాగా నాప్రపితామహులగు వేమూరి సూరపశర్మగారు కృష్ణాజిల్లా తెనాలి తాలూకాలోనున్న వేమూరు గ్రామమున నివసించుచుండెను. ఈయన వేదపారంగతుడై జటాంతస్వాధ్యాయియు, వైదికకర్మకుశలుండును, ఆగమవేత్తయు నైయుండెను. ఇట్లుండగా విశాఖపట్నము జిల్లా విశాఖపట్న వాస్తవ్యులును, జమీందారులును, అగు రాయణంగారు తమ రాజ్యమున అనావృష్టి దోషమువలన పంటలులేక, జనులకుగాని, జంతువులకుగాని త్రాగుటకు నీరులేక బహు బాధలు పడుచుం

డుట చూచి జప, హోమ, దానాదులవలన వర్షము కలుగునని యోచించి కృష్ణాజిల్లా బందరు పట్నమునందున్న వారి స్నేహితుల చేర, వర్షములేమిచే, తాము పడు బాధలను గురించి వ్రాయుచు అనావృష్టి దోషమును పోగొట్టి వర్షమును కురియునట్లు చేయుటకు తగిన సమర్థతగల బ్రాహ్మణుని చూచి పంపుడని కోరిరట. ఆజాబు చూచి అచ్చటి వారు మాప్రపితా మహులగు ఈ సూరప శర్మగారిని తగిన వారని ఎంచి పిలిపించి ఆనిమిత్తము ఆయనతో చెప్పి విశాఖ పట్టణము వెళ్ళుమని ప్రార్థింపగా ఆయన అందుకు అంగీకరించి తగిన సన్నాహముతో బయలుదేరి వెళ్ళినట. అప్పుడు ఆయనను వారు తగిన మర్యాద చేసి మంచి వర్షము కురిపింపుడని కోరగా దాని విధానము చొప్పున జరిగించిన తప్పక వర్షము కురియునని ఆయన వారితో చెప్పి, మరికొందరు బ్రాహ్మణులనుపిలిపించి, వారిచే కొన్ని జపములు, అభిషేకములు చేయించి, తాను చేయవలసిన వారుణ జపము తానుచేసి, అందుకు తగిన హోమములు, దానములు, బ్రాహ్మణ సంతర్పణము చేయించి ఆప్రక్రియ ముగించు సమయమున హఠాత్తుగా మేఘావరణము కలిగి వారి తాలూకాయందంతటను గొప్పవర్షము వర్షించి జల సమృద్ధి కల్గెనట. అందుకు రాయణుంగారు అపరిమితానంద భరితులై ఆయనను, ఇతర బ్రాహ్మణులను తగిన దక్షిణ తాంబూలాదులచే తృప్తిపరచిరట. పిమ్మట వారు మాప్రపితామహుని తమ దేశమున స్థిరముగా నివసింపవలెనని ప్రార్థింపగా

ఆయన అందుకు అంగీకరించెనట. అప్పుడువారు లేమల్లిగారి పేరట సంవత్సరమునకు సుమారు 500 రూపాయలు రాబడిగల ఒక గ్రామమును ఆయనకు ఇనాముగా నిచ్చిరి. దానికి చెన్నయ్యమ్మ అగ్రహారమని పేరు. ఇది విశాఖపట్నము జిల్లా చీపురుపల్లి తాలూకాలో బుడుమూరు సమీపమున నున్నది. అప్పుడు ఆయన స్వగ్రామమైన వేమూరునకు తిరుగ పోయి తనకు వంశమును తోడుకొనివచ్చి తనచే ప్రతిగ్రహింప బడిన చెన్నయ్యమ్మ అగ్రహారమున శ్రీరామయ్యంగారిచే నిర్మింప బడిన గృహమునందు స్థిరముగా నివసించుచుండగా ఆయనకు ఇరువురు పుత్రులు కలిగిరి. వారిలో పెద్దవారికి గురుమూర్తి శర్మ, రెండవవారికి వేరేశ్వరశర్మ యని నామకరణము నొనర్చిరి. వారును వేదమును, శాస్త్రమును జ్యోతిషమును చదివి కాలక్రమమున పెద్దవారు వారి తండ్రి స్వర్గస్థులైన పిమ్మట, విభక్తులై ఆయగ్రహారమును సమముగా పంచుకొనిరి. వారిద్దరిలో జ్యేష్ఠులగు గురుమూర్తి శర్మగారికి పురుష సంతతి లేకుండెను. కొందరు పుత్రికలు కలిగిరి. వారిలో నొకరైన పుల్లెలవారి కోడలికు మాత్రము సంతతి కలిగినందున దౌహిత్రులగుటచేత ఆయన ఆస్తి వారికి కలిసినది. ఆసంతతివారు ఉన్నారు.

రెండవ కుమారుడైన వేరేశ్వర శర్మగారే మా పితామహులు. ఈయనకు వరుసగా ఆర్గురు పుత్రికలును, పిమ్మట, కడసారి కాన్పుగా ఒక పుత్రుడును కలిగిరి. ఆయనను వారు బహుప్రీతితో పెంచుచు శ్రీసూర్యనారాయణ శర్మయని నామ

కరణ మొనర్చిరి. ఆయనకు యజుర్వేదమును, జ్యోతిషమును నేర్పించి బొబ్బిలి పురవాస్తవ్యులగు తనికెళ్ళ కామేశ్వర శర్మ గారి కుమార్తెయగు శ్రీ ••గాంబయను కన్యకను వివాహము చేసిరి. ఈ దంపతులకు ఇరువురు పుత్రులు, నలువురు పుత్రికలు జన్మించిరి. వారిలో సర్వ జ్యేష్ఠుడను నేను. నాతమ్ముని పేరు నర సింహశాస్త్రి, మాలో ముగ్గురము జన్మించిన పిమ్మట మాపితామహులు స్వర్గస్థులైరి. ఆసరికి భూములలో కొన్ని విక్రయింప బడి మిగిలినవి ఋణాక్రాంతములై యుండెను. అప్పుడు మాతండ్రి గారు మాకు ఇంగ్లీషు విద్యనభ్యసింప జేయుటకై ఆగ్రామమును విడచి శ్రీకాకుళము కాపురము వెళ్ళి, అచ్చటనున్న బడిలో చదువ నన్ను ప్రవేశపెట్టిరి. అచ్చట కొద్దికాలమైనపిమ్మట బొబ్బిలివచ్చి నన్ను ఆంగ్లేయ పాఠశాలలో చేర్చిరి. అచ్చట నేను మిడిల్‌స్కూలు పరీక్షయిచ్చినపైని పర్లాకిమిడిలో శ్రీరాజా వారి ధర్మసత్రములో భుజించుచు వారి హైస్కూలులో చదివి మెట్రిక్యులేషను పరీక్షనిచ్చితిని. అప్పటికి మాప్రపితామహార్జితమైన గ్రామములోని భూములన్నియు పూర్తిగావిక్రయింపబడి నందున అంతట నేను చదువు చాలించి జీవనోపాధి సంపాదింప వలసి యుండెను. కావున నేను శ్రీమందసా రాజావారి ఆంగ్లేయపాఠశాలలో సహాయోపాధ్యాయుడనుగా పదునైదు రూపాయల వేతనమునకు ప్రవేశించి, పిమ్మట ఇరువది రూప్యములకు ప్రమోషనుపొంది అచ్చట కొంతకాలముండి పిమ్మట బడులపై తనిఖీదారుగా సుమారు ఒక సంవత్సరముండిన పిరువాత ఈఛత్రా

పురములో మాష్టరు ఆన్స్లోదొరగారు స్థాపించియుండిన ఆంగ్లేయ పాఠశాలలో సహాయోపాధ్యాయుని పదవిలో నెలకు ముప్పది రూప్యముల వేతనమునకు ప్రవేశించితిని. ఇచ్చట క్రమక్రమముగా ఉద్యోగాభివృద్ధి పొంది ఆ పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడ నైతిని. అప్పటికి ఈపాఠశాలకు మేనేజరుగాను, ఈ జిల్లా కలెక్టరుగా నుండిన మిస్టర్ మార్క్ మైకేలు దొరవారికిని, మ॥ రా॥ శ్రీ. రావు బహదూర్ తాడేపల్లి వెంకటకృష్ణయ్య పంతులు బి. ఏ., బి. యల్ గారికిని ప్రోత్సాహము కలిగించి వారి సహాయమున ఈ పాఠశాలను హైస్కూలుగా మార్చ గలిగితిని. పిమ్మట నీ పాఠశాల జిల్లాబోర్డు వారి పాలన క్రిందికి వచ్చి, యిప్పుడు మంచి అభివృద్ధిలోనున్నది. నేనును ఇంకను ఇందే సహాయోపాధ్యాయుడనుగా నున్నాను.

నేను నా ధర్మపత్నియగు శ్రీ లక్ష్మీదేవితో గూడి సుఖ నైమిత్తిక కర్మలు, యథోచితముగా చేయుచు తీరుబడిసమయములలో పంచదశి, భగవద్గీత, శ్రీ రామాయణము, భారతము, శ్రీమద్భాగవతము మొదలగు గ్రంథములు తరుచుగా పఠించుచు, చదివినవే చదువుటకువిసికి, అష ్టాదశ మహాపురాణము లను పఠియింప నారంభించితిని. నాకు సంస్కృత భాషా ప్రవేశము లేనందున ఈ పురాణము లన్నియు తెలుగు భాషలో దొరకనందునను, ఓఢ్రభాషా ప్రవేశము గలుగుటచే పదునెనిమిది పురాణములను చదువ గలిగితిని. ఈ పదు

నేనిం దింటిలో మూడు, 1. శ్రీమద్భాగవతము 2. మార్కండేయ పురాణము, 3. బ్రహ్మాండ పురాణములు మాత్రము తెలుగుభాషలో చదివితిని. మిగిలినవన్నియు గ్రంథభాషలో చదివితిని. ఇవియు పద్యకావ్యములే. ఐనను పామరులకు సైతము అర్థమగునట్లు సులభశైలిని వ్రాయబడియున్నవి. తెలుగు భాషలో పద్యాత్మకములై యున్న పురాణములు పండితులకే అర్థమగును. ఓర్థమున పురాణములుచదువుటకుప్రయాసపడనవసరము లేదు. ఇవియు సంస్కృత పదములతో నిండి సంస్కృతము నుండి తర్జుమా చేయబడి యున్నవి. నాగరికత కలవారమని పించుకొనుచున్న మన ఆంధ్రులలో పలువురు స్త్రీపురుషులకు ఉపయోగించునంత సులభశైలిని ఈ గ్రంథములు లేకుండుట చూచి అష్టాదశపురాణసారసంగ్రహమను పేర ఈ గ్రంథమును శ్రీహరి కరుణాకటాక్షమున వ్రాసితిని. పురాణగాథలను ప్రజలకు తెలియచేయుటయే నా ముఖ్య అభిప్రాయము గాని పాండిత్యప్రకటన కాదు. కావున ఇందలి తప్పులను విడచి ఒప్పులను గ్రహింప నా చదువరులను ప్రార్థించుచున్నాను.

ఛత్రపురము.
1—1—1926.

ఇట్లు సుజనవిధేయుడు,
వే మూరి జగన్నాథ శర్మ.

# అష్టాదశ పురాణ సారసంగ్రహము

3-వ భాగము.

# ప్రళయవర్ణనము.

మత్స్యపురాణములో చెప్పబడినట్లు బ్రహ్మ జీవితకాలము మనుష్యమానము ప్రకారము నూరు సంవత్సరములున్నదనగా ఆదిమధ్యాంత రహితుడైన పరబ్రహ్మము సృష్టినంతయు చేయ దలంచినవాడై నలుదిక్కులకు అధిపతులైన ద్రోణ, పుష్కర, ఆవర్తక, సంవర్తక, మేఘములను పిలిచి తన సెలవు అగువరకు వర్షము కురియకూడదని ఆజ్ఞాపించును. అవి అదివరకు దేవేంద్రుని అధికారముక్రింద ఉండుటచేత వాని ఆజ్ఞలనేమియు మన్నింపవద్దని కూడ మేఘములతో చెప్పును. ఆయాజ్ఞప్రకారము అవి ఆదినమునుండి వర్షముకురియుట మానును. ఇట్లు పదిరెండు సంవత్సరములు జరుగగా, పంటలు లేకుండును. అదివరకు ప్రపంచమందు నిలవయున్న ఆహారపదార్థములు చెల్లిపోవును. నూతులు, చెరువులు, నదులు మొదలగు స్వల్పజలాశయములు ఎండిపోయి మనుష్యులకు, జంతువులకు, వృక్షములకు నీరులేక చాలవరకు చచ్చును. అంతట ఆపరబ్రహ్మము, కోటికిరణములతో నున్న పన్నిద్దరు సూర్యులను పగటియందును, పదునారు

గురు చంద్రులను రాత్రియందును, ఉదయింపుడని ఆజ్ఞనిచ్చెను. వారు అట్లు చేయగా పగలు అగ్నిని సూర్యులును, రాత్రి హిమమును చంద్రులును వర్షింపగా సమస్తము భస్మమగును. ఇట్టి అవస్థ ఆరంభము కాగానే భరింపలేక కొందరు ఋషులు దేవేంద్రునియొద్దకుబోయి విశేషము ప్రార్థించి వర్షము కురిపింపుమని వేడుకొందురు. అప్పుడు అతడు మేఘములను పిలిచి ఆజ్ఞాపించునుగాని అవి వర్షింపక శ్రీమన్నారాయణుని సెలవు లేదు గనుక వర్షింపమని చెప్పను. అంతట వేడి దేవలోకమునకుకూడ వ్యాపించుటచే దానిని భరింపలేక దేవతలు బ్రహ్మయొద్దకుబోయి మొరపెట్టుదురు. అంతట బ్రహ్మపైకివచ్చి నలుదిక్కుల వ్యాపించు అగ్ని కిరణములను ఇంకిన సముద్రములను చూచి తన ఆయువు అంతమొందు కాలము వచ్చినదని గ్రహించి, ఆసంగతి వారికి తెలిపి, తానేమియు చేయలేనని వారితో చెప్పను. అంతలో తీవ్రకిరణములబాధవలన దేవతలు మూర్ఛిల్లి భస్మమగుదురు. బ్రహ్మయు మరి కొద్దికాలములో నిర్యాణమొందును.

ఇట్లు 100 సంవత్సరములు 12 సూర్యులు ప్రకాశించగా సమస్తము భస్మమగును. పిమ్మట శ్రీమన్నారాయణుండు నాలుగు మేఘములను 100 వత్సరముల వరకు సంతతధారా వృష్టిగా కుంభవృష్టి వర్షింపుమని ఆజ్ఞ చేయును. అవి ఆ ప్రకారము ఎడతెరిపిలేక రాత్రింబగలు వర్షము కురియగా

స్వర్గ, మర్త్య, పాతాళలోకములు జలముచే ముంపబడుటయే గాక, సూర్యచంద్రులు, నక్షత్రములు అంతర్ధానము నొంది జలము నక్షత్రమండలము వరకు వ్యాపించును. చిట్టచీకటిక్రమ్ము ను. హిమాలయము, మేరువు మొదలగు కులపర్వతములు కరగి పోవును. అట్టి సమయమందు కల్పవృక్షము, క్రింద జలములపైని వటపత్రశాయియై శ్రీ పరబ్రహ్మము యోగనిద్ర జెందును.

## సృష్టి వర్ణనము.

శ్రీపరబ్రహ్మ కల్పమువరకుఅనగా బ్రహ్మ కాలమానము ప్రకారము 108 సంవత్సరములు, నిద్రించిన పైని మేల్కొని చుట్టును చూడగా నీరు అంతటను వ్యాపించియుండుట కని పెట్టి తిరిగి ప్రపంచకమును, అంగని జీవజంతువులను సృజింపదలచి తన చేతులను ఏబది యోజనముల పొడవుగా పెంచి ఒక చేతితో నీటిని మధింపగా ఆమహా జలార్ణవమునందు నురగబుట్టును. ఆనురగలోనుండి రెండు పెద్ద నీటిబుంగలు పుట్టి గుడ్లై అందొ కదానిలోనుండి ఆకాశమును, రెండవదానినుండి మన్నుపుట్టు ను. మన్నులోనుండి యిసుక రాళ్ళు పుట్టును. ఈమన్ను క్రమ క్రమముగా చంద్రునివలె వృద్ధిపొందును. అంతట శ్రీమన్నారా యణుని నాభినుండి ఒక కమలము పుట్టి నూరు యోజనముల యెత్తువరకు పెరుగును. యోజనమనగా ఆమడ లేక యెనిమిది మైళ్ళు. అప్పుడు శ్రీమన్నారాయణుండు తుమ్మెద రూపమును ధరించి ఆకమలమునందు వ్రాలి అందు తన తేజస్సును విడచి

ఎప్పటి నిజరూపమును పొందును. తేజస్స్వరూపమైన నాలుగు ముఖములు యెనిమిది నేత్రములు ఎనిమిది చేతులు కోమలమైన శరీరము గల బ్రహ్మ జన్మించును.

ఈ బ్రహ్మకు పుట్టుకతో కూడ కవచము, కుండలములు కిరీటము చేతులలో దండము, కమండలము కలిగి బంగారువలె ప్రకాశించుచున్న శరీరకాంతి, యెఱ్ఱని పెదవులు కలిగియుండును. ఆయన నలుదిక్కుల చూడగా జలముతప్ప మరియేమియు కనబడకుండును. ఓం అను శబ్దము ఆయనకు వినబడును. అది యెక్కడనుండి వచ్చినదో అని పరికింపగా జ్యోతివలె ప్రకాశించుచున్న శ్రీమన్నారాయణుండు క్రిందనున్న జలమునందు కనబడును. ఆయనయే తనకు తండ్రియనియు ప్రపంచసృష్టి చేయుటకు తనను పుట్టించెననియు తెలిసికొనును. ఇంకను సృష్టి చేయ కోరిక కలుగగా శ్రీపరబ్రహ్మమందు లయమైయున్న ప్రకృతి స్త్రీరూపమున వెలువడి దివ్యమంగళ రూపముతోను వెయ్యి చంద్రుల కాంతితోను నూరు కన్నులు కలిగి ప్రకాశించుచుండుట చూచి మోహించి ఆమెతో కలియగా ఇద్దరు కుమాళ్ళు పుట్టుదురు. వారిలో ఒకడు మరకతమువలె ఆకుపచ్చని శరీరము, నాలుగు చేతులు, రత్నమయమైన కవచము, కిరీటము, సూర్యుని వంటి తేజస్సును గలిగి పీతాంబరమును ధరించి యుండును. ఈయనయే శ్రీ మహావిష్ణువు. రెండవ వాడు తెల్లని శరీరము, ఐదు ముఖములు, ఐదు శిరస్సులు, పదునైదు కన్నులు, పదిచేతులు,

కలిగి నక్షత్రకచకుండల కిరీటములతో ప్రకాశించుచుండును. ఆయన పేరు శ్రీ మహాదేవుడు. వీరిద్దరు పుట్టగానే తండ్రికి ప్రదక్షిణ నమస్కారములుచేసి కూర్చుందురు. అంతట బ్రహ్మయు తండ్రిని దర్శించుటకు వచ్చి సాష్టాంగ నమస్కారములుచేయగా తండ్రి మనసు లేవనెత్తి కౌగిలించుకొని కూర్చుండ నియోగించును. అంత శ్రీహరి ఆదిశేషుని పుట్టించును. అతనికి అనంతుడను పుట్టెను. ఆదిశక్తికి ఎఱ్ఱని శరీరచ్ఛాయగల గాయత్రి జన్మించును. ఆమెకు సావిత్రి పుట్టును. ఆమెకు సరస్వతి పుట్టును. ఆమె ముఖమునుండి వేదములు కలుగును. ఆమె ఆ వేదములను శ్రీమన్నారాయణుని కిచ్చును. నారు వానిని బ్రహ్మకు ఇయ్యగా నాలుగు ముఖములతోను నాలుగు వేదములను ఆయన చదువును. ఆయన సరస్వతిని చూచి మోహింపగా ఆమె అతని కయ్యబడును. అంతట శ్రీ పరబ్రహ్మ కనుబొమల మధ్యనుండి దక్షప్రజాపతి జన్మించును. బ్రహ్మతో వేదములను చదువుటకు అందరును మొదలుపెట్టుదురు. ఇట్లు కొంతసేపు వరకు వేదపారాయణ జరిగిన పిమ్మట ప్రళయజలమును సంహరింపుమని శ్రీ మహాదేవునికి ఆదివిరాట్టు ఆజ్ఞ ఇచ్చును. అంత గొప్పపనిచేయుట తన చేతకాదని ఆయన మనవిచెయ్యగా అతడు బ్రహ్మముఖము చూచును. బ్రహ్మ తాను సృష్టిచేయగలనుగాని జలమును సంహరింపలేననగా విష్ణుని ముఖము చూచును. శ్రీ విష్ణువు బ్రహ్మ సృజించు ప్రతిజంతువు హృదయ

మందును ఆత్మరూపమున తానుండుటకు అంగీకరించును. పిమ్మట శ్రీ మహాదేవుని చూచి నీవే జలమును సంహరింపవలెనని చెప్పగా ఆయన కోటి కిరణములతో సూర్యుని పుట్టించి జలములను హరింపుమని ఆజ్ఞ ఇచ్చెను. అందు కతడు అంగీకరించును.

## మత్స్యావతార కథ.

శ్రీమన్నారాయణుండు ప్రళయాంధకారమును మహా జలార్ణవమున వటపత్రశాయియై యోగనిద్రను పొందియుండగా నిద్రవలన కలిగిన మైమరపువలన ఆయన చేతనున్న శంఖము జారి జలములలో పడెను. కొంతకాలమునకు అందులో నుండి ఒక రాక్షసుడు పుట్టును. శంఖమునుండి పుట్టుటచేత వానికి శంఖాసురుడని పేరు. వాని శరీరము 100 ఆమడలు పొడవు, దానికి తగిన లావు, బలము, నోరు గలిగి మహా జలములో తిరుగుచు అరచుచు మిక్కిలి ఆకలిబాధ పడుచు, తినుటకు ఏమియు దొరకక బిగ్గరగా మొరపెట్టుచుండెను. అంతట వేద పఠనము చేయుచున్న బ్రహ్మయొక్క ధ్వని విని, దానివలన వాని జాడ కనిపెట్టి సమీపించి మింగుటకు ప్రయత్నింపగా, బ్రహ్మ భయపడి తటాలున లేచి పరువెత్త బోయెను. అప్పుడు వాని తొడపైనున్న వేదపుస్తకము నీట బడెను. వాడు దానిని వెంటనే మింగెను. అది బ్రహ్మ చూచి తాను సృష్టిచేయుటకు ముఖ్యాధారముగా నున్న వేద గ్రంథము పోవుటకు మిక్కిలి దుఃఖించుచు భయముచే

వణకుచు తన తండ్రియైన శ్రీమన్నారాయణుని యొద్దకు బోయి దండప్రణామము చేసి, తలవంచి నిలుచుండెను. అంత నతని చూచి భయదుఃఖములకు కారణమడుగగా జరిగిన గంతయు మనవి చేసి, ఇకను నేనెట్లు సృష్టిచేయగలుగుదునని విచారించుచుండెను. ఇట్టి దీనావస్థలో నున్న కుమారుని చూచి, భయమును పోగొట్టి, ఓదార్చి తాను పోయి ఆరాక్షసుని సంహరించి వేదగ్రంథమును తెచ్చి ఇచ్చెదనని చెప్పి, వాని నివాసమునకు పంపెను.

అంతట శ్రీమన్నారాయణుండు మత్స్యనారాయణావతారమును ధరించి నాలుగు చేతులలో రెంటియందు గద, చక్రము ధరించి కటి భాగమునకు క్రిందను మత్స్యరూపుడై జలములో ఉరికి మహాప్రళయ జలమందు, ఈదుచు ఏడు దినములలో దిన దినమునకు పెరుగుచు శంఖాసురుని వెదకుచు వెళ్ళుచుండగ ఆశబ్దమువిని ఆరాక్షసుడు, ఆహారము దొరికెనదనిపోయి, తన చేతులతో గొప్ప దెబ్బ కొట్టెను. అందుకు సహించి మత్స్యమూర్తి వానితో ఇట్లు చెప్పెను. “నీవు మూర్ఖుడవు. జలములందు పుట్టిపెరుగుటచేత ఏమియు ఎరుగవు. నీ జన్మభూమియైన శంఖము నేనీవు మ్రింగితివి. వేదపుస్తకమును దొంగిలించితివి. ఆపుస్తకమునాకిమ్ము. నిన్ను క్షమించెదను. లేదా నిన్ను సంహరించెద” ఆమాటలు విని ఆరాక్షసుడు శ్రీహరితో ఇట్లనెను. “నీవు ఎవరు ? నీరూపు వింతగానున్నది. నీచేతులలో నున్నవి ఏమి ?

ఎట్లయిన నాకు చాల దినములనుండి ఆహారము లేదు. మిక్కిలి ఆకలిగానున్నాను. నిన్ను తప్పక ఇప్పుడే మ్రింగెదను." ఈమాటలువిని మూర్ఖులకు సామవచనములతో పనిలేదని మత్స్యమూర్తి తన చక్రముతో వానిని సంహరించి శిరస్సు తెగునట్లుచేసి, పిమ్మట వాని కడుపులోనున్న శంఖమును వేదపేటికను, తీసికొనుటకు వాని కళేబరమును చీరగా శ్రీహరి చేతి మహాత్వమువలన రక్తమునకు మారుగా పాలుగా రెనట. అప్పుడు శంఖమును తాను ఉంచుకొని వేద పుస్తకమును బ్రహ్మచేతికిచ్చి దానిలో చెప్పబడిన ప్రకారము సృష్టిచేయుమని చెప్పి శ్రీహరి నిజరూపముతో తన నిలయమునకు వేంచేసెను.

## బ్రహ్మ సృష్టి.

నీటి బుంగనుండి పుట్టిన మన్నుతోనే బ్రహ్మ భూమిని సృష్టించెను. శ్రీ విష్ణువు తన మనస్సునుండి చంద్రుని, ముఖమునుండి అగ్నిని, రోమకూపములనుండి వాయువును హృదయమునుండి మేఘములను నోటినుండి సప్తమహాఋషులను పుట్టించెను. తరువాత సురుచి మరీచి మొదలగు ఏడుగురు కన్యకలను పుట్టించి సప్తఋషులకు వివాహము చేసెను. విష్ణువు మన స్సంకల్పము వలన ఒకగుడ్డు పుట్టెను. దానిలోనుంచి స్వాయంభువు మనువుపుట్టెను. తరువాత విశ్వకర్మను పుట్టించెను. బ్రహ్మ హంసను పుట్టించి తనకు వాహనము చేసికొని దానిపై నెక్కి

సగము తగ్గియున్న జలముపై భూలోకమంతయును తిరిగి చూచి శ్రీవిష్ణువు నొద్దకుపోయి రాత్రి పగలు నిర్ణయింపుమని ప్రార్థింపగా సూర్యుడు పగలును, రాత్రి చంద్రుడు సంచరించునట్లు ఆజ్ఞాపించెను. భూమధ్యమందు మేరుపర్వతమును స్థాపించెను. ఎనిమిది దిక్కులను ఎనిమిది పర్వతములను నిలిపెను. ఈ సంగతి విని విష్ణువు సంతోషించి మన్మథుని కనెను. ఇతడు అందరు దేవతలకన్న మిక్కిలి చక్కనివాడు. సూర్యతేజస్సువలన జలార్ణవమింకగ సూర్యుడు కోటికిరణములున్న యెడల లోకము నశించునని తెలిసి సన్నంబుమని విశ్వకర్మకు బ్రహ్మ ఆజ్ఞాపించెను. అతడు వేయికిరణములను మాత్రము సూర్యునికిచ్చి మిగిలిన వానిని హరింపజేసెను. ఆవెయ్యింటిని పంద్రెండు భాగములుగ పంచెను. చంద్రునికి 16 కళలుంచెను. తరువాత శ్రీమహావిష్ణువు నోటినుండి బ్రాహ్మణులును, భుజములనుండి రాజులును, తొడలనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును జన్మించిరి. తరువాత చతుర్ముఖబ్రహ్మ వలన తరు లతా గుల్మాదులును నానావిధ పశు పక్షి మృగాదులును పుట్టింపబడెను.

ఇట్లు స్వర్గలోకములు ఏడు–1 భూలోకము 2 భువర్లోకము 3 సువర్లోకము 4 మహాలోకము 5జనలోకము 6 తపోలోకము 7 సత్యలోకము. పాతాళలోకములు ఏడు–1 అతలము, 2 వితలము 3 సుతలము 4 తలాతలము 5 మహాతలము 6 పాతాళము 7 రసాతలము. ఈ పదునాలుగు లోకములు సృజింప

బడెను. పైన చెప్పబడిన సత్యలోకము బ్రహ్మకు నివాసము. కైలాసమందు శ్రీ మహాదేవుడును వైకుంఠమునందు శ్రీ మహా విష్ణువును నివసించు చుందురు. వారలకొరకు దివ్యభవనములు విశ్వకర్మ నిర్మించెను.

## దేవ రాక్షసుల జన్మము.

దక్షప్రజాపతికి 60 మంది కుమార్తెలు. వారిలో నొకరిని శ్రీమహాదేవునికిని, ఇద్దరిని మహా విష్ణువునకును, చంద్రునికి 27 గురిని, సూర్యునికి ఒకతెను, అగ్నికి ఒక పిల్లను యమునికి మరియొకతెను, కశ్యపునికి ఇద్దరిని, ఇట్లు అందరు పిల్లలను తగిన వరులకిచ్చి పెండ్లి చేసెను. అందు కశ్యపబ్రహ్మకు దితివలన రాక్షసులును, అదితివలన దేవతలును పుట్టిరి. దేవతలలో శ్రేష్ఠుడు దేవేంద్రుడు. ఇతడు దేవతలకు రాజయ్యెను. వరుణుడు కుబేరుడు మొదలగువారును, యక్షులు, విద్యాధరులు, కిన్నరులు, కింపురుషులు, మొదలగువారును కశ్యపుని సంతతిలో చేరినవారు. కశ్యపునికి దితివలన జన్మించిన రాక్షసులు పాతాళమునం దుంచబడిరి. దేవతలకు స్వర్గలోక మియ్యబడెను. 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. భూమి కుమారుడైన కుజుడు, 4. చంద్రుని కుమారుడైన బుధుడు, 5. బ్రహ్మతనయుడైన బృహస్పతి, 6. భృగుమహామునితనయుడైన శుక్రుడు, 7. సూర్యుని కుమారుడైన శనైశ్చరుడు, 8. కశ్యపునికి సింహికయందు పుట్టిన రాహువు గ్రహము లయ్యెను. ఈ రాహువే రెండు

భాగములు చేయబడి కేతు వయ్యెను. ఇట్లు నవగ్రహములు రాజిల్లెను.

సత్యవ్రతుని చరిత్రము.

ఈ పైన చెప్పబడిన మహాప్రళయమునకు ముందు భూలోకమున ఒకమహారాజుండెను. ఆతడు గొప్ప పండితుడును, జ్ఞానియునై అసత్య మెన్నడు చెప్పకుండుటచే సత్యవంతుడను నామము వహించెను. ఇతడు సర్వకాల సర్వావస్థలయందును శ్రీమన్నారాయణునియందు భక్తి ధ్యానములు నిలిపి తనజ్యేష్ఠ కుమారుని యందు రాజ్యభారము విడచి, శ్రీహరిని షోడశోప చారములతోను పూజించుచు, పలువిధములగు ఆహారపదార్థ ములు భోగముచేయుచు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను, ఆరుగురుశత్రువులను జయించి వైరాగ్యమును పొంది, సర్వదా శ్రీహరిని ధ్యానించుచుండెను. ఆతనిని ఎవరు ఏ మన్న నుతించినను కొట్టినను కోపపడకుండువాడు. ఈయనగోచికట్టుకొని దండముకమండలముధరించి దుంప, కూరలు తినుచు ఆహారియందే మనస్సు లీనము చేసికొనియుండెను. ఇట్లుండగా భక్తపరాయణు డైన ఆ యాదిదేవుడు వానికి ప్రత్యక్షమై ఇట్లనెను. "ఓవత్సా! నీ భక్తికి మెచ్చితిని. నీకిష్టమైన వరము వేడుము. ఇచ్చెదను" ఆమాటలు విని భక్తిపరవశుడై యున్న ఆరాచయతి నిటాలున లేచి ఆయనకు ప్రదక్షిణ నమస్కారములు చేసి నిలుచుండి, స్తోత్రములు చేసి యిట్లనెను. "ఓ పరంధామా! నాకు కోరిక

కోరికయు లేదు. నాకేమియు అవసరము లేదు. నీ పదధ్యానమే చాలును కాని. నా యందు నీకు నిజమైన ప్రీతి యుండెనేని ఒక్కటికి అనుగ్రహింప వలెను. అది యేమనిన ప్రళయము సృష్టి చూడ నిమ్ము. అట్లే జరుగునని శ్రీహరి అంతర్ధాన మొందెను. పిమ్మట చాలకాలమునకు పన్నిద్దరు సూర్యులు ఉదయింపగా ఆవేడిమి భరింపలేక శ్రీహరిని ప్రార్థింపగా అతనిని రక్షించుటకు సుదర్శన చక్రమును పంపెను. అది వానికి ఎండ, చలి, ఆకలి, దప్పి, వాన బాధ లేకుండ అతడు ధ్యానము చేసికొనుటకు వీలగునట్లు కాపాడెను. తరువాత నూరు సంవత్సరములు వర్షము కురియుచున్నప్పుడు తిరిగి శ్రీహరి ప్రార్థింపగా నావయొకటి యిచ్చెను. అందు ప్రవేశించి నీటిపైని తేలుచు హరిని నిశ్చింతగా ధ్యానము చేయుచు ప్రళయము అంతమునందు ఉండె. పిమ్మట భూమి తిరిగి నేర్పడి అందు మేరుపర్వతము బ్రహ్మవలన స్థాపింపబడిన తరువాత అందు ప్రవేశించెను. ప్రళయమునందు ఇతడొక్కడే తప్ప మరియెవరును బ్రతికియుండ లేదు. త్రిమూర్తులును నశించిరి.

సృష్టి తిరిగి చేయబడి లోకములు ఏర్పడి అందు జనులు నిర్మింపబడిన పిమ్మట బ్రహ్మ తన కుమారుడైన నారదుని పంపి ఇతనిని పిలిపించి జంబూద్వీపమునకు చక్రవర్తిగా నుండు మని నియమించెను. కుశద్వీపమునకు చక్రవర్తి అయిన సోమశర్మ కుమార్తెను ఇతనికి ఇప్పించి వివాహము చేసెను. ఈ సత్యవ్రతు

నికి పెక్కుమంది కుమాళ్ళును కుమార్తెలును కలిగిరి. వారి వలన క్షత్రియ వంశము చాల వృద్ధిపొందె. కాలక్రమమున సుమారు లక్షమంది రాజులు ఈ జంబూద్వీపమును పంచుకొని న్యాయముగా పాలించుచుండిరి. వీరందరికిని ధనుర్విద్య బ్రహ్మదేవు చెప్పెను. విశ్వకర్మ ఆయుధములను తయారుచేసి యిచ్చెను. భూమియందు పంటలు బాగుగ పండుచుండెను. స్వర్గమర్త్య పాతాళలోకములు వారు తమ ఇష్టానుసారముగా ఈ మూడులోకములకు పోవుచుండెడివారు. జనులు చాలకాలము జీవించుచుండువారు. పాపమన్నది ఎరుగనందున, వారికి రోగబాధలు లేకుండెను. ఇట్లు ఈప్రియవ్రత చక్రవర్తి చిరకాలము పాలించి సకలసంపదలను అనుభవించి, శ్రీహరియందు భక్తి మరువక అంతమున మోక్ష సామ్రాజ్యమును పొందెను.

ఈ మత్స్యపురాణము నారదునివలన ఇంద్రద్యుమ్న మహారాజునకు చెప్పబడినట్లు శ్రీ వ్యాసమహాముని వలన వ్రాయబడినది.

మత్స్యపురాణము సంపూర్ణము.



# అష్టాదశ పురాణ సార సంగ్రహము

# కూర్మ పురాణము.

## సముద్రమథన ప్రయత్నము.

కొత్తగా సృష్టి చేయబడిన తరువాత కొంతకాలమునకు. మొదటి కృతయుగమునందు స్వర్గలోకమున ఇంద్రుని కొరకు విశ్వకర్మచే తయారు చేయబడిన సుధర్మ సభయందు దేవతలందరునుగొప్ప సభచేసిరి. ఆసభకుబ్రహ్మ, విష్ణు, మహేశ్వరులును ఇంద్రుడు మొదలగు అష్టదిక్పాలకులును, సప్తమహాఋషులును, నవగ్రహములును, చంద్రసూర్యులును, యక్షగంధర్వ కిన్నర కింపురుషులును, సిద్ధవిద్యాధరులును, మొదలగు ముప్పదిమూడు కోట్ల దేవతలును కూడిరి. అందు కొంతసేపువరకును కిన్నరుల పాట, గంధర్వుల ఆట జరిగెను. అదిచూచి పరమానంద భరితులై యుండిరి. ఆసమయములో బ్రహ్మ, మద్దెల వాయించుచుండగ విష్ణువు తాళము వేయుచుండగ ఈశ్వరుడు తాండవము చేయుచుండెను. ఇట్లు కొంతకాలము జరిగినపైని ఆటపాటలు ముగించి, సభవారందరును కార్యాలోచనపరులై, నిశ్శబ్దముగా నున్న సమయమందు, కుబేరుడు లేచి నిలువబడి, సభవారిని జూచి చేతులుజోడించి యిట్లనెను. "దేవోత్తములారా!

నా మనవి వినుడు. శ్రీమన్నారాయణుండు, సృష్టికి, ఆదియందు నన్ను ధనాధిపతిగా నియమించి, నవనిధులను నాయధీనము చేసెను. అవి ఇప్పుడు చెల్లిపోయి ఉన్నవి. వానిని తిరిగి పూర్తిచేయు ఉపాయమును ఆలోచింపుడు." ఈ మాటలువిని ఆశ్చర్యపడి దేవతలందరును నిశ్చేష్టులై యుండిరి. అప్పుడు శ్రీమహాదేవుడు లేచి యిట్లనెను. "ఏమి ఆశ్చర్యమైన మాటలు చెప్పితివి? నవనిధులును చెల్లిపోయినవా? అందు అపారమైన ధనము రత్నములుండెనే. అన్నియునసరిపోయినవా? ఏమిచేసితివి? ఎవరికిచ్చితివి! ఏమయ్యెను? ఇట్లుప్రశ్న చేయగాకుబేరుడు లేచియిట్లనెను. "ఓమహాప్రభూ! మనవిచేసెదను. చిత్తగింపుడు. ఇంద్రునికి దేవాధిపత్యమిచ్చునప్పుడు మీరేఆయనకు అనేకరత్నములిచ్చితిరి. సూర్యచంద్రులకు అనేకమయిన రత్నహారములిచ్చితిరి. దేవతలకందరికి పంచిపెట్టితిరి. బ్రహ్మయెన్నో తెసికొనెను. శ్రీమహావిష్ణువును మీరును చాలపట్టించుకొని వెళ్లితిరి. అందరును ఇట్లు వ్యయము చేసి ఇప్పుడు నన్నడిగిన నేనేమిచెప్పగలను. ఇదివిని విష్ణువు లేచి యిట్లు చెప్పెను. కుబేరుని మాటలు నిజమే. నిధులన్నియు సరిపోయినవి. రత్నములు మొదలగునవి యేమియు లేవు. కావున మనము, అనగా, దేవతలము, రాక్షసులము కలసి క్షీరసముద్రమును మథించిన, రత్నములు మొదలగు సమస్తము దొరకును. ఎట్లనగా ప్రళయకాలమందు ప్రపంచమందలి ధనము, బంగారు, రత్నములు మొదలగు సమస్తపదార్థములు అందుజేరెను. అందుకు తగిన సన్నాహము చేయుడు. ఆమాట

లువిని దేవతలందరును తమ వాహనములు, విమానములపైని బయలుదేరి పాలసముద్ర తీరమునకు పోయిరి. రాక్షసులందరిని తోడుకొనిరమ్మని బలిచక్రవర్తికి వర్తమానము చేసిరి. వాసుకిని రమ్మని పాతాళమునకు వార్తపంపిరి. అదియెట్లనగా.

హిరణ్యగర్భమార్గము.

దేవతలు స్వర్గమందును, క్షీరసముద్రము భూలోకమందును బలిచక్రవర్తియు, రాక్షసులు, వాసుకి పాతాళమందును ఉన్నారుగదా! ఆయాస్థలములకు మార్గమీ విధముగానుండును. భూమధ్యమున మేరుపర్వతమున్నది. దానిమీదనే స్వర్గలోకమున్నది. దాని ప్రక్కనుండి క్రిందుగా పాతాళమునకు బ్రహ్మ మార్గము చేయించి అందు విశ్వకర్మచే బంగారు రేకు స్థాపింపజేసెనట. దానికే హిరణ్యగర్భమార్గమని పేరు. అతోవనే పాతాళమునకు వచ్చుచు పోవుచుందురట. అది మానవులకు కానరాదట. బ్రహ్మచే పంపబడిన దేవదూతలు బలిచక్రవర్తితో మనవి చెయ్యగా ఆయన తన బలమైన సమస్త రాక్షసులతోను బయలుదేరి త్రిమూర్తులతోను దేవతలున్న పాలసముద్ర తీరమునకు వెంటనే వచ్చెను.

శ్రీహరి కూర్మరూపుడగుట.

వాసుకి తన వెయ్యి శిరస్సులపైని భూభారము వహించియున్నందున ఎట్లదిదించి రాగలడని బ్రహ్మప్రశ్న చేసెను. అప్పుడు విష్ణుమూర్తి దానికి ఉపాయమాలోచించి మరియొక

సాధనము లేనందున తాను గొప్ప కూర్మరూపమును ధరించి భూ భారమును సహించుటకు నిశ్చయించుకొని, వాసుకిని వెంటనే తమ్మని శ్రీ మహావిష్ణువు దేవదూతల నంపెను. భూమి మున్గనిలుచునను సందేహము లేకుండ ఆధారము విడచితమ్మని విష్ణువు సెలవిచ్చెనని దూతలు చెప్పగా వాసుకి వెంటనే బయలు వెడలి దేవతలున్నచోటు సిద్ధమయ్యెను. ప్రపంచమందలి సమస్త మైన చక్రవర్తులను, రాజులను, మునులను, ఋషులను, పిలుచుటకు బ్రహ్మ దూతలను పంపగా, అందరును వారి సైన్యములతో వచ్చిరి. సాగరము మధించుటకు దివ్యముగా మందర పర్వతమును, త్రాడుగా దానిని చుట్టి త్రిప్పుటకు వాసుకిని నిశ్చ యించిరి. కావున ఆ పర్వతమును తెచ్చుటకు దేవతలను రాక్ష సులను బ్రహ్మ ఆజ్ఞాపించెను. ఆ పర్వతము, లక్ష యేబది యోజ నముల ఎత్తును లక్ష యోజనముల వెడల్పును ఉన్నందున వారి కాపని సులభసాధ్యము కాకుండెను. అయినను వారు ముందుగా శ్రీహరిని ధ్యానించి దేవతలు ఒక ప్రక్కను రాక్ష సులు మరియొక ప్రక్కను చేరి కామరూపులు గావున తమ శరీరములను పెంచి ఊపిరి బిగబట్టి బహు కష్టముపైని దానిని పెల్లగించి తమ శిరస్సులమీద నుంచుకొనిరి. కాని దాని భార ము మోయలేక అడుగుతీసి వేయలేక చాల బాధపడి దాని క్రింద పడి చితుకుదుమేమోయను భయముకలిగి మహాప్రభూ! రక్షించు రక్షించుమని శ్రీహరిని మిక్కిలి ఆతురతతో ప్రార్థించి

మొరపెట్టగా దానిని విని వారియందు కరుణించి ఆపర్వతమును ఎప్పటివలె అచ్చట నుంచుడని వారికి సెలవొసంగి శ్రీ మహా విష్ణువు దానిని తన యెడమ చేతితో పిల్లలు గోళ్ళచే కాయను తీసికొనునట్లు తీసికొని పోయి పాలసముద్రములో విసరెను. అచ్చట అది మునిగెను. బ్రహ్మ మొదలగు దేవతలందరును అది చూచి వెరగంది విచారించుచుండిరి. అప్పుడు వారి భయమును మాన్పి శ్రీహరి ఎనిమిది లక్షల యోజనములు వైశాల్యమును ఒకలక్ష ముప్పదివేల యోజనముల యెత్తును గల శరీరముతో కూర్మరూపమును ధరించి ఆ పర్వతముక్రింద దూరి దానిని తన వీపుమీద నుంచి యెత్తగా పర్వతము జలముపైకి లేచెను. అప్పుడు వాసుకిని పిలిచి దీనినినీవు త్రాడుగా చుట్టుకొమ్మనగా అతడిట్లనియెను. "ఓ మహాప్రభూ! నేననగా నెంత వాడను. ఆపనికి చాలుదునా? దేవరాక్షసులుపట్టిలాగగా నాశరీరము ముక్కముక్క లగును. కాన ఈపనికినేను సమర్థుడను కాను. క్షమింపుము." వాని దీనాలాపములు విని శ్రీహరి యిట్లనెను. "ఓ వాసుకీ! నీవేల భయపడెదవు? నీకంటె బలము కలవా రెవరు? భూభారమంతయు వహించిన నీవే యిట్లనిన యీపని మరి చేయువారెవరు? స్వర్గ మర్త్యలోకముల బరువులో ఈపర్వతమనగా నెంత! భయపడకుము. ఈ పని చేయుటకు నీకంటె సమర్థులు ఎవరును లేరు. కావున నీవే పూనుకొనవలెను." అనగా విని సంతోషించి ఉప్పొంగి తన శరీరమును పొడవుగా

పెంచి, ఆ పర్వతమునకు మూడుచుట్లుగా తిరిగి ఒకప్రక్కను దేవతలును, మరియొకవైపు రాక్షసులును అందరును పట్టు కొనుటకు చాలినంత పొడవు ఉండెను. దాని తలవైపు రాక్షసులును, తోకవైపు దేవతలును, పట్టుకొని త్రిప్పసాగిరి. ఆ సమయములో రాజులు, మునులు, ఋషులు, సముద్రతీరమున నుండిరి. త్రిమూర్తులు వారి విమానములపైని అంతరాళమున నుండి చూచుచుండిరి. ఏ రంధ్రములో ఎక్కడ ఎవరు ఏమను కొనుచుండిరో చెప్పుటకును ఒకరివర్తమానము మరియొక్కరికి కొనిపోవుటకును వాయుదేవుని దూతగా బ్రహ్మ నియమించెను.

## సముద్ర మథనము.

అప్పుడు దేవతలు, రాక్షసులు కలిసి సముద్రమును మథింపగా స్వల్పకాలములోనే వారిబలము క్షీణించి త్రిప్పుటకు శక్తిలేక సొమ్మసిలి మహాప్రభూ యింక మేము త్రిప్ప లేమని మొరపెట్టగా విష్ణుమూర్తి వారి హృదయములందు తన తేజస్సును ప్రవేశపెట్టి వారికి బలము కలిగించెను. వారు త్రిప్పుటకు ఆరంభించగా ఆపర్వతము సరిగా నిలువక ఇటుఅటు పడుచుండెను. అది చూచి శ్రీహరి పురుషరూపమును దాల్చి దానిపై నెక్కి దానిని వంగకుండ నిలిపెను. రెండు గడియలు బాగుగ మథించిరిగాని అందు ఏమియు పుట్టకుండుట చూచి బ్రహ్మ జాంబవంతుని పిలిపించి సముద్రమునందు ఓషధులను తెచ్చి వేయుమని ఆజ్ఞాపించెను. ఓషధులు ఏవో అవి యెట్టివో,

యిచ్చుట వారకునో తెలియజేయు పుస్తకము అతని కిచ్చెను. అదిచూచి సమస్తౌషధులు తెచ్చి వానిని చిలుకగొట్టి సముద్రములో వేసి తరవగా కొంత సేపటికి అందులోనుండి పదార్థము పుట్టెను. దానినిచూచి ఆశ్చర్యపడి తరచుట చూచి బ్రహ్మకు వర్తమానము తెలుపగా ఆయన వచ్చి చూచి అది అమృతమని తెలిసి దానిని తీసి యొకగట్టి బంగారు కలశములో పట్టి తన యొద్ద జాగ్రత్తగా నుంచెను. తరువాత మరి కొంత సేపు మథించగా ఐరావతమను తెల్లని యేనుగు పుట్టెను. దానిని కూడ బ్రహ్మ స్వీకరించెను. తరువాత సుర పుట్టెను. అది కైపుగలుగు పదార్థము. దానిని త్రాగినవారికి మత్తెక్కుననియు, నాలుగు వర్ణములవారిలో ఎవరు త్రాగినను జాతిభ్రష్టులగుదురనియు, కొంతకాలము నరకములో పడుదురనియు అందరితో చెప్పి దానిని ప్రత్యేకముగానుంచెను. ఆవెనుక కొంతసేపు తరవగా చీనిచీనాంబరములు ధరించినట్టియు, వెయ్యి చంద్రుల కాంతి గలిగినట్టియు, అమృతముతో నిండిన బంగారు కలశమును చేబట్టి దివ్యమంగళ విగ్రహమైన స్త్రీ జన్మించెను. ఆమెయే శ్రీమహాలక్ష్మి. ఆమెను చూచిన వారందరు మోహభ్రాంతులై మూర్ఛిల్లి కొంతసేపటికి తెలివొంది ఆశ్చర్యపడిరి. ఆమెనుకూడ బ్రహ్మ ఒక భవనమున నుంచెను. మరికొంత సేపటికి ఎనమండుగురు అప్సరసలు పుట్టిరి. వారెవరనగా: రంభ, ఊర్వశి, మేనక, చిత్రరేఖ, మోహిని, మదన, కాంతిచంద్రిక, కుమారి, యని వారికి పేరులు బ్రహ్మ పెట్టెను.

పిమ్మట అష్టనిధులుపుట్టెను. వీరు బంగారుతో చేయబడి నవరత్నములుస్థాపింపబడిన శరీరములుగల పురుషులు. వారినుండి రత్నములు యెప్పుడు రాలుచుండునట. వారిని బ్రహ్మయొద్దకు తీసికొనివెళ్లగా ఆయనవారితో మూర్ఖులారా మీకొరకేసముద్రము మథించవలసి వచ్చెనని చెప్పి శ్రీలక్ష్మీదేవి సన్నిధానమందు వారిని కూర్చుండబెట్టెను. పిదప నవి కుబేరుని ధననిధులను స్వర్గలో నింపి యుంచెను తెలిసినను తెలుగకే యుండును. తరువాత ఆసముద్ర మందుఉచ్చైశ్రవసము మొదలుగా నేడు ముఖముల గుఱ్ఱములు పుట్టెను. అవి మాటలాడగలవు. మూడు లోకములును ఒక నిమిషములో తిరిగి రాగలవు. ఆవెనుక తామరపువ్వు ఆకారముగల ఒక గొడుగు పుట్టెను. దానిని విప్పిన నవరత్నములు జలజలరాలును. దానికే బ్రహ్మ కనకదండము అని పేరుపెట్టెను. తరువాత కామధేనువు, కల్పవృక్షము, సూర్యకాంతమణి, శ్యమంతకమణి, కౌస్తుభమణి, దేవదత్తమను శంఖము, పుట్టెను. పిమ్మట బంగారుతో నిర్మింపబడి రత్నస్థాపన చేయబడి, నాలుగేసి గుఱ్ఱములచే కట్టబడిన పుష్పక విమానము, నంది ఘోషమను రథము పుట్టెను. వీని నన్నిటిని బ్రహ్మ దాచిఉంచెను.

హాలాహలము పుట్టుట; దానిని ఈశ్వరుడు మింగుట.

ఇట్లుసముద్రమునందు పుట్టిన ప్రతివస్తువును దాచియుంచుట యెవరికిని ఇయ్యకుండుట చూచి ఈశ్వరుడు అందుకు కారణమేమని బ్రహ్మ నడుగగా, ఆయన మహాదేవునితో ఇట్లు రహ

స్యముగా చెప్పెను. "దేవా! వినుండు. దేవతలు, రాక్షసులు కలసి, సముద్రమును మథించుచున్నారు. ఈ వస్తువులను వెంటనే పంచియిచ్చిన యెడల వారికి ఇచ్చినవి మంచివి, మాకు మంచివి ఇచ్చినారు కారనిగాని, మాకు అదికావలెను, ఇది కావలెనని గాని, కొందరు కోరుదురు. అప్పుడు కలహములు పుట్టును. ఇంతేగాక రాక్షసులకు మంచి వస్తువులను మనము ఇయ్యము గదా! కలహములు మొదటనే పుట్టిన యెడల ఈ మహా కార్యము నెరవేరుట ఎట్లు? అన్యోన్యసహాయము లేకుండ నెరవేరు పనికాదు గదా? అందుచేత సముద్ర మథనము పూర్తి కాగానే అన్నియు ఒకచోట చేర్చి పంచిన బాగుగ నుండునని తలంచితిని." ఇది విని సరే మీ యిష్టము. ఎవరికేది యిచ్చినను నాకు వానితో పనిలేదు. ఈ మారు పుట్టినది మాత్రము నాది. నేను తీసికొందును. ఈ మాటలు విని ఆలాగైన సరే కానచ్చునని బ్రహ్మయు, విష్ణువును అంగీకరించిరి. తరువాత సముద్రమును తిరిగి తరవగా హాలాహల విషము పుట్టెను. కర్మవశమును చూచితిరా! ఇదివరకు రత్నములు, స్త్రీలు, మొదలగు పదార్థములు పుట్టుచుండు సముద్రములో ఇప్పుడు ఈశ్వరునివంతునకు వచ్చునప్పటికి విషము పుట్టినది. ప్రారబ్ధవశమును యెవరు తప్పింపగలరు. అట్టి సర్వేశ్వరునికే తప్పినదికాదు గదా! వాసుకియను ఆది శేషుని త్రాడుగా జేసి గదా, మందరమును కవ్వమునకు చుట్టి మథించుచుండిరి. అతనికి వెయ్యి తలలు, శరీరము వజ్రముకంటె

కఠినమైనది. కాబట్టి నిలిచినదిగాని లేకున్న ముక్కలగునుగదా. దానిని వారిశక్తికొలది వారు లాగగా అలసి ముఖముల వెంట విషము క్రిక్కెను. అది సముద్రములో పడెను. ఇంకను గట్టిగా లాగగా అగ్ని పుట్టెను. అదిచూచి దేవతలు, రాక్షసులు సముద్రములోని నీరు జల్లగా మరింత మండెను. ఈసంగతి వాయుదేవునివలన విని విష్ణుమూర్తి వర్షమును కురిపించెను. అందువలన అగ్ని చల్లారెను. కాని విషము బాగుగా వ్యాపించి బాధనెచ్చయ్యెను. అదిచూచి వారు నిలువలేక పారిపోయిరి. అంతకంతకు వ్యాపింపగా ఆకాశ భరింపలేక దేవతలు సమలోకముగు స్వర్గమునకును రాక్షసులు, నాగులు, పాతాళమునకును, బ్రహ్మ నచ్చైన సత్యలోకమునకు, ఈశ్వరుడు కైలాసమునకును పారిపోయిరి. గూడసుప్తిన చక్రవర్తులు మునులు మొదలగువారు పదిరెండు యోజనములు దూరముపోయినిలిచిరిగాని అచ్చటికికూడ దాని వేడి తగులుచుండెను. అచ్చట గరుడునిపైని విష్ణుమూర్తియు చల్లనివాడై అమృతమును, మంచును, వర్షించుచున్న చంద్రుని వద్ద నుండుటచే లక్ష్మి, అప్సరసలును, వజ్రమయ శరీరులై రక్తమాంసములు లేనందున నిధి పురుషులును మాత్రము ఎప్పటిచోట నుండిరి. అయినను విష్ణుని శరీరము విషపుకాకచే నల్లబడి అదిమొదలు కృష్ణుడను పేరుపొందెను. అంతట ఆ విషము వేడి బ్రహ్మలోకమువరకును వ్యాపించుట చేతను, అదిపరకే దేవతలందరును బ్రహ్మయొద్దకు చేరి మొఱ్ఱ

పెట్టుచుండుటచేతను, దాని బాధవలన తొలగించుటకు తనకు సమర్థత లేకుండుటచేతను, బ్రహ్మ దేవతలను వెంటతీసికొని కైలాసమునందున్న శ్రీమహాదేవుని యొద్దకు పోయెను. అప్పుడు వారి రాకచూచి ఈశ్వరుడు చిరునవ్వు నవ్వి ఇటువచ్చుటకు కారణమేమని అడుగగా, విషమువలన సంభవించిన బాధలను దెలుపుచు రక్షింపుమని పలువిధముల వారు ప్రార్థింపగా, సదా శివుడు కరుణా సముద్రుడు గనుక త్వరలో సంతోషించి వారిని ఆపదనుండి రక్షింపదలంచి వారితో బయలుదేరి విషమున్న సముద్రతీరమునకు పోయి దానిని సులభముగా చేతితో చేబట్టి రేగుపండువలె ముద్దగా చేసి గుటుక్కున మింగి తన కంఠము నందుంచెను. దాని వేడివలన ఆయన సొమ్మసిల్లుట చూచి, బ్రహ్మ, విష్ణువులు భయపడి, చంద్రుని, గంగను ఆయన శిరస్సున నుండ నియమించిరి. అందువలన కొంతసేపటికి ఆయన తెలివొంది గంగను చంద్రుని చూచి వారివలన తనకు ఉపకారముగుట తెలిసికొని, మీకు వరంబు లిచ్చెదను, వేడుడనగా చంద్రుడు ఇట్లనెను. "స్వామీ! నేను పుట్టినదినము సోమవారము కావున ఆ దినము తమ్ము పూజించు నరులకు యజ్ఞ ఫలము నిచ్చి నీలోకమైన కైలాసమందు వారికి, నివాసమిమ్ము. గంగ ఇట్లనెను. "ఆ నాడు నీకు అభిషేకము చేయువారికి కోటితీర్థముల మునిగి, సేవించిన ఫలమిమ్ము. వారి కోరికలను నెరవేర్చుము. నేటినుండి చంద్రశేఖరుడు గంగాధరుడు అను

నామములు పఠింతుము. ఇంతే మా ప్రార్థన.” వారికోరికలు విని అట్లు అనుగ్రహించితినని చెప్పి ఇంతేకాక యే మానవుండైనను కృష్ణపక్ష చతుర్దశీ సోమవారమునాడు నన్ను పూజించువారికి ఏవరముకోరినను తప్పక ఇచ్చెదనని ఈశ్వరుడు వాగ్దానముచేసెను. కంఠమునందు గరళము ఉంచుకొన్నందున అప్పటినుండి మచ్చ ఈశ్వరునికి కలిగెను. అందుచేత ఆయనకు నీలకంఠుడని పేరు సార్థకమయ్యెను.

జాంబవంతుని జన్మము.

హిమవంతునికిని మేనకాదేవికిని కుమార్తెయైన పార్వతి దేవిని ఈశ్వరుడు వివాహమైన పిమ్మట ఆ దంపతులు కైలాసమునకు విజయము చేసిరి. ఆ కైలాసమునకు నాలుగు ప్రక్కల అడవి యుండెను. దానికి రుద్రవనమని పేరు. ఎందుచేతననగా అందు నిరుమగా ఈశ్వరుడు విలాసార్థముసంచరించుచుండును. ఆ వనమందు అనేక ఫలవృక్షములు, పూలచెట్లు లతలు మృగములు ఉండెను. అందు సర్వకాలములందు వసంతఋతు లక్షణము కలిగి యుండునటుచేసెను నానావిధవాసనలతో చల్లని మందమారుతము వీచుచుండును. కనుక ఈశ్వరుడు పార్వతితో కూడ కేళివినోదములు సల్పుచుండును. ఒకనాడు చల్లని నీల మేఘము కాయుచుండు సమయమున నెమళ్లు కూయుచుండగా కోవెలలు అరచుచుండగా, ఈశ్వరుడు మంచి కుతూహలము కలవాడై భల్లూక రూపమును ధరించెను. అదిచూచి పార్వతి

చిరునవ్వు నవ్వి యిట్లనెను. "నాథా! ఎన్ని రూపములు ధరింప గలరు. మీ మహిమలు చర్యలు చాలవింతలు అందరికి అగోచరములు గదా! ఎవరు తెలిసికొన గలరు." ఆమాటలు విని సర్వేశ్వరుడు ఆనందించి ఆమెతో ఇట్లనెను. "చెలీ! ఈ రమ్య వనంబున ఇట్టి కుతూహల సమయమందు నీతో ఈ రూపమున భోగించుటకు మనసు పుట్టి ఈ రూపమును పొందితిని. కావున నీవును ఇట్టి ఆకారమును వేగంబో పొందుము సుమా." అనగా నిజపతి ఇష్టానుసారము మెలగుట సతీధర్మము గాన ఆమె అట్లు చేసెను. పిమ్మట వారు స్వేచ్ఛానుసారము కామవినోదము లనుభవించుచు కొంతకాల మా వనంబున సంచరించి తమ నిజ రూపములను పొందిరి. కొద్ది కాలములో భల్లూక ముఖముతోను మనుష్య శరీరముతోను ఆమెకు ఒక కుమారుడు పుట్టెను. ఆ బాలుని యొడిలో నిడికొని పార్వతి ఈవరము లిచ్చెను. "ఓ వత్సా! నీకు కోటి సింహముల బలము కలుగు గాక. ముల్లోకములయందును నిన్ను జయించువారు లేకుందురు గాక. కల్పాంతము వరకు జీవింతువుగాక. నీకు అన్ని శాస్త్రముల జ్ఞానము కలుగుగాక. ఈ వనములలో నీ ఇష్టానుసారము సంచరింతువుగాక. నాయనుగ్రహమువలన నీకు భయముండదు." అని వరములిచ్చి, పార్వతీ పరమేశ్వరులు నిజరూపములతో కైలాసమునకు వేంచేసిరి. అంతట జాంబవంతుడు ఆవనము నందే గాక, స్వర్గ, మర్త్య, పాతాళములందు సంచరించుచు

చెప్పిరి. శ్రీహరి ఆపని చేసి అందుండెడి జీవజంతువు లన్నిటిని రాళ్ళుగా మార్చియుండెను. కాన వానిని ఇప్పుడు ఎప్పటి జంతువులనుగ చేసెను. శ్రీహరి కూర్మరూపమును ఉపసంహరించెను. ఆయన పర్వతమునుదించి విచ్చేసిన తరువాత, సముద్రమునందు పుట్టిన సమస్త పదార్థములను పంచుకొనుటను గురించి ఆలోచించిరి. శ్రీమహాలక్ష్మి చేతిక బ్రహ్మ ఒక రత్నహారమును ఇచ్చి, మూడులోకములవారును ఇచ్చుటకు తగియున్నారని చెప్పి, అందు తనకు ఇష్టమైనవారికి ఆ హారమును మెడలో వేసి వరింపుమనగా ఆమె అందరిని పరికించి శ్రీ విష్ణువు మెడలో వేసెను. అప్పుడు దేవతలు ఆనూతన దంపతులపై పుష్పవానను కురిపించిరి. శ్రీహరి లక్ష్మిని గరుడవాహనముననుంచి తెచ్చి, తిరిగి వారితో కలిసెను.

## రత్నాదుల పంపకము.

మిగిలిన పదార్థములను పంచుమని శ్రీహరి బ్రహ్మతో చెప్పగా రాక్షసులు తమకు ముందుగా నిమ్మనిరి. తొందరపడకుడు. అందరికిని వరుసగా ఇచ్చుటయగునని బ్రహ్మ అనెను. శ్రీహరి దేవతలకు ముందుగా నిమ్మనెను. ఇంద్రుని పిలిచి ఐరావతమును, ఎనమండ్రు అప్సరసలను, రత్న ఛత్రమును, కుబేరునికి అష్టనిధులను, ఇచ్చి దేవతల ధనము కొట్టులోనుంచుమనెను. సూర్యునికి యేడు గుఱ్ఱములను ఇచ్చి తన రథమునకు పూన్చుకొమ్మనెను. కౌస్తుభమణిని శ్రీమన్నారాయణునకు, శమం

ఏకమణికుండలములు సూర్యునికిని ఇచ్చెను. ఆమాణిక్యము మెడలో నుండువారికి ఆకలి, దప్పి కలిగి ఉండవు. ఆ కుండలములు అమృతము గలవగుటచే, వాటిని చెవ్వులకు పెట్టుకొన్నవారికి మరణముండదు. పిమ్మట వరుణుని పిలిచి, పుష్పకవిమానము ఇచ్చెను. తరువాత బ్రహ్మ శివునిజూచి మీ కేమియునను తెలిసి కొనుడనగా నా వంతుగ నిదివరకే తీసియున్నాను, అయినను నాకుశంఖము నిమ్మనగా బ్రహ్మ ఆయనకు శంఖము నిచ్చెను. శివుడు దాని నడుగుటకు కారణమేమనగా అదిసూర్యునివలె ప్రకాశించుచుండును. దానిని ఊదిన ముల్లోకములకు వినబడును. దాని శబ్దమువిని జనులు మూర్ఛిల్లుదురు. దానివిన్న శత్రువులు వచ్చి యెదుటనిలుతురు. కుబేరునకు రథములన్నియు ఇచ్చి వానితో గరుడధ్వజము గల రథమును వాడుక చేయవద్దనియు అది శ్రీమహావిష్ణునే యెక్కవలెననియు చెప్పెను. కశ్యపుడు మొదలగు మహాఋషులకు కామధేనువులను పంచిపెట్టెను. తరువాత చక్రవర్తులను పిలిచి వారికి కిరీటములను, భుజకీర్తులను రత్నములను పంచి యిచ్చి వారిని వెంటనే తమతమ దేశములకు వెళ్ళుడని చెప్పెను. ఒక మణి బ్రహ్మ తన కంఠమున ధరించెను. దానివలన మోహము నశించును. ఈ మాయా సంసారమందు భ్రమయుండదు.

అందరికిని అన్నియు ఇచ్చుటయు, తమకు ఏమియు ఇయ్యకుండుటయుచూచి, రాక్షసులుమిగుల కోపించి బ్రహ్మనుజూచి ఇట్లు

నిరి. "ఓ పితామహా! అందరకు అన్నియు మంచివియంచి పంచి తిరి. నాసంగతి మరచితిరా ? మేము ఎంతోకష్టపడి సముద్రమును తరచితిమో ఎరుగరా ? ఇందులో శ్రీకృష్ణుని దోష మేమియు లేదు. మీరే గదా అందరకు పంచుచున్నారు. మేము కూడ ఇచ్చుటకే యున్నను పుచ్చుకొనుటకు మీకు బుద్ధిపుట్ట లేదు. మంచిమంచి పదార్థములను, రత్నములను, స్త్రీలను దేవత లకు ఇచ్చితిరి. మాకు మరి మిగిలిన దేమున్నవి ! అప్సరసలలో నలుగురిని మేము తీసికొనక మానము" ఆమాటలు విని బ్రహ్మ వారితో ఇట్లు చెప్పెను. "బిడ్డలారా ! తొందరపడ కుడు. మీవంతు మీకును దొరకును. అప్సరసలు ఇదివరకే ఇంద్రునికి ఇయ్యబడిరి. మీకు ఎట్లు లభించును. ఇచ్చినది పుచ్చుకొనుట గొప్ప దోషము గదా ! కావున ఆసంగతి మరచి పొండు. ఇందులో అమృతము గదా ముఖ్యమైనది: అది అంద రికీ ఇయ్యబడును. కావున దానిని అందరము భుజింతము. ముం దురత్నములను, పంచెదను." అని అప్పటికి మిగిలిన రత్నములు నాలుగు వంతులు వేసి అందులో మూడు వంతులు, మిగిలిన దేవతలకు గంధర్వులకు నాగులకు పంచి, మిగిలియున్న భాగము పట్టించుకొని, బ్రహ్మను తన వెంట తోడుకొని బలిచక్రవర్తి యొద్ద వాటిని బెట్టించి వీనిని మీరాక్షసులకు పంచిపెట్టుము" అనగా "ఇవి నేనెట్లు పంచగలను. అందరికని చాలవు. కొందరికి ఇచ్చి మరి లేవన్న బాగుండునా. అందరము శ్రమపడి సంపాదిం

చిన వానిని సమానముగా భేదబుద్ధి లేక పంచవలదా! అనెను."
అదివిని శ్రీహరి, బ్రహ్మను జూచి "వారిని ఎందుకు బ్రతిమాలెదరు. మనకు తోచిన మాత్రము ఇచ్చితిమి. వారికి ఇష్టమైన పుచ్చుకోవచ్చును. లేనియెడల మానవచ్చును." అని చెప్పగా, కశ్యపుడు బలిని బోధపరచి పంచిపెట్టుమనెను. కొందరికి ఏమియు నేకుండుట చూచి బ్రహ్మ మరికొన్ని పంపెను. అందరకు పంచిన పిమ్మట, ఒక రత్నహారమును బలిచక్రవర్తి మెడలో వేసెను. అతడు సంతోషించెను. అప్పుడు బలిచక్రవర్తి, అమృతమును క్రమముగా పంచెదరా! లేక ఇట్లే చేసెదరా' యని బ్రహ్మ నడుగగా అదియేమన్న మాట? తినవలసిన దాని విషయమై అట్లగునా! నీవు యెవరిని పంచుమన్న వారే పంచెదము." అనెను. శ్రీహరియే వడ్డించుటకు తగినవారు. ఆయన వడ్డించిన భేదాభేద బుద్ధి లేకుండును." అని బలి చెప్పెను.

అది విని సుధాకలశమును సురభాండమును తెప్పించి సభ మధ్యనుంపించెను. అవి చూచి సురాసురులు చుట్టునుమూగగా ఇట్లయిన నేనెట్లు వడ్డించగలను? మీరు పంక్తులుగా కూర్చుండుడని చెప్ప వారందరును కలిసికూర్చుంటిరి. అట్లుగాదు. వేరు వేరుగా కూర్చుండుడని చెప్పి దేవతలను తూర్పు ముఖముగాను రాక్షసులను పశ్చిమ ముఖముగాను కూర్చుండబెట్టి తాను జగన్మోహినీ రూపమును పొందెను. విశ్వకర్మ బంగారు గిన్నెలు దేవతలు ముందర నొక్కొక్కటియు వెండి గిన్నెలు రాక్షసుల

యెదుట నొకటి చొప్పునను ఉంచెను. అది చూచి రాక్షసులు కోపించి దుఃఖించిరిగాని నిమేషమాత్రములో తినుటకు యేగిన్నెలైననేమని ఎలి వారికి బోధించెను. అప్పుడు శ్రీహరి అచ్చటనున్న సురాసురలు ఎందరుండిరో అందరకు అన్ని స్త్రీ రూపములను ధరించి దేవతలకు అమృతమును, రాక్షసులకు సురను వడ్డించెను. ఎవరికి ఏ స్త్రీ వడ్డించుచున్నదో ఆమెయే గాని తక్కినస్త్రీలు కనబడకుండిరి. త్రిమూర్తులకు తప్ప ఇతరులకు స్త్రీ రూపములన్నియు కనబడలేదు. రాక్షసులు దానిని త్రాగి "ఇది సుర. అమృతము ఏదీ?" అనిఅడుగగా మొదటలందరకు సురయే వడ్డించితిని. ఇదిగో అమృతము తెచ్చుచున్నాను" అని అమృతమును చోటికిబోయి కలశచెంబుని అంతర్ధానమయ్యెను. ఇట్లు శ్రీమహావిష్ణువు తన మాయవలన జగన్మోహినియై తన విశ్వరూపమును చూపి భ్రమింపజేసెను.

## రాహువు అమృతపానము చేయుట.

ఈ రాహువు కశ్యపబ్రహ్మకు సింహికయను భార్యయందు బుట్టి తాత అనగా తల్లి తండ్రియైన దక్షప్రజాపతి యిచ్చిన శాపము వలన రాక్షసుడైనను అమృతము దేవతలకే కాని రాక్షసులకు ఇయ్యకుండుటకు త్రిమూర్తులు రహస్యముగా ఆలోచించుట ఎరిగియున్నందున తాను సూర్యచంద్రుల మధ్య దేవతలపంక్తిలో కూర్చుండి అమృతపానము చేసెను. సూర్యచంద్రులు ఆసంగతి శ్రీకృష్ణునితో చెప్పగా "ఇప్పుడు చెప్పిన

మించినపనికి నేనేను చేయగలను" అని ఆయన అనెను. కాని కృష్ణునికి కోపము లేకపోలేదు. వానిని కోపముతో చూడగా వాడు గడగడ వణకు చుండెను. నన్ను మోసగించి నాడన్న క్రోధముచేత కృష్ణుడు వానిపై సనచక్రమునువిడచెను. అది వానితలదునిమి రెండు ముక్కలుచేసెను. కాని ప్రాణములు పోనందున ఆమొండెము పద్మాసనము వేసి కూర్చుండి శ్రీహరితో ఇట్లనెను. "ఓస్వామీ! నిర్హేతుకముగా నాకింతమెంనుకు దుని మితిరి? మీరేకదా అమృతము నాకుఇచ్చితిరి? మీరు కరుణా సముద్రులు. సర్వజ్ఞులు. భూతభవిష్యత్తులు తెలిసినవారు. తమ రేకదా ప్రళయము సృష్టిచేయువారు. సమస్తలోకములు నిండి యున్నవారు మీరే. ఇట్టి అధర్మము చేసిన కాదనువారెవరు? తిండిబెట్టి వెంటనే నన్ను చంపితిరి. ముఖమంచూచి మీరే వర్ధిం చితిరిగదా! ఏల పోల్చలేకుంటిరి? పరమేశ్వరుడ వగుటచేత మీరు పోల్చలేకపోవచ్చునుగాని పాపపుణ్యభేదము తెలియదా? భోజనముపెట్టి ఆకలమందే జీవుని చంపుటవలన కలుగుపాపము భూమియుండునంతకాలము నరకబాధలను అనుభవింపచేయదా? పాపపుణ్యములు మీరు నిర్ణయించినవే గదా? వానిని మీరే అతిక్రమించిన పాలించువారెవరు? వాని మాటలువిని శ్రీహరి ప్రసన్నుడై ఇట్లుచెప్పెను. ఓయీ! నీయందు నాకు చాల కనికరము గలిగెను. నీయిష్టమువచ్చిన వరములను కోరు కొనుము. తప్పక యిచ్చెదను. అదివిని రాహువు ఇట్లుకోరెను.

3

ఓమహాప్రభూ! ఈచంద్రసూర్యులు చెప్పబట్టిగదా మీరు నన్ను నరికితిరి. కావున వీరిని మ్రింగుటకు నాకు సెలవిండు" అందుపై శ్రీహరి యిట్లనెను. ఓయీ! సూర్యచంద్రులను నీవు మ్రింగిన లోకములకు చాల బాధలుకలుగును. చీకటి నిండుకొనును! రాత్రిపగలు భేదముండదు. ఓషధులుపెరుగవు. వృక్షములు, పశు పక్ష్యాది జంతువులు మానవులు వృద్ధి పొందరు. ఇంకను అనేక కష్టములు కలుగును. కావున వీరిని నీవు భ్రమింగకుము. కాని అమావాస్య పోయి పాడ్యమి, పౌర్ణమి పోయి పాడ్యమి వచ్చునప్పుడు కొన్ని కొన్ని నక్షత్రములు, యోగములు కరణములు కలిసి యున్నప్పుడు వారిని నీవుమ్రింగి కొంచెము చప్పలించి వెంటనే విడుచుచుండుము. విడువకున్న నీతల పగిలి వెంటనే చావగలవు. వారు నీకు చేసినకీడు వారి నిట్లు బాధించుచుండును.

దీనికే గ్రహణమందురు. ఆగ్రహణ కాలమందు బంగారము, గోవులు, అన్నవస్త్రములు రత్నములు మొదలగు షోడశ మహాదానములు బ్రాహ్మణుల కిచ్చువారు, విధిప్రకారము సంకల్పముచేసి మమ్మును తలచుకొని ధ్యానముచేసి నన్ను స్మరించుచు విడుపువరకు జపించువారు, సమస్త పాపములను నశింప జేసికొని, సిరి సంపదలతో జీవించి తుదకు నన్ను పొందుదురు. అట్లు చేయక గ్రహణ సమయమందు స్నానము చేయకుండిన వారికి చండాలజన్మము కలుగును. ఆకా

లమునందు భోజనము, సంగమము, చేయువారికి నూరు జన్మములవరకు కఠిన దరిద్రము సంభవించును. నీ మొండెము రాహువను పేరును, నీ శిరస్సు కేతువను పేరును పొందినవాడవై సూర్యచంద్రు లున్నంతకాలము జీవింతువుగాక. అని శ్రీహరి వానికి వరములిచ్చెను. ఈ రాహుకేతువులు గ్రహములలో చేరెను. ఈ గ్రహణము పట్టుటవలన, చంద్రసూర్యుల బలము కొంత తగ్గును కావున వారి ఆయువు కొంత క్షీణించును. దీపములలో చమురు కొంత తగ్గించిన అది వెలుగుకాలము తగ్గునట్లే చంద్ర సూర్యుల ఆయువు తగ్గుటవలన కాలపరిమాణము యుగప్రమాణములు తగ్గును. అందు ఒక గ్రహణమువలన ఎంతకాలము తగ్గునో ఆ గ్రహణకాలమందు చేయబడిన కర్మలు అంతకాలము చేసినట్లు ఫలమిచ్చును. కాబట్టి గ్రహణకాలమందు చేసిన పాపపుణ్యముల ఫలము అధికము.

## దేవాసురులకు మొదటియుద్ధము.

శ్రీహరి రాహువుకు వరములిచ్చి తిరిగి వారివైపు చూచువరకును దేవాసురులు తమ పంక్తులలోనే కూర్చుండి యుండిరి. అమృతము తెచ్చి వడ్డించుమని శ్రీహరిని పిలుచుచుండిరి. అప్పుడు ఆయన వారిని చూచి అమృతము మరి లేదనియు వారు లేచిపోవచ్చుననియు వారితో చెప్పగా శ్రీహరిని నిష్ఠురవాక్యము లాడుటకు మొదలుపెట్టి యిట్లనిరి. ఓ హరీ! నిన్ను మేము నమ్మినను మాకు విశ్వాసము లేక

పోయెను. నీకు మేము ఏమి అపకారము చేసితిమి ? నీ సెలవు ప్రకారము చాల శ్రమపడి సముద్రము తరచితిమి. అందు దొరకిన పదార్థములు దేవతలతో పాటు మాకును సమముగా పంచక పోతివి సరేకదా ! అమృతమైనను మాకియ్యక సుర ఇచ్చితివి. ఇది నీకు ధర్మమా ? వారును మేమును అన్నదమ్ములము. మాలో మాకు లేని భేదబుద్ధి నీకేల గలిగెను. మేము కశ్యప బ్రహ్మ కుమారులమై, వేదాధ్యయనము నిత్యాగ్ని హోత్రములు, మంత్రజపములు చేయుచు నిష్ఠతో నున్న సంగతి తెలిసియు, మాకు సుర ఇచ్చి జాతి చెడగొట్టితివి. మాలో నొకడైన రాహువు కక్కుర్తిపడి నీ పక్షపాతబుద్ధి తెలిసియే కావచ్చును. మారువేషమున దేవతలతో కూర్చుండి యుండగా వానికి అమృతమిచ్చి తిన్నచోటనే వానిని సంహరించితివి. ఇదినీకుతగునా! ఈపనులవలన నీసమబుద్ధి, న్యాయము, సర్వజ్ఞత్వము, మాకు బోధపడినవి. ఇదివరకు మేమందరము నీ యందు, భక్తి భయము గౌరవము కలిగి మా సంశ్రితకాలె ముందు నీకు నమస్కరించుచుంటిమి. ఇంతటితో తెలిసెను. ఇకను నిన్ను నమ్మము. మరియునీకు భయపడము. ఇదిగో నీతో యుద్ధము చేయుచున్నాము. సిద్ధముగానుండుము. అని రాక్షసులందరును ఒక్కమారుగా శ్రీహరిపై బాణవర్షము కురిపింప నారంభించిరి. అది చూచి దేవతలందరు శ్రీహరి పక్షమున రాక్షసులతో తలపడిరి. వారు తమ వాహనములపై నుండి

ఉభయపక్షములవారును ఘోరమైన యుద్ధముచేసిరి. కొంత కాలములో బలిచక్రవర్తి మూర్ఛితుడయ్యెను. అతని పక్షమునను న్న రాక్షసులు అందరు చచ్చిరి. మిగిలియున్న కొంచెము మంది కొండగుహాలలోనికి అడవులకు పారిపోయి దాగుంకిరి. యుద్ధము ముగిసెను.

ఇట్లు అంతమైన తరువాత, వాసుకిని పిలిచి రత్నహారములు మొదలుగు గొప్ప బహుమానములిచ్చి తన నిజనివాసమునకు పంపిరి. అనతు ఎప్పటివలె భూభారమును వహింపగా శ్రీహరి తన కూర్మరూపమును సంహరించెను. మిగిలిన అమృతమును ఇంద్రునికిచ్చి దానిని జాగ్రత్తపరుచుమని బ్రహ్మ చెప్పగా, ఆయన దానిని రహస్యమైన స్థలమున భద్రపరిచి అచ్చట గంధర్వులను కాపుంచెను. పిమ్మట దేవతలందరును తమ వాహనముల నెక్కి త్రిమూర్తులతో కూడి వైకుంఠమునకు పోయి శ్రీహరికి శ్రీమహాలక్ష్మిని వివాహముచేసి అచ్చట కొంతకాలము వినోదము లనుభవించి శ్రీహరిచే సత్కారములనుపొంది, సెలవు తీసికొని, వారి నిజనివాసములకు వేంచేసిరి.

ఇంతు యుద్ధభాగము క్లుప్తపరచబడ్డది.

రాక్షసులు తిరిగి వృద్ధిపొందుట.

కశ్యపబ్రహ్మ ఈ యుద్ధమునందు తన పుత్రులైన రాక్షసులు నశించుట చూచి మిగుల దుఃఖించి మరి దేవతలతో కలియక ఇంటికి పోయి భార్యలతో ఈ సమాచార మంతయు

చెప్పగా రాక్షసమాతయైన దితి, మిగుల శోకించి దేవతలకు శాపమిచ్చుటకు సిద్ధపడగా కశ్యపుడు ఆమె చెయ్యి బట్టుకొని వారి వలన నేరము లేదనియు రాక్షసులే ముందు యుద్ధమునకు సిద్ధపడి రనియు చెప్పి ఆమెను వారించెను. మరియు తన గర్భమున ఇద్దరు కుమాళ్ళు త్వరలో కలుగుదురనియు వారిని మూడులోకములలో ఎవరును జయింపలేరనియు వారు త్రిమూర్తులకుకూడ అజేయులగుదురనియు చెప్పెను. అందు కామె సంతోషించెను. అది మొదలు సురాసురులకు విరోధము కలిగెను. శ్రీహరి అసురులకు విరోధిగానుండి వారిని సంహరించుచు సురల పక్షమున నుండుటచే దైత్యారి యని పేరు పొందెను.

కూర్మపురాణము సమాప్తము



# అష్టాదశ పురాణ సారసంగ్రహము
# వరాహపురాణము.

---

## సూర్యవంశము.

సూర్యునికి సంజ్ఞ, పద్మిని, ప్రభ, ఛాయ అని నలుగురు భార్యలు. సంజ్ఞకు వారిలో వైవస్వతమనువు పుట్టెను. పద్మిని గర్భమందు రేవతుడు, యముడు అను ఇద్దరుకొడుకులును, యమియను కన్యక యు పుట్టిరి. ఛాయకు సావర్ణిమనువు, తపతి, విష్టి అను ఇరువురు కన్యకలు పుట్టిరి. తరువాత శనైశ్చరుడు పుట్టెను. ప్రభయనుభార్యకు ప్రభాతుడు పుట్టెను. వీరిలో వైవస్వతమనువుకు తొమ్మండ్రు కుమారులు కలిగిరి. వారిలో జ్యేష్ఠుడు ఇక్ష్వాకుడు. ఇతనికి పదిహేనుగురు పుత్రులు. వారిలో మొదటి వాడు వికుక్షి. ఇతనికే కాకుత్స్థుడనిపేరు. వీనికుమారుడు పృథుచక్రవర్తి. వీనికివిశ్వకుడు, వీనికి ఆర్ద్రకుడు, వీనికియువనాశ్వుడు పుట్టిరి. ఇతడు కుమారుడు కలుగుటకొరకు తపస్సు చేయుటకై గోకర్ణతీర్థమునకు వెళ్లగా అచ్చట గౌతమమహర్షి తపస్సు చేయుచుండెను. ఆయనకు ప్రదక్షిణ నమస్కారములు చేసి, నాకెట్లు పుత్రులు గలుగుదురని అడుగగా "శ్రీమన్నారాయణుని సేవించిన ధర్మాత్ముడైన కొడుకుపుట్టును" అనెను. అట్లు చేయగా ఒకపుత్రుడు కలిగెను. వానికి శ్రవంతుడని పేరు. ఇతను శ్రమంతియను పేరుగల గొప్ప పట్టణము కట్టెను. వానికి

బృహదశ్వుడును, వీనికి కువలయాశ్వుడును పుట్టిరి. ఈయన దుంధుఅను పేరుగల రాక్షసుని చంపుటచేత దుంధుమారుడను పేరు సార్థకమయ్యెను. కువలయాశ్వునికి ముగ్గురు కొడుకులు వారిలో పెద్దవాడగు బృహదశ్వుడు రాజయ్యెను. వానికి ప్రమోదుడు, ఇతనికి హర్యశ్వుడు, వీనికి నికుంభుడు, వీనికి సంహితాశ్వుడు, వీనికి కుశాశ్వుడు, అరుణాశ్వుడు పుట్టిరి. వీరిలో రెండవవానికి యువనాశ్వుడు కలిగెను. ఇతడు ఇంద్రునితో సమానమైన పరాక్రమవంతుడై వారుణ యజ్ఞముచేసి, మాంధాతయను మిక్కిలి విష్ణుభక్తిగల కుమారుని కనెను. మాంధాతకు కుమారులు ముగ్గురిలో పెద్దవాడగు అంబరీషుడు రాజయ్యెను. వానికి యువనాశ్వుడు అతనికి హారితుడు, అతనికి పురుకుత్సుడు, అతనికి అసమంద్యుడు, అతనికి సంభూతి, అతనికొడుకు విష్ణువర్ధనుడు, అతనికి అనరణ్యుడు, అతనికి బృహదశ్వుడు, అతనికి హర్యశ్వుడు జన్మించిరి. అతడు కర్దముడను ఋషిప్రసాదము వలన సూర్యునితో సమమైన వసుమనస్సు అను పుత్రుని కనెను.

## వసుమనస్సు చరిత్రము.

వసుమనస్సుచక్రవర్తి సూర్యుని పూజించి వానివరము వలన త్రిధన్వుడను కుమారుని గనెను. దానశీలుడు మానశూరుడైన వసుమనస్సు దిగ్విజయముచేసి సమస్తరాజులను జయించి అశ్వమేధయాగము చేసెను. అందుకు ఎల్ల ఋషులను మునులను పిలిపించెను. అన్నము, ఉదకము ఇచ్చుటకు అనేక సత్ర

ములు పెట్టించెను. యజ్ఞము సమాప్తిచేసిన తరువాత ఒక సభ చేసి అందున్న మునులను, ఋషులను చూచి వారితో ఇట్లనెను. "ఓ మహామునిశ్రేష్ఠులారా ! మీరందరు మహాజ్ఞానులు. మీకు విశేషము గాని సంగతులుండవు. కాబట్టి నేనొక్క ప్రశ్న చేసె దను. నన్ను క్షమించి నాయందు కరుణించి నా సందేహము తీర్పుము. అది యేమనగా యజ్ఞము, తపస్సు, సన్యాసము, ఈ మూడింటిలో ప్రధానమైనది యేదో సెలవిండు. ఆమాటలు విని భవానిని కలయచూచి వసిష్ఠమహాఋషి లేచి యిట్లు చెప్పెను. "ఓ రాజా ! వినుము. నాలుగు వేదములు చదివి వివాహమై సంసారమునందు ప్రవేశించి కుమారుని గని యజ్ఞయాగములు చేసి వనవాసివై తపస్సుచేసి యోగమార్గమున శరీరము విడచి వైకుంఠమును పొందవలెను.

పులస్త్యమహాముని యిట్లనెను. "ఓ రాజా ! యజ్ఞ యాగములందు దేవతల నారాధించి మహాయోగివై తపస్సు చేసి శ్రీహరిని తృప్తిపరచి సంసారమును విడచి సన్యాసివి కావలెను."

పులస్త్యమహాముని ఇట్లుపలికెను "ఓ రాజా వినుము. ఘోరతపస్సు వలన పురాణపురుషోత్తముడైన శ్రీహరిని తృప్తి పరచిన ముక్తిపొందుదువు. ఈ సంసారములో మరల పుట్టవు ?

జమదగ్ని మహాముని యిట్లనెను. "ఓహో రాజా ! సర్వాంతర్యామియు సర్వేశ్వరుడునైన జగదీశ్వరుని యోగ మార్గమున దర్శించుటకన్న అధిక మేమున్నది.

విశ్వామిత్రుడు ఇట్లనెను. "రాజా! వినుము. అనంత మహిమ, అనంతశక్తి గలిగి అగ్నిస్వరూపుడగు శ్రీమహా రుద్రుని మంత్రము జపించి యోగాసనమున మూలకమలమును స్థాపించి తపస్సు చేసిన చతుర్వర్గములు అనగా ధర్మ, అర్థ, కామ, మోక్షములు కలుగును. యజ్ఞములు, యాగములు, దేవ పూజలు ఎందుకు?

భరద్వాజమహాముని యిట్లనెను. "ఓ మహారాజా! శ్రీ వాసు దేవుని పాదపద్మములయందు భక్తి యుంచవలెను. యజ్ఞము యాగము, తపస్సులు ఏమిచేయుచున్నను, శ్రీహరి పాదపద్మములనే ధ్యానించుచుండవలెను. అంతకంటె శ్రీభగవద్భక్తి ఏమియు లేదు.

అత్రిమహాముని యిట్లు చెప్పెను. "ఓ నగేశ్వరా! వినుము. ఈ జగత్తును సృష్టించునట్టియు, బ్రహ్మను సృష్టించినట్టియు, ఆసర్వేశ్వరుని ఘోరమైన తపస్సువలన ఆరాధింపుము. ఇంతకంటె మేలు చేయునది వేరలేదు."

గౌతమమహాఋషి యిట్లనెను. "ఓ మహీపాలా! వినుము. ఆదిమధ్యాంతరహితుడగు ఆది విరాట్టు పూజకంటె అధికమేమియు న్నది. ఆయనయే జగత్తులకు కర్త!

కశ్యప బ్రహ్మ ఇట్లు చెప్పెను. "ఓ మహారాజా! దేవ దేవ మహాదేవుడును, దేవాది దేవుడునైన శంభుని సేవించిన సర్వము లభించును."

క్రతుఋషి యిట్లు పలికెను. "ఓ నరాధిపా! వినుము. వేదములు చదివి, యజ్ఞములు చేసి, కుమారుని కని, తపస్సు చేత కులమును పవిత్రముచేసి, యోగమార్గమున శరీరమును విడచి, వైకుంఠము చేరవలెను అని వేదములలోను, పురాణములలోను చెప్పబడినది.

ఆచక్రవర్తి అందరు చెప్పినదివిని వారిని సత్కరించిన పిమ్మట తన కుమారుని పిలిచి రాజ్యభారము వాని కొప్పగించి ధర్మముగా పాలించుమనిచెప్పి, ఈషణత్రయములువిడచి హిమాలయ పార్శ్వమున నున్న దేవదారువనమున ప్రవేశించి, దుంపలు, ఫలములు తినుచు పంచేంద్రియములను నిగ్రహించి, గాయత్రి జపించుచు నూరు సంవత్సరములు కాగా బ్రహ్మప్రత్యక్షమై వరమడుగుమనెను. అప్పుడు ఆ రాజు సమాధి చాలించి లేచి, ప్రదక్షిణ నమస్కారములు చేసి యిట్లనెను. "గాయత్రిని జపించుటకు నాకు మరి నూరు సంవత్సరములు ఆయువునిమ్ము" అనియడుగ అట్లే ఇచ్చితినని బ్రహ్మ అంతర్ధానమయ్యెను. ఆ రాజుమరి నూరు సంవత్సరములు తపస్సు చేయగా అర్ధనారీశ్వరుడు దర్శనమిచ్చెను. వానిని ప్రార్థించి మరి నూరు సంవత్సరములు గాయత్రి జపించుటకు ఆయువు వృద్ధిచేయుమని కోరగా అట్లే ఇచ్చితి నని ఆయన వెడలెను. పిమ్మట మరి నూరుసంవత్సరములు గాయత్రీ మంత్రజపము చేయగా లక్ష్మీయుక్తుడై శ్రీ మహావిష్ణువు అంతరాళమున నుండి యిట్లు

నెను. "ఓ వత్సా! వర మడుగుము. నీ తపమునకు మెచ్చితిని" మీ రెవరో నాకు తెలియదు. మీరు నాకు కనబడలేదు. అట్టి మీరు నాకెట్లు వరమిచ్చెదరు" అనగా శ్రీహరి యిట్లనెను. "ఓ వత్సా నాస్వరూప మెట్లు నీకు కనబడును? యోగులకే అగోచరము. నీకు మరి ఆయువు లేదు. శివుడు నీకిచ్చిన నూరుసంవత్సరములు ముగిసెను." అనగా వారికిట్లు సంవాదము జరిగెను.

రాజ:—ఆయువు లేకున్న యముడు నన్ను ఎట్లు ప్రతికంపియున్నాడు?

శ్రీహరి:—నీయందు ధర్మబుద్ధి యున్నది. ధర్మముగల ప్రాణులను యముడు హింసింపడు.

రాజు:—ధర్మముగల ప్రాణులు చనిపోయిన పిమ్మట యెక్కడికి పోవుదురు?

శ్రీహరి:—యజ్ఞములు, యాగములు చేసినవారు స్వర్గమున దేవతలతో నుందురు. బ్రహ్మజ్ఞానము కలిగి తపస్సు చేసినవారు బ్రాహ్మణులై బ్రహ్మలోకమునుపొందుదురు. యోగమును సాధించినవారైన కైలాసమునకు పోవుదురు.

రాజు:—తిరుగ భూమియందు జన్మింపనివా రెట్టివారు?

శ్రీహరి:—నాభక్తులైన బ్రహ్మజ్ఞానులు తిరిగి జన్మింపక ముక్తి నొందుదురు.

రాజు:—భక్తుల లక్షణములు ఎట్టివి? జనులు పరబ్రహ్మనెట్లు చూడగలరు?

శ్రీహరి:—ఏకాక్షరమంత్రమును జపించువారు నారూపముచూడగలరు. చూచినవారికి చావుపుట్టుకలుండవు. భక్తుల లక్షణములు వినుము. నా భక్తులు నా పేరు వినువరు. రాగము ద్వేషము వారి కుండవు. వారిని నేను విడచియుండను. వారికొరకే చక్రమును పట్టియుందును.

రాజు:—నేను ఇప్పుడు ఏమి చేయుగలను ? బ్రహ్మజ్ఞానము సాధించుటకు నాకు మరి ఆయువులేదుగదా ? మీరు ఇంతకష్టపడి నాయొద్దకు ఏలవచ్చితిరి ? ఎక్కడనుండి వచ్చితిరో అచ్చటికి వెళ్ళుడు.

శ్రీహరి:—ఓరాజా ! వినుము. నీకు దివ్యజ్ఞానమును ఇచ్చుచున్నాను. బ్రహ్మజ్ఞానమును సాధింపుము. మరియొక సంవత్సరము నీకు ఆయువుఇచ్చుచున్నాను. జ్ఞానముకలిగిననీవునా రూపమునునీయందేచూడగలవు. ఏకాక్షర మంత్రము నీ కుపదేశించెదను. దానినిహృదయమందు జపించుము. నేనుపోయెదను. పిమ్మట ఆరాజు ఆ మంత్రమును ఆరు చక్రములయందు జపించి త్రిగుణములనునశింపజేసిశంఖు, చక్ర, గదాపద్మములు చేతులందును, వక్షమునందు లక్ష్మియుకౌస్తుభమణియుగల పరబ్రహ్మనుదర్శించి, తన తేజమును వాని తేజస్సులోకలిపి, జననమరణములను జయించు ముక్తి పొందెనట. గాయత్రి మంత్రప్రభావము ఎట్టిదో చూచితిరా ? వసుమనప్పు కుమారుడైన శ్రీధన్యుడు ధర్మముగా పరిపాలించుచు తన ప్రజలు ధర్మము తప్పకుండ సంచరించు

నట్లు చేయుచుండెను. వాని కొడుకు పేరు త్రయ్యారుణుడు. వానికొడుకు సత్యవ్రతుడు. సత్యవ్రతుని కొడుకు హరిశ్చంద్రుడు. ఇతడే భార్యను విక్రయించి యజ్ఞదక్షిణకొరకు ధనము విశ్వామిత్రుని కచ్చినవాడు. ఇతని కుమారుడు లోహితాస్యుడు. వీని కుమారుడు దుంధువు. వీని కొడుకు విజయుడు. వీనికి కారుకుడు, వీనికి వృకుడు, వీనికి బాహువు, బాహువునకు సగరుడు పుట్టెరి. ఈసగరునికి ప్రభ, భానుమతియనియిద్దరు భార్యలు. అతడు అగ్నిదేవు నారాధించి ప్రభయందు అరువది వేలమంది కుమాళ్ళను భానుమతియందు అసమంజుడను ఒక కుమారుని కనెను. అసమంజునికి అంశుమంతుడను వీరుడు పుట్టెను. వానికి దిలీప చక్రవర్తి కుమారుడయ్యెను. దిలీపునికి భగీరథుడు పుట్టి గంగానదిని భూలోకమునకు తెచ్చెను. భగీరథునికి శ్రుతుడు అతనికి నాభాగుడు, అతనికి సింధుద్వీపుడు, అతనికి అయుతాయువు, అతనికి ఋతుపర్ణుడు, అతనికి సుదాసుడుఅను మిగుల ధర్మాత్ముడైన చక్రవర్తి పుట్టెను. అతనికి కల్మాషపాదుడు, అతనికి అశ్మకుడు పుట్టెను. అతని భార్యఅయిన ఉత్కళయందు మూలకుడుపుట్టి పరశురాముని భయమువలన ఆడు వేషములో అడవికి పారిపోయెను. అందుచేత అతనికి నారీకవచుడని పేరు వచ్చెను. వానికి శతరథుడు, అతనికిఇలబిలుడు, వానికిబృహద్వర్మ వానికివిశ్వసహుడు, అతనికి ఖట్వాంగుడు, అతనికి దీర్ఘబాహుడు అతనికి రఘుమహారాజు, అతనికి అజమహారాజు, అతనికి దశరథ మహారాజు పుట్టెరి.

## దశరథమహారాజు సంతతి.

దశరథునకు కౌసల్య, కైక, సుమిత్రలను ముగ్గురుభార్యలు. అందు కౌసల్యకు శ్రీరాములు, కైకకు భరతుఁడు, సుమిత్రకు లక్ష్మణ, శత్రుఘ్నులు పుట్టిరి. ఇందు రామునికి లవ, కుశలను ఇద్దరు కొడుకులు. కుశునకు అతిథి, వానికినిషధుడు, నిషధునకు నలుఁడను చక్రవర్తి, అతనికి నభుఁడు, అతనికి పుండరీకాక్షుఁడు వీనికి క్షేమధన్వుడు వానికి దేవానకుడు వానికి అహీనగుడు వానికి మహాస్వానుడు వానికి చంద్రావలోకుడు వానికి తారాపీతుడు వానికి చంద్రగిరి వానికి భానువిత్తుఁడు వానికి శ్రుతాయువు పుట్టిరి. వీరందరికి ఇక్ష్వాకువంశజులని పేరు.

## జయధ్వజుని చరిత్రము.

వైవస్వత మనువు కుమార్తెయైన ఇళావతి కుమారుడు పురూరవుడు. ఇతను గొప్పచక్రవర్తియై భూలోకమున నెవరికిని భయపడువాడు కాడు. అతడు అప్సరసయైన ఊర్వశివలన ఆర్గురు కొడుకులను కనెను. వారిలో మొదటివాడు ఆయువు. అతడు రాహువు కూతురును పెండ్లాడి అయిదుగురు పుత్రులను గనెను. పెద్దవాని పేరు నహుషుడు. వానికొడుకు యయాతి. అతడు శుక్రాచార్యుని కుమార్తెయైన దేవయానను, వృషపర్వుడను రాక్షసుని కుమార్తె శర్మిష్ఠను పెండ్లాడి వారియందు నలుగురు కుమాళ్లనుకని వారికి తనరాజ్యమును పంచియిచ్చెను. వారిలో యదువు కుమారుడు సహస్రజిత్తు. వానికి శత్రుజిత్తు, అతనికి

హైహయుడను పుట్టి ప్రజలను బాగుగా పాలించుచుండెను. అతనికి వేణుహయుడు పుట్టి పెద్దవాడైన తరువాత కుమారునికి రాజ్యమిచ్చి, తాను యోగమార్గమున శరీరమును విడచి ముక్తి నొందెను.

ఈ హైహయుని వంశమున పుట్టినవాడు కృతవీర్యుడు. అతనికుమారుడు కార్తవీర్యార్జునుడు. అతడు పదునెనిమిది ద్వీపములు ఏలిన గొప్ప చక్రవర్తి. అతనితో సమానమైన వారు మూడు లోకములందు నెవరును లేరట. అతనిని పరశురాముడు యుద్ధమున చంపెను. ఈ కార్తవీర్యార్జునునికి సూరధ్వజుడు, సూరశేనుడు, శూరకృష్ణుడు, ధృష్టి, జయధ్వజుడు అను అయిదుగురు కొడుకులు. వీరు తండ్రితో సమానమైన బలము, చక్కదనము, గుణములు శస్త్రవిద్య యందలి నేర్పు గలవారై, మహారథులు, మహావీరులని పేరు పొందిరి. తమ తండ్రి పాలించుచుండిన పట్టణమైన మహిష్మతీపురమునకు పెద్దవాడు రాజయ్యెను. తక్కిన నలుగురును అన్న సెలవు ప్రకారము వర్తించుచుండువారు. వీరిలో పెద్దవారు నలుగురు ఈశ్వరుని ఆరాధించి వాని వరమువలన గొప్పబలపరాక్రమములు గలవారైరి. చిన్నవాడైన జయధ్వజుడు ఈశ్వరుని సేవింపక విష్ణుభక్తుడై యుండెను. అది చూచి అన్నలు నలుగురు ఇట్లనిరి. "మన తండ్రితాతలు ఈశ్వర భక్తులై ఆయన వరము వలన బలపరాక్రమములు కలిగి గొప్ప కార్యములు చేసిరి. నీవు

శివుని విడచి విష్ణుభక్తుడవగుటకు కారణమేమి ? ధర్మమార్గము విడచి అధర్మమున ఏలవర్తించెదవు" అనగా "అన్నలారా ! వినుండు. ఈజగత్తులకు కర్తయైన శ్రీజగన్నాధుడు వానిని సృష్టించుటకు తన రజోరూపముచేత బ్రహ్మయు, దానిని పాలించుటకు తన సత్వగుణముచేత విష్ణువును, దానిని సంహారించుటకు తన తమో గుణముచేత శివుడును, ఇట్లు మూడు రూపములు పొందెను. జగత్తులను పాలించువాడు విష్ణువు ఆయన యంశచేతనే పుట్టినవారగుటచేత రాజులకు భూమిని పాలించు సమర్థత కలిగినది.

కాబట్టి రాజులు విష్ణువునే ఆరాధింపవలెను. ఆమాటలు విని వారిట్లనిరి. "ఓ తమ్ముడా! వినుము. ఈజగత్తు అంతయు శివమయము. అతడే కల్పాంతమున అంతయు నశింపజేయును. అతనిని సేవించువారికి ఏదికోరిన అది ఇచ్చును. మోక్షమును కోరువారికి తప్పక మోక్షమిచ్చును. ఆయన మాయ ఎవరికిని తెలియదు. కనుకనే నరులందరును ఎల్లప్పుడు అతనిని సేవించెదరు." వారి మాటలు విని జయధ్వజుడు ఇట్లు చెప్పెను. "అన్నలారా ! ఎందుకు ఇట్లు చెప్పెదరు ? జగత్తులకు అధికారి శ్రీవనమాలి. అతడే మోక్షదాతయని యందురు. వేద, శాస్త్ర, పురాణములందు రామ, గోవింద, శ్రీకృష్ణ, శ్రీహరి, మురారీ, ఈ సంసారసముద్రమును తరింపజేయుమని ప్రార్థించుట కానంబడుచున్నది. దేవతలు శ్రీహరిని భజించి చావులేనివారైరి.

రాక్షసులు శివుని సేవించి యముని యింటికి పోవుచున్నారు హరిభక్తులు మోక్షమును పొందుదురు. శివభక్తులు భూమి యందు పుట్టుచున్నారు."

ఈ మాటలు విని అతని అన్నలు ఇట్లనిరి. "తమ్ముడా! మహాఋషులు చెప్పినది వింటివా! తన కులధర్మమే తనకు మోక్ష కారణమనిరి. మన తండ్రియైన కార్తవీర్యార్జునుడు ఏ మార్గమున నడచెనో అదే మనస్వధర్మము. ఆమార్గము విడచి వేరుమార్గమున ఏల నడచెదవు. ఆ శివుని సేవించియేగదా మన తండ్రి పదునెనిమిది ద్వీపములను జయించెను. మహావీరుడైన రావణుని బంధించెను. ఇరువది యొక్కమారు పరశురాముని ఓడించెను." అది విని తమ్ముడిట్లు చెప్పెను. "మన తండ్రిని పరశురాములు శివుని వరము వలన చంపలేక విష్ణుని సేవించి ఆయన విల్లును పొంది దానితో చంపెను. కనుక నే వైకుంఠము పొందెను."

## మునుల సభ.

ఇట్లు వాదించినతరువాత మునులను ఋషులను పిలిపించి సభచేసి యీ సంగతి స్థిరపరుపుమని పెద్దవాడును రాజును అయిన సూరసేనుడు అడిగెను. అప్పుడా రాజు దూతలను పంపి పిలిపించగా వసిష్ఠుడు, మార్కండేయులు, పరాశరుడు, కశ్యపుడు, శక్తి, అగస్త్యుడు, గౌతముడు, దేవలుడు, క్రతువు, వ్యాసుడు, మొదలగువారు తమ ముఖ్య శిష్యులతో సభకు

వచ్చిరి. వారికి అర్ఘ్య పాద్యము లిచ్చి పూజించి రాజు వారితో ఇట్లనెను. "ఓ మహాత్ములారా! మీరు పండితులు. బ్రహ్మతో సమానులు. మా విచారమును తీర్పుడు. మేము ముప్పురము శివుని సేవించుట మంచిదని అందుము. మా తమ్ముడు జయ ధ్వజుడు శ్రీహరి సేవయే ముఖ్యమనియు ఇతరులను పూజించుట వలన ఫలము లేదనియు వాదించుచున్నాడు. మీరు నిశ్చ యించుడు."

అందుపైని సభ వారందరు కొంతసేపు ఆలోచించుకొని తుదకు వారిలో వసిష్ఠుడు ఇట్లు చెప్పెను. "ఓ రాజా! వినుము. బ్రహ్మ వాక్యము ఎవరు తప్పింపగలరు? రాజులకు విష్ణువు; బ్రాహ్మణులకు ఇంద్రుడు, బ్రహ్మ, రుద్రుడు, సూర్యుడు, అగ్ని; దేవతలకు శ్రీమన్నారాయణుడు; దానవులకు మహా దేవుడు; యక్ష గంధర్వులకు చంద్రుడు; విద్యాధరులకు సరస్వతి; సిద్ధులకు శ్రీహరి; కిన్నరులకు పార్వతి; ఋషులకు బ్రహ్మ- ఈశ్వరుడు; స్త్రీలకు ఉమాదేవి; గృహస్థులకు సూర్యు డు- విష్ణువు- శివుడు; బ్రహ్మచారులకు బ్రహ్మ; సన్యాసులకు సూర్యుడు; యతులకు మహేశ్వరుడు; భూతములకు రుద్రుడు; కూష్మాండ గణములకు వినాయకుడు; అందరికిని గణ పతి యిష్టదేవత. ఎవరి మనస్సు ఎవరిని ప్రేమించునో వారికి వారే యిష్టదేవతగా ఎంచవలెను. మనస్సే మూలము. అందరి కంటె శ్రీమన్నారాయణుడు శ్రేష్ఠుడు."

వారు సెలవిచ్చిన సంగతులు విని, వారిని తగిన మర్యాదలు చేసిరి. వారును చాల సంతోషించి వారి నిజ నివాసములకు వెళ్ళిరి. పిమ్మట సోదరులు నలుగురును కైలాసమునకు వెళ్ళి శివుని సేవించి వరములు పొంది, మహా బల పరాక్రమములు కలవారై నలుదిక్కులను జయించి నలుగురును రాజులై భూమిని బాగుగా పాలించిరి.

జయధ్వజుడు నిత్యమును శ్రీహరియందు భక్తిగలవాడై శ్రీహరి ప్రతిమను షోడశోపచారములచే పూజించి ధ్యానించి జపించు చుండెను. ఇట్లుండ శ్రీహరి భక్తపరాయణుండు గావున కరుణించి గరుడ వాహనా రూఢుండై అతనికి దర్శనమిచ్చెను. అప్పుడతడు ప్రదక్షిణ నమస్కారములు చేసి పలు విధముల స్తోత్రములు చేసి చేతులు జోడించి యిట్లనెను. "మహాప్రభూ ! జన్మజన్మాంతరముల యందును నీదాసుడుగా ననుగ్రహింపుము" అనగా శ్రీహరి యిట్లనియెను. "ఓభక్త శిఖామణీ ! ఈ జన్మమందు కొంతకాలము సుఖించి, తిరిగి గొప్ప చక్రవర్తివై పుట్టి మరలప్రజలచే పూజింపబడుచు ఇట్లే ఏడు జన్మములెత్తి తుదకు మోక్షము పొందుదువు. ఈజన్మయందులక్ష్మి నీయింటనుండును. వీరుడ వని ప్రఖ్యాతి పొందుదువు. దేవదానవులైనను నిన్ను జయింపలేరు. ముల్లోకములు నిముసములో తిరుగగలవు. నీకు అడ్డులేదు. నీశరీరము వజ్రముకంటెకఠినమగును. ఏయస్త్రములు నీకు నాటవు" అని కవచము ఒకటి యిచ్చి శ్రీహరి వెడలెను.

## పరశురామునితో యుద్ధము చేసి శూరసేనుడు మొదలగువారు ఓడుట.

శూరసేనుడు మొదలగు నలుగురు అన్నదమ్ములు, ఒక నాడు సభచేసి తమ క్రింది సామంతరాజులను పిలిపించి వారితో ఇట్లు చెప్పిరి. "ఓసభాసదులారా! మా తండ్రి కార్తవీర్యార్జున మహారాజువంటి ధర్మాత్ములు లేరు. ఆయన బలమునందు మేరువుతోను, అస్త్రవిద్యయందు విష్ణువుతోను, ధనమునందు కుబేరునితోను, పరోపకారము చేయుటయందు చెట్టుతోను, శత్రువులయెడల యమునితోను, ప్రతాపమునందు సూర్యునితోను, దానము చేయుట యందు శిబి చక్రవర్తితోను, యజ్ఞములు చేయుటయందు బలిచక్రవర్తితోను, దోషములను క్షమించుట యందు భూమితోను, పాండిత్యమునందు బృహస్పతితోను, నీతిశాస్త్రమందు శుక్రునితోను, మాయను తెలిసికొనుటయందు మాయదైత్యునితోను, బుద్ధియందు బ్రహ్మతోను, సమానుడై యుండెను. అట్టివానిని పరశురాముడను ఒక బ్రాహ్మణుడు చంపెను. కాలము ప్రతికూలమైనప్పుడు విపరీతములు జరుగుచుండునుగదా!" ఈ మాటలు విని మగధ దేశపురాజైన బృహద్ధ్వజుడు ఇట్లనెను. "మీ తండ్రిగారు అడవికి వేటకు వెళ్ళి గొప్ప సర్పముచే తరిమి తన వెంట వచ్చిన రాణువను, తానును బహు శ్రమపడి ఆరాత్రి భోజనము లేక మరు నాడు జమదగ్ని మహాముని ఆశ్రమమునకు వెళ్ళగా ఆయన బహు

మర్యాదచేసి విందుచేయగా సంతోషించి ఆతని కామధేనువును అడుగగా ఇయ్యనందున బలవంతముగా తీసికొని పోవుటకు ప్రయత్నించెను. అప్పుడా తపసితో యుద్ధము చేసి అతనిని చంపెను. ఆపగ సాధించుటకు ఆయన కుమారుడైన పరశురాముడు మీ తండ్రిని చంపెను. ఇందు తప్పేమున్నది?"

ఆమాటలు విని శూరసేనుడు ఇట్లు ప్రత్యుత్తరము చెప్పెను. రాజ్యములో ప్రజలవద్దనుంచి గోవునుగాని, స్త్రీనిగాని రత్నమునుగాని, బలవంతముగానైన తీసికొనుట రాజనీతియేగదా. అందువలన అతనికి దోషము లేదు. ఈ పరశురాముడు మా తండ్రినే గాక ప్రపంచములోని రాజుల నందరిని ఇరువదియొక్క మారు వెదకి వెదకి చంపెను. గర్భిణీ స్త్రీలను వారి కడుపులోని పిల్లలను కూడ చంపెను. కావున ఆ బ్రాహ్మణుడు మన రాచకులమునకే వైరి. తండ్రియొక్క శత్రువును సాధింపని కొడుకు లుండి పనియేమి? కనుక నేను అతనితో యుద్ధమునకు పోవుటకు సిద్ధముగానున్నాను. మీరందరునాకు సహాయులు కావలెను. అని చెప్పగా రాజులందరునువిని మనమందరము కలియక పోవుట చేతనే అతడు అందరిని ప్రత్యేకముగా వధింపగలిగెను. ఇప్పుడు మన మందరమును కలిసి యుద్ధముచేసి అతనిని చంపుదము. అని అందరును తమ తమ సైన్యముల ప్రోగు జేసి ఆయనతో ఘోర యుద్ధము చేసినను లాభము లేనందున బ్రహ్మాస్త్రము ప్రయోగింపగా తిరిగిపరశురాములు బ్రహ్మాస్త్రము వేసెను. ఆ రెండు

అస్త్రములును అంతరాళమున యుద్ధము చేయు చుండగా బ్రహ్మ చూచి మహా ప్రళయము సంభవించు నని తలంచి అచ్చటికి వచ్చి వారి వారి కోపమును చల్లార్చి విడిపించి బ్రహ్మ తన నివాసమునకు పోయెను. పిమ్మట శూరసేనాదులు కఠినయుద్ధము చేసిరి గాని పరశురామునిచే మూర్ఛితులైరి. అప్పుడు వారి పక్షమున మిగిలిన రాజులు జయధ్వజుని శరణు కొనిరి. అతడు యుద్ధమునకు సిద్ధపడెను.

జయధ్వజుడు పరశురాముని ఓడించుట.

జయధ్వజుడు తన రథమును పరశురాముని యెదుటికి తీసికొని పొమ్మని తన సారథితో చెప్పి గజవ్యూహము పన్ని శత్రువులు అందు ప్రవేశించుటకు వీలులేకుండ చేసెను. అది చూచి పరశువు చేబట్టి రాముడు యుద్ధమునకు సిద్ధపడెను. ఘోరముగా యుద్ధము జరిగెను. రక్తము ఏరులుగా ప్రవహించెను. దానిని త్రాగుటకు భూతములు సంతోషించెను. అప్పుడు జయధ్వజుడు పరశురామునితో తలపడి ఒకరి నొకరు నిందించుకొనుచు వాదించిరి. అప్పుడు జయధ్వజుని చంపుటకు పరశురాముడును పరశురాముని జంపుటకు జయధ్వజుడును పందెములు వేసిరి. పరశురాముడు దేవిని ప్రార్థించి శక్తిని, జయధ్వజుడు విష్ణుప్రసాదము వలన చక్రమును పొందెను. త్రిమూర్తులు దేవతలు తమ విమానములపై అంతరిక్షమున నుండి చూచు చుండిరి. జయధ్వజుడు చక్రమును, పరశురాముడు

శక్తిని ఒండొరులపై బ్రయోగించిరి. చక్రము శక్తిని ముక్కలుగా దునిమెను. దేవతలు రాజును మెచ్చిరి. జయధ్వజుడు పాశు పతాస్త్రము వేసి అగ్ని చేతులు కాళ్లు కట్టివేసెను. అప్పుడు జయధ్వజుడు రథము దిగ్గి పరశురాముని యత్తి తీసికొనిపోయి తన రథముమీఁద నుంచుకొని జయభేరిని మ్రోగించుచుపోవుచుం డుట పైనున్న భృగుమహాముని చూచి రథము మీఁదికి రాగా రాజు అతనిని పూజించి నమస్కరించి యేల విచ్చేసితి రని యడు గగా, ఆయిన యిట్లు చెప్పెను. "రాజా వీనిని విడువుము. ఇతడే నా మనుమడు. జగదేకవీరుడు. విష్ణువు అవతారమై పుట్టి దుష్టసంహారము చేసెను. నీకు తప్ప వీనిని కట్టుటకు మరి సమర్థులెవరు ? నీవు పరమభక్తుడవు గనుక ఇతనిని కట్టగలిగితివి. కట్లు విప్పి విడిచి పెట్టుము." అనగా రాజు ఇట్లనెను "నాతో యుద్ధమందు ఓడిన అస్త్రములను విడచి బ్రా హ్మణవృత్తి అవలంబించెద నని పందెము వేసెను. అట్లు ము నివృత్తి ని బ్రతు కు మ ను ము" అ న గా భృ గు మహర్షి యిట్లనెను. "నీవు వాని మదము అణచితివి. నేటినుండి తపస్సు చేసికొనును" అన విని జయధ్వజుడు లేచి పరశురా మునికి ప్రదక్షిణ నమస్కారములు చేసి పాదములకు పూజించి క్షమింపు డని వేడెను. పరశురాముడు సంతోషించి తపోవనము నకు పోయెను. రాజు లందరును తమ ఇండ్లకు పోయిరి. శూర సేనుని సోదరులు తమ తమ రాజ్యములకు పోయిరి. ఇట్లు జయధ్వజుడు రాజాధిరాజయ్యెను.

## విదేహ దైత్యుని తపస్సు దిగ్విజయము.

కశ్యపునికి **దుంధు** అను రాక్షసుడు పుట్టి గొప్ప బలవంతుడు కాగా శ్రీహరి త్రివిక్రముడై వానిని చంపెను. వీని కుమారుడు దంభుడు వీనికి కుంభుడు, వీనికి జంభుడు, పుట్టెను. ఇంద్రుడు వానిని చంపి జంభభేది యను పేరు పొందెను. వీని కొడుకు విజృంభుడు. వీనికి కుజృంభుడు పుట్టెను. వీనికి ఇంద్రుడు భయపడు చుండెను. వీనికి కుదేహుడును, కుదేహునకు విదేహుడును పుట్టి శోభావతీ పట్టణమును పాలించు చుండెను. వీని యొద్ద శుక్రాచార్యుని వంటి బుద్ధిబలము గల సుబుద్ధి యను మంత్రి యుండెను. ఒకనాడు ఈ విదేహుడు తన మంత్రితో గూడ విహరించుచు నందనవనమునకు వెళ్ళెను. అచ్చట ఇంద్రుడు సభచేసి అప్సరసల నాట్యము చూచుచుండెను. ఇంద్రుని చంపి వాని సంపద తీసికొందమని రాక్షసుడనగా వానిమంత్రి యిట్లనెను. "రాజేంద్రా! ఇంద్రుడు సామాన్యుడు కాడు. ఇతడు మీ ముత్తాతయైన జంభాసురుని చంపెను. ఇతనిని మీరు జయింప తలంపు గలదేని బ్రహ్మను గురించి తపస్సు చేసి వరములు పొందవలెను.

ఆ మాటలు విని తన రాజ్యము మంత్రికి ఒప్పగించి హిమాలయ పర్వత ప్రాంతమున గంగాతీరమునకు పోయి చాల కాలము గొప్ప తపస్సు చేయగా బ్రహ్మ ప్రత్యక్షమై వరముడుగుమనెను. అప్పు డతడు ముల్లోకములకు తాను రాజు కావలె

ననియు తన శరీరము వజ్రమువలె కఠినమై త్రిమూర్తుల ఆయుధములు గాని ఇంద్రుని వజ్రాయుధము గాని నాటకుండ వలయు ననియు ఎవరిచేతను గాని, అగ్ని, జలములందు గాని చావు లేకుండ వరము వేడెను. బ్రహ్మ ఆ వరము లన్నియు నిచ్చి తిరిగి పోవుచుండగ ఇంద్రుడు వానికి కనబడి యెందుండి వచ్చుచున్నా రని అడుగగా నిదేహరాక్షసునికి మరణము లేకుండ వరము నిచ్చి వచ్చుచున్నా నని చెప్పెను. అది విని భయపడి ఎంత పని చేసితివి! వాడు ఇక నన్ను బ్రతుకనియ్యడు కదా” అని చెప్పగా ఆయన నీవు భయపడకుము. నాతో రమ్ము. శ్రీహరి యొద్దకు పోదము. ఆయన నీకు ఉపాయము చెప్పును. అట్లని వారు విష్ణుమూర్తియొద్దకు పోయి మనవిచేసికొనగా విని మంచిది. మీరు మీ నివాసములకు పొండని తాను బ్రాహ్మణ రూపమును ధరించి శ్రీహరి అవిదేహ రాక్షసుడు సంతోషముతో నున్న ఇంటికి పోవు మార్గములో కాళ్ళు చేతులు నరికి వేసిన వానివలె రక్తము కారుచు పడియుండెను. వాని నా రాక్షసుడు చూచి యెవరు నీవు? ఎందుకిచ్చట పడియున్నా వనగా “ అయ్యా! నేనొక బ్రాహ్మణుడను. బ్రహ్మను గూర్చి చాల తపస్సు చేసితిని. ఆయన నాకు ప్రత్యక్షమయ్యెను. చావు లేకుండ వర మడిగితిని ఇచ్చితినని చెప్పి ఆయన పోయెను. పిమ్మట నేను ఇంటికి పోయి కావలసిన ధనము పట్టుకొని తీర్థాటనముకై బయలుదేరితిని. ఈ త్రోవను పోవుచుండగా ఇద్దరు

దొంగలు నా ధనమంతయు తీసికొని నా చేతులు కాళ్లు నరికిరి. నాప్రాణములు పోవుచున్నవి. మరిమాటలాడజాలను." అనుచు ప్రాణములు విడిచెను. అది చూచి ఆశ్చర్య పడి బ్రహ్మ వరము ఇంతేనా అని విచారించి తిరిగి తపస్సు చేయుటకు పోయి మరి వేయి సంవత్సరములు తపస్సు చేయగా బ్రహ్మ మరల ప్రత్యక్ష మయ్యెను. అప్పుడా రాక్షసుడు తాను ఎప్పుడు ఎవనిచేత చచ్చునో చెప్పుమని ప్రార్థించెను. బ్రహ్మ చిరునవ్వు నవ్వి విష్ణు భక్తిగల ఒకరాజు వలన నీ ఆయుష్య కాలమునందు చనిపోవుదువని చెప్పి పోయెను. విదేహుడును తపస్సు చాలించి ఇంటికి పోయి తన మంత్రితో జరిగిన సంగతి చెప్పగా విని యిట్లనెను. "నీవు మోసపోతివి. ఆ బ్రాహ్మణుడు మాయావియైన విష్ణువు. నీకు మొదట బ్రహ్మ ఇచ్చిన వరమె మంచిది" అది నీవు చెడగొట్టుకొంటివి. మరణము నీవే కోరుకొంటివి. అదివిని కోపించి ముందు శ్రీహరిని చంపెదను. తరువాత ఇంద్రునిపై పోదము అనెను. అట్లు కాదు. శ్రీహరి పాలసముద్రమున ఉండును. ముందు ఇంద్రలోకముపైకే పోదమని తన రాక్షసుల నందరిని పిలిపించి స్వర్గముపై బడెను. అంతట ఇంద్రుడును అష్టదిక్పతులును కలిసి వానితో ఘోర యుద్ధము చేసిరిగాని ఓడిపోయిరి. ఇంద్రుడు స్వర్గము విడచి పారిపోయెను.

ఈసంగతి నారదుని వలన బ్రహ్మ విని వచ్చి ఆరాక్షసునితో ఇట్లనెను. "ఓయీ ! నీవు జయించితివి. ఇంద్రుడు

డెను. అతడు నీ దాసుడు. నీ కేమి కావలెనో అది ఇచ్చును తీసికొని నీ పురంబునకు పొమ్ము" అనిచెప్ప బ్రహ్మను జూచి దానవుడునమస్కరించి యిట్లనెను. "ఓ పితామహా! మంచి మంచి రత్నములను, అప్సరసలను మంచిబట్టలను ఇప్పింపుము. యముడు నాపట్టణమునైపు చూడకుండవలెను. నాపుర మందు ఎవరును రోగపీడితులు కాకూడదు. ఎవరును చావకూడదు." అనివేడ అతడు కోరిన ప్రకారము అన్నియు నియ్యగా రాక్షసుడు సంతోషముతో ఇంటికి పోయి పిమ్మట కైలాసముపై దాడి వెడలెను.

ఆవార్త విని ఈశ్వరుడు కైలాసము విడచి ప్రమథగణములతో కూడ పారిపోయెను. రాక్షసుడు వానికొరకు నలుదిక్కుల వెదకి యుండుటనుగానక కైలాసమును బ్రద్దలుకొట్టి పాడుచేయుటకు ప్రయత్నింపగా నీశ్వరుడు శ్రీహరినితలంచగా శ్రీహరి గరుడ వాహనారూఢుడై వచ్చెను. అంత హరి హరులు కలిసి ప్రమథగణములతో కూడ ఆ విదేహ రాక్షసునితో యుద్ధమును చాలకాలము జేసిరిగాని జయింపలేకపోయిరి. శ్రీహరి సుదర్శనమును, శివుడు త్రిశూలమును ప్రయోగించిన వాని దేహము కందదయ్యెను. అదిచూచి వా రదృశ్యులైరి. అంత సుబుద్ధియను మంత్రి దానవరాజుతో ఇట్లు చెప్పెను. 'మనము గెలిచితిమి. పాతాళమునకు పోదము రండు." అని పాతాళమునకు పోయి వాసుకి పట్టణము ప్రవేశింపగా అతడు

భయపడి శరణుజొచ్చి, మరి సమర్పించెను. అంతటితో సంతో షించి భూలోకమును గెలుచుటకు పోయిరి.

జయధ్వజునిచే విదేహాదైత్యుని వధ.

విదేహాదైత్యుడు తన పట్టణమైన శోభావతి పురమున తన కోటలో నుండగా నారద మహాముని అతనియొద్దకు ఒక దినము పోయెను. వారిని పూజించి గౌరవించి ఇట్లు సంభాషించెను.

విదేహుడు:—మునివరా! ఎందుండి విచ్చేయు చున్నారు?

నారదుడు:—రాజా! స్వర్గమునుండి వచ్చుచున్నాను.

విదేహుడు:—అందలి సమాచారము లేమి?

నారదుడు:—సభలో నింద్రుడు నిన్ను చాలా ప్రశంస చేసెను. ముల్లోకములు జయించితి వనియు, హరి హరులను ఓడించితివనియు, వాసుకి కూడ శరణుజొచ్చెననియు, యముని కాలదండము కూడ నిన్నేమియు చేయలేకుండెననియు భూలో కమును జయించిన యెడల శ్రీహరికూడ నిన్ను గౌరవించు ననియు చెప్పెను

విదేహుడు:—అన్నాడా? నా దెబ్బ వానికి తెలిసినది.

నారదుడు:—నీవు భూలోకమేల తిరిగెదవు?

విదే:—మరి యేమి చేయవలెను. ప్రపంచమందలి రాజులను జయింపవలదా!

నార:—మాహిష్మతి పురమున నున్న కార్తవీర్యార్జుని కొడుకు శూరసేనుడు మిక్కిలి ప్రతాపముగల చక్రవర్తి. అతనిని ఓడించిన అందరు రాజులును వశులగుదురు. నారంద గును అతని కొంచిదివారే ? ఇంతేకాక మరియొకరహస్యమున్నది.

విదే:— స్వామీ ! ఆ రహస్యమేమో చెప్పుడు.

నార:— అతనికి యౌవన వంతురాలయిన చక్కని కుమార్తెయున్నది. ఉమా. లక్ష్మి, సరస్వతులకన్నను ఆమె మిక్కిలి చక్కనిది. ముల్లోకములయందును అంత చక్కని స్త్రీ లేదు. నీకు తగినది ఆమెయే. నారీరత్న మన్న పేరు ఆమెకే తగును. ఆమె ముఖము చూచిన చాలును. ఇందుని సంపత్తి ఎందుకు. ఆమె మాటలు విన్న చాలును. అప్సరసల పాట లెందుకు ? అనెను. నారదుని మాటలు విని ఆ చిన దానియందు మోహపరవశుడై ఒక దూతను పిలిచి యిట్ల నెను. “ ఓయీ ! నీవు మాహిష్మతీ పురాధిపుడైన శూరసేన మహారాజు కొద్దకు పోయి నేను ముల్లోకములు జయించితిననియు హరి హరులను గెలిచితిననియు, చక్కనివాడననియు చెప్పి, అతని కుమార్తెయైన కాంతిమాలను నాకిచ్చి వివాహము చేయుమని చెప్పుము. ఇయ్యకున్న ననంతముగా తీసికొని పోవు దునని చెప్పుము. ”

అంతట ఆ దూత వెళ్ళి ఆ మాటలు చెప్పగా, శూర సేనుడు మండిపడి, వానిని చంపుటకు ప్రయత్నించెనుగాని

దశాశయని విడచిపెట్టెను. ఆ పూాశ పోయి జరిగిన దంశాయు న్యనితో చెప్పగా విదేహుడు యుద్ధసన్నద్ధుడై జయభేరి మ్రోగించి బయలు దేరుచుండెను.

ఈ సంగతి తన చారులవలన విని ఇందుడు భయపడి తన గురువైన బృహస్పతిని ప్రశ్న చూడుమనగా, అతడిట్లనెను. విదేహుడుమన లోకమునకు రాడు. శూరసేనమహారాజు కుమారెనుగురించి నారదునివలన విని ఆమెను తనకిమ్మని ఆయనకడకు దూతనంపెను. ఆమహారాజుఆమెనుఇయ్యనందునఅతనిపై దాడివెడలుచున్నాడు. అది వినిఇంద్రుడు వాడెట్లుచనిపోవుననిఅడిగెను. వాడు విష్ణు భక్తుడైన జయధ్వజునిచే మరణించును. హరిహరుల తేజస్సుతో ఒక ఆయుధమును విశ్వకర్మచే తయారు చేయించి ఆజయధ్వజునికి ఇమ్ము. ఇది విని ఇంద్రుడు బ్రహ్మతో గలిసి విష్ణువు నొద్దకుపోయి యీ సంగతి ఆయనతో చెప్పగా విని ఆయన కూడ వారితో కలిసి కైలాసమునకు పోయి శివునితో మాటాడిరి. అప్పుడు వారు వారి కళలతో ఆయుధమును తయారు చేయించి విష్ణువు చేతికిచ్చిరి.

ఇట్లుండదానవులు మాహిష్మతీ పురమునకుపోయి శూరసేనాదులతో ఘోరయుద్ధము చేయ వారు చాల కాలము పోరి పారిపోయిరి. అది చూచి జయధ్వజుడు రాక్షసునిపై బడి నిలునిలు మని యుద్ధము చేయనారంభించెను. శ్రీమన్నారాయణుని మనస్సున ధ్యానించి రాక్షసునిపై బాణ వర్షము

కురిసించెను. పెక్కుమంది రాక్షసులు చచ్చిరి. రక్తము వరదలై ప్రవహించెను. బ్రహ్మాస్త్రమును విదేహునిపై ప్రయోగింపగా వాడు దానిని శూలముతో సంహరించెను. తరువాత నారిద్దరును గదా యుద్ధము చేసిరి. ఇద్దరి గదలు విరిగెను. పిమ్మట మల్లయుద్ధము చేసిరి. జయధ్వజుడు క్రిందపడెను. రాక్షసుడు వానిపై కూర్చుండియుండెను. ఇది చూచి దేవతలు చాల విచారించి విశ్వకర్మచే తయారు చేయబడిన ఆయుధమును వాయుదేవుని చేతికిచ్చి, దానిని జయధ్వజునికిచ్చి, రాక్షసుని నాభికమలమును దానితో భేదింప అతడు చచ్చునని రహస్యముగా వానితో చెప్పి రమ్మని పంపిరి. ఇంతలో జయధ్వజుడు రాక్షసుని క్రిందబడద్రోసెను. అంతట పవనుడు ఆయుధము ఇయ్యగా దానితో వాని నాభికమలమును ఛేదింపగా వాడు చచ్చెను. నారదుడు సంతోషించి నాట్యమాడెను. దేవతలు పుష్పవర్షము కురిపించిరి. మిగిలిన రాక్షసులు పారిపోయిరి. జయధ్వజుడు, శూరసేనాదులు తమ నిజనివాసములకు జయజయధ్వానములతో పోయిరి.

విశ్వామిత్రుడు జయధ్వజుని చూచుటకు ఒకదినమున వెళ్ళగా నాచక్రవర్తి మహామునిని విధియుక్తముగా పూజించెను. అప్పుడు ఆముని చక్రవర్తితో ఇట్లనెను. "రాజాధిరాజా! నీవంటి వీరుడు మూడు లోకములందును లేడు. ముల్లోకములను జయించి బహు ప్రతాపవంతుడై హరిహరులను కూడ వీగించిన విదేహ రాక్షసుని శ్రీహరి

కరుణవలన చంపితివి. కావున శ్రీమన్నారాయణుని యెడల భక్తివిడువకుము." ఆమాటలు విని జయధ్వజుడిట్లనెను. "ఓముని శ్రేష్ఠా! మీరు పరమజ్ఞానులు. మీకు సరియైనవారు జగత్తులో లేరు. బ్రహ్మసృష్టికి మారు సృష్టి చేసితిరి. శ్రీహరిని పూజించుట యెట్లో ఆయన ఎట్లు సంతోషించునో, వారి ప్రభావమెట్టిదో మీ వలన వినగోరెదను." అని యడుగగా మహాముని యిట్లు చెప్పదొడంగెను. "ఓనృపశ్రేష్ఠా! ఆ శ్రీహరి మహిమ ఏమని చెప్పుదును. దేవ, రాక్షస, మానవులలో ఎవరికిని తెలియదు. సరేకదా! బ్రహ్మకు సహితము తెలియదు. ఆయన యెప్పుడు ఏరూపము ధరింతురో ఎవరికిని తెలియదు. వర్షబిందువులనైన లెక్కింపవచ్చును, సముద్రమందలి యిసుక రేణువులనైన లెక్క చేయవచ్చును గాని వారి రూపములను లెక్క చేయలేము. కొందరు బ్రహ్మ అనియు, కొందరు శివుడనియు, మరికొందరు విష్ణువనియు పలువిధముల తలంతురు. కొందరు యోగుల మని గోచులు కట్టుకొని తిరుగుచుందురు. మరి కొందరు భిక్షాపాత్రముల చేబట్టి ముష్టి యెత్తుకొనుచుందురు. కొందరు తపస్సుచేసి లీనమగుచుందురు. మరికొందరు బొమ్మలను, రాళ్లను పూజించుచుందురు. కొందరు తమ ఆత్మలను కష్టపెట్టుచుందురు. వీరందరును ఆయన రూపమే. నీవు విష్ణుయజ్ఞము చేసిన యెడల శ్రీహరి సంతోషించునని" ఈమాటలు విని ఆ యజ్ఞము తమరే చేయింపవలెనని జయధ్వజుడు కోరగా వసిష్ఠ,

అత్రి, గౌతముడు, అగస్త్యుడు మొదలగు మహర్షులను పిలిపించి విశ్వామిత్రుడు యజ్ఞము చేయించెను. శూరసేనాదులగు నలుగురు అన్నలతో కలిసి జయధ్వజుడు యజ్ఞము చేసెను. హరిహరులు అచ్చటికి స్వయముగా వచ్చిరట. ఆ రాజులు ఇహమందు సర్వసుఖములను పొంది పరమపదప్రాప్తి నొందిరి.

## జయధ్వజుని వంశము.

ఈ జయధ్వజ చక్రవర్తికి నూరుగురు కుమాళ్ళు. అందు జ్యేష్ఠుడు వీతిహోత్రుడు. వీరసింహుడను బిరుదు పొందెను. ఇతనికి వృషుడు, వృషునికి మధువు, మధువునకు వృశుడు, వృశునికి విశ్రుతుడు, విశ్రుతునికి దుర్జయుడు పుట్టిరి. ఇతనిభార్య మిక్కిలి చక్కనిది. ఆమెతో సమానమైన సుందరులు ముల్లోకములలో లేరట. ధర్మగుణమందును నీతియందును ఆమె గొప్పదగుటచేత ఆమెను మహా సతియందురు. దుర్జయుడు ఒకనాడు యమునానదీతీరమున నుండగా మంచి పాట వినబడెను. అదియొక స్త్రీయొక్క కంఠస్వరమని గ్రహించి ఆపాట వినుచుపోయి అచ్చట పాడుచున్న ఊర్వశిని చూచి మోహించెను. ఆమెయు రాజుయొక్క సౌందర్యవిలాసములను కని మోహించినందున ఇద్దరును పరస్పర ప్రీతులై కేళీవినోదములను అనుభవించిరి. ఇట్లు చాలకాలము గడచిన తరువాత ఒకనాడు రాజు ఇంటికిపోవుటకు ఆమెను సెలవడుగగా ఇంకొక సంవత్సరము నాతో సుఖమనుభవింపుడని కోరెను. అందుకు రాజు అంగీకరించి ఒకసారి

యింటికిపోయి స్వర్గంలో వచ్చెదనని చెప్పెను. అందుకుఆమె సరే యని, మరియే అప్సరసను కూడబోకు డనెను. మంచిదని ఇంటికి పోయెను. ఆనాటిరాత్రి తన భార్యను కలియబోగా భయ కంపితుడై భార్యను ముట్టుకొనలే కుండెను. అదిచూచి ఆమె గ్రహించి తమ భయమునకు కారణమేమి ? ఎవరికి భయ పడుచున్నారు? అని అడుగగా లజ్జచే రాజు మాటాడలేకుండెను. అదిచూచి ఆ యిల్లాలు జ్ఞానదృష్టిచే సర్వమును తెలిసి యిట్లనెను. " నాథా ! భయమెందుకు? భయపడు రాజు ప్రజ లను పాలించుటెట్లు? పాపముచే భయము కలుగును. వెంటనే పాపపరిహార మార్గము చూడుడు.

అదివిని రాజు కణ్వమహాముని ఆశ్రమమునకు పోయి తాను చేసినదంతయు వారితో మనవిచేసి దానికి ప్రాయశ్చిత్తము తెలిసికొని తిరిగి ఇంటికి పోవుచుండగా ఒక దివ్యపురుషుడు విమానమున అంబరవీధిని పోవుచు పాడుచుండుటవినెను. ఆ పురుషుడు మంచిబట్టలు,అలంకారములు, రత్నహారములుధరించి ఉండెను. అతని పాటవినగానే ఊర్వశి జ్ఞాపకమునకు వచ్చెను. ఈ దివ్యపురుషుని మెడలోని హారము ఊర్వశికి మిక్కిలి అంద ముగ ఉండునని తలంచి ఆ హారమును తీసికొనుటకు వానితో ఘోర యుద్ధముచేసి రత్నహారమును తీసికొని దానిని ఊర్వశికి ఇచ్చుటకుపోగా ఆమె అచ్చట లేకపోయెను. పిమ్మట పెక్కు చోట్ల వెదకి ఎందును ఆమెను కానక హిమవత్పర్వతమునకు

పోయి హేమకూట పర్వతమునందున్న పెక్కుమంది చక్కని అప్సరసలను చూచెను. వారు రాజునుచూచి మోహించి బహు ప్రార్థించిరిగాని ఊర్వశితో చేసిన వాగ్దానము ప్రకారముగ తానుమరియేఅప్సరసను ముట్టకూడదని వారికివిముఖుడై మేరుపర్వతమున ఆమెను వెదకబోయెను. అచ్చట మానససరోవరతీరమున ఊర్వశిని చూచి ఆమె మెడలో హారమును వేసి సంతోషించెను. కొంతకాల మందుండి కామసుఖము ననుభవించుచుండగ ఒకనాడు రాజుతో "మీకుఇంటికివెళ్లి యేమిచేసెతి రని యడుగగా తాను ఆమెను విడచినది మొదలు తిరిగికలిసి కొనువరకు జరిగిన దంతయు ఆమెతో చెప్పెను. అదివిని కణ్వమహాముని గాని, మహా పతివ్రతయైన అతని భార్యగాని శాపమిచ్చెదరేమో అని భయపడి అతనియింటికి పొమ్మని చాలా బోధించెను గాని వినలేదు. రాజు ఆమెనువిడచి పోవుటకును ఇష్టపడలేదు. అదిచూచి ఊర్వశి వికృతరూపమును పొందెను. వెంటనే రాజు ఆమెను విడచి అడవికిపోయి పండ్రెండు వత్సరములు తపస్సుచేసి కణ్వమహర్షిని దర్శించి జరిగిన దంతయు మనవిచేయుగా కాశికిపోయి గంగా స్నానముచేసి విశ్వేశ్వర దర్శనము చేసి ఇంటికివెళ్లి యజ్ఞము చేసిన పాపపరిహార మగునని చెప్పెను. వెంటనే రాజు అట్లుచేసెను. పిమ్మట నీ రాజుకు కుమారుడు పుట్టెను. వానికి సుప్రతోడని నామకరణము చేసిరి. ఆవెనుక అతను రాజయ్యెను.

శ్రీకృష్ణుడు ఈశ్వరుని గురించి తపస్సు చేయుట.

ఒక దినము శ్రీకృష్ణుడు జాంబవతితో అంతఃపురమున కేళీవినోదంబులు సలుపుచుండగా ఆమె తనతోటి సవతులకు పుత్రులు కలుగుచుండుటయు తనకు లేకుండుటయు తలంచి విచారించి తన కొక కుమారుని ప్రసాదింపుమని ప్రార్థింపగా కృష్ణుడు ఆమె యందు కరుణించి తాను పోయి ఈశ్వరుని గురించి తపస్సు చేయుటకు శివభక్తులలో ముఖ్యుడైన ఉపమన్యు మహాముని ఆశ్రమమునకు పోయెను. అతడు ఆమునికి సాష్టాంగ నమస్కారములుచేసి చేతులు జోడించి యెదుట నిలచుండుట చూచి ఆముని యిట్లనియెను "ఓ స్వామీ! మీరిట్లు వచ్చుటకు కారణమేమి? ఇట్లు కూర్చుండుడు. మీ రాకవలన నా యిల్లు పవిత్రమైనది. నేను ధన్యుడనైతిని. నా తపంబు ఫలించెను. మీదర్శనము సులభముగాలభించునదికాదు" అనియనగా ఆమాటలు విని శ్రీకృష్ణుడు ఇట్లు పలికెను. "ఓ మునివర్యా! నేనొక కార్యార్థినై మీ దర్శనమునకు వచ్చితిని. శ్రీ మహాశివుని ప్రత్యక్షముగా దర్శింపవలెనని కోరిక పుట్టినది. మీరు వారి భక్తులలో శ్రేష్ఠులు గనుక అది సులభముగా నాకు లభించుమార్గము చూపెదరని యిటువచ్చితిని." ఆమాటలు విని ముని యిట్లనెను. "శ్రీహరీ! మిక్కిలి కఠోరమైన తపస్సుచేసిన గాని సదాశివునిదర్శనముసులభ సాధ్యముకాదు. వారుపార్వతితో నీ వనంబుననే తిరుగుచుందురు. వ్యాసుడు ఇచ్చటనే గొప్ప

తపస్సుచేసి వారి దర్శనమును పొంది జ్ఞానమును సంపాదించెను. పూర్వము వసిష్ఠ మహామునియు ఇచ్చటనే తపస్సుచేసి యోగ జ్ఞానమును పొందెను. పుత్రులు లేనివారు పుత్రులను, విద్యలేని వారు విద్యను, సంపదలు కోరువారు సంపదలను, పొందుచున్నారు. కావున మీరును మనస్సు నిలకడచేసి యింద్రియములను స్వాధీనము చేసికొని ఆహారమునందు నియమము కలిగి నే నుపదేశించుమంత్రమును భక్తితో జపించినయెడల మీకును శీఘ్రకాలములోనే శ్రీమహాదేవుడు కరుణాసముద్రుడు కావున దర్శన మిచ్చును." ఆమాటలు శ్రద్ధతో విని ఆ ముని చెప్పిన ప్రకారము కృష్ణుడు కౌపీనమును ధరించి శరీరమంతటను భస్మమును పూసికొని రుద్రాక్షమాలికను మెడను వేసికొని తపస్సు చేయగా కొంతకాలమునకు అర్ధనారీశ్వరుడు కనిపించెను. అప్పుడు వారికి ప్రదక్షిణ నమస్కారములొనరించి బహు స్తోత్రములు చేసి మీ సాటి కొమరుని ఇమ్మని ప్రార్థించెను. అట్లేయొసంగితినని వరమిచ్చి ఈశ్వరుడు కృష్ణుని కౌగిలించుకొని కైలాసమునకు తోడ్కొని పోయెను. అచ్చట కొంతకాలముండి అచ్చటి వినోదములను చూచుచుండగ ద్వారకయందు కృష్ణుడు లేడని తెలిసి కొందరు రాక్షసులు ఆ పట్టణముపై దండెత్తిరి. కృష్ణుని జాడ తెలియక బలరాముడు మొదలగు యాదవులు చింతిల్లుచుండగా, శ్రీ నారదమహాముని. ద్వారకకు వచ్చి శ్రీకృష్ణుడు కైలాసమున నుండుట యెరింగించెను. అది విని

బలరాముడు గరుత్మంతుని పంపగా అతడు నిముసములో కైలాసమునకుపోయి, కృష్ణుని తోడ్కొనివచ్చెను. వారిరాకవిని రాక్షసులు పారిపోయిరి. తరువాత కొద్దికాలములోనే జాంబవతికి పుత్రసంతానము కలిగెను. ఆ పిల్లవానికే సాంబుడనిపేరు.

### లింగోత్పత్తికి కారణము.

ఒకానొక సమయంబున శ్రీకృష్ణుడు ద్వారకలో నుండగా మార్కండేయ మహాముని శిష్యులతో వారిని దర్శింప బోయెను. అపుడు కృష్ణుడు ఎదురుగా వెళ్ళి వారిని తన మందిరమున జేర్చి, అర్ఘ్యపాద్య విధుల పూజించి, భుజింపజేసి, తన సభాసనమున కూర్చుండజేసిన, వారి దర్శనముకొరకు ఉగ్రసేనుడు బలరాముడు మొదలగు యాదవులు అచ్చటికిపోయి వారికి దండప్రణామములు చేసిరి. అప్పుడు కృష్ణుడు ఆ మహామునిని చూచి యిట్లనెను. "ఓ మునిశిఖామణీ! మీరు బ్రహ్మతో సమానులు. మహాప్రళయములు ఎన్నియో చూచితిరి. మీ ఈ శరీరము కల్పాంతములుండి యున్నది. మీరెరుగని అంశము లేదు. నాయందు కృపచేసి. ఆత్మయోగమును గురించి కొంచెము సెలవిండు." అదివిని మార్కండేయులు ఇట్లు చెప్పిరి. "ఓకృష్ణా! నీ యెదుట నేనేమిచెప్పగలను? కర్మయోగముగాని భక్తి యోగముగాని జ్ఞాన యోగముగాని సాధించుట నీ కొరకేగదా! నీవు యోగమయపురుషుడవు. నీకు నేనేమి చెప్పగలను?" అనగా విని చిరునవ్వు నవ్వి కృష్ణుడు

ఇట్లు చెప్పెను. "స్వామీ! నేను ఉపమన్యునియొద్ద యోగ జ్ఞానమును పొంది చాలకాలము తపస్సు చేసి ఈశ్వరుని వరము వలన సాంబుడను కుమారుని కంటిని. నేను ఎప్పుడును మహేశ్వరుని పూజించుచుందును. ఆ హరుడు దేవాదిదేవుడు. శివలింగము మహిమను జను లెరుంగరు. నేను పూజింపకున్న వారి కెట్లు తెలియును. శివుని కంటె హెచ్చు దేవుడు లేడు. ఆ ఘోర మంత్రముకంటె హెచ్చుమంత్రమును లేదు. యాగము, యజ్ఞము, తీర్థము, వ్రతము, దానము వీనివలనలు గు పుణ్యమెంతో శివపూజ నిత్యము చేయుటవలన అంత ఫలము కలుగును. నిత్యమును స్నానము చేసి శివపూజ చేయువానికి కలుగుఫలము ఋషులకును, తాపసోత్తములకును కలుగదు." ఇదంతయువిని శివలింగము ఎట్లు ఉత్పత్తియైనదో చెప్పుమని ఆ మునియడుగగా కృష్ణుడిట్లు చెప్పనారంభించెను. "సభాసదులారా! సావధానముగా శ్రద్ధతో వినుండు. ప్రళయమందు అంతయు నశించి జలముతో ప్రపంచమంతయు నిండి, చీకటి క్రమ్మి, దిక్కులు కానరాకుండునపుడు నేను విరాట్టు రూపముతో అనగా, వెయ్యి తలలు, వెయ్యి చేతులు, వెయ్యి కన్నులు, వెయ్యి ముఖములు కలిగి ప్రళయ జలము మీద నిద్రించియుండగ కోటి సూర్యుని వెలుగుతో ప్రకాశించుచున్న ఒక్క పురుషుడు దూరమున ప్రకాశించుచుండెను. అతడు నాలుగు ముఖములతో వేదమును చదువుచు నిముసములో నాయొద్దకు వచ్చి

నన్ను చూచి ఆశ్చర్యపడి నీవెవరవు ? ఇచ్చట ఎందుకున్నావని యడిగెను. తాను జగత్తులకు కర్తననియు, స్వాయంభువుననియు నాతో చెప్పెను. ఆ మాటలు విని, నేను ఈ జగత్తులను పెక్కు సార్లు సృజించుట, పాలించుట, సంహరించుట చేయుచుందు నని చెప్పితిని. అతడు నా మాయచే మోహితుడై నన్ను నిందించుచు వాదించెను. అప్పుడు మా ఇరువురకు జరుగుచుండెడు గొప్ప వివాదమును తీర్చుటకు అచ్చట హఠాత్తుగా అద్భుతమైన లింగమొకటి పుట్టెను. అది కాలాగ్నివలె ప్రకాశించుచుండెను. దానికి వృద్ధిగాని క్షయముగాని, మొదలుగాని, కొనగాని లేకుండెను. అప్పుడా చతుర్ముఖుడు నన్ను చూచి దాని మొదలు కనిపెట్టుమని చెప్పి తాను దానికొనను చూచుటకు మీదికి పోయెను. అది మొదలు వెయ్యి సంవత్సరముల వరకు నేను క్రిందికిని, బ్రహ్మ మీదికిని, పోతినిగాని నేను మొదలుచూడ లేదు. అతడు కొనయుచూడలేక బయలుదేరిన స్థానమునకు వచ్చి చేరి దివ్యదృష్టిచే చూడగ, అతడే ఆదిమధ్యాంతరహితుడనియు జగత్తులను సృజించి, పాలించి సంహరించువాడనియు తెలిసికొని స్తోత్రములు చేయగా మాయందు కరుణించి నిజరూపముతో ఆ ఈశ్వరుడు మాకు ప్రత్యక్షమయ్యెను. ఆయనకు చంద్ర, సూర్య, అగ్నులను మూడు కన్నులుండెను. త్రిశూలమును, పినాకమును పట్టియుండెను. వాని తేజము బ్రహ్మాండమంతయు నిండియుండెను. పాము జన్నిదమై యుండెను.

మేఘగర్జనము వంటికంఠధ్వని కలిగియుండెను. ఆయన మాతో ఇట్లనెను. "ఓయీ! మీకు ప్రసన్నుడనైతిని. భయపడకుడు. మీరిరువురు నాశరీరమున పుట్టినవారే. నా కుడిచేతి నుండి బ్రహ్మయును ఎడమచేతినుండి విష్ణువు నను నామములతో మీరు పుట్టిరి. మీ కిష్టమైన వరము నిచ్చెదను. కోరుకొనుడు" అనగా మేము అతని పాదములందు సర్వదా భక్తి నిలుచునట్లు వరము వేడితిమి. [illegible] నాహృదయ మధ్యమునుండి శివుడు పుట్టును. మీరు ముగ్గురును అన్నదమ్ములగుదురు. నా యొక్క రజస్సు, సత్వము, తమస్సులను మూడు గుణముల చేతను బ్రహ్మ, విష్ణువు, శివుడు అను మువ్వురును కలిగి సృష్టి, స్థితి, లయములు చేయుచుందురు. అనిచెప్పి ఆ మహాపురుషుడు అంతర్ధాన మయ్యెను. ఎటుపోయెనో మేమెరుంగము. కావున నేను లింగమును నిత్యమును పూజించెదనని కృష్ణుడు చెప్పెను. ఆకథవిని సంతోషించి మార్కండేయులు తన ఆశ్రమమునకు వెళ్లెను.

## హిరణ్యాక్షుని చరిత్రము.

కశ్యపబ్రహ్మకు దితియను భార్యయందు హిరణ్యకశిపుడు హిరణ్యాక్షుడను ఇద్దరు కొమరులు పుట్టిరి. వీరు బ్రహ్మనుగుఱించి గొప్ప తపస్సు చేసిరి. వీరిలో చిన్నవాడైన హిరణ్యాక్షుడు గొప్ప బలము గలవాడును, మిగుల గర్విష్ఠుడును, అయి యుండెను. హిమాలయ పర్వతమునందు ఇతడు

చేసిన ఘోరమైన తపస్సు వలన బ్రహ్మాండము వణకెను. ఆ తపస్సు వేడిమివలన స్వర్గమునందు దేవతలు ఉండలేకపోయిరి. బ్రహ్మ కూర్చుండి యున్న పీఠము వణకెను. ఆతడు తన లోకమున ఉండలేక తన వాహనమైన హంసపై నెక్కి హిరణ్యాక్షుడు తపస్సు చేయుచున్న హిమాలయ పర్వతమునకు వెళ్ళి "నీవెందుకు తపస్సు చేయుచున్నావు. నీవు కోరిన వరము ఇచ్చెదను అడుగుము" అని చెప్పెను. అప్పుడు హిరణ్యాక్షుడు బ్రహ్మకు ప్రదక్షిణ నమస్కారములు చేసి చేతులు జోడించి యిట్లనెను. "ఓ పితామహా! మీ అనుగ్రహము నాయందు కలిగెని విష్ణు చక్రము వలన తెగకుండునట్లును, దేవ, దానవ, యక్ష, నాగ, కిన్నర, కింపురుష, గంధర్వులచే చావు లేకుండునట్లును, ఓడిపోకుండునట్లును, నీవు చేసిన సృష్టిలో దేనివలనను రాత్రిగాని పగలుగాని నాకు చావు లేకుండునట్లును, నా దేహము వజ్రము కంటె గట్టిగా నుండునట్లును వరము ప్రసాదింపుడు" అనియెను. "మంచిది. ఇచ్చితి"నని చెప్పి బ్రహ్మ అంతర్ధానమాయెను. అటుపైని ఆ రాక్షసుడు విష్ణుమాయచే మోహితుడై తనకుమరి చావు లేదని గర్వించి, ఇష్టానుసారము చేయుట కారంభించెను. ఋషులను, బ్రాహ్మణులను, విష్ణుభక్తులను, ధర్మాత్ములను బాధించెను. వాని దురాగ్రములను చూచి దేవతలు భయపడి స్వర్గమును విడిచి పారిపోయిరి. ఋషులు తమ ఆశ్రమములను విడిచిరి. యజ్ఞాదులను పాడుచేయుట, స్త్రీలను చెరబట్టుట, మొదలగు

దుర్న్యయములు చేయుచు ముల్లోకములను అల్లకల్లోలము చేసె ను. ఇంద్రుడును అష్టదిక్పతులును, మేరు పర్వతమమీదికి పారి పోయిరి. ఎప్పటికిని నీరిబాధ తప్పనందున బ్రహ్మయొద్దకుపోయి ప్రార్థింపగా ఆయన యిట్లు చెప్పెను "దేవరాజా! కొద్దికాల ములోనే రాక్షసునివలన బాధలు తప్పును. ఈమేరుపర్వతము మీద విష్ణునిగురించి యాగము చేయుము. ఆయన ఈరాక్షసుని త్వరలోనే సంహరించి మీబాధలను తొలగించును. భయపడ కుము" అనవిని దేవేంద్రుడు విష్ణుప్రీతిగా ఒక సంవత్సరము సాగును, యజ్ఞముచేసెను.

వరాహావతారము.

ఇట్లుండగా మహా ప్రతాపవంతుడైన హిరణ్యాక్షుడు భూమిని చాపచుట్టుగా చుట్టి చంకలో పెట్టుకొని పోయి పాతా ళమున దాచెను. అదిచూచి శ్రీమన్నారాయణుండు, తెల్లని శరీరము, ఎఱ్ఱనికండ్లు, రాళము వంటినోరు, ప్రళయకాలమందలి సముద్రధ్వనివంటి గర్జనము, కోటి సూర్యులవంటి ప్రకాశముగల వరాహరూపముతో యజ్ఞకుండములోనుంచి పుట్టెను. ఇంద్రా ది దేవతలు చేతులు జోడించుకొని మహాప్రభూ రక్షించురక్షించు మనిప్రార్థించిరి. అంతకంతకు ఆవరాహమూర్తి పెద్ద పర్వతము వలె పెరిగి తన దంతములను కూడ పెంచి, తన దంష్ట్రకొసతో భూమిని అతి సులభముగా పైకిఎత్తి యిప్పటివలె దానిస్థలమున యుంచెను. ఆయనమహిమవలనదానియందలి సమస్తజీవరాసులు

చెడకుండ ఎప్పటివలెనుండెను. ఈసంగతి తనచారులవలన హిరణ్యాక్షుడు విని కోపావేశుడై గదచేతబట్టి ఆవరాహమూర్తియున్న చోటికి వచ్చి గద త్రిప్పి దానితో కొట్టగా ఆగద రెండుముక్కలయ్యెను. అంతట రాక్షసుడు ఆ వరాహము తోక బట్టుకొనెను. ఆ తోకను ఆడింపగా వాడు జలములో బడెను. అప్పుడా వరాహమూర్తి తన దంష్ట్రముతో ఆ రాక్షసుని హృదయముమీద కొట్టగా హృదయమును చీల్చి నేలమీదను రక్తము వచ్చెను. రాక్షసుడు అరచి చచ్చెను. మిగిలిన రాక్షసులు పారిపోయిరి. బ్రహ్మాది దేవతలు వరాహమూర్తిని స్తోత్రములు చేసిరి. అంత వారి స్తుతులకు సంతోషించి శ్రీ వరాహమూర్తి ఆ అవతారము చాలించి తన నిజరూపముతో వైకుంఠమున కేగెను.

## హిరణ్యకశిపుని చరిత్రము.

హిరణ్యకశ్యపుడు తనతమ్ముడైన హిరణ్యాక్షుని వరాహరూపమున శ్రీహరి చంపిన సంగతి విని, మిగుల దుఃఖించి, హరిపై పగ తీర్చుకొనవలెనని బ్రహ్మను గురించి తపస్సు చేయుటకు హిమాలయ పర్వతమునకు పోయి అందు చిరకాలము నిరాహారుడై శీతోష్ణములకు సహించి ఘోరమైన తపస్సుచేసెను. వాని తపః ప్రభావమువలన భూమి కంపము నొందెను. దిక్కులు తల్లడిల్లెను. దిక్పాలకులు భీతిల్లి తమ నివాసములను విడిచి పారిపోయిరి. బ్రహ్మయు భయపడెను.

దిక్పతులతో కలిసి దేవతలు మొరపెట్టగా, బ్రహ్మ హంస వాహనారూఢుడై, ఆ దుష్టుడు తపస్సు చేయు చోటికి వెళ్ళి ఇట్లనెను. "ఓవత్సా! ఏల యిట్టి తపస్సు చేయుచున్నావు. నీవు కోరు వరములను ఇచ్చుటకు వచ్చినాను. అడుగుము." అనగా అతడు సంతోషించి లేచి బ్రహ్మకు ప్రదక్షిణ నమస్కారములు చేసి నిలుచుండి యిట్లనెను. "పితామహుడా! దేవతలును మేమును కూడ నీకు మనుమలమె గనుక నీకు మే మందరమును సమానులమేగదా! మే మందరము అన్నదమ్ములము. తల్లులు వేరైనను తండ్రి ఒకడే. మీకు మా యెడ భేదబుద్ధి యేందులకు? దేవతలకు అమృతమిచ్చి అమరులను అనగా చావు లేనివారలనుగ చేసితిరి. వారికి స్వర్గలోక మిచ్చితిరి. మాకు ఏభోగములును లేవు. మేము కొట్టినను వారు చావరు. వారి వలన మేము చచ్చుచున్నాము. వారు మేము వివాద పడు నపుడు. నీవుగాని, శ్రీహరిగాని దానిని చల్లార్చక వారి పక్షమై మమ్ము చంపుదురు. మేము దుర్మార్గులమనుటకు కారణమేమి? మాతప్పేమి! బలవంతులకు అందరును భయపడుదురు. బలహీనులను అందరును దూషింతురు. కావున మీరు నాకు చావు లేకుండ వరమిండు. నేను దేవతలను బాధింతును. విష్ణువు కూడ నన్ను చంపలేకుండ వరమియ్యవలెను." ఈమాటలు విని బ్రహ్మ ఇట్లనెను. "బాబూ!. చావులేని వరము నేనియ్యజాలను. మరియేమైనను కోరుకొనుము." అనగా విని హిరణ్య

కశ్యపుడు ఇట్లు కోరుకొనెను. "తాతా! నాకు అమరత్వము ఇయ్య లేకున్న ఏ ఆయుధములచేతను, విష్ణువుని సుదర్శనచక్రము చేతను కూడ చావులేకుండునట్లును, హరిహరులుగాని, అష్ట దిక్పాలురుగాని, నవగ్రహములుగాని, నరదానవులుగాని, రాత్రి గాని, పగలుగాని, నన్ను చంపలేకుండునట్లును, అగ్ని నన్ను కాల్వ లేకుండునట్లును, జలములు ముంపలేకుండునట్లును, సూర్యుడు దహింపలేకుండునట్లును, సీ సృష్టిలోని జీవజంతువులు నన్ను చంపలేకుండునట్లు వరమొసంగుము" అని వేడగా అట్లేఇచ్చితి నని చెప్పి బ్రహ్మ నిజలోకమునకు వెళ్ళెను. ఈ వరములను పొంది తనకు చావులేదనిగర్వించి, తనబలముచే ముల్లోకములను జయించి వానికి రాజయ్యెను. మునులను ఋషులను బాధించుట, యజ్ఞములను పాడుచేయుట, స్త్రీహత్య, శిశుహత్య మొదలగు దుర్మార్గములు చేయుచుండెను. ఈ పాపములను భూమి భరింపలేక ఇంద్రుని సభలోనికి వెళ్ళి యేడ్చెను. అది విని తాను ఏమియు చేయలేక ఇంద్రుడు బ్రహ్మయొద్దకుపోయి మొర పెట్టెను. బ్రహ్మయు తానేమియు చేయజాలనని చెప్పి ఇంద్రునితో కలిసి శ్రీహరియొద్దకు పోయి చెప్పుకొనెను. ఇంద్రాది దేవతలు ఆ రాక్షసుని బాధలు చెప్పుకొని శ్రీహరిని శరణు చొచ్చిరి. ఇది చూచి వారిపై కరుణించి శ్రీహరి తన యోగబలము వలన తన శరీరము నుంచి ఒక దివ్య పురుషుని పుట్టించెను. ఆపురుషుడు కోటి సూర్యుల ప్రకాశము కలిగి, నాలుగు చేతుల శంఖచక్రగదా

శార్ఙ్గములు ధరించి, శ్రీహరికి ప్రణమిల్లి ఏమి సెలవు తండ్రీ యని అడుగగా వత్సా! నీవు భూలోకమునకు పోయి హిరణ్యాకశ్యపుని అతని సైన్యమును నాశనముచేసి రమ్మని ఆజ్ఞాపింపగా ఆతడు విని గొప్ప సింహనాదము చేసెను. ఆగొప్ప ధ్వని విని అష్టదిక్పతులు త్రుళ్ళిపడిరి. బ్రహ్మ వణకెను. రాక్షసులు ఈ ఉత్పాతమునకు కారణమేమో యోహించి శ్రీహరి తమ పైకి యుద్ధమునకు వచ్చుచున్నాడని తెలిసికొని తాము యుద్ధసన్నాహము చేసిరి. అంతట ఆదివ్యపురుషుడు వచ్చి రాక్షసులను చాలమందిని చంపెను. హిరణ్యకశిపుడు వానితో యుద్ధముచేసి దివ్యాస్త్రములు ప్రయోగించెను. అతని అస్త్రములు రాక్షసునికి తగులలేదు. అందుకు భయపడి ఆదివ్యపురుషుడు అదృశ్యుడుకాగా రాక్షసులు జయధ్వనులుచేసి గెల్చితిమని సంతోషించిరి.

ఇట్లుండగా హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడను కొడుకు పుట్టి పెరుగుచుండెను. ఆ శిశువు పుట్టినది మొదలు తనలో తాను నవ్వుకొనుచు సంతోషించుచుండెను. అయిదవ సంవత్సరమున ఆబాలుడు శ్రీహరిని గురించి మాట్లాడుచు, ఆడుచు, పాడుచు, ధ్యానించుచుండుట తండ్రిచూచి వానికి చదువు లేనందున వెఱ్ఱివానివలె నున్నాడని యెంచి తన కులగురువగు శుక్రాచార్యుని కుమారుడైన చండామార్కులను పిలిపించి వాని యొద్ద ఆపిల్లవానిని ఒప్పగించి విద్య నేర్పుమని చెప్పెను. అతడట్లు చేయ నారంభించెను. కొంతకాలమయిన పిమ్మట

కుమారుని వాని గురువును పిలిపించి ఏమి నేర్చుకొంటి వనగా చదువులో మర్మమంతయు తెలిసికొంటి ననెను. అది యేమి యని యడుగ "నాయనా! సమస్త జగములను పుట్టించి, పాలించి సంహరించు శ్రీహరి పదధ్యానమును నేర్చికొంటిని" అని అనెను. ఆమాటలువిని తండ్రి గురువునుకోపించి మాకులవిరోధియైన విష్ణువునుగురించి బోధించితిరా? అనిఅడిగెను. లేదుమహారాజా! అది వాని స్వభావజన్యముగాని నేను నేర్పినది కాదని చెప్పెను. అప్పుడు తలిదండ్రులు పిల్లవానికి పలువిధముల బుద్ధులుబోధించి శ్రీహరి తమకు శత్రువని చెప్పి, శివుని ధ్యానింపుమనియు, సమస్తశాస్త్రములు బాగుగా నేర్చుకొమ్మనియు చెప్పి తిరిగి గురువున కొప్పగించిరి అప్పుడు ప్రహ్లాదుడు గురువువెంటబోయి చదువుకొనెను. కాని శ్రీహరినే స్మరించుచు గురువు ఏది చెప్పినను దానికి విష్ణుపదముగానే అర్థము గ్రహించుచుండెను. తనతో చదువు రాక్షస బాలురకు విష్ణుభక్తి నేర్పుచుండెను. అదిచూచి గురువు భయపడి తనకు నిందవచ్చునని తెలిసికొని రాక్షసరాజు వద్దకు పిల్లవానిని తీసికొనివెళ్ళి ఇట్లు మనవి జేసికొనెను. "ఓ మహారాజా! ప్రహ్లాదునికి ఎంతబోధించినను విష్ణుభక్తి విడువకున్నాడు. శివునిపేరు పలుకడు సరే కదా ఇతర బాలురకుకూడ విష్ణుభక్తిబోధించి చెరుపుచున్నాడు. కావునఅతనికి విద్యనేర్పుటనావలన కాదు. మీరే వానిని బాగుచేసికొనవలెను" అనిచెప్పి విడచిపెట్టెను. అదివిని హిరణ్యకశిపుడుమిగుల

విచారించి, తనకడుపున పుట్టినవానికిహరిభక్తి యెట్లుకలిగెనని మిక్కిలి ఆశ్చర్యపడి అనేకవిధముల వానికి బోధించియు, తన భార్యయైన లీలావతిచే బోధింపించియు, మేలు కనబడనందున, సామ, దాన, భేద, దండనములను నాలుగు యుపాయములను, ఉపయోగించి చూడవలయునని నిశ్చయించి, రాక్షస భటులను కొందరిని పిలిపించి వారిచే దండింపించుట కొండ పైనుండి పడద్రోయుట, ఏనుగులచే త్రొక్కించుట, పాములచే కరపించుట, విషము త్రాగించుట మొదలగు శిక్షలు ఎన్ని చేయించినను, శిక్షలు చేయువారే చచ్చిరిగాని, ఆ పిల్లవానికి ఏ బాధయు లేక నిర్వికారముగాను, సంతోషముగాను నుండుట చూచి, మిక్కిలి ఆశ్చర్యమును, కోపమును గలవారై చేయునది లేక బాలుని బుజ్జగించి మంచి మాటలతో ఇట్లు బోధించెను. "కుమారా, శ్రీహరి మన కులవిరోధి. అతడు మన రాక్షసులను అనేకులను అనేక రూపములతో అనేక పర్యాయములు చంపియున్నాడు. ఇంతేకాక, నాకు తమ్ముడును నీకు పినతండ్రియు నైన హిరణ్యాక్షుని పందిరూపమున చంపెను. అది మొదలు అతనిని చంపుటకు నేను ఎన్నో విధముల ప్రయత్నించుచు ఎచ్చట వెదకినను కనబడలేదు. వాడు ఎక్కడనున్నాడో చెప్పగలవా?" అని ప్రశ్నింపగా ప్రహ్లాదుడు యిట్లు పలికెను. "ఓ తండ్రీ! ఇట్లు నచించెదరేలా. సర్వాంతర్యామియు, సర్వజ్ఞుడును, సర్వవ్యాపకుడు నగు శ్రీహరి యెందున్నాడని యేల

అడిగెదరు. ఆయన అంతటను నిండియున్నాడు. మీాయందు నాయందు, అణువు మొదలు మేరువు వరకు గల అన్ని పదార్థములయందును శ్రీహరి నిండియున్నాడు. కాని వాని నిజరూపు చూచుటకు మనకు శక్తి చాలదు. కనుక కానరాకున్నాడు. అట్టి సామర్థ్యమే మనకున్నయెడల ఆయనను మనము అంతటను చూడగలము." అని బాలుడు చెప్పగా, తండ్రి నమ్మక ఈ స్తంభములో చూపగలవా? అని అడిగెను. తప్పక చూపింపగలనని బాలుడు తండ్రితో పలికెను. అది విని హిరణ్యకశిపుడు తన చేతనున్న గదతో స్తంభమును కొట్టగా అది పటపట పగల్చుకొని శ్రీహరి అందుండి నరసింహరూపమున బయలువెడలెను. ఆయనకు నడుముక్రింది భాగము మనుజాకృతియు మీాది భాగము సింహాకృతియు గలిగియుండెను. ఆ భయంకరమైన రూపమును చూచి అచ్చటనున్నవారందరును భయపడి పారిపోయిరి. రాక్షసరాజు ఆ నరసింహమూర్తిని గదతో కొట్టగా అది రెండు ముక్కలయ్యెను. పిమ్మట శూలముతో కొట్టెనుగాని అదియు వ్యర్థమయ్యెను. అంతట రాక్షసుడు శక్తిని ప్రయోగించెను. దాని తేజస్సుచూచి పైనుండి చూచుచున్న దేవతలు పారిపోయిరి. సూర్యునిరథము నిలిచెను. కాని అది శ్రీ నరసింహమూర్తికి పుష్పవలె తగిలెను. అదిచూచి రాక్షసుడు ఒక గుద్దు గుద్దెను. అప్పుడు శ్రీ నృసింహమూర్తి హిరణ్యకశిపుని పట్టి తన తొడలపై వేసికొని తన చేతిగోళ్ళతో వాని వక్షస్థలమును చీల్చి చంపెను.

అంతట ఆకాశమున జయ జయ ధ్వనులు చెలంగెను. స్వర్గమున ఇంద్రుడు గొప్ప ఉత్సవము చేసెను. శ్రీ నరసింహ మూర్తిపై దేవతలు పారిజాత పుష్పములతో వర్షము కురిపించిరి. గంధర్వులు పాడిరి. అప్సరసలు ఆడిరి. శ్రీ నృసింహ మూర్తియొక్క ఘోరమైన రూపమునుచూచి దేవతలు భయపడి స్తోత్రములు చేయ నారంభించిరి. రాక్షసులు ఆరూపు చూడలేక పారిపోయిరి. బ్రహ్మ అచ్చటికి వెళ్లి స్తుతించెను. కాని అప్పటికిని కోపము చల్లారనందున లక్ష్మిని పిలిపించిరి. ఆయమ్మ వచ్చి ఆ రూపుచూచి వెరగుపడి కోపమును పోగొట్ట ప్రయత్నించెను, గాని ఆమె ప్రయత్నము నిష్ఫల మయ్యెను. అంతట ప్రహ్లాదుడు దగ్గరకుబోయి సాష్టాంగ నమస్కారములు చేసి చేతులు జోడించుకొని యిట్లు ప్రార్థించెను.

"జయ జయ జితకామజయ దివ్యనామ, జయజయగుణధామ జలధరశ్యామ,జయ జయ పద్మాక్ష జయ భక్తరక్ష, జయ మేరు సమధీరజయ నిర్వికార, జయ శ్రీరమావక్ష జయదుష్టశిక్ష, జయ ధర్మపరిపాల జయ పుణ్యశీల, జయ మునిజనలోల జయ భక్తపాల, జయ భక్త మందార జయ కీర్తిసార, జయ సోమ రవి నేత్ర జయ దివ్యగాత్ర, జయ భువనస్తోత్ర జయపీతవస్త్ర, నీయందుబుట్టును నిఖిలలోకములు, నీయందు పెరుగును నీయందు నణగు, గావున మహితత్వకారణుడైన, జాణవు నీపద జలజయుగ్మములు, కుదురుగా నమ్మిన కుటిలాత్మ నన్ను, కృప

జూడు కృపజూడు ప్రేమతో నిప్పుడు, చపలచిత్తుడనన్ను చయ్యన నేలు, నిపుణతతో బ్రోవు శ్రీనారశింహా" అను అతని ప్రార్థన విని శ్రీనృశింహమూర్తి శాంతమూర్తియై ఇట్లనెను. "ఓవత్సా! ప్రహ్లాదా! నీవు రాక్షసులలో పవిత్రుడవు. నీవు కోరినవరంబులిచ్చెదను కోరుము" అనగా విని ఆబాలుడిట్లనెను. "స్వామీ! మీపాదములయందు సర్వదా నాకు భక్తి యుండనిమ్ము. మా తండ్రికి మంచిగతియిమ్ము." అనివిని శ్రీహరియిట్లు సెలవిచ్చెను. "వత్సా! మీతండ్రి మరియొక జన్మాంతమందు ముక్తినొందును. నీకు నాయందు నిశ్చలభక్తియుండును." అని స్వామి అంతర్థాన మొందెను. పిమ్మట ప్రహ్లాదుడు తండ్రికి అగ్ని సంస్కారాది కర్మలు క్రమముగాజేసి, తరువాత పట్టాభిషేకము నొంది దానవ చక్రవర్తియై రాజ్యము క్రమముగా పాలించుచుండెను.

## శ్రీహరితో ప్రహ్లాదునియుద్ధము.

ప్రహ్లాదుడు ధర్మయుక్తముగా రాజ్యము పాలించుచు తన రాక్షసులు ధర్మప్రవర్తన కలిగి సంచరించునటుల జేసెను. అతని రాజ్యమందలి స్త్రీపురుషులు రాత్రింబగళ్ళు హరిని స్మరించుచుండిరి. ఇట్లు వారు హరిభక్తులగుటచే వారు బలవంతులు, తేజోవంతులై యజ్ఞములు, యాగములు చేయుచుండుటచేత వారికిపంటలు బాగుగపండి ధనవంతులును ఆచారవంతులునైరి. ఆచారము వలన ధర్మబుద్ధి, సత్యము, దయ, వారికి కలిగినవి. అందువలన మాయ నశించి అహింసపుట్టి దానివలన హింస

నేయు క్రూరస్వభావము పోయినది. తరువాత ప్రతి యోగుణము కలిగినది. అందువలన లక్ష్మి వారిని ఆశ్రయించెను. లక్ష్మి విష్ణు శక్తిగనుక వారు శక్తివంతులైరి. మునులు వారికి హవిర్భాగము లిచ్చుచుండిరి. వారి రాజ్యములో రోగము, శోకము, వ్యాధి లేక యమునివలన బాధ లేకయుండిరి.

ఇట్లు రాక్షసు లుండుటచూచి, దేవతలు ఓర్వలేక అందుకు ప్రతీకారము ఏమి చేయుదుమని ఆలోచించి ఒక తపశ్శాలిని ప్రహ్లాదుని సభకుపంపిరి. అపుడు పోవుసరికి ప్రహ్లాదుడు రాచకార్యములు విచారించు చుండుటచేత వెంటనే ఆ బ్రాహ్మణుని పూజింపలేకపోయెను. బ్రాహ్మణుని అనాదరణచేసిన దోషము సంభవించినందున ఆతపశ్శాలి ప్రహ్లాదుని యిట్లు శపించెను. "రాజా! ఎవరి అనుగ్రహము వలన ఇంత గొప్పవాడవైతివో అట్టి శక్తి నిన్ను విడుచును గాక." అది మొదలు అతని బుద్ధి అధర్మమునందు ప్రవేశించెను. అప్పుడతడు ఒకరోజున వేటకు బయలుదేరెను. అడవివెంట బోవుచు నొక చోట నర, నారాయణులను ఋషులు తపస్సు చేయుచుండుట చూచెను. వారివద్ద ధనుస్సు బాణములు క్రిందపడి యుండెను. అవి చూచి, "మీరు మాయఋషులు. కానియెడల తపస్సు చేయువారికి ధనుర్బాణము లెందుకు? ఋషులు జీవహింస చేయుదురా! కాబట్టి మిమ్ములను చంపుట నాకు ధర్మముగాతోచుచున్న"దని వారిపై బాణములు వేసెను. నర,

నారాయణులును బాణములు విల్లున సంధించి యుద్ధమునకు తలపడిరి. అతని బాణములను వారును, వారి బాణములను అత డునునివారించుచు ఏఁడుదినములు రాత్రిపగలు నిరుపమమైన యెడ తెరిపిలేక యుద్ధము చేసిరి. నరుఁడు ప్రహ్లాదుని విల్లు విరిచెను. మరి విల్లు లేక గదతో అతఁడు యుద్ధము చేయగా నారాయ ణుఁడు ఆగదను విరుగగొట్టెను. అంతట ప్రహ్లాదుని మూర్ఛ పడునట్లు కొట్టి, నర, నారాయణులు అంతర్ధానమయిరి. ప్రహ్లా దుఁడు తెలివొంది చూచు సరికి వారు లేనందున ఆశ్చర్యపడి వారు ఋషులు కారనియు, విష్ణు స్వరూపులనియు తెలిసి మనలో తానిట్లనుకొనెను. "నేను పాపాత్ముడను. రాజ్యమత్తు డనై అధర్మముగా వారితో యుద్ధము చేసితిని. నేను తీర్థాట నము చేసికొన్న గాని నాపాపము పోదు" అని ఆలోచించి తన పినతండ్రియైన హిరణ్యాక్షుని కుమారునికి రాజ్యమిచ్చి తాను తీర్థయాత్రలు చేయుటకు బయలు వెడలెను.

## అంధకాసుర పరాజయము.

హిరణ్యాక్షుడు ఈశ్వరుని గురించి ఒకప్పుడు గొప్ప తపస్సు చేసి మెప్పించెను. అందుకు ఆయన ప్రత్యక్షమై వర మడుగుమనగా ఇట్లనెను. "స్వామీ! నాకు మీవంటి కుమా రుడు కావలెను. బలములోను యుద్ధమందును వానికి సమా నులు లేకుండవలెను. మిమ్మును తప్ప అందరని వాడు జయించ గలిగి యుండవలెను. మీరు మాకు తండ్రులు. పార్వతీదేవి

మాకు తల్లి. ఆమెను మోహించిన వాడు చనిపోవచ్చును” మంచిది అట్లే ఇచ్చితినని చెప్పి ఈశ్వరుడు అంతర్ధానమొందెను. పిమ్మట అతనికి కుమారుడు పుట్టెను. వానికి అంధకాసురుడని పేరు పెట్టిరి. వీనికే రాజ్యమిచ్చి ప్రహ్లాదుడు తీర్థయాత్రకు పోయెను. ఈ అంధకాసురుడు క్రమక్రమముగా ప్రబలుడై నందున వాని మాట ఎవరును తప్పలేకుండిరి. వాడు కోరినపుడు మేఘములు, వర్షము కురియుచుండెను. గాలి వీచుచుండెను. సూర్యచంద్రులు ప్రకాశించు చుండిరి. ఇంద్రుడు వాడు కోరిన వన్నియు ఇచ్చుచుండెను. ముల్లోకములయందును వాని యాజ్ఞ నుమన్నింపనివారు లేకుండిరి. వాని బాధలు పడలేక దేవతలు విష్ణుయొద్దకు పోయి మొఱపెట్టిరి. వాడు తన చేత చావడనియు ఇంకను వానికి ఆయువున్నదనియు ఉపాయము ఆలోచించి చంపవలెననియు గనుక వాని బాధలు మరికొంతకాలము అనుభవింపవలెననియు చెప్పి పంపెను. వారందఱును నిరాశులై వారివారి నివాసములకు పోయిరి.

ఒకదినమున అంధకాసురుడు భూలోకమున సంచరించుచు కైలాసపర్వతము వైపు వచ్చుచుండగా అచ్చట లోకజనని యైన పార్వతి వాని కంటబడెను. ఆమెను చూచి మోహించి పట్టుకొనుటకు దగ్గరకు పోగా ఆమె అంతర్ధాన మొందెను. అంతవాడు వెదకి వేసారి ఆమెను ఎందును గానక ఇంటికి పోయి జరిగిన వృత్తాంతమంతయు తన మంత్రులతో చెప్పి విచారిం

చుచు మనోవ్యాధివలన పీడితుడై దినదినము క్షీణించుచుండెను. అంత ప్రహ్లాదుడు తీర్థములు సేవించి యింటికి వచ్చి తన తమ్ముని క్షీణదశ చూచి కారణమేమని అడుగగా జరిగిన దంతయు చెప్పి, ఆ స్త్రీని సంపాదించుటకు ఉపాయము చెప్పుమని అడిగెను. ప్రహ్లాదుడు ఆ మాటలు విని భయపడి ఆమె జగత్తులకు తల్లి యనియు, ఆమెయందు అట్టి కోరిక తగదనియు పర స్త్రీని కోరుట దోషమనియు చెప్పెను. ఇంతేకాక ఆమె ఈశ్వరునిక ఇల్లాలనియు, ఈశ్వరుడు ముల్లోకములను నిముసములో దహింపగలడనియు, ఆ వాంఛను విడువనియెడల, మృతి నిశ్చయమనియు చెప్పి, వానికి దేవీ మహాత్మ్యము బోధించెను.

## దేవీ మహాత్మ్యము.

ఇట్లు మనో వ్యాధివలన కామజ్వర పీడితుడగు తమ్మునికి ఇంకను బోధపరుపవలెనని ఆ దేవి మహాత్మ్యమును గురించి ప్రహ్లాదుడు ఇట్లు చెప్పెను. ఒక దినమున ప్రమథగణములు చుట్టును సేవించుచుండగా శ్రీ మహాదేవుడు కైలాసమున కొలువుదీరి యుండగా వారిని చూచుటకు బ్రహ్మ అచ్చటికివెళ్లెను, వానిని ఆదరించి కూర్చుండ నియోగించి, ఇటువచ్చుటకు కారణమేమని ఈశ్వరుడు అడిగెను. మహిషాసురుడు ఎట్లు చచ్చునని బ్రహ్మ అడిగెను. అది విని మహేశ్వరుడు శ్రీహరిని తలంచెను అప్పుడు శ్రీ మహావిష్ణువు గరుడ వాహనుడై అచ్చటికి విచ్చేసెను. వారు ముగ్గురును

స్నేహాభావమున ప్రేమతో ఒకరి నొకరు చూచుకొనిరి అప్పుడు దివ్యమంగళ విగ్రహమువంటి ఒక స్త్రీ పుట్టెను. ఆమె తెలుపు, నలుపు, ఎఱుపు కలిసిన శరీర వర్ణము కలిగియుండెను. ఆమె పదునాలుగు లోకములలోను చక్కనిది. త్రిమూర్తులును ఆమెను చూచి యిట్లనిరి. "నీవు ఎవరు? ఏందు కిచ్చటికి వచ్చితివి" అని అడుగగా నేను మీ శక్తిని. మీ చూపులవలన ఇప్పుడే పుట్టితినని చెప్పెను. "అట్లైన నీపేరు త్రికళ. నీమూడు కళలతోను మూడు రూపములు పొందుము." అనిరి. వెంటనే ఆమె మూడు రూపములు గల ముగ్గురు స్త్రీలై నిలచెను. తెల్లని వర్ణముగల స్త్రీ శ్వేత పర్వతమునకును, ఎఱ్ఱని వర్ణము గల స్త్రీ మందర పర్వతమునకును, నలుపు వర్ణము గల స్త్రీ నీలపర్వతమునకును పోయి అచ్చట తపస్సుచేయుచుండెరి. శ్వేత వర్ణముగలది బ్రహ్మశక్తియైన సరస్వతి. రక్త వర్ణము గలది విష్ణు శక్తియైన లక్ష్మి. కృష్ణవర్ణము గలది ఈశ్వరుని శక్తియైన మహాకాళి. శ్వేతవర్ణముగల సరస్వతి చాలకాలము తపస్సు చేయుచుండగ ఒకదినమున ఆమె మనస్సు చలించెను. అప్పుడామెకు కోటిమంది కన్యకలు వెంటనే పుట్టిరి. ఆమె వారందరకు ఆ మందర పర్వతమున అన్ని దివ్యభవనములు కావలెనని కోరగా అవి వెంటనే సిద్ధముగానుండెను. అందు వారిని ప్రవేశ పెట్టి వారికొరకు తగినన్ని నూతులు, చెరువులు, ఉద్యానవనములు సిద్ధముచేయించెను. వారందరకు అన్ని పేర్లు పెట్టి వారి

వలన తాను తనకు కావలసిన పనులు చేయించుకొనుచుండెను. ఇట్లు ఆమె సుఖము లనుభవించుచు రత్న సింహాసనమున కూర్చుండగా ఒకనాడు నారద మహాముని ఆమెను దర్శింప బోయెను. ఆ ఋషి సాష్టాంగ దండప్రణామము చేయగ, ఆమె అతనిని గౌరవించి కూర్చుండుటకు రత్నపీఠము ఇప్పించెను. పిమ్మట అర్ఘ్యపాద్యములిప్పించెను. ఆమె అతనిని చూచి "ఓ మునీ! నీవు గొప్ప ప్రభావముగలవాడవు. కలహప్రియుడవు. జగడములే కోరుచుందువు. ఇప్పుడెందుండి రాక ఎందునిమిత్తము" అని అడుగగ "ఓ తల్లీ! నేను బ్రహ్మలోకము నుండి స్వర్గమునకు పోగా అందు ఇంద్రుడు విచారముతో నుండుట చూచి, కైలాసమునకు వెళ్లి శ్రీ సదాశివుని దర్శనము చేసి, నిను దర్శనముకొరకు యిటు వచ్చితిని" అని మనవి చేసెను. ఇంద్రుడు విచారించుటకు కారణమేమని దేవి యడుగగా నారదుడిట్లనెను. "అమ్మా! మహిషాసురుడను రాక్షసుడు స్వర్గముపై దాడివెడలుటకు సిద్ధపడుచున్నాడని విని ఇంద్రుడు విచారించుచున్నాడు" అని చెప్పి సెలవుతీసికొని పోయెను. పిమ్మట నారదుడు మహిషాసురుని వద్దకుపోయి అతని వలన పూజితుడై యిట్లనెను. "ఓ రాక్షసరాజా! మందర పర్వతమందు నేనొక స్త్రీ రత్నమును చూచితిని. అంత సౌందర్యము జగత్తులో లేదు. ఆమెవద్ద అనేక స్త్రీ లున్నారు. వారును చక్కనివారే! ఆమె నీకు తగిన భార్య కాగలదు. నీవు బ్రహ్మవరము వలన

త్రిలోకములు జయింపగలవు. దేవతలను గెలిచిన ఆమె నీధనము కాగలదు." అని శ్రీహరి ధ్యానము చేయుచు నారదుడు పోయెను.

పిమ్మట మహిషాసురుడు తన యొనమండ్రు మంత్రులను సభ చేసి నారదుని వలన తాను విన్న సమాచారము వారితో చెప్పి, ఆ స్త్రీని స్వాధీనము చేసికొనుటకు ఉపాయ మడుగగా వారు ఆమెవద్దకు దూతను పంపుట మంచిదనిరి. అదివిని తన మంత్రులలో నిగుల చూపరుని పిలిచి తన చరిత్ర ఆమెతో చెప్పి పంపెను. తాను యుద్ధసన్నద్ధుడై స్వర్గలోకముపై పోయెను. ఇంద్రునితో ఘోరముగా యుద్ధముచేసి గెలిచెను. దేవతలతో ఇంద్రుడు పారి పోయి బ్రహ్మతో చెప్పుకొనెను.

## మహిషాసురుని జననము.

మహిషాసురుని వలన పంపబడిన దూత మందర పర్వతమునకుపోయి దేవి సన్నిధానమున ప్రవేశించి సాష్టాంగపడి నమస్కరించి, నక్షత్రముల మధ్యనున్న చంద్రునివలె చెలికత్తెలనడుమ రత్నసింహాసనమున కూర్చున్న దేవిని జూచి యిట్లు తనరాక విన్నవించెను. "అమ్మా ! నేను మహిషాసురుని వలన పంపబడినదూతను. సింధుద్వీపమున, మాహిష్మతీపురమను పట్టణముగలదు. దానిని విప్రజిత్తను రాక్షసరాజు పాలించుచుండెను. ఆయనకొక కుమార్తెగలదు. ఆమెపేరు మాహిష్మతి. ఆమె త్రిలోకసుందరి. ఆమె తన చెలికత్తెతో వనవిహారము చేయ మం

దరపర్వతప్రాంతతపోవనమునకుపోయి అచ్చట తపస్సుచేయుచు
న్న ఋషినిచూచి అతనిని భయపెట్టి అందుండి వెడలగొట్ట
దలంచి తాను తన సఖులతో అడవి గేదెలరూపము ధరించి
ఆమునిని బెదిరింపగా ఆయన తనతపోమహిమవలన ఈవేషధార
ణము తెలిసికొని "ఓదుర్మార్గురాలా! నీవును నీసఖులును,
నూరు సంవత్సరములు వరకును గేదెల రూపములతో నుందురు
గాక" అని శపించెను. అతనిని ఆమె భయపడి శాపపరిహారము
వేడగా "నీవొక కుమారుని కనునవరకు ఇట్లుందుము" అనెను.
అదిమొదలు వారందరును మహిష రూపములతో నుండి అడవు
లలో సంచరించు చుండిరి. ఆవనంబున ఒకఋషి తపస్సుచే
యుచు ఆకాశమార్గమున విమానముపై బోవుచున్న అప్సరసను
చూచి కామాతురుడయ్యెను. అంతట అతని తేజస్సుమహిషరూ
పమునన్న మహిష్మతి అప్పుడే ఆమెకు సద్యోగర్భమున ఒక
కుమారుడు పుట్టెను. ఆమె వాని నిచ్చట విడచి తాను శాప
విముక్తయె నిజరూపమును పొంది ఇంటికిబోయెను. తరువాత
ఆపిల్లవాడు క్రమముగ పెరిగి పెద్దవాడై ఘోర తపస్సుచేసి
బ్రహ్మను మెప్పించి గొప్ప వరములుపొంది మహా పరాక్రమము
గలవాడై ముల్లోకములను జయించి రాజయ్యెను. వానిపేరే
మహిషాసురుడు. వానిని దేవతలు, రాక్షసులు, నాగులు పూజిం
చుచున్నారు. వానిని నీవు భర్తగా వరింప ప్రార్థించెదను."
అని చెప్పగా ఆదేవి విని యూరకుండెను. అప్పుడు ఆమె చెలి

కత్తెలలో నొకతె ఇట్లనెను. "ఓయీ! నీవు దూతవు. నీప్రభువు చెప్పుమన్నమాటలుచెప్పితివి. మారాణి కుమారీవ్రతము పూనీ యున్నది. ఈజన్మకు ఇట్లేయుండును. మేము ఆమె తోటివా రము. నీవు ఇచ్చట నిముసమైననిలువక వచ్చినదారినే పొమ్ము" ఆమాటలువిని దూత తన ప్రభువైన మహిషుని వద్దకు పోయి జరిగినదంతయు మనవి చేసెను.

## మహిషాసురుని వధ.

దూత మాటలు విని రాక్షసుడు కోపావేశుడై ఆ దేవిని బలాత్కారముగ తెచ్చుటకు ఉద్దేశించి యుద్ధ సన్నద్ధుడై మంద దర పర్వతమునకు పోవుచుండెను. ఇట్టి సమయములో నార దుడు, దేవి యొద్దకు పోయి నమస్కరించి యిట్లనెను. " ఓ జగ జ్జననీ ! ఇంద్రుడు నన్ను మీ వద్దకు పంపగా వచ్చితిని. మహి షాసురుడు బ్రహ్మ వరమువలన త్రిలోకములను జయించి రాజై అందలి ప్రజలను, దేవతలను, ఋషులను, చాల బాధింపు చున్నాడు. ఆ బాధలను సహింపలేక వానిని సంహరింప ప్రార్థింపుమని దేవతలు నన్ను మీవద్దకు పంపిరి. ఆ రాక్షసుడు మిమ్ములను బలవంతముగ తీసికొని పోవుటకు మీ పైకి సైన్య ములతో వచ్చుచున్నాడు. వానిని చంపు మార్గము చూడుము" అని అంతర్ధానమయ్యెను. అంతట రాక్షసుని భేరీ నాదంబులు వినబడగా ఆ దేవి తన పరివారమును "చూచి సిద్ధపడుడు. అదిగో రాక్షసుడు వచ్చుచున్నాడు. వానిని చంపవలె"ననగా

అందరును యుద్ధమునకు సిద్ధపడిరి. సంకులకలహము జరిగెను. అందు రాక్షసులు అందరు చచ్చిరి. మహిషాసురుడు మాత్రము మిగిలియుండెను. అప్పుడు దేవి రుద్రుని తలంపగా, ఆయన ప్రత్యక్షమయ్యెను. ఆమె ఆయనను సాక్షిగ చూచుచుండు మని రాక్షసునితో వింత వింతలైన పలువిధములగు ఆయుధ ములతో వినోదముకొరకు యుద్ధము చేయుచుండెను. అది చూచి ఈశ్వరుడు ఆమెతో "ఇట్లు ఎంతసేపు" అనగా దేవి, వానిని క్రింద బడద్రోసి ఒక చేత వాని జుట్టు పట్టు కొని రెండవ చేత వాని మెడ నరికి పారవైచెను. అప్పుడు శరీరమునుండి ఒక పురుషుడు బయటికి వచ్చి దేవికి నమ స్కరించి స్వర్గమునకు పోయెను. దేవతలు దేవిని బహుస్తో త్రములు చేసి ఆమెపై పుష్పవర్షము కురిపించిరి. వారిప్రార్థనలకు దేవిసంతసించి వరమడుగుమనగా వారిట్లనిరి. "ఓతల్లీ! మమ్ములను ఆపదలనుంచికాపాడుచుండుము. మీ ఈచరిత్రము చదివిన వారి కోర్కెలు నెరవేర్పుము. అంతేచాలును." అట్లే కటాక్షించితినని దేవి అంతర్ధానమొందెను. అని దేవి మహాత్మ్యము ప్రహ్లాదుడు అంధకాసురునికి బోధించి ఆదేవి మహిమ దేవతలకే తెలియదు. ఆమెను అపహరించుటకు ప్రయత్నించుట వలన నీవు బహు పాపాత్ముడవైతివి. కావున ఈ పాపబుద్ధి విడువుము. ఆమెను శరణుజొచ్చిన మనము సంపదలను పొందుదుము. అగమ్యాగమనము వలన పాపము, దానివలన అధర్మము, దాని

వలన దారిద్ర్యము సంభవించును. అందువలన లక్ష్మి విడచి పోవును. దాని వలన ఐశ్వర్యము పోవును. అదిపోయిన బలము పోవును. పిమ్మట ఎవరును లక్ష్య పెట్టరు. లక్ష్యపెట్టకపోయిన అధికార ముండదు. అంతట ఆయువు క్షీణించును. ప్రాణము లను పాశములచే బంధించి యమదూతలు తీసికొని పోయి నరకములో వేయుదురు. అక్కడబాధ లనుభవింపవలసి యుండును. ఇన్నిటికిని పాపమే మూలము. కాబట్టి పాపబుద్ధి విడచి, ఆ దేవిని శరణు వేడుము. అట్లుచేసిన ముల్లోకములకు అధిపతివయి సిరి సంపద లనుభవింపుచు సుఖించి, కీర్తిని సంపాదించి దేహాం తమున స్వర్గాదిభోగములను పొందుదువని ప్రహ్లాదుడు చెప్పగా విని అంధకాసురుడు ఊరకుండెను.

## గౌతమ రహస్యము.

పూర్వకాలమున వేలకొలది మునులు శ్రీ సదాశివుని నిమిత్తము దేవదారు వనమునందు తపస్సు చేయుచుండిరి. ఆ కాలమున వర్షములు లేక పంటలు పోయెను. పండ్లు, కాయలు దుంపలు మొదలగునవియును దొరకనందున వారికి ఆహారము లేక బాధపడి గౌతమ మహర్షి ఆశ్రమమునకు వెళ్లగా ఆయన వారిని ఆదరించి అన్నపానము లిచ్చి పోషించుచుండెను. కొంత కాలమునకు వర్షములు కురియుగా పంటలు పండెను. వృక్షములు ఫలించెను. కాలమాన స్థితి బాగుగ నుండెను. అదిచూచి మునులు తమ తమ నెలవులకు పోవుదుమనిరి. కాని మరికొద్ది

కాలముండుడు. కాలము బాగుగ నున్నది గనుక మునుపటికన్న బాగుగా నేను మీకు సత్కారము చేయుదును." అని గౌతముడు చెప్పినందున మరికొంత కాలముండిరి. ఆదినములలో వారు మాయగోవు నొకటి దానిని సిద్ధము చేసి ఆయన కిచ్చిరి. దాని మర్మమెరుగక ఆయన దానిని గో శాలయందు కట్టబోగా అది క్రిందపడెను. అదిచూచి వారు ఆయనతో "గోహత్యచేసిన ఇంట యెట్లు భుజింతుమని" పలికిరి. గౌతముని పాపినిచేసి పోయిరి. ఆయన తన తపోమహిమవలన వారి కృత్రిమము తెలిసికొని వారు మహా పాపులై అడవులయందు తిరుగుచుందురనియు, వేద బాహ్యములైన పనులు చేయుచు పుట్టుచు చచ్చుచుందురనియు శపించెను. ఈ శాపమువలన వారు పాపులై హరిహరులను ప్రార్థింపగా వారు ఆ ఋషిని హరిహరులు ఒకచోట కలిసి యిట్లు సంభాషించిరి.

హరుడు గౌతముని శాపము వలన అపవిత్రులైన ఈ మునులు ఎట్లు పవిత్రులగుదురు ?

హరి:—వీరికి ప్రతికారము లేదు. ఏమనగా వేదమే అన్నిటికిని మూలము. మొదలు లేనప్పుడు కొమ్మ లెట్లుండును.

హరుడు:—మరి వీరికి మార్గము లేదా ?

హరి:—వేరుమార్గ మున్నది. ధర్మహీనులు నరకమున పడుదురు. వీరికి దేగతి. చేసిన కర్మఫలము అనుభవింపవలదా ?

హరుడు:—వీరుతిరిగి మనలను ధ్యానించుచున్నారే ! మన చేతనైన యుపకారము చేయుదమా !

హరి:—అయిన నిట్టిపాపులను రక్షించుటకు మనము క్రొత్తశాస్త్రములను కల్పింపవలెను.

హరుడు:—అట్లే చేయుదము.

ఇట్లు ఇద్దరును ఆలోచించి, కపాలము, నకులము, భైరవము, పంచరాత్రము మొదలగు కొన్ని గ్రంథములు చేసిరి. వీనికి మోహన గ్రంథములని పేరు.

శ్రీమహాదేవుడు వారితో ఇట్లనెను. మీరు ఇదివరకు యెన్నిసారులు నరకములలో పడితిరో గాని ఇప్పుడు, మనుష్య జన్మముఎత్తితిరి. ఈ జన్మలో మాసేవచేసినందున ఈ గ్రంథములు చదివి, వానిబలము వలన పాపములను నశింప జేసికొని మమ్మును పొందగలరు. అని వారితో చెప్పి వారి మేలుకొరకు తానును, భస్మమును శరీరమున పూసికొని, చేత కపాలమును, జడయందును మెడలోను పుర్రెకెలమాలలను ధరించి యోగియై వారితో కలిసి భిక్షాటనము చేయుచుండెను. శివుడు ఎంత దయాళుడో చూచితిరా ?

శివుడు యోగి అవుటచూచి పిల్లలను విష్ణువునకు ఒప్పగించి, కైలాసమందు ప్రమధ గణములను కాపుంచి, పార్వతి మందరపర్వతమునకు పోయి తపస్సు చేయుచుండెనట. ఆమె పరిచర్యకొరకు దేవతాస్త్రీలు ఆమెకు చెలికత్తెలై అం దుండిరట. అట్లు కొంతకాలము జరిగినపిమ్మట శ్రీమహాశివుడు కైలాసమునకు వేంచేసినసంగతి విని పార్వతీదేవియును కైలాసమునకు వెళ్ళి భర్తతో కలిసికొనెను.

శ్రీ వరాహపురాణము సమాప్తము.

---

# అష్టాదశ పురాణ సారసంగ్రహము

## శ్రీ వామన పురాణము.

ఒకనాడు పులస్త్య మహాముని తన ఆశ్రమములో నుండగా దేవఋషియైన నారదమహాముని ఆయనను దర్శింపబోయెను. పులస్త్యుడు ఆయనకు అర్ఘ్యపాద్యాది సత్కారములు చేసి కూర్చుండబెట్టెను. ఆ దేవముని పులస్త్యుని జూచి "స్వామీ మీరు సమస్త శాస్త్రములు, పురాణములు, వేదములు, వేదాంతములు తెలిసినవారు. మీవలన వామన పురాణము సవిస్తరముగా వినవలెనని యిటకు వచ్చితిని. నాయందు దయయుంచి సెలవియ్యవలయును." అనగా విని పులస్త్య మహాముని చాల సంతోషించి, ఆ దేవర్షితో ఇట్లు చెప్పెను.

### 1. పార్వతి పరమేశ్వరులు ఋతుత్రయము గడపుట.

పూర్వమొకప్పుడు పార్వతీ పరమేశ్వరులు, మందర పర్వతముపై నుండగా గ్రీష్మఋతువు ఆరంభమయ్యెను. అప్పుడు మహేశ్వరి మహేశ్వరునితో ఇట్లు పలికెను. 'నాథా! ఈగ్రీష్మము చాల హెచ్చుగా నుండుటచే వేడి భరింపశక్యముకాదు. మనకు ఇల్లు లేదుగదా? ఎచ్చటనుండి మనమీ సూర్యుని బారినుండి తప్పించుకొందము." అన విని శివుడిట్లనెను. "ప్రాణేశ్వరీ! నేను సదా అరణ్యనివాసిని. ఆశ్రమము లేని

వాడను" అనగా విని పార్వతీదేవి ఈశ్వరుని తీసికొని ఒక చెట్టు క్రిందకుపోయి ఆమండు వేసవికాలము కష్టముతో గడపెను. అంతట వర్షకాల మారంభమయ్యెను. దిక్కులు చీకటితో నిండెను. బాటలు కనబడవయ్యెను. ఆకాశము మేఘములతో నిండియుండెను. మెరుపులతో, ఉరుములతో. పిడుగులు పడుచుండెను. అప్పుడామె భర్తను చూచి యిట్లనెను. "ప్రాణవల్లభా! గాలి వడిగా వీచుచున్నది. ఉరుములు భయంకరముగా ఉన్నవి. వాన తెరిపిలేక కురియుచున్నది. చెట్లు పెరిగి పుష్పాలు పూచి, కాయలు కాచి, పండ్లు పండుచున్నవి. చీరకట్టి అలంకారములు ధరించిన స్త్రీవలె భూమి అందముగా నున్నది. నదులు పొంగలి పారుచున్నవి. సరస్సులు నీళ్లతో నిండియున్నవి, పద్మములు పూయుచున్నవి. ఇట్టివర్షకాలమున చెట్టుక్రింద నుండగలమా? కావున, ఈ పర్వతమున ఇల్లు కట్టింపుమని ప్రార్థించెను." ఆమాటలు విని శివుడు ఇట్లనెను. "ప్రియసఖి! నీవు చెప్పినట్లు ఇల్లుకట్టింపవలసినదే, గాని నేను బీదవాడను. ధనమెక్కడ తెత్తును. చూచితివా నాశరీరము మీద బట్టయైనను లేదు. పులి చర్మము కప్పుకొని అడవిలో తిరుగుచున్నాను. జన్నిదము లేక నాగోపవీతము ధరించితిని. అలంకారములు లేక పాములను కుండలములుగా బెట్టికొంటిని. సర్పములను కంకణములుగాను, నల్లత్రాచును కంఠాభరణముగాను చేసికొంటిని. ఆయన మాటలకు లజ్జయును, భయమును, కోపము

గలవై తలవంచుకొని అట్లయినచో చెట్లక్రిందనే ఉండుమనెను. అది విని మేఘములపైకి పోవుదము రమ్మని ఈశ్వరు డనెను. సరే యని మేఘములపైకి పోయి వారు వర్షకాలము గడపిరి. మరికొంత కాలమునకు శరదృతువు ప్రవేశింపగా మేఘము లదృశ్యమయ్యెను. నదీసరోవరములందలి నీరు నిర్మలమయ్యెను. వెన్నెల తేటగా నుండెను. గోవులు అంభారవము చేయదొడగెను. అప్పుడు శివుడు పార్వతిని చూచి మందరపర్వతమునకు పోదము రమ్మని బయలు వెడలి అందు చేరిరి.

## 2. ఈశ్వరుని బ్రహ్మహత్య.

2. పులస్త్యునిజూచి నారదమహాముని మహాత్ముడైన ఈశ్వరునికి బ్రహ్మహత్య యెట్లు సంభవించెనని యడుగగా అత డిట్లు చెప్ప నారంభించెను. "త్రిమూర్తులు సృజింపబడిన తరువాత ఒకప్పుడు బ్రహ్మవద్దకు ఈశ్వరుడు పోయి మహా కోపముతో ఇట్లనెను. ఓయీ! నీవెవరు? ఎందుండి వచ్చితివి? నీ తలిదండ్రు లెవరు?" అని యడిగిన బ్రహ్మప్రత్యుత్తరము చెప్పక "నీ వెవరు? నీ వెందుండి వచ్చితివి? నీ తలిదండ్రు లెవరు? ఎందుకు ఇందువచ్చితివి?" అని తిరిగి ఈశ్వరుని ప్రశ్నించి తలవంచుకొని ఊరకుండెను. అది చూచి శివుడు కోపపరవశుడై యుండెను. బ్రహ్మ ఆయనను చూచి "ఓ రుద్రుడా! నీసంగతి నాకు తెలియును. దిగంబరుడవు, ఎద్దునెక్కి తిరుగువాడవు, నేచేయు సృష్టి నాశనము చేయువాడవు" అనగా మరియు నుగ్రుడై శివుడు

మూడు కన్నులను విప్పి భయంకరముగా నుండి బ్రహ్మను భస్మముచేయుటకు చూచెను. కాని సాధ్యముకానందున గోళ్ళతో బ్రహ్మయొక్క ఒక ముఖమును ఖండించెను. అది శివుని యెడమచేతియందు అంటుకొనెను. ఎన్నివిధముల దానిని వదలించుకొనుటకు ప్రయత్నించినను అదివదలకయుండెను. అంతట బ్రహ్మ తన శరీరమునుండి ఒక అద్భుతమైన పురుషుని సృష్టించెను. వాడు మిక్కిలి భయంకరరూపము కలిగి ఆయుధములతో శివుని వైపు తిరిగి "ఓ బ్రహ్మహత్యాపాతకీ ! నీ ముఖము చూడకూడదు. నిన్ను ముట్టకూడదు. కనుక నిన్ను చంపను. నీతో మాట్లాడ కూడదు. ఇచ్చటనుండి వెంటనే పొమ్ము. అనగా ఈశ్వరుడు బదరికాశ్రమమునకు పోయెను. కాని బ్రహ్మ శిరస్సు చేతిని వదలక అంటియుండుటచేత మిగుల దుఃఖించుచు అనేక తీర్థ స్నానములుచేసి, దేవతా దర్శనములు, ఉపవాసములు, తపస్సులు చేసినను కార్యములేకుండెను. ఆ బదరికాశ్రమమున నున్న నారాయణుని దర్శించి స్తోత్రములు చేసి ప్రార్థింపగా ఆయన ప్రసన్నుండై ఇట్లనెను. "ఓ మహేశ్వరా ! నీవు ప్రయాగకు పోయి స్నానము చేసి పిమ్మట వరుణ, అసి అను రెండు నదులమధ్యనున్న భూమియందు యోగశాయియైశ్రీహరి యున్నాడు. ఆనదులయందు విధ్యుక్తముగా స్నానముచేసి ఆయనను దర్శించి పూజించిన నీమహాపాపము నశించును" అని ఆన తీయగ శివుడుఅట్లుచేసి బ్రహ్మహత్యా పాతకమును నశింప జేసి

క్కొనెను. కాని బ్రహ్మశిరస్సు చేతినివదలలేదు. అంతడుతిరిగి శ్రీమ న్నారాయణుని యొద్దకుబోయి మనవిచేసెను "ఓస్వామి! నాపా పముపోయెనుగాని కపాలమువదలలేదు." అనగా ఓశంకరా! నా యెదుటనున్న సరస్సులో విధ్యుక్తముగా స్నానముజేయుము" అనెను. అట్లు చేయగా కపాలము జారిపడెను. కనుక ఆనాటి నుండి ఆతీర్థమునకు కపాల మోచనమని పేరువచ్చెను. ఇన్ని కష్టములుపడినగాని ఈశ్వరునివంటి సర్వేశ్వరునికి బ్రహ్మహత్యా పాపము పోయినదికాదు. మనమనగా నెంతవారము ?

## ౩. సుకేశుడను రాక్షసుని చరిత్రము.

నారదుడు మరల పులస్త్యునిజూచి "ఓమునివర్యా! సుకే శుడను రాక్షసుని చరిత్రము నాకు సవిస్తరముగా చెప్పుడని అడుగగా ఆయన ఇట్లు చెప్ప మొదలుపెట్టెను.

నారదా! వినుము. ఇది మిక్కిలి పురాతనమైన ఇతి హాసము. దీనిని నేను పూర్వము విన్నట్లు చెప్పెదను. పూర్వ కాలమున విద్యుత్కేశుడను రాక్షసు డొకడుండెను. వానికి సుకేశుడను కుమారుడుండెను. ఇతడు ఘోరమైన తపస్సుచేసి శివుని మెప్పించెను. ఆమహాదేవుడు వానికి ప్రత్యక్షమై "ఎవరివలనను చావు లేకుండునట్లులను, యుద్ధములో వాని నెవ రును జయించ లేకుండునట్లును, వరమిచ్చుటయేకాక ధర్మము నందు బుద్ధినిలుచునట్లు వరమిచ్చెను. ఆసుకేశుడుధర్మవర్తనము గలవాడై తన యిచ్ఛవచ్చినచోటికి పోవుచుండువాడు. ఒకదిన

మున వాడు మగధరాజ్యమందున్న అడవికిపోయి అందు తపస్సు చేయుచున్న కొందఱు మహర్షులను జూచి నమస్కరించి ఉచితాసనమున కూర్చుండి వారితో ఇట్లనెను. "ఓమునిశ్రేష్ఠులారా! నాకొక సందేహము కలదు. దానిని తమరు తీర్పవలెను.

మహర్షులు:—ఓరాక్షసకేసరీ! ఆ అంశమేమి?

సుకేశుడు:—ఇహపర లోకములందు మేలు చేయునది ఏది?

మహర్షులు:—రెండు లోకములందును ధర్మము మేలొనర్చును.

సుకేశుడు:—సజ్జనులు ఎవరిని పూజింతురు?

మహా:—ధర్మపరుడే సజ్జనులచే పూజింపబడును.

సుకే:—సుఖముగా ఎవరు వృద్ధిపొందుదురు?

మహా:—ధర్మాత్ములే సుఖముగా అభివృద్ధి పొందుదురు.

సుకే:—ధర్మలక్షణమేది? ఏమంచిపనులకు ధర్మమందురు? దేనివలన దేవతలు వృద్ధత్వము, మరణములేక యున్నారు? సవిస్తరముగా సెలవిండు.

మహా:—దేవతలకు యాగము చేయుట, విష్ణువును పూజించుట, ధర్మములు. రాక్షసులకు బాహుబలము, యుద్ధము చేయుట, మత్సరము కలిగియుండుట ధర్మములు. నీతిమంతులకు హరిభక్తి. సిద్ధులకు యోగసిద్ధి, వేదపఠనము, ఆత్మజ్ఞానము

విష్ణుభక్తి, శివభక్తి, ధర్మములు. ఋషులకు జపము, తపము, జ్ఞానము, సాంఖ్యము, బ్రహ్మచర్య వ్రతము, విజ్ఞానసమాధి. మనుష్యులకు వేదపఠనము, యజ్ఞములు చేయుట, కార్పణ్యబుద్ధి లేకుండుట, పరస్త్రీని ఆయాసపడకుండుట, బ్రహ్మచర్యము, దానము చేయుట, అహింస, దయ, క్షమ, శుచిత్వము, దేవుడు, సూర్యుడు, వీరియెడల భక్తి సులభములు చేయుచుండుట, ఇంద్రియములను జయించుట ధర్మములు. ఇట్లు ధర్మములు వేరు వేరుగా నుండును. వీనిని విధించినాడు బ్రహ్మ.

సుకేశి:—ఇవి సామాన్య మనుష్యులకు సనాతన ధర్మములు. ఇవి గాక విశేషధర్మములున్న సెలవిండు.

మహా:—ద్వీపభేదములను బట్టి ధర్మములు భేదించి యుండును.

ద్వీపములలో జంబూద్వీపము శ్రేష్ఠము. ద్వీపముల విస్తీర్ణము వినుము.

| ద్వీపములు. | విస్తీర్ణము. | సముద్రములు | విస్తీర్ణము |
|---|---|---|---|
| 1 జంబూద్వీపము | 1 లక్ష. | ఉప్పుసముద్రము | 2 ల॥లు |
| 2 ప్లక్షద్వీపము | 2 ల॥యో | ఇక్షుసముద్రము | 4 ల॥లు |
| 3 శాల్మలీద్వీపము | 4 లక్షలు | సురాసముద్రము | 8 ల॥లు |
| 4 కుశద్వీపము | 8 లక్షలు | నేతిసముద్రము | 16 ల॥లు |
| 5 క్రౌంచద్వీపము | 16 | పెరుగుసముద్రము | 32 ల॥లు |
| 6 శాకద్వీపము | 32 | క్షీరసముద్రము | 64 ల॥లు |
| 7 పుష్కరద్వీపము | 64 | మంచినీళ్లసముద్రము | 128 ల॥లు. |

పై చెప్పబడిన ద్వీపములందున్న మనుష్యులువారి ఆచారములు వ్యవహారములు వేరువేరుగా నుండును. మనమున్నది జంబూద్వీపము ఇదిచాలాపవిత్రమైనది. ప్లక్షద్వీపము మొదలు శాక ద్వీపమువరకును ఈ అయిదు ద్వీపములందుండు వారు భాగ్యవంతులు దేవతలవలె సుఖముగ జీవించుచు కల్యాణము వరకును ఉందురు. వారి ధర్మములు దేవతలకు చెప్పబడినవే, పుష్కరద్వీపమువారు భయంకరాకారము కలిగి పిశాచములవలె నుందురు. వివేకము జ్ఞానము, దయ, సత్యము, ఆచారము మీరు లేవు. మాంసమునే భక్షించుచుందురు. ఘోర మరణమును పొందుచుందురు.

సుకే—వారట్టివారగుటకు కారణమేమి ? దయచేసి చెప్పుడు.

మహర్షులు:—ఆ పుష్కరద్వీపమునందు రౌరవము మొదలగు ఇరువదియొక్క మహా నరకము లున్నవి. కావున అవి మహా భయంకరమైనవి.

సుకే:—రౌరవము మొదలుగాగల నరకములను నాకు వివరించి స్పష్టముగా చెప్పుడు.

మహర్షులు:—నరకములుఏవనగా, 1. రౌరవము 2. మహారౌరవము 3. తామిస్రము 4. అంధతామిస్రము 5. కుంభీపాకము 6. కాలసూత్రము 7. అసిపత్రవనము 8. సూకరముఖము 9. అంధకూపము 10. క్రిమిభోజనము 11. సందంశము 12. తప్త

ర్మి 13. వజ్రకంటకశాల్మలి 14. వైతరణి 15. పూయోదము 16. ప్రాణరోధము 17. విశసనము 18. లాలాభక్షణము 19. సారమేయాదనము 20. అవీచిరయము 21. లోహపానము ఇవిగాక 1. క్షారకర్దమము 2. రక్షోగణభోజనము 3. శూల ప్రోతము 4. దందశూకము 5. పర్యావర్తనము 6. అవటనిరోధము 7. సూచీముఖము అను ఏడును కలసి 28. నరకములని మరి కొందరు. పాపములు చేయువారని యముడు ఈ కూప ములలో వేసి శిక్షించును.

సుకేశుడు:—ఏ పాపములు చేయువారని యముడు ఎట్లు శిక్షించునో చెప్పుడు

మహర్షులు ఇట్లు చెప్పనారంభించిరి. వేదములను శాస్త్ర ములను నిందించువారు, పురాణములు, ఇతిహాసములు చదువని వారు, వినని వారు, అవి సత్యములని నమ్మనివారు, పెద్దలను నిందించువారు, యజ్ఞములు, యాగములు చేయువారు, ధర్మములు చేయువారని ఆటంకపెట్టువారు, చనిపోయిన నర కములో పడుదురు. అచ్చట అనేక బాధలు పొందుదురు. ఇతరులకు విచారము కలిగించువారును, దేవతాపితృకార్యముల యందు భోజనమునకు నియమింపబడి మరియొకచోట భు జించువారును, సజ్జనులను బాధించువారును, తల్లి దండ్రులను, గురువులను మన్నించని వారును, క్రిందికి తల, మీదికి కాళ్ళు ఉండునట్లు నరకములో పడి మలము, మూత్రము భక్షింతురు.

దేవతలను, అతిథి, అభ్యాగతులను, తల్లి దండ్రులను, పిల్లలను ఉపవాసముంచి భుజించువారు నరకములో బడి కుళ్ళు రక్తమును త్రాగుచుందురు. పిమ్మట అశుద్ధమును తిందురు. ఎంగిలిచేతి నుండి బ్రాహ్మణుని, గోవును, అగ్నిని, ముట్టుకొనువారు, చంద్రుని, సూర్యుని, నక్షత్రములను చూచువారికి కండ్లలో యమభటులు, నిప్పులు పోసి మండింతురు. తల్లి దండ్రులు, అన్న, స్నేహితుడు, వాని భార్య, గురువు, వాని పత్ని, బంధువులను కొట్టువారిని ఘోర నరకములో వేసి యఱ్ఱగా కాల్పబడిన మేకులు వాని శరీరముల యందు దిగ గొట్టుదురు. నూతులు, చెరువులు, ఇండ్లు దేవాలయములు, తోటలు చెడగొట్టువారిని రంపములతో కోయుదురు. గోవు, బ్రాహ్మణుడు, అగ్ని, సూర్యుడు, చంద్రుడు వీరికెదురుగా మలమూత్రములు విడుచువారి మర్మస్థానములను ఇనుపముక్కుల కాకులు పొడిచి తినుచుండును. శరణుజొచ్చినవారిని, రక్షింపనివారిని, పర్వదినములలో స్త్రీసంభోగము చేయువారిని, పరదారను మోహించువారిని, జలమందు మలమూత్రములు విడుచువారిని, భక్తిశ్రద్ధలతో పిలిచినప్పుడు భోజనమునకు వెళ్ళనివారిని, ఛండాలుని యొద్ద దక్షిణ పుచ్చుకొనువారిని, వానికి పురోహితుడగువారిని, గోమాంసము అమ్ము వారిని, తినువారిని, బంగారము దొంగిలించువారిని, గురుపత్నిని హరించువారిని, స్త్రీహత్య, శిశుహత్య, బ్రహ్మహత్య చేయువారిని, అబద్ధపు సాక్ష్యము చెప్పువారిని,

నిత్యకర్మలు చేయనివారిని, నరకములో, పడవేసి యముని దూతలు అనేక విధములు బాధింతురు. అబద్ధమాడువారు, అన్యాయము చేయువారు, చాడీలు చెప్పువారు, దొంగిలించువారు, స్వామిద్రోహులు, విశ్వాసఘాతుకులు, మిత్రద్రోహులు నరకము నొందుదురు. అన్నిటికన్న విశ్వాసఘాతుకము గొప్పపాపముగా చెప్పబడినదని మహర్షులు చెప్పగావిని సుకేశుడు సంతోషించెను.

## 4. ఆశ్రమ ధర్మములు

తరువాత సుకేశుడు మునులను గూర్చి బ్రాహ్మణులకు నాలుగు ఆశ్రమములు విధింపబడినవని చెప్పినారు. అవి యెవ్వి? వాని ధర్మము లెవ్వి? సెలవిండు. అని అడిగెను.

ఓ రాక్షసేశ్వరా? వినుము. అహింస, సత్యము, క్షమ, దానము, తపము, శుచిత్వము, దమము, కార్పణ్యము లేకుండుట, దొంగతనము చేయకుండుట, శమము ఇవిఅన్ని ఆశ్రమములవారికిని, అన్ని వర్ణములవారికిని సామాన్య ధర్మములు. బ్రాహ్మణులకు ఆశ్రమములు నాలుగు. అవి ఏవనగా బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము. బ్రాహ్మణబాలుడు ఉపనయనము కాగా గురువునొద్ద వేదముచదువుటకు ప్రవేశించవలెను. అతడుప్రతిదినమును స్నానము ఉదయముననే చేసి సంధ్యావందనాది నిత్యకర్మలు తీర్చుకొని, అగ్నియందు హోమము చేసికొని, వేదము చెప్పుకొన

వలెను. పిమ్మట గురువునొద్ద సెలవుపొంది మధూకరముచేసి దొరకిన పదార్థములను తెచ్చి గురువునెదుటబెట్టి వారు తనకుఇచ్చిన దానిని తినవలెను. వారిసేవ చేయవలెను. ఆయన దయను సంపాదింపవలెను. ఆయన పిలిచిన వెంటనే సిద్ధముగా నుండవలెను. వారుచెప్పిన పాఠమును వల్లించుచుండవలెను. ఇట్లుండి. ఒక వేదమునుగాని, నాలుగు వేదములుగాని తన చేతనైనన్ని వేదములను చదివి గురుదక్షిణ ఇచ్చి, నమస్కరించి, సెలవుతీసికొని ఇంటికిపోయి, మంచి వంశమున బుట్టిన సులక్షణములుగల కన్యను వివాహమాడవలెను. ఇట్లుగృహస్థుఅగును. వివాహము చేసికొనుటకు ఇష్టములేకున్న వానప్రస్థుడు కావచ్చును. లేదా బ్రహ్మచారిగానుండి గురుసేవ చేయుచు ఉండవచ్చును. గురువు లేకపోయిన గురుపుత్రుని సేవింపవలెను. పుత్రుడు లేనియెడల తనకంటె పెద్దశిష్యుని సేవింపవలెను. ఇట్లు చేయువాడు మృత్యువును జయించును.

గృహస్థధర్మములు వినుము. వివాహ మైన తర్వాత నిత్యకర్మల చేయుచు, దానధర్మములు, దేవ, పితృ, అతిథిపూజలు చేయుచు, ధనార్జన చేయుచు, మంచి ఆచారవంతుడై యుండవలెను. ఆచారము లేనివాడు ఇహపరముల యందు సుఖము లేక చెడిపోవును. వాడుచేసిన యజ్ఞములు, తపస్సు, దానము, అన్నియు నిష్ఫలములు. వానికి సుఖము కలుగదు. ఆచారము ధర్మములకు మూలము. కావున దానినిచ్చట స్పష్టముగా చెప్పె

డను. ప్రాతఃకాలమున అనగా కోడి కూయునప్పుడు లేచి ఇష్ట దేవతను స్తోత్రముచే ధ్యానించి, ప్రక్కమీదనుండి లేచి, దేవుని నామములను స్మరించుచుపోయి, కాలకృత్యములు తీర్చుకొని, దేశకులాచారాను గుణ్యముగ స్నాన సంధ్యాద్యనుష్ఠానములు నిర్వర్తింపవలెను. అబద్ధమాడక, కోపముపొందక, ఎవరిని నిష్ఠురములాడక, అతిథి, అభ్యాగతులను పూజించుచు వేళకు భోజనము చేయవలెను. దిగంబరిగా నుండకూడదు. దిగంబరులను చూడకూడదు. ఉత్తరముగగాని, దక్షిణముగగాని తలపెట్టి నిద్రింపగూడదు. స్వగృహమున తూర్పుగాను, ప్రయాణమార్గమున పరస్థలమున పడమరగాను తలనుంచి నిదుర పోవలెను. ఒకరు కట్టివిడచిన బట్ట, ఒకరు ఉపయోగించిన పువ్వులు, పూలదండలు, ఒకరు తినగా మిగిలిన అన్నము, త్రాగగా మిగిలిన నీరు ఉపయోగింపగూడదు. రాత్రి స్నానము చేయకూడదు. గ్రహణకాలములందు చేయవచ్చును. శాస్త్రములను, పురాణములను వినవలెను. నీళ్ళతో జుట్టు దులపకూడదు. సజ్జనులతో సహవాసము చేయవలెను. ఇట్టి సదాచారములతో వర్తించువారు ఇహపరసుఖంబులు కలిగి యుందురు.

వానప్రస్థుల ధర్మమేమనగా :—కుమారులను కుమార్తెలను కని తనకు వృద్ధావస్థ రాగా ఆత్మజ్ఞానమును పొందుటకు వానప్రస్థాశ్రమము అవలంబింపవలెను. అనగా అడవికి పోయి తపస్సుచేయుచు, నేలను పరుండుచు, దుంపలు పండ్లు తినుచు,

బ్రహ్మచర్య వ్రతము చేయుచు శ్రీహరిని ధ్యానించు చుండ వలెను.

సన్యాసి ధర్మము లేవనగా అభిమానమును, సమస్త సంఘములను విడచి బ్రహ్మచర్యవ్రతము కలిగి ఒక యింట బహుదినములుండక భిక్ష మెత్తుకొనుచు, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను వదలి ఆత్మజ్ఞానము కలుగువరకు దేహమును పోషించుకొనుచు జీవించవలెను. ఆత్మజ్ఞానము కలుగుటవలన పూర్వజన్మములందు చేయబడిన పాపము నశించి యీ జన్మ మందలి పాపము, కర్మ త్యాగమువలన నానను పొందక జనుడు మోక్షము పొందును." అని ఋషులు చెప్పగా విని వారియొద్ద సెలవుపొంది సుకేశుడు నిజగృహమున కరిగెను.

బలిచక్రవర్తి ముల్లోకములను జయించుట.

నారదమహాముని పులస్త్య మహర్షి నిజూచి బలిచక్రవర్తి స్వర్గమును ఎట్లు సంపాదించెనని యడుగగా ఆ మహర్షి యిట్లు చెప్పెను.

హిరణ్యకశ్యప మహారాజు కుమారుడగు ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు. విరోచనుని కుమారుడు బలి. ఇతడే రాక్షస రాజయ్యెను. ఇతడు అనేక యజ్ఞములు, యాగములు చేసి శంబరుడు మయుడు అను క్రూర రాక్షసులను జయించి, ధర్మముగా రాజ్య పాలనము చేయుచు రాక్షసులు ధర్మముగా ప్రవర్తించు నట్లును, సత్యము

తప్పకుండా నట్లును, నీతినియమములు కలిగి వర్తించునట్లును చేసెను. ఇందువలన వారి పాపములు క్షీణించి వారు పుణ్యా వంతులైరి. వారిరాజ్యమున ధర్మము నాలుగు పాదములతో నడ చుచుండెను. రాక్షసు లిట్లుండగా ఒకదినమున మహాలక్ష్మి కమ లముచేతబట్టి సభలోనున్న బలిచక్రవర్తి యెదుటికివచ్చి యిట్లు చెప్పెను. "ఓ దైత్యరాజా! నేను క్షీరసాగరమందు పుట్టినమహా లక్ష్మిని. నీవు నీపితామహుడైన ప్రహ్లాదుని పేరు నిలిపితివి. నీ న్యాయపరిపాలన సత్యవ్రతముచూచి సంతోసించి నీయింట కొంత కాలముండుటకు వచ్చితిని." అని అతని యింట నుండెను. అందువలన రాక్షసులు సిరిసంపదలతో తులదూగు చుండిరి. ఆబలి స్వర్గముపై దాడివెడలి ఇంద్రుని జయించి అతని రాజ్య మును తీసికొనెను. అంతకుముందే భూలోకమును జయించి ముల్లోకములకు చక్రవర్తియై ధర్మపాలనము చేయుచుండెను.

### 5. దేవతలు బ్రహ్మయొద్దకు బోవుట.

ఇట్లు రాక్షసులచే నోడింపబడిన దేవతలు విచారము నొంది చేయునదిలేక ఆలోచించి వేరుఉపాయములేక ఇంద్రుని వెంట మేరుపర్వతమున తపస్సు చేసికొనుచున్న కశ్యప బ్రహ్మ యొద్దకు బోయి తమ అవస్థలు చెప్పుకొనగా ఆయన విని విచా రించి యిందుకు శ్రీహరి తప్ప ప్రతీకారము చేయువారులేరని యెంచి వారిని తోడ్కొని తన భార్యయైన అదితితో కూడ బ్రహ్మయొద్దకు బోయెను. వీరు పోవునప్పటికి చతుర్ముఖుడు శత్రు

నాశనియను తన సభలో ఆస్థానమున కూర్చుండి సామగానము వినుచుండెను. అచట ఎందుచూచినను యజ్ఞములు చేయువారు వేదపాఠకులు, తపోవంతులు, ఋషులు ఉండిరి. ఆసమయమందు అదితి కశ్యపులు, ఇంద్రుడు మొదలగు దేవతలు ఆయనకు నమస్కరించి, ఉచితస్థలమున కూర్చుండి ఇట్లు చెప్పిరి. ఓతాతా! మారాజ్యము బలిచక్రవర్తి తీసికొని మమ్ములను హీనపరచి మాచే పరిచర్య చేయించుకొను చున్నాడు. ఈ పరాభవము వలన మేము స్వర్గమున నిలువలేకున్నాము. నూరాజ్యము మరల మాకు స్వాధీనమగు ఉపాయము చెప్పుము" అనగా విని బ్రహ్మ ఇట్లు చెప్పెను. "ఓ కశ్యపా! నీవు గొప్ప తపస్సు చేసి శ్వేతద్వీపమున క్షీరసాగరమందున్న శ్రీమన్నారాయణుని మెప్పించిన ఆయన నీకు ప్రసన్నుండగును. అప్పుడు ఆయ నను నీకు కుమారుడై పుట్టుమనియు, రాక్షసులను ఓడించి ఇం ద్రునకు రాజ్యమిమ్మనియు వరమడుగుము. ఆయన సర్వశక్తుడు గనుక ఆలాగు తప్పక నీకోర్కెదీర్చును." ఆమాటలువినికశ్య పుడు గొప్ప తపస్సుచేసి వేదవ్రతములుచేసి శ్రీమన్నారాయణుని ధ్యానింపగా శ్రీహరి ప్రత్యక్షమై వరమడుగు మనెను. అప్పుడు కశ్యపుడు సాష్టాంగనమస్కారములుచేసి ప్రార్థించి ఇట్లు కోరెను. "ఓ జగద్రక్షకా! అదితి గర్భమున ఇంద్రునికి తమ్ముడనై పుట్టి స్వర్గమును ఇంద్రునికి యిప్పింపుము" అని ప్రార్థింపగా అట్లే చేయుదునని శ్రీహరి ఆనతిచ్చెను. శ్రీహరి వారిని వారి నివాస ములకు పొమ్మని అంతర్ధాన మయ్యెను.

## 6. శ్రీ వామనావతారము.

అనంతరమున దేవతలు తమ లోకమునకును, కశ్య పుడు తపస్సు చేయుటకు మేరుపర్వతమునకును, అదితి తపస్సు చేయుటకు కురుక్షేత్రమున నున్న సర్వకామప్రదవనమునకును పోయిరి. అచట అదితి పదివేల సంవత్సరములు ఘోరముగా తపస్సు చేసెను. అందుకు శ్రీహరి సంతోషించి ఆమెకు ప్రత్య క్షమై దగ్గరనిచ్చెను. అప్పుడు ఆమె ఆయనకు ప్రదక్షిణ నమ స్కారములు చేసి బహువిధముల ప్రార్థించి ప్రసన్నుని చేసి కొని ఇట్లు వేడుకొనెను. "ఓభక్తవత్సలా! దీనరక్షకా! ఆదిమ ధ్యాంతరహితా! నా మొర ఆలకింపుము. నాకుమారుడైన ఇం ద్రునిముల్లోకములకు రాజుగా చేయుము. వానికి యజ్ఞభాగములు ఇప్పించుము. రాక్షసులు తమ రాజ్యములో రాజుగ నుండ నిమ్ము. నామనోవేదనను పోగొట్టుము." శ్రీహరి ఆమెతో ఇట్ల నెను. "దేవీ! నీగర్భమున బుట్టి రాక్షసులను నిర్మూలముచేసి ఎప్పటియట్లు ఇంద్రునికి రాజ్యసంపదలిచ్చెదను." ఆమాటలువిని అదితి దేవదేవునితో నిట్లనెను. "ఓజగదీశ్వరా! నేను సామాన్య మైన స్త్రీని, చతుర్దశభువనములు కుక్షియందు గల నీభారము మోయగలనా! మీరు సృష్టి స్థితి లయములు చేయసమర్థులు" అనవిని "తల్లీ! వెరువకుము. నీవు నిర్విచారముగ నుండుము. నీవు నాభారము మోయనవసరములేదు. నీభారము నాభారము నుకూడ వహించెదను. సుఖముగా నుండుము. పోయెదనని "

అదృశ్యుడయ్యెను. పిమ్మట ఆమె తపము చాలించి భర్తనుజేరి శ్రీమన్నారాయణుండు ఆనతిచ్చిన సంగతులు చెప్పి ఇష్టాగోష్టి నుండగా కొంతకాలమునకు గర్భమును ధరించెను. అంతట ఆమె నడచునపుడు భూమి వణకుచుండెను. ఆమె పాదములు పెట్టుచోట్ల భూమి కుంగుచుండెను.

## 7. ప్రహ్లాదుడు బలిని శపించుట.

ఇట్లు అదితి గర్భవంతురాలైన పిమ్మట రాక్షసులు తేజోహీనులై మాడిన ముఖములు కలవారై యుండుటయు, దేవతలు సంతోషముతో నుండుటయు చూచి యిందుకు కారణమేమని బలిచక్రవర్తి తన తాతయగు ప్రహ్లాదుని అడిగెను. అది విని ప్రహ్లాదుడు శ్రీహరిని ధ్యానించి యోగదృష్టిచే దెలిసికొని బలితో ఇట్లు చెప్పెను. " ఓవత్సా ! వినుము. చతుర్దశ భువనములు తన కుక్షియందుగల శ్రీ మహావిష్ణువు అదితి గర్భమునం దున్నాడు. ఆయన రాక్షసుల బలమును, తేజమును సంహరించును. శ్రీహరి మీ ఐశ్వర్యమును అపహరించి దేవతల కిచ్చును." అదివిని బలిచక్రవర్తియిట్లనెను. "ఓతాతా! శ్రీహరి అంత బలవంతుడా ! అంతకంటె హెచ్చు బలవంతులు నాయొద్దనున్నారు. విప్రజిత్తి, నిశుంభుడు, జంభుడు, హయశిరుడు, దుర్జయుడు మొదలగు అతిబలవంతులయిన రాక్షసులు నాయొద్ద కోటానకోట్లున్నారు. వారినతడు జయింపగలడా ? చూతము !' అనగా విని ప్రహ్లాదుడు మహా కోపముగలవాడై

"ఓరీ ! నీకు కాలము సమీపించినది. నిన్ను రక్షించువారు లేరు. నీవు చెప్పినవారందరును, ఆ మహావిష్ణువు ఎదుట దోమలవంటి వారు. ఆయన లోకములన్నిటిని పుట్టింపను, రక్షింపను, సంహరింపను సమర్థుడు. నీకువిపరీతబుద్ధి పుట్టినది. నీకు కాలము సమీపించెను. నీవు నశించుకాలము వచ్చినది. కనుక ఇట్టి మాటలు నీనోట వచ్చినవి. నాకు శ్రీహరి పరమ బాంధవుడు. నేను ఆని ప్రియభక్తుడను. అట్టివానిని నీవు నిరాకరించుచున్నావు. కావున నిన్ను నేను శపింతును. నీవు త్వరలో రాజ్యభ్రష్టుడ వగుదువుగాక" ఆమాటలు విని బలిచక్రవర్తి భయకంపితుడై తాత పాదములపై బడి తన్ను రక్షింపుమని అనేకవిధముల ప్రార్థింపగా ప్రహ్లాదు డిట్లనెను. నా శాపము వృధాపోదు. నేటినుండి నీవు శ్రీహరిని మనస్సుచేతను, కాయముచేతను, కర్మచేతను, ప్రీతితో ధ్యానించిన ఆయన నిన్ను రక్షించును.

8. బలియజ్ఞమునకు వామనుడు పోవుట.

అదితికి తొమ్మిదిమాసములు పూర్తియైన తర్వాత పదవమాసము ప్రవేశింపగా, వామనుడు జన్మించెను. అతడు మంచి తేజశ్శాలియై ప్రకాశించు చుండుట చూచి సర్వజనులు దేవతలు సంతసించిరి. బ్రహ్మవచ్చి జాతకర్మ, నామకరణములు చేయించెను. ఆవామనుని స్తోత్రముచేసెను. అదివిని బ్రహ్మతో వామనుడిట్లనెను. "ఓ చతుర్ముఖుడా ! పూర్వము అదితి

కశ్యపులు, ఇంద్రుడు నన్ను బాగుగా వేడుకొని ప్రార్థించి వర మడిగిన, ఇంద్రునికి శత్రువులు లేకుండునట్లు చేసి, ముల్లోక ములు ఇచ్చుటకు వరమిచ్చితిని. అందునకే ఇట్లుఅవతరించితిని.'' అని చెప్పగా బృహస్పతి యజ్ఞోపవీతమును, బ్రహ్మ కృష్ణాజిన మును ఇచ్చిరి. మరీచి బ్రహ్మపాలాశదండమిచ్చెను. అదిమొదలు వసిష్ఠుడుకమండలమిచ్చెను. అంగిరస మహాముని పవిత్రములును, పులమహర్షి దర్భాసనమును, పులస్త్యమహాముని పీతాంబరమును, ఇచ్చిరి. వేదవేదాంగాది చతుర్దశ మహావిద్యలను బ్రహ్మస్వరలో నేర్పెను. ఇట్లు సమస్త విద్యలు త్వరలో అభ్యసించి వామన మూర్తి దండము, కమండలము, గొడుగు పట్టుకొని బలి యజ్ఞ మునకు ప్రయాణమయ్యెను. అతడు నడచుచుండగా పాదము వేసిన చోట్ల భూమి లోతులు పడుచుండెను. అది చూచి ఆయన మెల్లగా పాదములు వేయుచుండెను. అయినను భూమి పర్వతములతోకూడ వణకుచుండెను. సముద్రములు పొంగెను. నదులు పొరలి పారుచుండెను. భూభారము వహించుచున్న ఆదిశేషువు తలలు వంచెను. ఈ విపరీతములు చూచి, దానికి కారణమేమని బలిచక్రవర్తి తన గురువును, పురోహితుడు అయిన శుక్రాచార్యుని అడిగెను. అదివిని ఆయన దివ్యదృష్టిచే చూచి సర్వమును తెలిసికొని యిట్లుచెప్పెను. "ఓ దైత్యేంద్రా! వినుము. జగన్నాథుడును, పరమాత్ముడును, సనాతనుడును అయిన శ్రీహరి వామనమూర్తియై కశ్యపుని ఇంట అవతరించి

నీయజ్ఞమునకు వచ్చుచున్నాడు. ఆయన భారము మోయలేక భూమి వణకుచున్నది. పర్వతములు, నదులు చలించుచున్నవి. సముద్రములు పొంగుచున్నవి. అన్నిటి భారము వహించునది భూమి గనుక ఆభూమి వణకగా అన్నియు చలించును. దేవతలందరు ఆతని వెంటనున్నారు గనుక అగ్నులు మండక అచ్చట నేయున్నవి. కావున మనము అగ్నిలో వేసిన ఆహుతులు వ్యర్థమగుచున్నవి.'' శుక్రుడు ఈ మాటలు చెప్పగావిని బలిచక్రవర్తి శరీరమున పులకాంకురములు గలవాడై ఇట్లనెను. "ఆచార్యవర్యా! నాతల్లిదండ్రులు, నేను ధన్యులము. నావంశము ధన్యతనొందినది. ఏమనగా యజ్ఞభోక్తయైన శ్రీమన్నారాయణుండు నా యజ్ఞమునకు నిజరూపముతో గయచేయు చున్నాడు. నాకంటె అధికులెవరు? యోగులలో శ్రేష్ఠులకు కూడ దర్శనమియ్యని ఆదిమధ్యాంతరహితుడు నాయాగమునకు స్వయముగ విచ్చేయుచున్నాడు. ఇంతకంటె హెచ్చు సంతోషమేమున్నది. నేనేమి చేయవలెనో సెలవిమ్ము.'' ఆమాటలువిని తన గురువైన శుక్రుడిట్లనెను. "ఓ రాక్షసేంద్రా! వినుము. యాగములయందు హవిర్భాగము దేవతలకు చెందవలెను. నీవు దానికి బదులుగా రాక్షసులకు ఇచ్చుచున్నావు. ఇదిశాస్త్రసమ్మతము కానందున శ్రీహరి వామనరూపుడై పుట్టి దేవతలకు మేలుచేయును. కాబట్టి నీవు బాగుగ ఆలోచించి ప్రవర్తింపవలెను. ఆయన నీకు కీడును దేవతలకు మేలును చేయును.

కావున నీవు నేనుచెప్పినట్లు చేయుము. ఆ వామనుడు నిన్ను దానమడుగునప్పుడు ఇచ్చెదనని చెప్పవద్దు. మంచి మాటలతో సంతోషపెట్టవలెను. ధనము, రత్నములు, బంగారు, గోవులు, భూమి నే వడిగినను ఇయ్యవద్దు. వారి దర్శనము నీకు లభించు నప్పుడు ఆయనకు ప్రదక్షిణముచేసి సాష్టాంగ దండప్రణామము చేసి చేతులు జోడించుకొని ఎదుట నిలచి, స్వామీ! మీరే మడిగినను ఇయ్యజాలను. ఈ జగత్తు అంతయు మీరు సృష్టి చేసినదేకదా! మీది మీకిచ్చుట ఉచితము కాదుగదా. కావున నే నేమి సమర్పింపగలను? ఇట్లు విన్నవించిన నీకు మేలుకలుగును.'' అని చెప్పిన ఆచార్యుని మాటలు విని బలి ఇట్లు చెప్పెను. "ఓ గురువర్యా! మీరు బ్రాహ్మణోత్తములు. ఈమాటలు మీ ముఖమునుండి ఎట్లు వచ్చినవి. సామాన్య జనులు అడిగినప్పుడే వారిని నిరాశులనుచేసి పొమ్మనలేక కోరినది ఇచ్చిపంపుచుంటినిగదా? "లేదు." అన్నమాట నానోటరాదు. అట్టి ఆవిషయములో సమస్త పాపములను పోగొట్ట సమర్థుడును, పుట్టుక యనుభయమును తన ధర్మము మాత్రముచేతనే పోగొట్ట గలవాడును, జగత్తునకు కర్తయునైన ఆ శ్రీహరి అడిగినప్పుడు లేదని నే నెట్లు చెప్పగలను. ఆయన దర్శనము కొరకే కదా జనులలో కొందరు వ్రతములు, ఉపవాసములు, జపములు, తపములు, యజ్ఞములు, యాగములు, దానములు, ధ్యానములు చేయుచున్నారు. ముల్లోకములవారును కోరునది ఆయ

నదర్శనమేకదా! పరమభక్తులు తప్ప ఆయనను మరి యెవరు చూడగలరు? ఆ జగదీశ్వరుడు నా యజ్ఞమందు నాకు ప్రత్యక్షమై చెయ్యిచాచి, ఇమ్మని అడుగుటకంటె గొప్ప సమయము ఎప్పుడు నాకు లభించును. అది నా పూర్వ పుణ్యము కదా. దాన మెవరికిచ్చినను పుణ్యమేకదా. అందులో ఆ శ్రీహరికంటె తగిన పాత్రులెవరు? ఆయన ఏమి అడిగినను సరే. భూమిగాని, ధనముగాని, ధనాగారముగాని, కోటగాని, వేటగాని, గ్రామముగాని, రాజ్యముగాని, ముల్లోకములుగాని, తుదకు నాప్రాణము అడిగినను ఇచ్చెదను. గురువులైన మీ యెదుట ప్రమాణము చేయుచున్నాను. "లే" దన్నమాట నానోట రాజాలదు. అట్లు ఇచ్చుటవలన నాకునష్టములేదు. ఈదేహము ఎప్పుడైనను విడువవలసినదే కదా! ఇది శాశ్వతము కాదన్నమాట ఎల్లరకును తెలిసినదేకదా! అట్టి జగదీశ్వరునికి ఇచ్చుటవలన చతుర్విధ పురుషార్థములు అనగా ధర్మ, అర్థ, కామ, మోక్షములు నాలుగును ఒక్కమారే చేకూడును. అంతకంటె జీవునికి మరియేమి కావలెను. మోక్షమే కదా! అందరు అన్ని విధముల ప్రయత్నించి సాధింపవలసినది. దానిని పొందుటకు ఇదియు ముఖ్యసాధనము. కావున మీరు నివారింపకుడు" అని బలిచక్రవర్తి తన గురువైన శుక్రాచార్యునితో చెప్పి ముగించు సమయములో శ్రీవామనమూర్తి బృహస్పతి మొదలగు దేవబృందములతో వచ్చి సమీపించెను. అట్లు సింహద్వారమునకు

వచ్చిన వామనమూర్తిని దేవతలను చూచి అచ్చటి ద్వారపాల కులు ఆశ్చర్యపడి కోపముగలవారై ఆయనను ఆటంకపరచ తలంచిరి. కాని అప్పుడా వామనుడు అగ్నివలె ప్రకాశించుట చేత చూచిన వారందరును తేజోహీనులును, బలహీనులునై భయముచేత వణక నారంభించిరి. వసిష్ఠ, విశ్వామిత్ర, గర్గ, చ్యవనప్రముఖులగు ఋషులును, బలిచక్రవర్తియును ఆవామ నుని రూపుచూచి భయసంభ్రమాక్రాంతులై నాసనము దాల్చిరి. తమ జన్మము సార్థకమయ్యెనని మనస్సులో తలంచిరి. అప్పుడు వారందరును లేచి ఆయనకు ఎదురుగాబోయి ప్రదక్షి ణముచేసి సాష్టాంగదండ ప్రణామము లర్పించిరి. బలి ఆ వామ నుని చూచి మనస్సులో ఇట్లనుకొనెను. “ యాచించుటకు కదా! శ్రీహరి తన శరీరమును సంకుచితముగా చేసికొని వామన రూపముగల బ్రాహ్మణవేషధారియై కాలినడకతో నావద్దకు వచ్చినాడు. ఆయనకు నేను ఏమిఇచ్చినను కష్టము లేదు. ” అంతట అచ్చట నుండు వారందరును ఏకకాలమున వామనుని స్తోత్రము చేసిరి. బలిచక్రవర్తి ఆయనకు అర్ఘ్యపాద్యము లిచ్చి పూజించుచు ఇట్లు విన్నవించెను. “ ఓ జగదీశ్వరా ! సర్వాంతర్యామీ ! పరాత్పరా ! సర్వసాక్షీ ! పురాణపురుషా ! నాస్వాధీనమందున్న స్వర్గ, మర్త్య, పాతాళలోకములుమూడును తమ ఆధీనము చేయుచున్నాను. వానిలో తమకు కావలసినంత ధనముగాని, ధాన్యములుగాని, బంగారముగాని, రత్నములు

గాని, గుఱ్ఱములుగాని, ఏనుగులుగాని, దాసదాసీజనములుగాని, స్త్రీలనుగాని, భూములను లేక ముల్లోకములను గాని, తమరు తీసికొనవచ్చును. తమచిత్తము వచ్చినవి తీసికొనుడు.'' అనగా విని వామను డిట్లనెను. "ఓ దైత్యేంద్రా! నాకు భూములు, గ్రామములు, రాజ్యములుగాని, గోమహిష అశ్వగజములుగాని ధన, వస్త్ర, సువర్ణ రత్నములు కాని, దాస, దాసీ స్త్రీజనములు గాని అక్కరలేదు. హోమగుండము స్థాపించుకొనుటకు మూడడుగుల భూమి యిచ్చిన చాలును'' అది విని బలిచక్రవర్తి ఆశ్చర్యపడి తనలో తానిట్లు వితర్కించుకొనెను. మూడడుగుల భూమి అడుగుచున్నాడు. ఇది దేనికి యుపయోగించును. ఇది కపటముగాని వేరొకటిగాదు. '' అని వితర్కించుకొని ఇట్లు ఆయనతో సంభాషించెను.

బలి:—ఓ వామనుడా! నీవడుగుట చూడగా ఆశ్చర్యమగుచున్నది. మీరెవరు ?

వామ:—దైత్యేంద్రా! నేనెవ్వడనని చెప్పలేను. నేను అందరివాడను.

బలి:—స్వామీ! మీనివాసమెచ్చట ?

వామ:—రాజా! నానివాసము స్థిరమైనది కాదు. అంతటను నేనేయుందును.

బలి:—స్వామీ! ఇంతస్వల్పదానము నన్నడుగవచ్చునా?

వామ:—రాక్షసేంద్రా! అంతేచాలును. మూడడుగు లిచ్చిన ముల్లోకము లిచ్చినట్లు సంతోషించెద. అసంతుష్టద్విజా నష్టః అని యున్నదిగదా!

బలి:—ఈపాటి స్వల్పభూమికొరకు నాయొద్దకు రావలెనా? లోకములో ఎందరో యున్నారే!

వామ:—నేను ఈదినమున యాచనకై బయలుదేరి వచ్చుచుండగా, కొందరు బ్రాహ్మణులు త్రోవలో కలసిరి. గొప్ప దాత లెవరని వారినడుగగా, దాతలలో మొదట నీపేరు చెప్పిరి.

బలి:—విప్రోత్తమా! నేనిట్టి స్వల్పదానమిచ్చి యెరుగనే! నాపేరు తమరు వినియుంటిరిగదా? అందుకు తగినటు కోరవలయును గాని ఇంతస్వల్పమా?

వామ:—దనుజోత్తమా! స్వల్పమని విచారింపకుము. అంతేచాలును. మూడడుగులే మూడు లోకములుగా భావించెదనంటిగా! ఆశకు అంతమున్నదా! మనుజుడు పెరిగినకొలది ఆశ అధికమగును కాని తగ్గదు. బలము, శరీరపటుత్వము, మాటలబిగి మొదలగున వన్నియు తగ్గునుగాని, ఆశ అంతకంతకు పెరుగును. కావున సంతుష్టి కలిగియుండుటమంచిది. సంతుష్టిగల వాడే మూడులోకముల సుఖముపొందును. సంతుష్టి లేనివారలు పుట్టుచు చచ్చుచుందురు. పూజింపబడును. వాడే సంతుష్టికలవాడు ముక్తినొందును. నీవు చక్రవర్తివని అడిగినంత ఇచ్చెదవని,

నేను హెచ్చుగా అడుగవచ్చునా ? నాకు కావలసినంత అడిగి తిని. అంతేఇచ్చిన చాలును.

ఈమాటలువిని యెద్దనున్న శుక్రాచార్యు లిట్లని బలిచక్రవర్తితో చెప్పెను.

శుక్రుడు:—ఓదానవరాజేంద్రా ! ఇతను నిజమయిన బ్రాహ్మణుడు కాడు. దేవతలకు సహాయము చేయుటకొరకు శ్రీమహావిష్ణువు అదితిగర్భంబున కుమారుడై పుట్టెను. అతడేఇతడు కపట బ్రాహ్మణ వేషముతో ఇట్లు నీయొద్దకు వచ్చినాడు. నీకాసంగతి తెలియక కోరినది ఇచ్చెదనంటివి. ఇందువలన రాక్షసవంశమునకు ఉపద్రవము వచ్చును నిన్ను మోసపుచ్చి నీయైశ్వర్యమంతయు అపహరించి దేవేంద్రునికిచ్చును. ఇతడు. శరీరమును పెంచి ఒక పాదముతో భూమి అంతయును, రెండవ పాదముతో స్వర్గమును, మూడవ పాదమున పాతాళలోకమును కొలిచి ముల్లోకములు ఆక్రమించును. అప్పుడు నీకు నిలుచుటకు కూడ తావైనయుండదు. ఎట్లు బ్రతికెదవు ! ఈ మూడు లోకములలోను చీమదూరుటకైనను సందులేకుండునట్లు అంతటను అతడే వ్యాపించి యుండును. అప్పుడు నీవెందుబోదువు ? ఇంతేకాక మరియొకటి చెప్పెదను వినుము. దేని నిచ్చుటవలన నాశనము కలుగునో అది దానమనిపించుకొనదు. తనకున్న ధనమును ఐయిదు భాగములు చేసి తనకు కావలసిన దానిని కొనుటకు, ధర్మమునకు, కీర్తి సంపాదించు పనులుచేయుటకు, ఆశ్రితు

లకు, ఇట్లు నాలుగు భాగములు వ్యయముచేసి మిగిలిన భాగ మును ఆపదకాలమున తనకు ఉపయోగించు నిమిత్తము దాచ వలెనని నీతికోవిదులు చెప్పుచున్నారు. తనకు లేకుండ ధర్మము చేయుట తగవుకాదు. అంతేకాక సర్వమును పోవునపుడు ఇచ్చెదనన్నది లేదన్నను అనృతదోషము సంభవింపదు. ఇప్పుడు నీవు ఇతనికిచ్చిన మరియేమియు నీకు మిగులదు. స్త్రీల యెడలను, వివాహము సంఘటించుటయందును, ప్రాణమునకు హానికలుగునపుడును, ధనమంతయు నశించునపుడును, మాన భంగము కలుగునపుడును గోవులను బ్రాహ్మణులను రక్షించు నపుడును అబద్ధమాడినను అందువలన పాపములేదు. కావున నామాట విని, యీదానము చేయుట మాని, యీ వామనుని మంచి మాటలు చెప్పి పంపుము.

బలి:—గురువర్యా! మీరు సెలవిచ్చిన దంతయు నిజమే. గృహస్థులకు ఇదియే ధర్మము. కాని ఇచ్చెదనని చెప్పి లోభగుణముచేత అడుగవచ్చిన వానిని ఎట్లు పొమ్మందును. ఆడిన మాటలు లేదనుటకంటె హెచ్చుపాపమేమి? ఎట్టి పాపా త్ములనైనను మోయగలను గాని, అబద్ధమాడువాని బరువు భరింపజాలనని పూర్వము భూదేవి బ్రహ్మతో చెప్పుకొనలేదా! ప్రాణమును రక్షించుకొనుటకై పిరికివాడై యుద్ధరంగమునుండి పారిపోవుట, అబద్ధమాడుట ఈ రెండిటికంటె మానహాని కలుగ జేయునది మరిలేదుగదా? ఇంతియేకాక వ్యవసాయదారునికి

మంచి భూమి, మంచి విత్తనము, ఒక్కమాను సమకూరు నట్లు దానము ఇచ్చువానికి మంచి పదార్థము, మంచి పాత్రుడు దొరుకుట అసాధ్యము కాదా ? గొప్పపుణ్యాత్ముల కేగాని అందరికిని అట్టిభాగ్యము కలుగునా ? పూర్వమీ భూమిని ఎందరోరాజులు పాలింపలేదా ? వారిలో శిబి మొదలగువారి పేర్లు ఇప్పటికిని చెప్పుకొనుచున్నారు కారా ? ఇంతకును ఈయన శ్రీ మహావిష్ణువని మీరే యిప్పుడు సెలవిచ్చితిరి. అట్టి ఆదిదేవుడును, పురాణపురుషుడును ఇంత చిన్నరూపమును ధరించి నన్నడుగవచ్చిన, నే నెట్లు లేదందును. అతడు చెయ్యిచాచి అడుగుట, నాచేతిక్రింద అతడు చేతినుంచుట నాయదృష్టముగదా ? రాజ్యముగాని, యీ శరీరముగాని శాశ్వతము కాదుగదా? ఏమైననుకాని, రాజ్యమేనశింపని, నేనే నశించిన సరే, నేను మాట తప్పను. ఇతనికి దానమియ్యక మానను. ఇంతేకాక ఆయన అడిగినంత నేను ఇచ్చునపుడు ఆయన నన్ను శిక్షించునా ? ఇది ఎట్టి న్యాయము. ఏమయినను సరే. ఈయనకు తప్పక దానమిచ్చెదను.

శుక్రు:—ఓ దైత్యేంద్రా ! నేను నీ మేలుకోరి చెప్పిన మాటలు నిరాకరించితివి. కావున త్వరలో రాజ్యభ్రష్టుడవగుదువుగాక !

బలితన మనస్సులో ఇట్లు తలపోసెను. పూర్వము మాతాత ప్రహ్లాదుడిచ్చిన శాపమునకు తోడు మా కులగురుని శాపము

కూడ చేరినది. ఏమి చేయుదును. మాటతప్పలేనుగదా ? దానమిప్పుడేయిచ్చెదను అనిఆలోచించి తన భార్యయైన సంధ్యావళి వైపుచూడగా ఆమె ఒకచేత బంగారు పళ్ళెమును మరియొక చేత బంగారు కలశతో నిర్మలమైన జలమును పట్టుకొనివచ్చి భర్తయొద్ద నిలిచెను.

అప్పుడు బలిచక్రవర్తి వామనుని పాదములు కడిగి, ఆ నీరు శిరస్సున చల్లుకొని, మూడడుగుల భూమి దానము చేయుచుండగా, ఆజారీలోని నీరు పడకుండ శుక్రుడు తన కన్నును అడ్డముగా నుంచెను. వామను డది గుర్తించి, దర్భపుడకతో పొడిచెను. అందువలన ఆశుక్రునికన్ను గ్రుడ్డి దాయెను. అది మొదలు ఒక కన్నుపోయినవానికి శుక్రాచార్యుడను మాట వాడుకలోనికి వచ్చెను. అంతట నీటిధారపడగా బలి వామనుని చేతిలో ధారపోసెను. శ్రీహరి తృప్తిపొందెను. కావున సమస్త భూతములును తృప్తిపొంది బలిచక్రవర్తిని పొగడెను. భూదానము ఇచ్చువారును, పుచ్చుకొనువారును స్వర్గాదిభోగములు చిర కాల మనుభవించుచుందురు. కావున ఏదానమును భూదానము తోసమానముకాదు. ఆ సమయమున వామనుడు బలినిచూచి ఇట్లనెను. “ రాజా ! ఏదో కొంచెము దానమిచ్చుచున్నానని విచారింపకుము. నే నడిగినంత ఇచ్చుటయే ముల్లోకము లిచ్చుటయనితలంచుము. అనుచుండగా దేవతలు పుష్పవర్షము కురిపించిరి.

## వామనుని విశ్వరూపము.

ఇట్లు మూడడుగుల భూ దానమును పొందిన వామనుడు క్రమ క్రమముగా పెరిగి పెద్దవాడై మూడు గుణములను ఏక కాలంబున విజృంభింపచేసి విశ్వరూపమును ధరించి భూమియు, ఆకాశమును నింపి, భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము, అను ఏడు ఊర్ధ్వలోకములకంటె ఎత్తుగా పెరిగి, ఎచ్చటను సందు లేకుండ వ్యాపించి పాదముక్రింద భూమియు, పిక్కలయందు పర్వతములను, కాలివ్రేళ్ళపై పిశాచగణములను చేతి వ్రేళ్ళయందు గుహ్యకులను, జానువులయందు విశ్వేదేవతలను, అంగములయందు దేవతలను, రోమములయందు మహర్షులను, జుట్టున నక్షత్రములును, కర్ణములయందు అశ్వనీ దేవతలను, నాసికయందు వాయువును, ముఖమందు అగ్నులను, వక్షస్థలమునందు రుద్రులను, వీపునందు అష్టవసువులను, కంటి భాగమందు లక్ష్మియు, గుహ్యదేశమున ప్రజాపతులను, నడుమున రాక్షసులను, నాభియందు సప్త మహాసముద్రములను, హృదయమున ధర్మంబును, కంఠంబున వేదములను, నేత్రంబుల సూర్య చంద్రులను, ఇట్లు జగమంతయు, చరాచరాత్మకమైన ప్రపంచమును, తనశరీరమున అన్ని భాగములయందును ధరించి ఒక పాదముచే భూమిని, మరియొకపాదముచే స్వర్గలోకంబును, ఆక్రమించి ఇట్లు వ్యాపించుటలో దుష్టులైన రాక్షసులను సంహ

రించి, నాభినుండి పుట్టిన మఱియొక పాదముచే బలిని పాతాళ లోకమునకు అణగ ద్రొక్కెను. ఇట్లు మూడుపాదములచే ముల్లోకములను ఆక్రమించుకొని ఇందునకిచ్చి, బలిని జూచి యిట్లనెను. "ఓ రాక్షసోత్తమా! నీవు నాకు దానమిచ్చితివి గనుక అక్షయమైన భూమి నిచ్చెదను. నీవు సుతలలోకమున నుండుము. అచ్చోటు మిగుల పవిత్రమై మనోహరముగనుండును. నీవు కల్పాంతమువరకును జీవింతువు. సావర్ణ్య మన్వంతరమున నీవు ఇంద్రపదవి నొందుదువు. అపుడు ముల్లోకములకు నధిపతివగుదువు. అంతవరకు సుఖములుఁ భోగములుఅనుభవించుచు రోగములు లేనివాడవై నివసించుము. అచ్చట అనేక దివ్యభవనములు, సరోవరములు, ఉద్యానవనములు గలవు. అనేక దివ్యమైన స్త్రీలు గలరు. వారితో సుఖించుచు చిరయౌవనము కలిగి యుండుము. నన్ను ఏమరకుము. దేవబ్రాహ్మణులను పూజించుము." ఈమాటలువిని బలి అందుండుటకు అంగీకరించి యిట్లనెను. "ఓజగదీశ్వరా! మీపాదసేవ అనుగ్రహింపుము. నాకచట ఆహారమేమో సెలవిండు" "దైత్యేంద్రా! శాస్త్రప్రకారము విధ్యుక్తముగా జరుగనియజ్ఞములు, దానములు,హోమములు, శ్రోత్రియులైనబ్రాహ్మణులతో పెట్టబడని శ్రాద్ధములు నీకుఆహారమగును. నేను నీశత్రువులను సంహరించుటకు నాచక్రమును పంపుదును. నీవు కోరునపుడు నేను దర్శనమిచ్చుచుందును.

అంతట ప్రహ్లాదుడు, విశ్వరూపమును ధరించియున్న శ్రీహరినిజూచి సంతోషించి, తర్వాత కొంతసేపటికి ఆవిశ్వరూప

ముపసంహరించి యెప్పటి రూపముతో నున్న వామనునిజేరి ప్రదక్షిణ నమస్కారములు చేసి ప్రార్థించి యిట్లుమనవిచేసెను. “స్వామీ ! మీరు నామనుమడైన బలికి ఇంద్రపదవి ఇచ్చి యిప్పుడు తీసికొనుటవలన చాల ఉపకారము చేసితిరి. లేనియెడల గర్వాంధుడై, తమసేవ మరచియుండును. మావంశములో ఈ బలి చాల అదృష్టవంతుడు. ఏలయనగా మావారందరు పగచే నిన్ను పొందిరి. మీరు వీనియందలి ప్రేమచేత దర్శనమిచ్చితిరి. “ఇందుకు కారణము తమకు మాయందుగల కరుణయేగాని వేరొకటిగాదు.” అని మనవిచేసి ప్రణమిల్లెను. అప్పుడు శ్రీహరి ప్రహ్లాదునిచూచి “ఓవత్సా ! నీమనుమడు మహాజ్ఞాని. ఇతడు సావర్ణి మనువుకాలములో ఇంద్రుడై సమస్త భోగములను అనుభవించి పిమ్మట మోక్షము పొందును” అని చెప్పి శ్రీహరి అంతర్ధానమొందెను. అంతకుముందు విశ్వరూపమును దర్శింప వచ్చుటకి పోయి అంతరాళముననున్న ఈశ్వరుడును బ్రహ్మయును, ఇంద్రాది దేవతలును, మునులును, ఋషులును ఆశ్రీహరియొక్క యద్భుతచర్యల నెన్నుకొని తమలోతాము సంతోషించుచు, ఒకరితోనొకరు చెప్పుకొనుచు, తమ నివాసములకు పోయిరి.

## కురుక్షేత్ర మహాత్వము.

వామనావతారముయొక్క చరిత్రము వింటిని. అది చాల పవిత్రమైనది. ద్వీపము లన్నిటిలో జంబూద్వీపము శ్రేష్ఠమైనదనియు, అందు భరతవర్షము మిగుల పుణ్యభూమి

యనియు చెప్పుదురు. ఇందుకు కారణమేమని మునులు సూత మహర్షి నడుగగా సూతుడిట్లు చెప్పుచున్నాడు. ఋషులారా ! వినుండు.

పూర్వము ఈ ప్రశ్న నారదుడు పులస్త్య మహాముని నడుగ వారిట్లు చెప్పిరి. భగవద్వర్షము పుణ్యదేశమనుటకు అనేక కారణము లున్నవి. అందు పెక్కు పుణ్యనదులు, పర్వతములు, క్షేత్రము లున్నవి. అన్నిటిలో కురుక్షేత్రము మిక్కిలి పవిత్రమైనది. అది గంగా సింధునదులమధ్య నున్నది. దానికే ఆర్యావర్తపుణ్యభూమి యని యందురు. ఎవడైనను ఆ దేశము పేరు దలచుకొన్నను అందు నివసింతుమని అన్నంత మాత్రముననను వాని సమస్తపాపములు నశించి వానికి మోక్షమలవడును. కారణమేమనగా అనేకమైన పవిత్రమైన ఆశ్రమములు, తీర్థములు అందున్నవి. ఆశ్రమములలో ముఖ్యమైనవి యేవనగా:-

1. కామ్యవనము:—ఇందు ఎవరు ఏ కోరికతో శ్రీహరిని ధ్యానింతురో, వారి కాకోరిక తప్పక సిద్ధించును.

2. అదితివనము:—పూర్వము ఇందు కశ్యపబ్రహ్మ భార్యయైన అదితి తపస్సుచేసి శ్రీహరిని వామను డను పేరుతో కుమారునిగా పొందెను.

3. వ్యాసవనము:—ఇందు వేదవ్యాసులు తపస్సు చేయుచుండును. ఇది మిక్కిలి మనోహరమైనది.

4. ఫలకవనము—ఇది మిగుల పవిత్రమైనది.

5. సూర్యవనము, 6. మధువనము, 7. శీతవనము ఇవియు అతిపవిత్రంబులు. వనమనగా ఆశ్రమము.

ఈ కురుక్షేత్రమందు పెక్కు పుణ్యానదు లున్నవి. అవియేవనగా:—సరస్వతి, వైతరణి, గంగ, మధుస్రవ, పాపనాశన, కౌశిక, హిరణ్వతి. ఈ ఏడు నదులును మహాపవిత్రమైనవి. వీటి పేరు తలంచిన మాత్రమున నే సమస్తపాపములు నశించును. స్నానముచేసిన వారిఫలమెంత యని చెప్పుదును? తీర్థాటన చేయుబయలు దేరు వారు మొదట రమ్యకతీర్థమున స్నానము చేసి అందున్న యక్షుని దర్శించి అదితివనమునకు బోవుదురు. అచ్చట పుత్రులను గోరువారు తపస్సుచేసిన బలవంతులు గుణవంతులు సుందరులగు పుత్రులను బడయుదురు. మరణాంతమున స్వర్గమును వైకుంఠమును పొందుదురు. ఇందు శ్రీహరియెల్లప్పుడు నునివసించు చుండును. అందుండి విమలతీర్థమునకుబోయి స్నానముచేసి అందున్న విమలేశ్వరుని దర్శించి సమస్త పాపములచే విడువబడిస్వర్గమును కైలాసమునుపొందుదురు. ఏకాదశిదినమున అచ్చటి బలరామకృష్ణులను దర్శించువారు వైకుంఠమును పొందుదురు. అచ్చటనుండి ప్లవతీర్థమునకుబోయి స్నానముచేసి వేదపుస్తకమును చేతబట్టియున్న బ్రహ్మను దర్శించిన వారు బ్రహ్మయజ్ఞఫలమును పొందుటయే కాక అంతమున బ్రహ్మలోకనివాసమునుపొందుదురు. రమ్యక తీర్థములో స్నానవిధి చేయువారు పరమ పదప్రాప్తి నొందుదురు. అటనుండి దక్షాశ్రమమునకు

బోయిదక్షేశ్వరునిదర్శించిన అశ్వమేధయజ్ఞముచేసిన ఫలము పొందుదురు. అచటనుండి శంభుతీర్థమునకు బోయి స్నానముచేసి అచ్చటనున్న హరి హర మూర్తిని దర్శించి పూజించి, సర్వపాప విముక్తులై, సర్వతీర్థమునకు పోదురు. ఇందు నిత్యము నాగులు స్నానము చేయుచుందురు. ఇందుస్నానముచేసిన నరులకు పాములవలన భయముండదు. అందుండి నరకోద్ధార తీర్థమునకు బోయి స్నానముచేసి ఒకరాత్రి యందుండి మరుసటి దినమున తిరిగి స్నానవిధి తీర్చి, అచ్చటి దేవుని పూజించి, కొందరు బ్రాహ్మణులకు భోజనము పెట్టి భోజనమైన తరువాత వారియెదుట చేతులు జోడించుకొని నిలువబడి యిట్లు వారితో విన్నవింపవలెను. "స్వామీ! నన్నాశ్రయించియున్న పాపములను నశింపజేసి పుణ్యముకలుగునట్లు అనుగ్రహింపుడు."

అచ్చట నుండి పంచనదీ తీర్థమునకు పోవుదురు. వీనికే కోటితీర్థములని పేరు. ఎందుచేతననగా పూర్వమచ్చట ఈశ్వరుడు పంచవటములను ప్రతిష్ఠచేసెను. అచ్చట అనేక దానవులు చేరిరి. వారు అందుండుటచే అది మహా భయంకరముగా నుండును. వారిని పారదోలుటకు కోటి తీర్థములను ఈశ్వరుడు అక్కడికి తెచ్చెను. అందు స్నానముచేయువారికి పంచయజ్ఞములు చేసిన ఫలము లభించును. అందు శివుడు దేవబృందములతో నివసించుచుండి అగ్నిష్టోమ ఫలము నిచ్చును. దానియందు స్నానము చేయువారు శ్రద్ధాన్వితులు, జితేంద్రి

యులు, నగుదురు. పిమ్మట అశ్వనీ కుమార తీర్థమునకు పోయి యథావిధిగా స్నానముచేసి పరమగతిని పొంది, సోమతీర్థమునకు పోవుదురు. దీని మహిమ దేవతలకు సైతము తెలియదు. పూర్వము చంద్రుడు క్షయరోగముచే బాధపడుచు, అచ్చటికి పోయి స్నానముచేసి సోమేశ్వరుని దర్శించి పూజించి రోగ నివృత్తి పొందెను. కావున ఈ తీర్థ సేవ సమస్తరోగములను పోగొట్టి రాజసూయ యాగ ఫలమునిచ్చును. మరణాంతరమున చంద్రలోకమును పొందుదురు. అచ్చట జ్వాలామహేశ్వరుడు, భూతేశ్వరుడు అను రెండు లింగములున్నవి. వానిని యథావిధిగా పూజించువారు తిరుగ జన్మమొందక మోక్షమును పొందుదురు. అక్కడినుండి పోయి, ఏకహంస తీర్థమును సేవించిన వేయిగోవులను దానముచేసి, పౌండరీకమను యాగము చేసిన ఫలముగలుగును. పిమ్మట మంజునట తీర్థమునకు పోయి, ఏకరాత్రి నివసించి, ఉపవాసము చేసి, అందున్న గణపతిని పూజించిన మహాపాతకములు పోవును. యక్షిణి యను పేరుగల దేవి యందున్నది. ఆమెను పూజింపవలయును. ఈతీర్థమునకే కురుక్షేత్రపుణ్యద్వారమని పేరు. దీనికి ప్రదక్షిణముచేసి దేవబ్రాహ్మణులను భోజనాదులచే పూజించిన, గొప్ప ఫలమునిచ్చును. ఇందుండి పుష్కరతీర్థమునకు పోవలెను. దీనిని పరశురాముడు ప్రతిష్ఠచేసెను. ఈతీర్థము సేవించిన అశ్వమేధయాగ ఫలముకలుగును. కార్తికశుద్ధ ఏకాదశి మొదలు పున్నమవరకు అందుస్నానముచేసి

ఒకకన్యాదానముచేసిన, సమస్తపాపములు నశించి కోరికలు నెర
వేరి మోక్షముచేకూరును. అచ్చటకపిలుడను మహాయక్షు
డున్నావాడు పాపాత్ములను చాలబాధలు పెట్టును. వానిభార్య
యైనమహాయక్షిణియు అందున్నది. ఆమె దుందుభి వాయిం
చుచుతిరుగుచుండును. ఆమెయొకదినమున తనబిడ్డను తొడలపై
నుంచుకొని కూర్చుండియుండగా, ఒకస్త్రీ ఆమెనుచూచి యిట్ల
నెను. "ఓ చిన్నదానా! నేను నిన్నును, నీబిడ్డను, చంపితిందును."
ఆమాట విని ఆమె మిగుల భయపడి అనేక విధముల ప్రతిమా
లగా కరుణించి, మరల ఇట్లు చెప్పెను. నీవు సరస్వతి తీర్థమునకు
పోయి, రాహుగ్రస్తమైన సూర్యగ్రహణము పట్టినపుడు అందు
స్నానము చేసి సమస్తపాపములు పోగొట్టికొని, స్వర్గమును పొం
దుదువు. సరస్వతి తీర్థమున నివసించువారు బ్రహ్మజ్ఞానులగు
దురు. అచ్చట నివసించుటకు దేవతలు, ఋషులు సిద్ధులు పోవు
దురు. వారు నిత్యమును బ్రహ్మను దర్శించుచుందురు. కేవలము
పాపము చేసిన జనులచ్చటికి పోయిన వారు బహు జన్మముల
నుండి చేసిన పాపములు నశింపజేసికొని పుణ్యవంతులై శ్రీ మహా
విష్ణువు నిజదర్శనము చేసి మోక్షమును తప్పక పొందుదురు.
ఆకసమునుండి గ్రహములు, నక్షత్రములు, క్రిందపడుట మనము
అప్పుడప్పుడు చూచుచున్నాము. వారు పూర్వజన్మమున మను
ష్యులైయుండి అనేక పుణ్యములు చేసి గ్రహ, నక్షత్రరూప
ములను పొంది, బహుకాలము సుఖమనుభవించి, వారి పుణ్యము

క్షీణింపగా తిరుగ, మనుజులై పుట్టుటకు భూమినిపడుచున్నారు. వారట్లుపడి పండ్లు, ధాన్యములు మొదలగు మనము భుజించు పదార్థములయందు ప్రవేశించి దానితో పురుషునియందు ప్రవేశించి, పిర్యమును పొంది, స్త్రీ గర్భమున ప్రవేశించి శిశురూపమున జన్మింతురు. ఇట్లు పుట్టినవారు గొప్ప బుద్ధిమంతులు, జ్ఞానవంతులు, ఐశ్వర్యవంతులునై యుందురు. వారు సాధారణముగా మూర్ధాభిషిక్తులుగాని, గొప్ప తపోనంతులుగాని, గొప్పలోకోపకారులుగాని, అగుదురు. అట్టివారు కురుక్షేత్రమున మృతినొంది తిరిగి పుట్టక, మోక్షము నొందుదురు. బ్రహ్మ మొదలగు దేవతలు, ఋషులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, అప్సరసలు నిత్యము స్థాణుహ్రదయమందు స్నానముచేయుదురు. మోక్షమిచ్చువానిలో ముఖ్యమైనవి నాలుగు. అవియేవనగా (1)బ్రహ్మజ్ఞానము(2)గయలోశ్రాద్ధము చేయుట (3)ఆవుసాలలోచచ్చుట, 4. కురుక్షేత్రమున నివసించుట, ఈకురుక్షేత్రము మహిమయెంత చెప్పినను తరుగదు. బ్రహ్మాదులకే అగోచరము. మనవంటివారికి శక్యమగునా ?

దేవతలకు సంతతి లేకుండుటకు కారణము.

పార్వతీ పరమేశ్వరులు మందరపర్వతమున నుండగా ఒకనాడు ఈశ్వరుడు విశ్వకర్మను పిలిచి దివ్యభవనము నిర్మింపుమని చెప్పగా, అరువదినాలుగు యోజనములు వైశాల్యము గల ప్రాకార మేర్పరచి దానిమధ్య సువర్ణ వికారమైన గోడల

తోను, నవరత్న ఖచితమైన కంబములతోను, ముత్యాల తోరణములతోను, ఏడుఅంతస్థులుగల మేడలతోను, స్ఫటికసోపానములతోను, గదులు, సభామంటపములు స్నానశాలలు, వంటశాలలు, భోజనశాలలు, ధనాగారములు, దాస దాసీజనములుండుటకు వేరు వేరు గృహములు త్వరలో నిర్మించెను. అందు యథాశాస్త్రీయముగా ప్రతిష్ఠచేసి, ఉమా మహేశ్వరులు ప్రవేశించి పంచయజ్ఞములు చేసిరి. అందు వారు కేళీవినోదములు చేయుచుండిరి. కొంతకాలము వరకు సంతానము లేనందుకు పార్వతి మిగుల చింతించి ఒకనాడు శివునిజూచి ఇట్లనెను. "ఓ ప్రాణేశ్వరా! సంతానము లేనివారికి ఎంత సంపదయున్నను ఏమి ప్రయోజనము? కావున నేను బిడ్డలకొరకు తపస్సు చేయబోవుచున్నాను. సెలవొసంగుడు." అందులకు మహేశ్వరుడు అంగీకరించెను. అప్పుడు ఆమె హిమవత్పర్వతమునకు, నలుగురు చెలికత్తెలతో పోయి ఒక గుహయందు ప్రవేశించి, ఏకనిష్ఠతో తపస్సుచేయుచుండగా నూరుసంవత్సరము లయ్యెను. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై "దేవీ నీ తపస్సునకు మిగుల సంతోషించితిని. నీ కోరిక త్వరలో నెరవేరును. ఇక తపంబు చాలింపుము" అనెను. పార్వతికి బంగారమువలె ప్రకాశించు శరీరఛాయ కలుగునట్లు వరమిచ్చి, అంతర్ధాన మొందెను. పార్వతియు తపస్సు చాలించి తన దివ్యభవనమునకు పోయెను.

ఈశ్వరుడు మహా మోహపరవశుడై పార్వతితో కలిసి కేళివినోదములు సల్పుచు ఎవరికిని సమయ మియ్యకుండెను.

ఇంద్రాది దేవతలు భయపడి బ్రహ్మగారియొద్దకు పరువునపోయి తమ భయకారణము మనవిచేయుగా బ్రహ్మ వారితో నిట్లనెను. " ఓ సురలారా! వెఱువకుడు. ఉమామహేశ్వరులు మోహాపరవశులై కేళీవినోదములు సలుపుచున్నందున సమయము కాకుండెను. మీరు వైకుంఠమునకు పోయి శ్రీ మహావిష్ణువును ప్రార్థింపుడు. ఆయన ఇందుకు ఉపాయము చెప్పును. అనగా విని వారు శ్రీహరి యొద్దకు బోయి మొరపెట్టిరి. వారి దీనాలాపములు విని కరుణించి వారితో, శ్రీహరి ఇట్లనెను "ఓసురరాజా! ఆ ఈశ్వరుని కేలిని భంగము చేయవలెను. లేనియెడల ఆయనకు కుమారుడుపుట్టి మహా బలపరాక్రమము గలవాడై నీఇంద్రపదవిని హరించును. మీరందరు కూడి మందర పర్వతమునకు పోయి ఇందుకు ఉపాయము చూడుడు. నేనుకూడ ఇంతలోనే వచ్చెదను." ఈమాటలు విని దేవతలు దిగులుపొంది త్వరగలో శివుని మందిరమునకు బోయి, నందికేశ్వరుడు ద్వారపాలకుడై యున్నందున లోనికి పోలేక సింహద్వారమునందుండి కేకలు వేయుచుండిరి. ఆధ్వని విని ఈశ్వరుడు లేచి పైకివచ్చి దేవతలను చూడగా వారు ఆయన పాదములపై బడి పలువిధముల స్తోత్రములు జేయుగా కరుణించి "ఏల ఇట్లు వచ్చితిరని" అనెను "తమ దర్శనార్థము" అనిరి. పిమ్మట కొంత సేపు వారితో సంభాషించి దేవతలు సంతోషముతో తమ నివాసములకు జనిరి. ఈశ్వరుడు తన భవనములో ప్రవేశించి

పార్వతితో దేవతలు వచ్చినసంగతి చెప్పెను. ఆసంగతి పార్వతి విని తన కోరిక నిష్ఫలము చేసినందులకు దేవతలకు సంతతి కలుగకుండ శపించెను. అందుచేతనే అదిమొదలు దేవతలకు సంతానము లేదు.

## వినాయకుని జన్మము.

ఇట్లు ఆశాభంగము నొందినపార్వతి తనకు పిల్లలు లేరను దుఃఖముతో విచారించుచుండెను. ఈశ్వరుడు అనేకవిధముల ఆమెనుఓదార్చెనుగాని ఆమె శాంతింపనందున తన చేతులతో కొంతమన్నుత్రిప్పి ఒక బొమ్మనుచేసి భార్యచేతికిచ్చి యిదుగో నీకు కూమారుడు. వీనిని పెంచుమనగా భర్తతనను పరిహాసముచేయుచున్నాడని క్రందనముంచెను. అప్పుడాబిడ్డ కావుకావున ఏడ్చెను. అతనిని ఆమె వెంటనే యెత్తుకొనగా పాలిండ్లు చేపెను. బిడ్డకు పాలిచ్చి ముద్దాడి ఆనందించి భర్తచేతికిచ్చి పుత్రసుఖ మనుభవింపుమనెను. ఈశ్వరుడు ఆబిడ్డనుజూచి లక్షణములు కనిపెట్టి వీడు అల్పాయుష్కుడగును. అని రెండుచేతులతో పట్టుకొని చూచుచుండగా, చెయిజారి క్రిందబడి రెండుముక్కలై తల యొకచోట మొండెమొకచోట పడెను. అదిచూచి పార్వతి ఘోరముగ రోదనముచేయ మొదలుపెట్టెను. అదివిని శివుడోర్వలేక ఆమెను ఓదార్చి తలయు మొండెము ఒకచోటనుంచి కలిపి శిశువునుబ్రతికింప ప్రయత్నించెనుగాని ముక్కలు కలియవయ్యెను. అప్పుడు ఆకాశమునుండిగొప్పధ్వనివినబడెను. అదియే

మనగా "ఓసర్వేశ్వరా! ఎందుకు విచారించెదవు? ఆశిరస్సు మొండెమునకు అతకదు. శివునిదృష్టిచే అదితెగెను. నేరుశిరస్సు అమర్చిన బిడ్డను వెంటనే బ్రతుకును. ఆ శిశువు పడుకొనుటకు తల ఉత్తరముగా పడినంతను ఉత్తరదిక్కుగా తలపెట్టుకొనిపరుండియుండు జంతువు తలను తెచ్చి అతుకవలెను" ఆ మాటలు విని శివుడు నందీశ్వరుని పిలిచి ఇట్లనెను. "నందీ! నీవు కత్తి చేపట్టి వెంటనే పోయి స్వర్గ మర్త్య పాతాళములలో ఎచ్చట నైనను ఉత్తరముగా తలయుంచి పరుండు ఏజంతువు తలనైనను సరే నరికి తెసికొని రమ్ము" అనగా వెంటనే నందిబాహులునేగి భూలోకమున పాతాళలోకమున వెదకినను అట్టి జంతువు కానరానందున స్వర్గమునకుబోయి వెదుకగా ఇంద్రుని యేనుగు అట్లు కనబడగా దానిని నరకబోయెను. అప్పుడు ఇంద్రుడు వచ్చి ఆతంకపరచి "నీవెవరు? యెచ్చటనుండి వచ్చితివి? ఎందుకు నాపట్టపు ఏనుగను చంపబోవుచున్నావు?" అని యడుగగా నందీశ్వరుడు ఇట్లనెను. "నేను ఈశ్వరుని బంటును. నాపేరు. నంది ఈశ్వరుని కుమారుని తలఉగ్రదృష్టిచే తెగిపడెను. దానిని అతుకులకు ఎన్నిప్రయత్నములు చేసినను కలియలేదు." అప్పుడు ఆకాశవాణి ఇట్లనెను. "ఉత్తరముగా పరుండియున్న జంతువు తల తెచ్చి అతుకుడు" శివుని ఆజ్ఞవలన భూలోకమును, పాతాళమును వెదకి ఎందును గానక ఇటువచ్చితిని. ఈ మృగమును నరికి దీని తల తీసికొని పోయెదను. నీవు దీని ఆశవిడు

వృము. అనగా ఇంద్రుడు కోపించి "ఇది నాపట్టపు ఏనుగ. దీని పేరు ఐరావతము. దీనిని చంపవద్దు పొమ్ము" అనగా వినక నంది దానిని చంప నుంకించెను. అప్పుడు వారిరువురికిని కొంత సేపు ద్వంద్వయుద్ధము జరిగెను. ఇంద్రుడు మూర్ఛనొందిపడెను. అంతట గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు మొదలగు దేవ బృందములు వచ్చి నందితో సంకులయుద్ధము చేసిరి గాని పరా జితులై పారిపోయిరి. ఇంద్రుడు తెలివొంది లేచి మాతలి తెచ్చిన రథమెక్కి కొంతసేపు సమరముచేసి పిగిపారిపోయెను. ఈ సమరమందు దెబ్బ తగిలి ఆగజముయొక్క దంతము ఒకటి విరిగెను.

అప్పుడా ఏనుగ శిరస్సు నరికి నందీశ్వరుడు దానిని త్వరలో తెచ్చి శివునికియ్యగా, దానినివెంటనే మొండెమునకు అతుకగా ఆశిశువు పునర్జీవితుడయ్యెను. ఆసమయమున బ్రహ్మ విష్ణువు ఇంద్రాది దేవతలు, మునులు, ఋషులు, సిద్ధులు, సాధ్యులు వచ్చి ఆబాలుని చక్కదనము, లావణ్యము, చూచి ఆనంద భరితులైరి. బ్రహ్మ యాబాలుని చూచి, నాయకుడు లేకుండ పుట్టుటచేత వినాయకుడని పేరు పెట్టి, ముల్లోక వాసులును మొదట ఇతనిని పూజించునట్లు వరమిచ్చి, అతనికి జప మాల యొకటి యిచ్చి చిరంజీవియగునట్లు ఆశీర్వదించెను. బృహస్పతి యజ్ఞోపవీతము నిచ్చెను. సరస్వతి చతుర్దశ విద్యలను ఇచ్చి, గంటయొకటి ఇచ్చెను. విష్ణువు అమృత కలశమును

భూదేవి వానికి వాహనముగా ఎలుకను, శివుడు వ్యాఘ్రచర్మమును, పార్వతి చిరాయువును, శ్రీ మహాలక్ష్మి అష్టైశ్వర్యములను, వరుణుడు పాశమును, వాయువు మందారపుష్పహారమును ఇంద్రుడు అంకుశమును ఇచ్చిరి. ఇతను విఘ్నమును పొంది బ్రతికెను. కావున విఘ్నేశ్వరుడనియు, ప్రమధ గణములలో శ్రేష్ఠుడగుటచేత గణాధిపతియనియు, గజముఖము గలవాడగుటచే గజాననుడనియు, ఏకదంతుడు, మూషికవాహనుడు, వక్రదంతుడు, పార్వతీనందనుడు, స్థూలదేహుడు, అగ్రపూజ్యుడు, లంబోదరుడు భక్త దుఃఖహారుడు, సర్వవిఘ్న వినాశకుడు, హేరంబుడు, గణేశుడు సిద్ధిప్రదుడు, సిద్ధిదాత, సిద్ధేశుడు, సూర్యకర్ణుడు, స్కంధపూర్వజుడు అని పేర్లు. ఈ నామములను నిత్యము త్రికాలముల పఠించువారికి అన్ని కోరికలు నెరవేరును. విద్యకోరువారికి విద్యయు, ధనము కోరువారలకు ధనమును. పుత్రులను కోరువారికి పుత్రులను మోక్షమును అపేక్షించు వారికి మోక్షమును కలుగును. ఈ వినాయకుడు పుట్టిన దినము భాద్రపద శుద్ధ చతుర్థి కావున ఆ నాడు దేవతలు, మనుజులు, అందరును ఇతనిని పూజింపవలెనని పార్వతీ పరమేశ్వరులు నిశ్చయించిరి. అట్లు పూజించు వారికి విఘ్నములు లేకుండునట్లును, సమస్తకార్యములునుఫలించునట్లును, ఆపదలు లేకుండునట్లును శ్రీగణనాథుడు వారిని కాపాడుచుండును. అని బ్రహ్మాది దేవతలు వరములు ఇచ్చి తమ నివాసములకు జనిరి.

## గణేశ వివాహము.

వినాయకుడు ఇట్లు పెరుగుచుండగా కొంతకాలమునకు కుమారస్వామి శ్రీ ఉమా మహేశ్వరులకు కుమారుడై పుట్టి దినదిన ప్రవర్ధమానుడై వృద్ధిపొందుచుండెను. ఇట్లు ఇరువురును అన్యోన్య ప్రీతికలవారై మెలంగుచు తలిదండ్రులకు సంతోషము కలుగునట్లు అతివినయమును, విధేయతయు, ప్రేమయును కలిగి హృదయానందదాయకులై మెలంగుచుండిరి. యుక్తవయస్సును పొందినవారగుటచేత, వినోదముగా కాలము గడుపుచుండిరి. వీరిట్లుండుట చూచి సంతోషించుచు జననీ జనకులయిన పార్వతీ పరమేశ్వరులు ఇట్లు సంభాషించిరి.

పార్వతి:—నాథా ! బిడ్డలకు యుక్తనయస్సు వచ్చినది. వారి వివాహమునుగూర్చి ఏమి ఆలోచించిరి ?

శివుడు:—ప్రియసఖీ ! ఆలోచింపలేదు గాని యిందొక చిక్కు ఉన్నది.

పార్వతి:—చిక్కనుచున్నారేమి ? ఏమి చిక్కు ఉన్నది? అనేకులు తమ బిడ్డల నిచ్చి మనతో సంబంధము చేయుదుమని వర్తమానముల నంపుచున్నారే !

శివుడు:—అది నిజమే గాని ఇచ్చెదమని చెప్పినంత మాత్రమున ఏ పిల్లనైనను చేయవచ్చునా ? దంపతుల చిరకాల సుఖము నపేక్షించి గదా వివాహము చేయుట. అందుకు,

పార్వతి:—అవును. వారి సుఖముకొరకే వివాహము చేయుట కాని, వారు ముందు సుఖమునే పొందుదురో లేక కష్టమునే అనుభవింతురో అది మీకెట్లు తెలియును!

శివుడు:—తెలియకపోవుటయేమి? అట్టి సంగతులు తెలిసికొనుటకు మనకెన్నో సాధనములున్నవి.

పార్వతి:—స్వామీ! ఆ సాధనములేవో సెలవిండు!

శివుడు:—సఖి! వినుము. జ్యోతిషశాస్త్రము, కళాశాస్త్రము మొదలగు శాస్త్రములయందు ఈ సంగతులు బాగుగా వివరింపబడియున్నవి.

పార్వతి:—దేవా! ఈశాస్త్రములలో వివాహవిషయములా చెప్పబడియున్నవి? జ్యోతిషమున పంచాంగములు చేయుట, జాతకములు వ్రాయుట, ముహూర్తములు పెట్టుట మాత్రమే చెప్పబడినవని నేననుకొనుచున్నాను.

శివుడు:—అంతవరకు నీవెరుగుదువు గదా? జాతకము ననుసరించి యేస్త్రీలయు పురుషులయు జన్మక్షేత్రము, రాసి గ్రహస్థితులను బట్టి వారికి అనుకూలించెనో లేదో తెలిసికొనుటకు (12) ద్వాదశకూటములు చెప్పబడియున్నవి. అవి యేవనగా దినకూటము, గణకూటము, మహేంద్రకూటము, స్త్రీదీర్ఘకూటము, యోనికూటము, రజ్జుకూటము, వేధకూటము, నాడీకూటము మొదలగునవి కూటమనగా కలియుట.

పార్వతి:—ఈకూటముల ఉపయోగమేమి?

శివుడు:—ఇందులో కొన్ని కూటములు సరిపడకయున్న దంపతులు కలహించుచుందురు. మరికొన్ని కూటములవలన వారికి సౌఖ్యము లేకుండును. కొన్నిటివలన వారి కెడబాటులు కలుగును. మరికొన్నిటివలన దంపతులలో నొకరు వెంటనే మృతినొందుదురు. మరికొన్ని గ్రహములు సరిపడకయున్న వారి సంతానము నశించును.

పార్వతి:—ఇట్టి బాధలున్నవా ? అట్లయిన అవిముఖ్యముగ చూడవలసినదే. సాముద్రికమున నేమున్నది?

శివు:—స్త్రీపురుషుల లక్షణములను, రేఖలను, దంతములను, వెండ్రుకలను, నేత్రములనుబట్టి వారిఆయుర్దాయము ఐశ్వర్యము,సంతానము, స్వభావము మొదలగు సంగతు లనేకములు తెలియును. కావున సమాన లక్షణములుగల స్త్రీపురుషులకు దాంపత్యము శోభించును.

పార్వతి:—బాగుగ సెలవిచ్చితిరి ? కళాశాస్త్రము వివాహ విషయమున నెట్లుపయోగించును ?

శివుడు:—మంచిప్రశ్న వేసితివి. చెప్పెదనువినుము. కళాశాస్త్రమున స్త్రీపురుషులజాతిభేదములు, వారివారిఅభ్యాసములు, నడవడికలు, రుచులు, సుఖభోగమును కోరు సమయములు, వేరు వేరుగాచెప్పబడియున్నవి. స్త్రీజాతులునాలుగు. పద్మిని, చిత్రిణి, హస్తిని, శంఖిని. పురుషజాతులు నాలుగు. పాంచాలుడు, కూచిమారుడు, భద్రుడు, దత్తుడు. వీరిలో ఏజాతి స్త్రీకి ఏజాతి పురు

షునికి వివాహము సుఖమును, సంతోషమును, ప్రీతిని, హెచ్చుగ కలుగ జేయునో, ఎట్టి దాంపత్యము బాధకరముగా నుండునో తెలిసికొనవచ్చును. ఇది ఇట్లుండగా వీరిద్దరిలో ఎవరికి వివాహము చేయడమో నిశ్చయింపవలెను.

పార్వతి:—ఇందుకు విచారింప వలసిన పనిఏమి? వినాయకుడు పెద్దవాడుగదా?

శివుడు:—అదే గొప్ప చిక్కుగా కనబడు చున్నది. వీరిద్దరును నిత్యమును ఇందు విషయమై వాదించుకొను చుందురని మన నందీశ్వర, భృంగీశ్వరులు నాతో పలుమారు చెప్పు చుందురు. వీరు ఒకరికంటె నొకరు ముందుగ వారే వివాహమాడవలెనని కోరుచుందురట. ఈతగవు తీర్చుట ఎట్లు? కాని, వారిని పిలిపింపుము చూతము.

పార్వతి:—(ద్వారమందున్న నందిని చూచి) బాలురను తోడుకొని రమ్ము. అనగా అతడు పోయి వారలతో విన్నవింపగా వారు విచ్చేసి తలిదండ్రులకు నమస్కరించి ఎదుటనున్న ఆసనములపై కూర్చుండిరి.) అప్పుడు వారిని జూచి ప్రేమతో తల్లి దండ్రులు వారలతో ఇట్లు సంభాషించిరి.

పార్వతి:—బిడ్డలారా? ఏమిచేయుచుంటిరి?

వినాయకుడు:—అమ్మా శ్రీకృష్ణుడు రుక్మిణిని వివాహమాడిన కథను చదువుచుంటిమి!

శివుడు:—కుమారులారా! మీకు యుక్తవయస్సు వచ్చినది. కావున వివాహము అవసరము. కానిఇద్దరికిని ఏకకాలమున చేయుటకు వలను పడదు. మీరిద్దరును ఇంచుమించుగా సమయవయస్కులు. మా ప్రేమయు మీవిధి వినయములును సమానమే. కావున ఎవరికి వివాహము ముందు చేయవలయునో నిశ్చయింపలేము. ఇందుకు నేనొక తెరవాలోచించితిని. అది ఏమనగా మీలో ఎవరు భూమిచుట్టును ప్రదక్షిణముచేసి ముందు వచ్చెదరో వారికి ముందును, రెండవవానికి తర్వాతయును వివాహము చేయ నిశ్చయించితిని.

అనగా కుమారస్వామి తనలో తానిట్లను కొనెను. "అట్లయిన నేను నిముసములో భూమిచుట్టును తిరిగి రాగలను. నాది మయూరవాహనము. దానిపైని నేనెక్కిన వెంటనే అది ఎగురును." అని సంతోషించెను.

వినాయకుడు ఇట్లుమిక్కిలివిచారించు చుండెను. నాదిమూషికవాహనము. ఇది పిల్లులనుగాని, పక్షులను గాని చూచిన దాగుండును. నేను ఎట్లుభూప్రదక్షిణము చేసి వానికంటె ముందు రాగలను? ఇది యసాధ్యము. కావున నేను అందు విషయమై ప్రయత్నము చేయను. వేరు ఉపాయము ఆలోచించెదను." అని తరువాత కొద్దిదినములలో తానుండు గృహమున గోమయముతో అలికించి, ముగ్గు పెట్టించి, పీఠములువేయించి, పూజాద్రవ్యముల నుంపించి తాను తలిదండ్రులయొద్దకు బోయి, వారితో ఇట్లు

విన్నవించెను. "జననీ జనకులారా! నేను మిమ్ములను ఈదినమున పూజింపదలంచితిని. కావున మీరునాగృహమునకు వేంచేయవల యును." అనగా వినిఆశ్చర్యపడి ఒకరిముఖము ఒకరుచూచుకొని చిరునవ్వునవ్వుచు, మంచిది. పదమనివారుతనయునివెంటబోయిరి. వారిని పీఠములపై కూర్చుండ బెట్టి అర్ఘ్యపాద్యము లిచ్చి, షోడశోపచారములచే పూజించి, ఏడుసార్లు ప్రదక్షిణములుచేసి, సాష్టాంగ దండ ప్రణామము చేసి, ఎదుట నిలిచి, వారితో నిట్లు అనెను. "జననీ జనకులారా! ఎప్పుడు పెండ్లి చేసెదరు? నేను గెలిచితినిగదా!" అనగావిని పార్వతీ పరమేశ్వరులు ఆశ్చర్యము నొంది. "కుమారా! అదియెట్లు? నీవు ఇంకను ఇల్లువిడచిబయ లుదేరనేలేదే! గెలిచితినని ఎట్లంటివి?" అని యడుగ "ఏమి మీకు నేను ప్రదక్షిణచేసితిని కదా! తలిదండ్రులకు ప్రదక్షిణముచే యుట భూప్రదక్షిణముతో సమానముకాదా! ఇంతేకాక మీరు నాకే కాక ప్రపంచములోని జనులందరకును తలిదండ్రులుకారా? పది నాలుగు భువనములు మీ కుక్షియందు లేవా? వేదశాస్త్ర పురాణములయందు అట్లు చెప్పబడియున్నది కదా? అవి మనకు ప్రమాణములు కావా? సందేహించెద రేల? పితృమాతృపాద సేవ మాని వారి నింటనుంచి తీర్థయాత్రలు చేయుట వలన ఫలమేమి? ఫలము లేదు. సరేకదా దోషముకూడ సంభ వించును. ఇంటిలో తీర్థముండగా పైకి బోవుట ఏల? వేదము అబద్ధమా? కావున మీరు నాకు తప్పక వివాహము చేయ

వలయును. అని గణపతి చెప్పగా విని శివు డతనిని శ్లాఘించి అతడు చెప్పినది సత్యమని యెంచి వివాహ ప్రయత్నము చేసెను. అంతట విశ్వరూపుడను వాడు, సిద్ధి, బుద్ధి యను తన కుమార్తెలనిచ్చి వివాహము చేసెదనని చెప్పగా, ఆకన్యకలు మిగుల సుందరులు, సుగుణవంతులు, లక్షణవతులు అగుటచేత, పార్వతీ పరమేశ్వరులు అంగీకరించిరి. పిమ్మట విశ్వకర్మను పిలిపించి, వివాహవేదికలు, మొదలగునవి కట్టించి, హరి బ్రహ్మలను, ఇంద్రాది దేవతలను పిలిపించి మంచి సుముహూర్తమున వివాహముచేసిరి. బ్రహ్మాదులు నూతనదంపతుల నాశీర్వదించి తగిన సత్కారములుపొంది తమ నిజనివాసములకుజనిరి. పిమ్మట కొద్దిదినములలో కుమారస్వామి భూమిచుట్టు తిరిగి వచ్చి, తన కంటె ముందు వినాయకునికి వివాహమైనందున తనకు వివాహము అవసరములేదని చెప్పి, తపస్సు చేసికొనుటకై మేరు పర్వతమునకు పోయెను. శ్రీ మహా గణాధిపతి బ్రహ్మచారి యని మనవారు చెప్పుకొనుట నిజముకాదు. అని ఇందువలన మనకు తెలియుచున్నది.

## వామన జయంతి వ్రతఫలము.

శ్రీ వామనమూర్తి భాద్రపద శుద్ధ ద్వాదశి దినమున శ్రవణా నక్షత్రమందు జననమొందెను. కావున ఆదినము గొప్ప వ్రతదినము. త్రేతాయుగమున జరిగిన ఈ క్రింది కథవలన ఆవ్రతమాహాత్మ్యము వెల్లడియగుచున్నది. పూర్వము మద్ర దేశ

మున బ్రాహ్మణు లుండు అగ్రహార మొకటియుండెను. దాని పేరు శాకల్యపురము. అందు ధనవంతుడును, ధర్మపరుడును, న్యాయమార్గాను వర్తియైన కోమటి యుండెను. అతడు పెక్కు మనుష్యుల సామానును తీసికొని బళ్ళపైని వేసికొని, సౌరాష్ట్రదేశములో అమ్ముటకు బోవుచుండెను. మార్గములో మరుభూమిపై (అనగా జనులుగాని, వృక్షములుగాని, లేని యడారిలో) పోవుచుండగా దొంగలు కొందరు చూచి ఆ సామానును దోచుకొని కట్టుబట్టలతో అతనిని విడచిపెట్టిరి. అతడు మిక్కిలి దుఃఖముతో పోవుచు, ఆకలి దప్పులకు తాళలేక, అలసి త్రోవలో నున్న రావిచెట్టుక్రింద గూర్చుండెను. ఆ చెట్టుపైని పక్షులైనను లేవు. మధ్యాహ్నకాలమై యుండెను. అట్టి సమయములో ప్రేతనాయకు డొకడు అనేక ప్రేతలను తన వెంట తీసికొనిపోయి ఆ చెట్టునీడకు వచ్చి కూర్చుండి, అచ్చట అదివరకే యున్న కోమటిని చూచి అతని వృత్తాంతము అడిగి తెలిసికొని, చాల విచారించి వాని నష్టమును గూర్చి తానుగూడ దుఃఖించి, వానిని ఓదార్చి జరిగినపనికి విచారించుటవలన లాభము లేదని బోధించెను. ఆ ప్రేతనాథుడు పిమ్మట తన భృత్యులను పిలిచి కోమటిని వారికి చూపి, "ఈ కోమటి మనకు అతిథి. ఇతనికి మనము సత్కారము చేయవలయును. ఇతనిని చూచుటవలన నా బంధువు లందరిని చూచినట్లున్నది." అని చెప్పుచుండగా నొక క్రొత్తకుండతో పెరుగు కలిసిన అన్నమును, మరియొక కుండతో

మంచి నిర్మలమైన జలమును, ఆకసమునుండి అచ్చటికివచ్చెను. అది చూచి ప్రేతనాథుడు కోమటికిని తక్కిన తన పరివారము నకును కావలసినంత అన్నమును, నీరును ఇచ్చి మిగిలినది తాను కడుపునిండ భుజించెను. అంతట ఆ కుండలు రెండును అదృశ్య మయ్యెను. అదిచూచి కోమటి ఆశ్చర్యపడి ప్రేతనాథునితో ఇట్లనెను. "అయ్యా! ఈ నిర్జన ప్రదేశమున, అన్నోదకములు ఎట్లు వచ్చెను." ఆమాటలు విని వానితో ప్రేతనాథుడిట్లనెను. "అయ్యా! పూర్వజన్మమున నేను శాకల్యపురమున నుండు ఒక బ్రాహ్మణుడను. అప్పుడు నాపేరు సోమశర్మ. నేను దానధర్మ ములు చేసి యెరుగను. బహు కష్టములపై నాకు అన్నము దొరకుచుండెను. ఇట్లుండ నొకదినమున భాద్రపద మాసము న శుక్ల పక్షమునఏకాదశి దినమున మాగ్రామస్థులందరును సమీప మున నున్న తీర్థమున స్నానముచేయబోయిరి. వారితో నేనును బోతిని. అందు స్నానముచేసి ఆదినమున ఉపవాసము చేసితిని. మరునటి ఉదయమున తిరిగి స్నానము చేసి కుండతో అన్నము వండి అందు పెరుగునిండుగా పోసి క్రొత్తబట్ట దానిపై కప్పి కఱ్ఱతో చేయబడిన పాదరక్షలతో మంచి బ్రాహ్మణుని పిలిచి దానమిచ్చితిని. నేను డెబ్బది సంవత్సరములు జీవించితిని. కాని ఇది తప్ప మరియే దానమును ఎప్పుడునుచేసి యెరుగను. పిమ్మట కొంత కాలమునకు నేను చనిపోతిని. నాకు ఉత్తర క్రియలు చేయువారు లేనందున, ఇట్లు ప్రేతనై యున్నాను. ఆదినమున

చేసిన దానమువలన కలిగిన పుణ్యమువలన, ఈచెట్టు నాకు నీడ నిచ్చుచున్నది. ఈప్రేతలునన్ను మోయుచుందురు. మధ్యాహ్న కాలమునకు ఈనీరు, పెరుగుఅన్నము నాయొద్దకువచ్చుచుండును. నేను భుజింపగనే అవి అంతర్ధానమగును. నేను తినకముందు ఎంతరకు బెట్టినను తరుగక అక్షయమగుచుండును. ఇది నావృత్తాంతము. వస్త్రము నాకుఅవసరమైనప్పుడు దానంతటదేనాయొద్దకువచ్చును. శ్రవణద్వాదశినాడు చేసినదానఫలమిట్టిది." ఆమాటలువిని ప్రేతనాథుని చూచి కోమటియిట్లనెను. "ఓప్రేతనాథా! మీరు నాకు ఈదినమున నిర్జన ప్రదేశమున అన్నోదకము లిచ్చి కాపాడిరి. మీరు చేసిన మేలు మరువను. మీకు ప్రత్యుపకారము చేయవలెనని యున్నది. ఏమికోరెదరని అడుగగా ప్రేతనాథుడిట్లనెను. "ఓ వైశ్యోత్తమా! నాకు మేలు చేయ నెంచితివేని నీవు గయాతీర్థమునకు బోయి, స్నానముచేసి పవిత్రుడవై నాపేర పిండదానము జేసిన, నాకు ప్రేతత్వ విముక్తి యగును. అన్ని తీర్థములకన్న, గయాతీర్థ స్నానము చాల శ్రేష్ఠము. అందువలన సమస్త పాపములు నశించుటయే గాక గొప్పపుణ్యము కలుగును." అని చెప్పి ప్రేతనాథుడు లేచి ప్రేతల వలన మోయబడుచు మరుభూమినివిడచి పోయెను. తరువాత కోమటిబయలుదేరి శూరసేన దేశమునకు పోయి వ్యాపారము చేసి, విశేషధనమార్జించి, గయకు పోయి స్నానము చేసి, తన పితరులకు, బంధువులకు, తనకు గయాశ్రాద్ధము చేసి ప్రేతనాథుని

గోత్రనామములతో సయుతము పిండప్రదానము చేసెను. అందు వలన ఆ ప్రేతత్వము పోంది గంధర్వుడై కొంతకాలము సుఖముగా జీవించి మరల బ్రాహ్మణుని యింట పుట్టి వేదములు, శాస్త్రములు, పురాణములు చదివి, అభ్యాసవశమున తిరుగ శ్రవణద్వాదశీ వ్రతము చేయుచుండెను. ఇట్లు చాలకాలము నరకు సిరిసంపదలతో సుఖముగా జీవించి దిగ్విజయము చేసి రాజాధిరాజయ్యెను. ఈయనయే పురూరవచక్రవర్తి. వామన జయంతి లేక శ్రవణద్వాదశీ వ్రతఫలము ఇట్టిది.

ఉత్తరక్రియలు లేకుండినాను ప్రేతరూపమున యుందురనియు, గయాశ్రాద్ధము వలన వారికా రూపు మారి మంచి జన్మము కలుగుననియు, ఇందుమూలముగా స్పష్టమగుచున్నది.

శ్రీ వామనపురాణము సమాప్తము.

---

# అష్టాదశ పురాణ సారసంగ్రహము

## భవిష్యత్తులేక కలికి పురాణము.

### పురాణమునకు మూలకారణము.

ఈ కలికి పురాణమును పూర్వము నారదునికి బ్రహ్మ చెప్పెను. ఆనారదుడు వ్యాసమహామునికి చెప్పెను. వ్యాసుడు తన కుమారుడైన శుకమహామునికి చెప్పెను. ఆ శుకునివలన సూతమహాఋషి విని, శౌనకాది మహామునులకు చెప్పెను.

పూర్వమొకప్పుడు శౌనకాది మహామునులు నైమిశారణ్యమున సభ చేసియుండగా అచ్చటికి సూతుడు విచ్చేసెను. ఆయనను చూచి ఋషులందరును ప్రత్యుత్థాన మొనరించి తోడ్కొనిపోయి అర్ఘ్యపాద్యములిచ్చి పూజించి, కుశలమడిగి, అతనితో నిట్లనిరి. "ఓసూతమహర్షి ! నీవు సకల ధర్మాధర్మ విచారణుడవు. సమస్త పురాణవేత్తవు. భగవత్కథను చెప్పి మాఅజ్ఞానమును పోగొట్టుము. మీరు త్రికాలవేత్తలుకదా, మీ రెరుంగని విషయములు లేవు. శ్రీమన్నారాయణుడు కలికి మూర్తియై యచ్చట జన్మించెను ? ఏమి చేసెను ? కలియుగ మెట్లు సంప్రాప్తమయ్యెను ? ఆయుగమునందు జనుల నడవడి యెట్లుండెను? వారి ధర్మము లెట్లుండెను ?" అని అడుగగా సూతుడు తన గురువైన వ్యాసమహర్షిని, శ్రీమన్నారాయణుని ధ్యానించి ఇట్లు చెప్ప నారంభించెను.

కలిపురుషుని పుట్టుక.

ఓ మహాబుధులారా! వినుండు. శ్రీకృష్ణ నిర్యాణమైన పిమ్మట కలియుగ ప్రారంభమయ్యెను. అప్పుడు బ్రహ్మ తనసృష్టిభాగమునుండి అధర్మమునుగూడ పుట్టించెను. వానిభార్య అసత్యము. ఆమెకు దంభుడను పుత్రుడుగలడు. ఇతడు తన చెల్లెలగు మాయతో విహరించుచుండును. ఈదంపతులకు దంభుడను పుత్రుడును నికృతియను కూతురునుపుట్టి, వీరిరువురును దంపతులై క్రోధమను కుమారుని హింసయనుకూతునికనిరి. ఈక్రోధహింసలకుకలిపురుషుడుపుట్టెను. అతని లక్షణము లెట్టివనగా, నూనెకారుచున్న నల్లని శరీరము, కాకి కడుపువంటి కడుపు, కరాళమువంటి నోరు, ఎఱ్ఱని కన్నులు, భయంకరమగు ఆకారము కలిగి అగర్ధపు కింపుగల శరీరముతో జూదము, పానము స్త్రీ వ్యసనము లందు ప్రవర్తించుచు కలిపురుషుడు రాజ్యము పాలించుచుండెను. ఇతడు దురుక్తి యను స్త్రీతో విహరించుచు భయమను పుత్రుని మృత్యువను కూతుని కనెను. ఈ దంపతులకు నరకమను కొమరుడు, యాతన అను కూతురు పుట్టిరి. వీరి సంయోగము వలన వేలకొలది దుష్టులు జన్మించి అన్ని ధర్మములను నశింప చేసిరి. వారు యజ్ఞములు, అధ్యయనము, దానము, మంత్రములు, వేదము, వ్రతములు, ఉపవాసములు, పూజాదులును నశింపజేసి వ్యాధులు, ముసలితనము, దుఃఖము, భయము, మొదలగు తమ పరిచారకులను సృజింపగా అవి ధర్మమును నశింపచేసి అధర్మమును వృద్ధిపొందించెను.

## కలియుగ లక్షణములు.

అందువలన మాతృపితృ నిందాపరులును, దురాచారులును, వేదహీనులును, శూద్రపరాయణులై, కుతర్కవాదులు, వితండవాదులు, ధర్మవిక్రయులు, రసవిక్రయులు, మాంసవిక్రయులు, కూట సాక్ష్యము చెప్పువారును అయి బ్రాహ్మణులు ముందు వర్ణసంకరులగుదురు. ధనవంతుడే కడు శ్రేష్ఠుడగును. సంసార స్త్రీలు పాతివ్రత్యమును విడచి పరపురుషులతో విహరింతురు. సన్యాసులు గృహస్థధర్మమును అవలంబింతురు. ధనవంతులే సాధువు లనబడుదురు. దూరముననున్న జలములను తీర్థములందురు. యజ్ఞసూత్రమును ధరించినమాత్రమున బ్రాహ్మణుడందురు. దండములు ధరించినమాత్రమున యతియందురు. భూమిపై పంటలుతగ్గును. ధనలోపమున బ్రాహ్మణులు ఛండాలుని ఇంటయాజకు లగుదురు. విధవస్త్రీలు అలంకరించుకొని స్వేచ్ఛావిహారము చేయుదురు. ధూళితడియకుండునట్లు మేఘములువరించును. ఒకచెట్టు తడిసిన దానిప్రక్కనున్న మరియొకచెట్టు తడియకుండును. రాజులుప్రజలపై విశేషమువన్నులువేయుదురు. వానినిచెల్లించుటకు శక్తలేక జనులు గ్రామములను; పట్టణములనువిడచి భార్యాపుత్రులతో ఆకలిబాధ పడలేక కొండగుహలకు అరణ్యములకు, పర్వతములకు పారిపోవుదురు. అచ్చటమధుమాంసములను, పండ్లు, దుంపలు తిని బ్రతుకుదురు. కలియందు మొదటి పాదమున శ్రీకృష్ణుని నిందింతురు. రెండవపాదమున

శ్రీహరి పేరు చెవుల వినరు. మూడవ పాదమున వర్ణసంకర మగును. నాల్గవపాదమున జనులందరు ఒకటే వర్ణముకల వారగుదురు. శ్రీవిష్ణుని నామమును పూజను మరచి నాస్తికులై వేద పఠనము, జపము, హోమము, తిథిప్రయోజనములు అనగా తద్దినములు విడచి ఓంకారమును విడచి ద్విజులు సంచరింతురు. కలియుగమున అయిదువేల సంవత్సరములు గతింపగా గంగ మొదలగు తీర్థసేవనము, సాలిగ్రామ పూజనము, విడచి ధర్మములను ధర్మపరులను నిందించుచుందురు. పదివేల సంవత్సరములు గతియింపగా శ్రీహరి భజనమునుమాని క్షుద్ర దేవతలను పూజించుచు, బౌద్ధధర్మమును అవలంబించి సనాతనధర్మములను విడతురు. విష్ణుభక్తులను, బ్రాహ్మణులను నిందింతురు. వేదములను అష్టాదశపురాణములను, మంత్రములను తంత్రములను, వేదాంగములను, శాస్త్రములను, యోగశాస్త్రములను తత్వజ్ఞానమును తెలియక పండితులమనుకొనుచుందురు. పిత్రు, మాతృ తిథులయందు పశువులను చంపి వాని మాంసమును తిని మద్యపానము వేశ్యాగమనమును చేయుదురు. స్వగోత్రమున పుట్టిన స్త్రీలను పొందుదురు. శవమును దహించిన వెంటనే చనిపోయిన వారిని మరతురు. ఉత్తర క్రియలు మానుదురు. స్త్రీ పురుషులు తమ యిష్టప్రకారము వివాహ మాడుదురు. పురుషులు స్త్రీల యిష్టము చొప్పున వర్తింతురు. స్త్రీలు పురుషులను శిక్షింతురు. పురుషులు స్త్రీలను సేవింతురు.

అగ్రనామాలు దాసులవలె నుందురు. భార్యను తప్ప ఇతరు లను బంధువులని తలంపరు. తమ మతశాస్త్రములను విడచి మ్లేచ్ఛశాస్త్రములను చదువుదురు. ద్విజాతులు శూద్రులను సేవింతురు. కొందరు శూద్రునింట వంట చేయువా రగుదురు. కొందరు పశుపాలకులగుదురు. మరికొందరు పురోహితు లగుదురు. పాషండులవలె నుందురు. దంపతులు ప్రీతిలేని వారును, రాజులు పరాక్రమ హీనులును అడవులందు జనులును, గ్రామ, పట్టణములందు అడవి మృగములును నివసింతురు. నదులు, సరస్సులు జలశూన్యము లగును. చెరువులందు నదు లయందు పంటలు పండింతురు. సారమైన భూములను విడ తురు. పన్నులను చెల్లింపలేక జనులు తమ గృహములను విడ తురు. అధర్మపరులు సభాపూజ్యు లగుదురు. కులధర్మములను తీర్థములను నిందింతురు. అవి చేయువారిని నిందించి పరిహా సింతురు. జనులు మాటలయందుమాత్రము అహింస, దయ కనపరచుచుందురు. ఇట్టి పాపములవలన స్త్రీ పురుషులు వ్యాధి గ్రస్థులును, గ్రుడ్డివారును, పొట్టివారును, గూనివారును, మరుగుజ్జులును, చెవిటివారును, చేతులు లేనివారును, యౌవన మునసే ముసలివారును, అల్పాయుష్కులును, ప్రాణాంతకాల మందైనను లోభగుణము కలవారును అగుదురు. జనులకు పదియారువత్సరములకే శిరోజములు తెల్లబడును. ఇరువది సంవత్స రములకు మిక్కలి వృద్ధులగుదురు. ఎనిమిదవ యేట స్త్రీలు

రజస్వలలై బిడ్డలను కందురు. అనేకులు గొడ్రాండ్రగుదురు. అందువలన పలువురు దత్తపుత్రులగుదురు. అన్నిజాతుల వారును కన్యకలను అమ్ముదురు. తల్లి, అక్క, చెల్లెలు, కూతురు, కోడలు, ఆర్జించిన ధనమువలన పోషింపబడుదురు. లోభముచే తాము ఇచ్చిన దానద్రవ్యములను తామే అపహరింతురు. దేవబ్రాహ్మణ, గురుద్రవ్యములను స్వీకరింతురు. విధి నిషేధములను పాటింపరు. మూర్ఖులై పరధనములను, పరస్త్రీలను అపహరింతురు. భార్యాభర్తల నిర్ణయము ఉండదు. పంచపర్వములందు కూడ స్త్రీలపొత్తు సలుపుదురు. అమావాస్య నాటి రాత్రియందును గ్రహణ కాలములందును భుజింతురు. ఇట్లు క్రమముగా లోకము మ్లేచ్ఛమయమై యుండును. అధిక పాపమువలన జనులు అంగుళము పొడవు గలవారును, చెట్లు మూరెడు పొడవుగలవియు అగును.

## శ్రీహరి అవతరించుట.

ఇట్లు జనులు దేవతలను పూజించుట మానగా, వారు బాధనొంది బ్రహ్మయొద్దకు పోయి తమ బాధలను ఆయనతో విన్నవించుకొందురు. పాపభారమును భరింపలేక భూదేవియు వారలతో కలిసి బ్రహ్మయొద్దకు పోవును. చతుర్ముఖుడు వారి బాధలను విని తానేమియు చేయలేననియు, శ్రీమన్నారాయణుడే శరణ్యుడనియు వారలతో చెప్పి, వారలను తోడ్కొని గోలోకమునకు వెళ్ళి శ్రీహరికి నమస్కరించి చేతులు జోడించు

కొని పలువిధములు స్తోత్రములు చేయగా భూదేవి పాపులను భరింపలేక తమ దర్శనమునకు వచ్చిన సంగతియు, దేవతల బాధలను విన్నవింపగా, శ్రీహరి కరుణించి వారలతో ఇట్లు సెల విచ్చెను. "ఓపరమేష్ఠీ! ఇంద్రాది దేవతలారా! విచారింపకుడు. నేను భూభారమును నివారింపచేసి మీబాధలను తొలగింతును. నేను భరతవర్షమున శంబళ గ్రామముననున్న మహాపుణ్యాత్ము డగు విష్ణుయశుడను బ్రాహ్మణునికి భార్యయగు సుమతి గర్భ మున నాఅంశవలన పుత్రుడనై జన్మింతును. నాభార్యయగు నీ లక్ష్మి సింహళద్వీపమున బృహద్రథుడను రాజుకు కౌముదియను భార్యయందు పద్మావతియను పేర కుమార్తెయై జన్మించును. మీరందరును నాకు బంధువులై మీమీ అంశములవలన జనన మొందుడు. నేను భూభారమును నశింపచేసి, మరుత్తు, దేవాపి, నాకు భక్తులగుదురుగాన వారి నీభరతవర్షమునకు మండలాధీశ్వ రులనుగచేసి, కృతయుగ ధర్మములను మరల స్థాపించి, నేనుతిరుగ గోలోకమును చేరుదును" అనగావిని బ్రహ్మాది దేవతలు సంతో సించి వారి నిజనివాసములకు పోయిరి. పిమ్మట శ్రీహరి తాను బ్రహ్మాదులతో చెప్పిన ప్రకారము సుమతి గర్భమున చతుర్భు జములతో జన్మించును. అప్పుడు దేవతలు పుష్పవర్షము కురి పించి కలిభయమును విడతురు. ఆవిప్రదంపతులు నాలుగుచేతు లతో జన్మించిన యాబాలునిచూచి, "ఓమహాపురుషా! కృష్ణా! గోవిందా! అనంతా! మేము మానవులమయ్యు మాపూర్వ

పుణ్యావశమున మీరూపమును దర్శించితిమి. దేవతలకొరకును, భూభారమునుమాన్పుటకుమీరురహస్యముగామాయింటజన్మించిరి. అని ప్రార్థించియు మాయా మోహితులై పుత్రభావమును వహింపుదురు. ఆసమయమున గంగాదేవి స్త్రీరూపమును ధరించి కమండలముతో ఆబాలునికిగంగాస్నాన మొనర్చును. అనంతుడమృత మొసంగును. శ్రీహరి ఇట్లు చతుర్భుజములతో నుండుట తెలిసి బ్రహ్మ వాయుదేవునిచూచి నీవు శంబళ గ్రామమునకు పోయి విష్ణుయశుని ఇంట నున్న బాలుని వద్దకుపోయి రెండు చేతులతో నుండు మని చెప్పుము. అని పంపును. అతడట్లు చేయును. ఆ తలిదండ్రులు పుత్రోత్సవము చేయించి కోటిగోవుల దానముచేసి భోజనాదులచే బ్రాహ్మణులకు తృప్తికలిగింపుదురు ఇరువది యొకటవ దినమున మార్కండేయులు మొదలగు మహామునులు ఆబాలుని దర్శింపబోయి స్తుతులొనర్చి కలికి యని నామకరణము చేసి విమర్శతో పనులు చేయుచుండు మని చెప్పి తమ ఆశ్రమమునకు పోవుదురు.

## కలికిదేవుని విద్యాభ్యాసము.

అనంతరము ఆబాలుడు శుక్లపక్షపు చంద్రునివలె దిన దిన ప్రవర్ధమానుండై పెరుగుచుండును. ఈయనకు ముగ్గురు అన్నలుందురు. వారెవరనగా కవి, ప్రాజ్ఞుడు, సుమంత్రుడు. వారు పితృ మాతృ గురుభక్తియుక్తులై వేదపారాయణులు, ధర్మయుక్తులు, వేదవేదాంగాది విద్యలయందు నిపుణులై తలిదండ్రు

లకు వినయము గలవారై సంచరించుచుందురు. విశాఖయూపు
డను రాజు ఆ దేశమును పాలించుచుండును. ఒకనాడు తండ్రి
కల్కినిచూచి యిట్లనెను.

తండ్రి:—ఓ పుత్రా! నీవు ఉపనయనమును పొంది
విద్యాభ్యాస మొనర్పుము.

కుమా:—ఓ తండ్రీ! వేదమనగా నేమి? గాయత్రి
యన నేమి? ఏ సంస్కారముల వలన బ్రాహ్మణుడగును.

తండ్రి:—ఓ కుమారా! వేదములు శ్రీహరి ముఖము
నుండి పుట్టినవి. సావిత్రి వేదమాత. ఆ వేదములనుండి సత్త్వ,రజ,
తమోగుణములును పుట్టెను. దశవిధసంస్కారములవలన బ్రాహ్మ
ణుడగును. ఆ వేదములనుండి ముజ్జగములును పుట్టెను. యజ్ఞము,
అధ్యయనము, దానము, తపస్సు కలిగెను. కావున వేదమే
జగత్తులకు కారణము. ఆ వేదమువలననే, త్రిభువనములును
పాలింపబడుచున్నవి. వేదమంత్రములను జపించుటచేతనే శ్రీ జగ
న్నాథుడు ప్రసన్నుడగును. కావున సుముహూర్తమున నీకు ఉప
నయనము చేయుదును.

కుమా:—తండ్రి! దశవిధ సంస్కారములెవ్వి?

తండ్రి:—కుమారా! (1) గర్భాదానము. (2) పుంస
వనము. (3) సీమంతము (4) నామకరణము (5) అన్నప్రాశ
నము. (6) కర్ణవేధ (7) కేశఖండనము. (8) అక్షరస్వీక
రణము. (9) విద్యాభ్యాసము (10) ఉపనయనము అను నివి
దశవిధసంస్కారములు.

కుమా:—తండ్రీ! బ్రాహ్మణుడెట్టివాడు ?

తండ్రి:—విధివిహితంబుగా వివాహమైన స్త్రీయందు బ్రాహ్మణునికి జన్మించి, దశసంస్కారములను పొంది త్రిసంధ్యల యందును గాయత్రీ మంత్రమును జపించుచున్నవాడు బ్రాహ్మణుడు.

కుమా:—తండ్రీ! బ్రాహ్మణులు శ్రీహరిని ఎట్లు పూజింతురు ?

తండ్రి:—కుమారా! బ్రాహ్మణులు తపస్సు, సత్యము, దయ, శౌచము కలిగి తాము తరించి తమ వంశమున ఇరువది తరములవారిని తరింపచేయుదురు. వారు సదానందమయులై విష్ణుని పూజింతురు.

కుమారుడు:—తండ్రీ! సంసారమును తరింపజేయునట్టి బ్రాహ్మణులు ఎచ్చటనున్నారు ? అట్టివారినే కదా విష్ణు భక్తులలో శ్రేష్ఠులందురు.

తండ్రి:—కుమారా! ఈ కలిపురుషుని ప్రభావము వలన అట్టి బ్రాహ్మణులు నశించిరి. ఇప్పుడున్నవారు పేరునకే బ్రాహ్మణులుకాని వారికి మహత్తులేదు. ఎచ్చటనో ఒకరున్నను లెక్కకురారు.

అనగా విని కలికిమూర్తి తన మనస్సున కలిపురుషునిపై క్రోధించి వానిని శపింపనెంచి ఉపనయనమును చేయుమని చెప్పగా

బ్రహ్మవేత్తలయిన ఋషులను పిలిపించి, యథావిధిగా పుత్రునికి ఉపనయనమొనర్పగా, ఆ బాలుడు తేజోరాశియగు సూర్యునివలె ప్రకాశించుచుండెను

కలికిమూర్తి పరశురాముని యొద్ద విద్యాభ్యాసము.

ఉపనయనానంతరము కలికిమూర్తి బ్రహ్మచర్యమునుఅవలంబించి, వేదము, శాస్త్రము, శస్త్రవిద్య నేర్చుకొనవలెనని తండ్రియొద్ద సెలవు తీసికొని ఇల్లు విడచిపోవుచుండగా, ఆసంగతి యెఱింగి పరశురాములు త్రోవలో ఆ బాలుని యెదుర్కొనగా మిగుల తేజశ్శాలియగు ఆరాముని చూచి, బాలు డిట్లనును. " అయ్యా ! హరి హరులవలె ప్రకాశించుచున్న తమరెవరు !" పరశురాము డిట్లు చెప్పను. " నేను భృగువంశమున పుట్టినవాడను. జమదగ్ని మహాముని మాతండ్రి. నా పేరు పరశురాముడు. ఇరువదియొక్కమారు క్షత్రియులనునిర్మూలమొనర్చి వారి రక్తముతో పితృతర్పణ మొనర్చితిని. నేను మీకు విద్య నేర్పుటయను కీర్తిని పొందగోరి ఇటు వచ్చితిని." అనగా కలికిమూర్తి ఆయనతో మహేంద్రగిరియందు ప్రవేశించి చౌషష్టి కళలును ధనుర్విద్యయును, వేదములను నాలుగు మాసములలో పూర్తిగానభ్యసించి, సకల విద్యా పరిపూర్ణుడై చేతులు జోడించుకొని గురువుయెదుట నిలిచియేమి దక్షిణ సమర్పింపవలెనని కలికిమూర్తి అడుగును. అప్పుడు పరశురాముడు ఆయనతో యిట్లనెను. " స్వామీ ! శ్రీహరి పూర్ణఅంశముతో భూభార నివార

ణార్థము జన్మించితిరి. ఆపని చేయుటయే గురుదక్షిణగా నే తలంచెదను. నావలన పొందిన విద్యలన్నియు తమ జయము కొరకు అవునుగాక. శివుడు, పార్వతి, తమకు అన్ని అస్త్రము లను ఒసంగుదురుగాక. సింహళద్వీపమున పద్మావతిని వివాహమై దిగ్విజయమును చేసి ధర్మహీనులగు రాజులను నశింపచేసి మరుతు, దేవాపి యను క్షత్రియోత్తములకు రాజ్యము నిత్తురు గాక." అని ఆశీర్వదింపగా ఆయనయొద్ద సెలవును పొంది కలికి మూర్తి బిల్వోదకేశ్వర క్షేత్రమునకు జని అందున్న పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి, స్తుతింపగా ఆహరుడు ప్రీతుండై చిరునవ్వుతో ఆబాలుని చేరదీసి తన నిజాంకమున కూర్చుండ బెట్టుకొని, ఈశ్వరు డిట్లు విన్నవించును. "ఓ స్వామీ! నీవు త్రిలోకములకు అధిపతివైన శ్రీహరివి. కలిభారమును మాన్పు టకై అవతరించితివి. నీవు ఈ గరుడాశ్వమును తీసికొనుము. ఇది కామ గమనము కలది. పదునాల్గు భువనములును నిమిషమాత్రములో తిరిగి రాగలదు. ఈ రత్నపు పిడిగల కత్తిని కూడ తీసికొనుము. ఇది పాపులను సంహరిం చును." అని వరమొసంగ, వారియొద్ద సెలవుతీసికొని గుఱ్ఱము నెక్కి, శంబళగ్రామమునకు వేంచేసి, తలిదండ్రులతో తానొన ర్చిన పనులను, అభ్యసించిన విద్యలను, పొందిన వరములను గురించి, మనవి చేయును. వారు ఆనందింతురు.

పిమ్మట ఆ దేశపురాజైన విశాఖయూపుడు జనులవలన కలికి మూర్తి ప్రభావమును విని, ఆయనను దర్శింపబోయి.

ఆయనకు సాష్టాంగ దండ ప్రణామములు చేసి స్తుతులొనర్చెను. అది విని కల్కిమూర్తి యిట్లనెను, "ఓ రాజా! నీవు విష్ణుభక్తులలో ప్రధానుడవగుదువు. ధర్మముతో ప్రజలను పాలింపుము. నాసృష్టిలో బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రములను, బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థ, యతులు ముఖ్యులు. వీరు కలి బాధలవలన వారి స్వకీయ ధర్మములను విడచి చెడిరి. వారిని తిరుగ బాగు చేయవలెను. నీవు అశ్వమేధయాగమును చేయుము. అందువలన దేవతలు తృప్తిపొంది, వర్షములను కురిపించుటచే సస్యములు ఫలించును." అని చెప్పగా రాజువిని రాజనీతులను ధర్మములను తెలిసికొని సెలవుతీసికొని తన నిజనికేతనమును చేరును. ధర్మముగా రాజ్యమును పాలించుచుండును.

## పద్మావతి స్వయంవరము.

ఇట్లు రాజు వెళ్ళిన పిమ్మట, శ్రీ శుకమహాముని కల్కిమూర్తిని దర్శింపబోగా ఆయనను విధి విహితముగా పూజించి కుశలమడిగి శ్రీహరి ఆయనతో ఇట్లు సంభాషించును.

కల్కిమూర్తి:—ఓమునివర్యా! మీరు మాభక్తులలో శ్రేష్ఠులు. మీరాక మాకు శుభము. ఎందుండి విచ్చేయుచున్నారు?

శుకుడు:—స్వామీ! నేను సింహళ ద్వీపమునుండి వచ్చుచున్నాను.

కలికి:—అయ్యా! అందలి విశేషమేమి?

శుకులు:—స్వామీ! ఆదేశపురాజైన బృహద్రథునకు అతని భార్య కౌముదికిని ఒక పుత్రికయున్నది. ఆచిన్నది బహు సుందరాంగియై లక్ష్మివలె నొప్పుచున్నది.

కలికి:—అయ్యా లక్ష్మివలె యుండవచ్చునుగాని లక్ష్మి యెట్లగును?

శుకులు:—ఏలకాకూడదు. శ్రీహరి నరుడై అవతరించు నప్పుడు, లక్ష్మి యేల అవతరింపకూడదు?

కలికి:—సంయమీంద్రా! ఆమెనుగురించి యేమి చెప్ప బోవుచున్నారు.

శుకులు:—ఆమె శ్రీహరిని వివాహమాడవలెనని ఈశ్వరునిభక్తితో పూజింపగా హరుడు ఆమెకు ప్రత్యక్షమై అట్లేఅగు ననియు, దేవ, యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుష, మానవుల లోనెవరైనను ఆమెను వివాహమాడగోరిన వెంటనే స్త్రీల గుదురనియు వరమొసంగెను.

కలికి:—సరే, బాగుగనే యున్నది. ఆ వెనుక యేమి జరిగెను.

శుకులు:—పిమ్మట ఈమె ఇట్టి వరమును పొందిన సంగతి ఆమె తలిదండ్రులువిని శ్రీహరి తమకు అల్లుడగు భాగ్యము లభించునని ఆనందించిరి.

కలికి:—ఇందు ఆశ్చర్య మేమున్నది! శ్రీహరియే అల్లుడగు నప్పుడు వారానందించుట సహజమే కదా? పిమ్మట యేమి జరిగెను?

శౌకులు:—తరువాత ఆరాజు కుమార్తెకు స్వయంవరము చాటింపగా లక్షమంది నృపులు ఆ స్వయంవర సభకు పోయిరి. అప్పుడు ఆపద్మావతి నవరత్నభూషితురాలై చీనాంబరమును ధరించి పూలహారము చేగొని సభకు విచ్చేయగా రాజులందరును మోహావేశమున ఆమెను చూచి కామించి ఆమెవలె స్త్రీలయిరి.

కలికి:—ఔను. బాగుగనే యున్నది. ఈశ్వరవాక్యము వృథయగునా! పిమ్మట ఆచిన్నది యేమి చేసెను?

శౌకులు:—వారందరు స్త్రీలగుట చూచి పద్మావతి శివుడిచ్చిన వరము తప్పదని సంతసించి శ్రీహరిని తలచి "ఓ నారాయణుడా! ఎచ్చటనున్నాడవు? నా యందు కరుణించవేమి స్వామీ!" అని ధ్యానించెను.

కలికి:—ఆమె తలిదండ్రు లేమనిరి?

శౌకులు:—వారును ఆశ్చర్యపడి, కొంతవరకు నిశ్చేష్టులై, త్వరలో తెలివొంది శ్రీహరిని ధ్యానించి, ఈ ఆపదనుండి రక్షింపుమని ప్రార్థించిరి.

కలికి:—స్త్రీలైన రాజు లేమనిరి?

శుకులు:—వారు తమ స్త్రీరూపములను చూచి దుఃఖించుచు విధిని, నిందించుచుండిరి.

కలికి:—మునీంద్రా! మీరు ఎచ్చటినుండి ఈ సమాచారమును వింటిరి ?

శుకులు:—నే నొక చెట్టుపైనుండి అంతయు చూచి, ఆమె వృత్తాంతము తమతో విన్నవింప, నిటవచ్చితి.

కలికి:—ఓ మునివర్య! పరులకు ఉపకారము చేయుట మీవంటి సాధువులకు సహజ ధర్మమేగదా. కావున మీరు పద్మావతి యొద్దకు పోయి, ఆమెను ఓదార్చి, నేను త్వరలో వచ్చెదనని చెప్పిరండు.

శుకులు:—చిత్తము : పోయివచ్చెదను.

కలికిమూర్తి వివాహము.

అని సెలవుతీసికొని గగనమార్గమున సింహళద్వీపమును చేరి, పద్మావతిని దర్శించి, ఆమెతో కొంతసేపు సంభాషించి, పిమ్మట కలికిమూర్తి వృత్తాంతమంతయు చెప్పి, ఆమె శివుని ఉపదేశప్రకారము విష్ణువునుపూజించి ధ్యానించుచుండిన త్వరలో శ్రీహరివిచ్చేసి వివాహమాడునని చెప్పి,మరలశంబళగ్రామమునకు పోయి కలికిమూర్తిని దర్శించి ఆమె సవిస్తారమంతయు చెప్పెను. అదివిని శ్రీహరి దివ్యవేషధరుడై ఈశ్వరుడిచ్చిన కామ గమనము గల గుఱ్ఱము నెక్కియు, శుకులు ఆ కాశ మార్గమునను సింహళ ద్వీపమునకువెళ్లి అందలి సౌందర్యమునకు ఆశ్చర్య

పడుచు, ఒక దివ్య సరోవరమున స్నానము చేయుచుండిరి. స్నానానంతరమున శ్రీహరిస్ఫటిక సోపానమున కూర్చునియుండి పద్మావతికి సమాచారము తెలుపుటకు శుక మహామునిని పంపును. ఆయన అంతఃపురమును చేరి పద్మావతితో శ్రీహరి సరోవరతీరమున విచ్చేసియున్న సంగతి చెప్పగా ఆమె తనసఖులతో బయలుదేరిపోయి శ్రీహరిని దర్శించి, మరల నగరు ప్రవేశించి తలిదండ్రులతో శ్రీహరి విచ్చేసిన సమాచారమును చెప్పగా, రాజు తన పరివారముతో పోయి, కలికమూర్తిని దర్శించి పూజించి, తన నిజనివాసమునకు తోడ్కొనివెళ్ళి దివ్యభవనమున నిలుపును. పిమ్మట మంచిదినమున శుభముహూర్తమున, తన కూతును ఆయనకిచ్చి వివాహము శోభస్కరముగా నొనరించును. మామగారుచేయు మర్యాదలకు సంతోషించుచు శ్రీహరి కొన్ని దినము లందుండి సుఖభోగము లనుభవించు చుండును.

స్త్రీరూపమును పొందిన రాజులు పురుషులగుట.

ఇంతకుమున్ను ఈశ్వర శాపమువలన స్వయంవర కాలమున స్త్రీరూపమును పొందిన రాజులు తమ దేశములకు బోవసిగ్గుపడి పద్మావతికి దాసీలై సేవచేయుచుండిరి. వారిప్పుడు శ్రీహరికి సేవలు సలిపి, ఆయన అనుగ్రహమును పొంది రేవానదిలో స్నానము చేసినంతమాత్రమున యెప్పటివలె, తమ పురుషరూపములను పొందినవారై, శ్రీహరిని పలువిధముల స్తోత్రము చేయుదురు. తరువాత వారు కలికిమూర్తివలన రాజకీయ ధర్మములను ప్రజా

పాలన పద్ధతులను విని సంసారమందలి మాయను, దానిని అతి క్రమించు రీతులను ఆనతీయుమని ప్రార్థింపగా అనంతుడను మునిని శ్రీహరి స్మరించును. ఆమునివచ్చి వారికావిషయము లను బోధించగా విని, వారు తృప్తినొందుదురు. అనంతరము వారు శ్రీహరిని పూజించి ఆయన యొద్ద సెలవు తీసికొని, తమ దేశములకు జని తమ ప్రజలను సుఖముగా పాలించు చుందురు.

## ఇంద్రుడు శంబళగ్రామమున విశ్వకర్మచే పుర నిర్మాణము చేయించుట.

ఇట్లు కలికిమూర్తి సింహళద్వీపమున చారుమతీపురమున అత్తవారింటనుండగా, ఇంద్రుడు విశ్వకర్మను పిలిపించి శంబళ గ్రామమున కలికిమూర్తియై అవతరించిన శ్రీహరి కొరకు నవ రత్నములతోను, సువర్ణముతోను, దివ్య భవనములను నిర్మింపు మని ఆజ్ఞాపింపగా, అతడు అంగీకరించి శంబళమునకు పోయి, ద్వారకయందును, బృందావనమునందును, తానుముందు నిర్మిం చిన రీతిగ, దివ్యసుందర మందిరములను త్వరలో తయారు చేయును.

## శ్రీ కలికిమూర్తి తనపురము ప్రవేశించుట.

ఇట్లు రాజులకు సెలవిచ్చి పంపి కలికిమూర్తి తన పురము నకు బోవ సమకట్టి, అత్తమామలయొద్ద సెలవు తీసికొని, వా రొసంగిన కానుకలను అనగా ఏనుగులను, గుఱ్ఱములను, రథము

లను, దాస దాసీజనంబులను, దివ్యాభరణములను తీసికొని భార్యతో బయలు దేరి కామగామియై అంతరిక్ష మార్గమున అశ్వారోహణము చేసి, గగన మార్గమున పోవును. ఆయన పరివారమును సముద్రము నుదాటి భూమార్గమున రండని పంపును అప్పుడు సముద్రుడు వారికి త్రోవ యిచ్చును. కలికమూర్తి తమతో గగనమున పోవుచున్న శుకునిగూర్చి యిట్లనెను. "మునివర్యా! మీరు ముందుగా మా జననీ జనకులగొద్దకు పోయి మారాక వారితో విన్నవింపుము. మేము పరివారముతో కూడ యింతలో వచ్చెదము." అనగా విని ఆ ఋషి శంబళమునకు పోవును గాని దానిని పోల్చ లేకుండెను. విశ్వకర్మ నిర్మితములైన దివ్య హర్మ్యములను, ఉద్యానవనములను, సరోవరములను స్ఫటిక సోపానములను, చూచి ఆశ్చర్యము నొందుచు పోగా, విష్ణుయశుడు ఆయనకు ఎదురేగి, తోడ్కొనిపోయి, అర్ఘ్య పూజ లొనర్చి, తన కొమరుని యోగక్షేమము లడుగును. శ్రీ శుకులు ఆయనతో కలికిమూర్తి వివాహ విషయ ప్రసంగ మంతయును వారి శుభాగమనమును గురించియు, చెప్పగా సంతసించి పట్టణ మంతయు అలంకరించి, పూర్ణ కలశము లను పెట్టించి, తోరణములను కట్టించి, జయ జయ ధ్వనులతో వారికి ఎదురేగి గొప్ప ఉత్సవముతో ఆ దంపతులను వారి పరివారమును నిజమందిరములకు తీసికొని పోవును. అంత ఆ నూతన వధూవరులు వారలకు నమస్కరింతురు. పద్మావతి

అ క్షేత్రములను వివిధోపచారములచే పూజించును. విష్ణుయ శుడు ఆనందభరితుడై; బ్రాహ్మణులకు విశేష దానధర్మములను భూరిసంతర్పణములను చేయుచు కొంతకాల మిట్లు సుఖంబుండ కలికిమూర్తికిని అన్నలకును సంతానములు కలిగి క్రమముగా నెదుగుచుందురు.

కలికిమూర్తి దిగ్విజయము చేయుట.

ఇట్లు శ్రీ కలికిమూర్తి ధనధాన్య వాహన సంపత్తితో తులదూగుచు ఒక రోజున సభామండపమున మంత్రి పురోహిత బాంధవసహితుండై కొలువుండగా విష్ణుయశుడు అచ్చటికి విచ్చేయును. ఆయన తండ్రికి ప్రత్యుత్థానముచేసి సాష్టాంగదండ ప్రమాణంబు లాచరించి ఆసీనుంజేసి ఇట్లు విన్నవించును. "ఓజన కా! మీచే అశ్వమేధము చేయించవలెనని యున్నది. అందుకు ముందు దిగ్విజయము చేయవలసి యున్నది. తమరు నాకు సెల వొసంగిన సైన్యముతో పోయి నా స్త్రీకులయిన రాజులనందరను నిర్మూలము చేసి వచ్చెదను." అనగా తండ్రి కుమారుని ఆశీర్వదించును.

పిమ్మట యా శ్రీహరి సోదర, మంత్రి, సేనాసమేతుడై బయలువెడలి కీకట పురమునన్న బుద్ధ ఆలయముపై బడి, యుద్ధము చేయ నారంభించును. బుద్ధులు దేవతారాధనమును పితృపూజనమును విడచి, పరలోకమును నిందించువారును, ఆత్మాభిమానములును, కులము జాతి; విచక్షణము లేక భోజన

ప్రతి భోజనములను, సంబంధ బాంధవ్యములను చేసికొనుచు బహు బలముగలవారై యుందురు. వారికి రాజై ఒక జైనుడు ఉండును. అతడు సేనా సమన్వితుడై కలికిమూర్తితో యుద్ధము చేయును. విశాఖ యూపుడు కలికిమూర్తిని కలిసి బౌద్ధులతో యుద్ధమునకు పోవును. ఉభయ పక్షములవారికిని ఘోరయుద్ధమగును. అందు బౌద్ధులు అనేకులు చనిపోవుదురు. వారి సైనికులు చెల్లాచెదరై పారిపోవుదురు. అప్పుడు కలికిమూర్తి బుద్ధుని చూచి "ఓ రాజా ఒక్క నిముసము నాయెదుట నిలువుము. నేను పదునాల్గు భువనములకును అధిపతిని. జీవులకు శుభాశుభముల నిచ్చువాడను. నా బాణములవలన చంపబడి నీవు యమపురికి పోవుదువు." అనిపలికెను. ఆమాటలువిని జైను డిట్లనును "బౌద్ధులను చంపుట పుణ్యమా? మీరు దైవమన్నమాట నిజమైన మేము నిన్ను యేమిచేయగలము." అని కలికిమూర్తి ప్రయోగించు బ్రహ్మ, వాయువ్య, ఆగ్నేయ పర్జన్యాది అస్త్రములను జైనుడుచూచి భయపడును. జైనునిసైన్యములు పలాయితులగుదురు. కలికిమూర్తి జైనునితో ద్వంద యుద్ధముచేసిచంపును. పిమ్మట వారితెమ్ముడు శుద్ధోధనుడు శ్రీహరి భార్యయైన మాయాదేవిని యుద్ధమునకు పురికొల్పును. ఈమె యుద్ధమున బహు నేర్పరియై అనేకమాయలెరుంగును. ఈమెతో యుద్ధము చేసి కలికిమూర్తి సేనాధిపతులు నిశ్చేష్టులగుదురు. వారి చేతనున్న అస్త్రములు క్రిందపడును. అప్పుడు ఆయన అమృత దృష్టి

తో వారిని చూడగా అందరును తెలివొంది మరల యుద్ధము చేయుదురు. అప్పుడు కలికిమూర్తి అశ్వారోహణము చేసి చేత ఖడ్గమును ధరించి, వారినందరను నిముసములో సంహరించును. అప్పుడు వారి భార్యలు పతివిహీనలై అధైర్యము నొంది ప్రాణములపై నాశవిడచి, యుద్ధమునకు పోవుదురు. శ్రీహరి వారిని చూచి చంపుటకు చేతులురాక వారలకు జ్ఞానోపదేశము చేసి, భక్తివైరాగ్యములు కలవారై ముక్తినొందుడని బోధించును.

వాలఖిల్యాది మునులు కలికిమూర్తిని దర్శించుట.

ఇట్లు శ్రీ కలికిమూర్తి బౌద్ధులను మ్లేచ్ఛులను నశింపచేసి, విశేషధనరత్నరాసులను తన సైన్యములచే నిజమందిరమునకు పంపించి, జాతిధర్మములను, ఆశ్రమధర్మములను, శ్రీ విష్ణుసేవా ధర్మములను, యజ్ఞవిధానములను, వైదికతాంత్రికవిధానములను భూలోకమున స్థాపించి మిగ గజ, రథ, అశ్వ, పరివార సహితుండై చక్రతీర్థము నకు పోవును. అచ్చట ఆయన విధివిహితముగా స్నానధ్యానములను తీర్చుకొనియుండగా, సూక్ష్మదేహులగు వాలఖిల్యాదిమునులు విచారగ్రస్తులై వారిని దర్శింపబోవుదురు. వారు అరువదివేలమంది. వారినిచూచి శ్రీహరి మీామీావిచారమునకుకారణమేమి ?అని అడుగగా వారిట్లు విన్నవింతురు.

కుథోదరియను రక్కసిని వధించుట.

స్వామీా! కుంభకర్ణుని మనుమరాలు (కూతురికూతురు) కుథోదరియను పేరుగల రక్కసి ఒకతెయున్నది. ఆమె కాలకుం

జుడను వానిభార్య. ఆమె ఎత్తు అంతరిక్ష
హిమాలయమున శిరస్సును నిమజ్జ
కొని పరుండును. ఆమెకువికుంజుడను కుమ
ఒక స్తనమునుండి పానము చేయుచుండగ
నుండి పాలు కారుచుండును. ఆక్షీరములు
చుచుండును. ఆమె విడచు ఊపిరి వేగముచే
వచ్చితిమి. దానిబాధ భరింపలేక యున్నాము
చి మమ్ము రక్షింపుమని ప్రార్థింతురు. అందు
శ్రీకలికిమూర్తి తన పరివారముతో ఆమునులవెంట
క్షీరనదినిచూచి, పిమ్మట ఆనిశాచరి యుండు స్థలమునకు
దాని ఆకారమును చూచి ఆశ్చర్యపడి దానినెట్లు సంహ
వచ్చునని ఆలోచించుచుండగా, ఆమె ఆమునను, రథ
తురగపదాతులను మ్రింగును. శ్రీహరి దాని కడుపునండి
రీతముగా పెరిగి డొక్క చీల్చికొనిపైకివచ్చేయును. ఆయనపరి
మును అట్లే వెలుపలికి వచ్చును. ఇది అంతయు దివినుండి
చుచున్న దేవతలు మొదట హాహాకారములు చేయుదురు క
తుదకు సంతసించి శ్రీహరిపై పుష్పవర్షము కురిపింతురు.

## వికుంజుని సంహరించుట.

ఇట్లు తల్లి మృతినొందుట చూచి అయిదు వత్సరముల
బాలుడగు వికుంజుడు కొందరు రాక్షసులతో అచ్చటికిపోయి
శ్రీహరితో యుద్ధమారంభించును. బాలుడని కనికరించి కలికి

బాణములను విడచునుగాని వాడు చావ
చ్చిన బ్రహ్మాస్త్రమును ప్రయోగించి
లినరాక్షసులను తనఖడ్గముతో నరకును.
ము తొలగునని మునులు, దేవతలు,
యోగింతురు. పిమ్మట కలికిమూర్తి
యి గంగాస్నానముచేసి గంగను నారా
యగా పూజించి పుండరీకవనమున విశ్రమించి
ంతముల తపము చేయుచుండు మునులును,
ఆయనను దర్శింపబోవుదురు. ఆకలికిమూర్తి వార
రాంచి క్షత్రియవంశపు పేరులుగ నెరింగి వారి వంశచరిత్రను
డని కోరగా వారిలో మరుతు ఇట్లుచెప్ప నారంభించెను.
మీా ! నేను సూర్యవంశమునజన్మించితిని. వైవస్వతమనువు
వాడను. మావంశపు చరిత్రము రామునివరకును ప్రసిద్ధము -
వున తమరు వినియే యుందురు." అనగా శ్రీరాముని కథను
గారిగా చెప్పుమని ఆయన అడుగగా మరుతు ఇట్లని విన్న
ంపదొడంగెను.

## శ్రీహరి రాముడౌటకు కారణము.

పూర్వము రావణుడను రాక్షసరాజుండెను. ఆతడు
లంకయందు రాజై యుండి, స్వర్గ, మర్త్య, పాతాళములను
జయించి ముల్లోకవాసులను బాధించుచు, అనేక ఘోరపాప
ములను చేయుచుండెను. వాని బాధలను భరింపలేకను, దేవత

లును, మునులును, పాపభారమును భరింపలేకను భూదేవితో గూడ సత్యలోకమునకు పోయి బ్రహ్మతో చెప్పుకొనగా ఆ చతుర్ముఖుడు వారి మొఱలు వినియు, తానేమియు చేయలేక గోలోకవాసియగు శ్రీహరి తప్ప, ఇతరులేమియు చేయజాలరని వారలతో పోయి, ఆయనకు విన్నవింపగా శ్రీహరి వారలప్పై కరుణించి తాను శ్రీరాముడనుపేర భూలోకమున భరత వర్షమున కోసలదేశమును పాలించుచుండు దశరథమహారాజునకు కుమారుడనై అయోధ్యయందు జన్మించెదననియు, దేవతలందరును వానరులై జన్మించి తనకు సహాయమొనర్చిన త్రిలోక కంటకుడగు రావణుని సంహరించి వారి బాధలను, భూభారమును నివారించెదననియు వారితో చెప్పి పంపెను.

## శ్రీరాముల జన్మము.

పిమ్మట కొంతకాలమునకు దశరథ మహారాజు చిరకాలమువరకు సంతతి లేక పుత్రకామేష్టియను యాగమునుచేయగా యాగాంతమందు ఆ హోమ గుండమునుండి అగ్ని దేవుడు బ్రాహ్మణరూపమున స్వర్ణపాత్రముతో పాయసము తెచ్చి, దశరథుని చేతికిచ్చి, "రాజా! నీవు దీనిని నీ భార్యలకిచ్చిన తప్పక సంతతికలుగును." అని చెప్పి అంతర్ధానమునొందెను. దశరథుడు ఆ పాయసమును తన భార్యలగు కౌసల్య, సుమిత్ర, కైకేయిలకు పంచియివ్వగా శ్రీహరి అంశచే కౌసల్యకు రాముడును, శంఖము అంశచే భరతుడును, చక్రముఅంశచే శత్రుఘ్నుడును, కైకకును,

అనంతునిఅంశచే లక్ష్మణుడు సుమిత్రకును జన్మించిరి. ఇట్లు పుత్రులకలిగి దినదినప్రవర్ధమానులై శుక్లపక్షమునందలి చంద్రునివలె పెరుగుచుండిరి. కొంతకాలమునకు యుక్తవయస్సురాగా వారికి తండ్రి ఉపనయనములు చేసెను. అంతట విశ్వామిత్రుడు తాను చేయుచుండిన, యజ్ఞమునకు విఘ్నము కలుగచేయుచుండిన తాటకి, మారీచుడు, సుబాహుడు అను రాక్షసుల సంహరింప శ్రీరామ లక్ష్మణులను తన వెంట బంపుమని దశరథుని కోరి తన వెంట తీసికొనిపోయి వారికి అస్త్రవిద్యను నేర్పగా, వారు యజ్ఞవాటికకు పోయి, ఆ రాక్షసులలో కొందరిని చంపియు, మారీచుని ఎగుర గొట్టియు ఆయన జరుపు యాగమును సమాప్తి నొందించిరి. భర్తశాపమువలన రాయియైయుపడియున్న అహల్యను నెప్పటివలె స్త్రీని చేసెను. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో మిథిలకు పోయి, జనకుడు చేయు సీతాస్వయంవరమున శివుని విల్లు విరచి రాముడు సీతను పెండ్లాడెను. ఊర్మిళను లక్ష్మణుడును, మాండవిని భరతుడును, శ్రుతకీర్తిని శత్రుఘ్నుడును వివాహమై అయోధ్యకు పోవుచుండగా మార్గమున పరశురాముని గర్వమణచి, అయోధ్యలో ప్రవేశించిరి. పిమ్మట కొద్దిదినములలో దశరథుడు రామునికి పట్టము కట్టుటకు సిద్ధపడగా కైక తన కుమారుడైన భరతునికి రాజ్యమిమ్మనియు; శ్రీరాముని పదునాల్గు వత్సరములు అరణ్యమున యుండపంపు డనియు రాజును వేడికొనెను. ఆసంగతి విని రాముడు అడవికి

పోవ సిద్ధపడగా సీతయు, లక్ష్మణుడును వెంటనంటిరి. కావున వారినిగూడ తోడ్కొని ఆయన అడవికి పోయెను.

### దశరథుని మరణము.

ఇట్లు రామలక్ష్మణులు అడవికిపోయిన దుఃఖముచే దశరథుడు మరణించెను. అప్పటికి తాతగారింటికి పోయియున్న భరతుడు తండ్రిచనిపోయిన సమాచారము వినగానేవచ్చి, ఆయనకు దహనాది కృత్యములు చేసి, అన్నను తీసికొని వచ్చుటకు అరణ్యములకు వెళ్ళెను. కాని రాముడు సత్యవ్రతుడు. కాన తండ్రి సెలవుప్రకారము అరణ్యవాసము జరుపక రానని చెప్పి, తనకు మారుగా తన పాదుకలను అతని కొసంగెను. భరతుడు వానినితీసికొనిపోయి రాముడులేని అయోధ్యలో తానుండుటకు ఇష్టపడక నందిగ్రామమున నుండెను.

### రావణుడు సీతను అపహరించుట.

పిమ్మట సీతారామలక్ష్మణులు అనేకరాక్షసుల వధించుచు, పుణ్యపురుషులను దర్శించుచుపోయి, పంచవటీతీరమున పర్ణశాల నిర్మించుకొని, అందు నివసించుచుండగా రావణుని చెల్లెలగు, శూర్పణఖ వారినిచూచి మోహించి తనను వివాహమాడుమని రామునికోరగా, ఆయన సెలవుప్రకారము లక్ష్మణుడు ఆమె ముక్కును చెవులును కోసెను. ఆమె మొరలిడుచు పోయి తన సహోదరులగు ఖరదూషణాదులతో చెప్పగా, వారు స్వపరివారములతో పోయి రామలక్ష్మణులచే హతులైరి.

శూర్పణఖ వెంటనే రావణుని యొద్దకుపోయి, సీత సౌందర్యము అతనికి వర్ణించిచెప్పి, ఆమె తనకు తగిన స్త్రీయని చెప్పెను. ఆమాటలువిని రావణుడు తన స్నేహితుడైన మారీచునొద్దకు పోయి అతనిని బంగారు లేడిరూపమున సీత యెదుటికి పొమ్మని చెప్పెను. మారీచుడట్లు చేయగా సీత లేడినిచూచి దానిని పట్టి తెమ్మని రామునితో చెప్పెను. రాముడు లక్ష్మణుని, సీతయొద్ద కాపుంచి లేడివెంట పోయెను. దూరముపాఱిపోయిన లేడిని రాముడు బాణముతో కొట్టగా "హా లక్ష్మణా!" అని కేకవేసి క్రిందపడి మృతినొందెను. ఆ కేకవిని సీత లక్ష్మణుని రామునొద్దకు పంపెను. అంతట రావణుడు సన్యాసివేషమునవచ్చి సీతను తన విమానము నందుంచుకొని తీసికొనిపోయి తన అశోకవనమున రాక్షసస్త్రీలను ఆమెయొద్ద కాపుంచెను.

రామలక్ష్మణులు సుగ్రీవునితో సఖ్యముచేయుట.

అంతట రామలక్ష్మణులు కలిసి పర్ణశాలకు వచ్చి సీత లేనందున మిగుల శోకించి ఆమెను వెతకుచు పోయిపోయి హనుమంతుని గాంచిరి. అతని వలన సుగ్రీవుని వృత్తాంతమంతయు విని అతనితో స్నేహముచేసి వాలిని సంహరించి సుగ్రీవుని కిష్కింధలో వానరరాజుగ చేసిరి. అతడు తన వానరదూతలను సీతను వెదకుటకు నలుదిక్కులకు పంపగా దక్షిణదిక్కునకు పోయిన హనుమంతుడు, అంగదుడు, జాంబవంతుడు మొదలగు వారలలో హనుమంతుడు సముద్రమునుదాటి లంకకుపోయి అశోకవనమున

సీతను గాంచి సంభాషించి ఆవనమును పాడుచేయగా రావణుడు పంపిన రాక్షసులను అనేకులను చంపి, ఇంద్రజిత్తు అను రావణుని పుత్రునిచే బ్రహ్మాస్త్రము వలన కట్టబడి రావణునియొద్దకు తీసికొనిపోబడెను. అతనిని పరుషములాడి, తాని తోక కాల్చ, వాడు దానితో లంకాపట్టణమును దహించి తనతోకను సముద్రములో ముంచి చల్లార్చుకొని, తిరుగ రామునియొద్దకువచ్చి సీత సమాచారమును మనవి చేసెను.

శ్రీరాములు రావణుని చంపుట.

ఇట్లు సీత సమాచారమును విని రామలక్ష్మణులు సుగ్రీవుని వానరసైన్యములతో బయలుదేర సముద్రముపై వారధికట్టి దానినిదాటి లంకకుపోగా రాక్షససైన్యములు వారితో నిలువబడెరి. రాక్షసవీరులు అనేకులు మడిసిరి. రావణుని తమ్ముడగు విభీషణుడు అన్నకు నీతులు బోధించినను అతడు వినక తూలనాడినందున అతడు రాముని శరణుచొచ్చెను. ఈ విభీషణునివలన రావణ కుంభకర్ణాదుల మర్మమెరింగివారలను సంహరించి, విభీషణునికి పట్టము కట్టి, సీతను తీసికొని పుష్పక విమానముపై అయోధ్యకు పోయెను.

శ్రీరాముని పట్టాభిషేకము.

అంతట పదునాల్గు సంవత్సరములు పూర్తికాగా సీతారామలక్ష్మణులు నందిగ్రామమున విడసిరి. అంతకు ముందే హనుమంతునివలన రాముని రాక విినియుండిన భరతుడు

అయోధ్యను శృంగారించి యుంచినందున నలువు రన్నదమ్ము లును వారి వారి భార్యలతో కలిసి అందుబోయిరి. శ్రీరాములు తమ్ములతో సుఖముగానుండె తనవెంటవచ్చిన విభీషణ సుగ్రీ వాది వానరులను సత్కరించివారి వారినెలవులకు పంపెను." అని మరుతు శ్రీరాముని చరితమును చెప్పగా కలికిమూర్తి విని సంతసించి శ్రీరాముని సంతతిని వర్ణించుమనగా మరుతుడు ఇట్లు మనవిచేసెను.

## శ్రీరాముని సంతతి.

శ్రీరామునికి కుశుడు, లవుడు అను ఇద్దరు కుమారులు. వారిలో కుశునికి అతిథి, అతనికి నిషధుడు, అతనికి నభుడు, అత నికి పుండరీకుడు, వానికి క్షేమధన్వుడు, అతనికి నృపశేఖరుడు, అతనికి దేవానీకుడు, వానికిహీనుడు, ఇతనికిపారిపాత్రుడు, వీనికి బలాహకుడు, వీనికి అర్కుడు, వీనికి రజనాభుడు, వీనికిఖగణుడు, వీనికి విధృతుడు, వీనికిహిరణ్యాక్షుడు, వీనికిపుష్యుడు, వీనికిధ్రువుడు, వీనికి స్యందనుడు, వీనికిఅగ్నివర్ణుడు, వీనికిశీఘ్రుడు పుట్టిరి. ఈయ నయే మాతండ్రి. నాపేరు మరుతుడు. నేను తాత్రము లేక యు న్నాను. నాకుమారుడు బుధుడు. వానికి సుమిత్రుడను పుత్రుడు కలడు. తమ అవతారమును చూచుటకు నిరీక్షించుచు కలాప గ్రామమున నివసించుచు తపస్సు చేయుచుండి తమరు అవతరిం చినసంగతి, శ్రీ వ్యాసమహాముని వలన విని, ఇటవచ్చి మిమ్ములను దర్శించి, నా పూర్వజన్మపాపమును నశింపచేసికొని, కృతార్థుడ

నైతిని. అనగా విని కలికిమూర్తి మీ వంశచరిత్రమును వింటిని. అది బహు పవిత్రమైనది.

## చంద్రవంశపు రాజులు.

శ్రీహరి నాభికమలమున పుట్టిన బ్రహ్మకు అత్రిమహా ముని కుమారుడై జన్మించెను. ఆయన కుమారుడు చంద్రుడు. వీనికి బుధుడు, వీనికి పురూరవుడు, వీనికి యయాతి, నహుషుడు. ఈ నహుషుడే ఇంద్రుడయ్యెను. యయాతికిని దేవయానకును, యదు, తుర్వసు లను ఇరువురును, శర్మిష్ఠకు ద్రుహ్యుడు, అనుడు, పూరుడును పుట్టిరి. పూరునికి జనమేజయుడును, అతనికి పచిన్వానుడు, వీనికి ప్రవీరుడు, వీనికి మనుస్యుడు, వీనికి అభయదుడు, వీనికి ఊరుక్షయుడు, వీనికి తారణి, వీనికి పుష్కరారుణి, వీనికి బృహత్క్షేత్రుడు వీనికహస్తి పుట్టి, హస్తినాపురమును తన పేరకట్టించెను. అతనికి అజమీఢుడు, అవామీఢుడు, పురమీఢుడు, అను ముగ్గురు జన్మించిరి. అజమీఢునికి ఋక్షుడు, వీనికి సంవరణుడు, వీనికి కురురాజు, వీనికి పరీక్షిత్తు, నిషధుడు, సుధన్వుడు, జహ్నుడు అను నలువురు పుత్రులు కలిగిరి. సుధన్వునికి సుహోత్రుడు, చవనుడను ఇరువురు పుత్రులు కలిగిరి. సుహోత్రునికి బృహద్రథుడు వీనికి కుశాగ్రుడు, వీనికి ఋషభుడు, వీనికి సత్యజిత్తు, వీనికి పుష్టభాను, వీనికి నహుషుడు, వీనికి బృహద్రథుడు వీనికి సోమాపి, జరాసంధులను ఇరువురుపుత్రులు. జరాసంధుని కొడుకు సహదేవుడు. ఇతడే మగధవంశమును అభి

వృద్ధి నొందించెను. సోమాపికి శ్రుతశ్రవుడు, వీనికి సురథుడు ఇతనికిబిందురథుడు, వీనికిసార్వభౌముడు, వీనికిజయసేనుడు, వీనికి రథానీకుడు, వీనికి అయుతాయువు, వీనికి క్రోధనుడు, వీనికి దేవాతిథి, ఋక్షుడు అని ఇరువురు జన్మించిరి. ఋక్షునికి దిలీపకుడు, వీనికి ప్రదీపకుడు, అను నాలుగ్రొడీయు పుట్టిరి. నాపేరు దేవాపి. నాకుమారుడైన సాంతునికి రాజ్యమిచ్చి నేను తపంబు చేయ బోతిని. పిమ్మట కలాపగ్రామమున రహస్యముగా మీదర్శనము నిమిత్తము కాచియుంటిని. అని దేవాపి చెప్పెను.

శ్రీకల్కిమూర్తి మరుతు దేవాపులకు రాజ్యమిచ్చుట.

వారి వంశచరిత్రములను విని కల్కిమూర్తి సంతసించి యిట్లనెను. ఓ క్షత్రియవంశోత్తములారా! “ మీరు సత్యవంతులై ధర్మమును విడువకసంచరించుచున్నవారలు. కావున మీకుమీ రాజ్యములందు అభిషిక్తుల చేసెదను.” అనిమరుతునిఅయోధ్యయందును, దేవాపిని హస్తినాపురమందును అభిషేకించి విశాఖయూపుని కుమార్తెను మరుతునికిని, రుచిరాశ్వుని కుమార్తెను దేవాపికిని యిచ్చి వివాహము చేసెను. తరువాత శ్రీహరి ఆకసమువైపు చూడగా రెండు విమానములు అచ్చటికి వచ్చెను. వాటిని వారికి చూపి, మీరు వీనిపై నెక్కి దుష్టులను సంహరింపుడు. ఈ విమానములు కామగమనము కలవి. ముల్లోకములను నిముసములో తిరిగి రాగలవు. వానియందు దివ్యాయుధము లున్నవి. వానివలన మీరు అందరిని జయింపవచ్చును.

## కృతయుగము యతివేషమున కల్కిమూర్తిని దర్శించుట.

ఇట్లు వారలతో చెప్పుచుండగా, ఒక యతి ఆసభకు వచ్చెను. కల్కిమూర్తి దిగ్గన లేచి ఆయనను విధియుక్తముగా పూజించి "స్వామీ మీరెవరు?" అని యడుగగా ఆ త్రిదండి యిట్లు విన్నవించెను. "ఓ నారాయణుడా! నేను మీ భృత్యుడను. మీరు పద్మావతిని వివాహమై దిగ్విజయము చేసి, దుష్టులను శిక్షించి భూభారమును నివారణ చేసినందున మిమ్ము దర్శింపవచ్చితిని. మీరు ఉపాధిరహితులు. ఇప్పుడు ఉపాధిని వహించియున్నారు. త్రిమూర్తులను, ఇంద్రాదులను, పదునల్గురు మనువులను సృష్టించినవారు మీరేకదా? నాపేరు కృతయుగము. కలిభయమును మీరు పోగొట్టుటచే నేను తిరిగ నిల్వగలిగితిని" అనెను. అని సూతుడు శౌనకాదులతో చెప్పగా వారిట్లు ప్రశ్న చేసిరి. "ఓ సూతా! మనువులు, పదునలుగురని చెప్పితిరి వారి నామములెవ్వియో సెలవిచ్చి మమ్ము కృతార్థులనుచేయ వేడెదము" అనగా సూతుడు వారలతో నిట్లు చెప్పెను. "ఓమునులారా! వినుండు. మనువులలో స్వాయంభువు 2 స్వారోచిషుడు, 3 ఉత్తముడు, 4 యమసుడు, 5 రైవతుడు, 6 చాక్షుషుడు, 7 వైవస్వతుడు, 8 సావర్ణి, 10 బ్రహ్మసావర్ణి, 11 ధర్మసావర్ణి, 12 రుద్రసావర్ణి, 13 వేదసావర్ణి, 14 ఇంద్రసావర్ణి. వీరందరును శ్రీహరిచే సృజింపబడి నామరూపములచే భేదింపబడుచున్నారు. 71 యుగములైన ఒక మన్వంతరమగును."

అని సూతుడుచెప్పి వారలకు సంతుష్టి కలుగచేసెను. శ్రీకలికి మూర్తి ఇట్లు కృతయుగ ధర్మములను మరల స్థాపించెను. (ఈమనువుల జననము మార్కండేయ పురాణమున పూర్తిగ వ్రాయబడినది.)

### శశిధ్వజునితో యుద్ధము.

పిమ్మట శ్రీకలికిమూర్తి కృతయుగ పురుషుని, మరుదేశీ వాపులను, విశాఖ యూపులను వారివారి సైన్యములతో కలిసి దాటివెడలి మ్లేచ్ఛ, బర్బర, యవనరాజులను అనేకులను జయించిన పిదప, శశిధ్వజుడను రాజుపై బోగా, ఆ రాజు సేనాసమన్వితుడై యుద్ధమున పలుమారు మూర్ఛితుడై తెలివొంది లేచుచుతుదకు సమ్మోహనాస్త్రముచే కలికిమూర్తిని మూర్ఛ నొందచేసి, తన నగరమునకు తీసికొని పోయెను. అచ్చట శశిధ్వజుని భార్యయగు సుశాన్త శ్రీహరిని చూచి పలువిధముల స్తోత్రము చేసెను. అంతట కలికిమూర్తి తెలివొంది, ఎదుట చేతులు జోడించుకొని తనను ధ్యానించుచున్న సుశాన్తను చూచి యిట్లనెను. "ఓకమలనయనా! నీపేరేమి? నీవెవరి భార్యవు? అనగా విని ఆమె ఇట్లు విన్నవించెను.

"స్వామీ! మీరు ఈబ్రహ్మాండాధిపతులు. సృష్టిస్థితిలయ కారణ భూతులు. సర్వాంతర్యాములు. మీ రెరుంగనిదేమున్నది? మీకు శత్రుత్వ మిత్రత్వములు లేవు. నాపేరు సుశాంత. ఈ నాభర్తయైన శశిధ్వజమహారాజును నేనును మీకు

దాసులము. మాయెడల దయగలిగి మా నేరముల క్షమింప వేడెదము. అంత శశిధ్వజుడు ఇట్లు విన్నవించెను. "ఓదీన శరణ్యా! మూఢుడనై మీతో యుద్ధము చేసితిని. రక్షింపుడు. నేను మీ శిక్షకు పాత్రుడను. మీ ఇష్టాను సారము శిక్షింపుడు" అనగా శ్రీహరి వారిని దయతో చూచి "మీరుదంపతులు ధర్మబుద్ధి గలవారు. మీ భక్తికి మెచ్చితిని. వరమడుగుడు" అనెను. పిమ్మట ఆ దంపతులు తమ కుమార్తెను శ్రీకల్కిమూర్తికిచ్చి వివాహము చేసిరి. అల్లునికి తగిన కట్నములు కానుకలు ఒసంగిరి.

## శశిధ్వజుని పూర్వవృత్తాంతము.

ఆ వివాహము చూడవచ్చిన రాజులందరును శశిధ్వజుని చూచి "రాజా! మీరు బహుపుణ్యాత్ములు కాకున్న శ్రీహరితో సంబంధము లభించుట దుర్లభము" అనిరి. అప్పుడు శశిధ్వజుడు వారలతో ఇట్లు చెప్పెను. "ఓ నృపోత్తములారా! మాపూర్వజన్మముల చరిత్రమును చెప్పెదను వినుండు. వేయియుగములక్రిందట నేనును నాభార్యయైన ఈమెయు గరుడులమైయుండి ఒక వేటకాని వలలో చిక్కగా ఆవ్యాధుడు మమ్మును పట్టుకొని గండకీనది యొడ్డునకు తీసికొనిపోయి ఒక సాలిగ్రామముపై మా తలలనుంచి మరియొక సాలిగ్రామ శిలతో వానిని చితుకగొట్టి చంపెను. అందువలన మేము పక్షిశరీరములను విడచి దివ్యశరీరధారులమై విమానములనెక్కి వైకుంఠమునకు

పోయి శ్రీమన్నారాయణుని దర్శించి ముక్తినొందితిమి. అచ్చట నూరు యుగములుండి బ్రహ్మలోకమునకుపోయి అయిదు వందల సంవత్సరము లుండి, పిమ్మట స్వర్గమునకు చని నాలుగువందల యుగములుంటిమి. ఇప్పుడు ఈ జన్మమున దంపతులమై యిట్లు న్నాము. సాలిగ్రామము తగులుటవలన మాకిట్టిసుఖము లభించెను. గండకి నదియందలి శిలలన్నియు సాలిగ్రామములే. ఆనది యందు స్నానము చేసినవారు తమపాపములను పరిహరింపచేసి కొని స్వర్గాది సుఖము లనుభవింతురు. అందువలననే మాకు పూర్వజన్మ జ్ఞానము లభించినది. ఈ పుట్టువునందును శ్రీహరి పాదపద్మములందు భక్తిగలిగి, ఇప్పుడు కలికి రూపమున అవత రించిన శ్రీహరిని పూజించితిమి.'' అని అచ్చటనున్న రాజులతో చెప్పి, వారలకు సాత్విక, రాజస, తామసము లను త్రివిధ భక్తులను బోధించి, శశిధ్వజుడు తన రాజ్యమును కొమరునికొప్ప గించి, తాను భార్యతో గూడ శ్రీహరిని ధ్యానించుటకు వనము నకు బోయెను.

## శ్రీహరి కాంచనపురమున ప్రవేశము.

ఇట్లు శ్రీ కలికిమూర్తి శశిధ్వజునికి సెలవిచ్చి పంపి తనతో నున్న సమస్తరాజులను వెంటతీసికొని కాంచన పురము బయలు ప్రవేశించెను. ఆ పురిమందు నాగులు నివసించుచుండిరి. వారిని సంహరించుటకు శ్రీహరి సన్నాహ పడుచుండగా ఆకాశవాణి యిట్లనెను. "ఓ స్వామీ! ఈ పట్టణమున మీరు తప్ప ఇత

రులు ప్రవేశించిన బ్రతుకజాలరు." అది విని శ్రీ కలికిమూర్తి తన పరివారమును అచ్చట విడచి, తాను కామగమన మగు గుఱ్ఱము నెక్కి కత్తి చేబట్టి ఆ పట్టణమున ప్రవేశించెను. అచ్చట రతీదేవితో సమానమగు ఒక స్త్రీని చూచి ఆశ్చర్యపడి యిట్లనెను.

కలికిమూర్తి:—ఓ స్త్రీ రత్నమా! నీ వెవరు?

విషకన్య:—ఓ పురుషోత్తమా! నేను చిత్రగ్రీవుడను గంధర్వుని భార్యను.

కలికిమూర్తి:—ఓ కలికీ! నీవిచ్చట నుండుటకు కారణ మేమి?

విషకన్య:—అయ్యా! నేను ఒక దినమున విమానమున నా భర్తతో గంధమాదన పర్వతమునకు పోయి విహరించుచుండగా, యక్షుడను మునీశ్వరుడు అచ్చటికి రాగా, వికృతరూపుడగు ఆమునినిచూచి నేను పరిహసించితిని. అందుకు ఆయన అలిగి విషనేత్రివి కమ్మని శపించెను. అందువలన నేను పతిని విడచి ఇందుపడి ఈ నాగకన్యలతో కలసి యున్నాను. నా కండ్లనుండు విషముచేత నాయెదుట కనబడిన దేవతలును నరులును భస్మ మగుచున్నారు.

కలికి:—ఓయింతి! అట్లయిన నేను భస్మము కాకుండు టకు కారణమేమి?

విషకన్య:—అయ్యా! మీరు సామాన్య నరులు కారు. మీరు జగదీశ్వరునిగా తలంచెదను. కాకున్న నాదృష్టిని పడిన తోడనే భస్మమగుదురు. మిమ్మును దర్శించుటచే నాకు శాపవిమోచన మయ్యెను. అదిగో జ్యోతిర్మయమగు విమానము వచ్చినది. నే పోయెదను. అని ఆ శ్రీహరికి ప్రదక్షిణ నమస్కారములు సలిపి ఆమె విమానమున గంధర్వ లోకమునకు పోయి తన భర్తతో కలిసెను.

శ్రీ కలికిమూర్తి శంబళగ్రామమున ప్రవేశము.

పిమ్మట శ్రీహరి ఆ పురమునందలి నాగ కులమును సంహరించి బృహన్నలుడను రాజునకు అచ్చట పట్టముకట్టి అయోధ్యకు పోయి మారుతిని అచ్చట అభిషేకించి, హస్తినాపురమున దేవాపికి పట్టాభిషేక మొనర్చి, శంబళ గ్రామమునకు జని నిజభవనమున ప్రవేశించెను. తరువాత తన అన్నయైన కలికి శౌంభక దేశమును, ప్రాజ్ఞునికి పౌండ్రమును, సుమంత్రునికి పుళింద దేశమును, తన వంశపువారలకు ఇతర దేశములను పంచియిచ్చి తాను శంబళ మండలమునకు రాజై పాలించుచు అదివరకు నిలవయున్న ధనరత్న రాసులను తలిదండ్రులకు కొసంగెను. ఇట్లు భారతవర్షమునందే గాక జంబూద్వీప మందంతటను ధర్మపరాయణులగు రాజులను ప్రతిష్ఠించి కృతయుగధర్మములు అంతటను వ్యాపించునట్లు చేసెను. బ్రాహ్మణులు వేదాధ్యయన పరులును, స్వకర్మనిరతులును, క్షత్రియులు ధర్మపాలనా

సత్రులును, వైశ్యులు వాణిజ్యనిపుణులు శూద్రులును, ద్విజసేవా పరాయణులును, విష్ణుపూజారతులును, స్త్రీలు పతివ్రతలునై యుండిరి. ఇట్లు వర్ణాశ్రమ ధర్మములు తప్పక జరుపుచు రాజులు యజ్ఞదీక్షా పరాయణులై యుండుటచే వర్షములు బాగుగా కురియుచు సస్యములు పూర్తిగా ఫలించుచుండుటచే ప్రజలు సుఖముగా జీవించుచుండిరి.

విష్ణుయశుడు యజ్ఞములుచేసి నారదునివలన జ్ఞానము గనొందెను.

పిమ్మట కలికిమూర్తి తండ్రిచే రాజసూయము, వాజపేయము, అశ్వమేధము మొదలగు యాగములు చేయించెను. ఋత్విక్కులకు అనేకదక్షిణలు దానములు నొసంగి భూరి సంతర్పణములనుచేసి విప్రులకేకాక సమస్త జీవరాసులకుతృప్తి కలుగజేసెను. ఆయాగములు చేయు సమయమున నారదాది మహా ఋషులు అనేకులు విచ్చేసిరి. అవబృథస్నానమైన పిమ్మట విష్ణుయశుడు నారదుని చూచి "స్వామీ ! మీరు మహాజ్ఞానులు, మీ రెరుంగని విషయములులేవు. జీవుడు ముక్తి పొందదగినసాధనమును నాకుపదేశింపుడు." అనెను. అది విని ఆ దేవ ఋషి ఇట్లనెను. "ఓ విప్రోత్తమా ! నీవు మహా పురుషుడవు. నీగర్భమున ముక్తిదాత జన్మించెను. నీకు కొదువ ఏమి ? జీవుడు మాయతో కలసి దేహమును ధరించును. దేహములేకున్న బుద్ధిలేకుండును. బుద్ధిలేకున్న జ్ఞానము సున్న.

మాయ లేకున్న చేష్టలుండవు. చేష్టలు లేనివారికి విద్యయుం డదు. విద్య లేకున్న జ్ఞానము కలుగదు. జ్ఞానము లేకున్న భక్తి యును క్రియయు కలుగవు. అది విని విష్ణుయశుడు కొమరుని అను మతిని పొంది భార్యయగు సుమతితో కలసి బదరికాశ్రమమునకు పోయి శ్రీహరిని ధ్యానించి మాయను విడచి యోగమార్గమున శరీరమును విడచి దివ్యశరీరమును ధరించి విమానముపై వైకుం ఠమునకు వేంచేసెను. సుమతియు ఆయనతో సహగమనము చేసెను. కలికిమూర్తి మునులవలన తలిదండ్రుల మృతవార్తను విని వారికి ఉత్తరక్రియలు యథావిధిగా జరిగించి, విశేష దాన ధర్మములు చేసి, బ్రాహ్మణులను తృప్తిపరచెను.

పరశురాముడు కలికిమూర్తిని చూడబోవుట.

అంతట ఒక దినమున పరశురాముడు కలికిమూర్తిని చూడబోగా గురువు రాకకు సంతసించి పత్నులతో కూడ ఆయనకు అతిథి సత్కారములు చేసి, సావకాశముగా కూర్చుండి మాటలాడుచుండగా, "నాభార్యయగు ఈ రమ సంతానమును కోరుచున్నదని" కలికిమూర్తి గురువుతో చెప్పెను. అందుకు రుక్మిణి ద్వాపరమునందు చేసిన వ్రతమును చేసిన తప్పక సంతతి కలుగునని పరశురాముడు చెప్పెను. ఈ వ్రతము పూర్వ ము శర్మిష్ఠ, ద్రౌపతి, సీతయు చేసి తమకోరికలను పొందిరనియు చెప్పెను. రమాదేవిచే ఆ వ్రతమును చేయించి పరశురాముడు తన నిజాశ్రమమునకు వెళ్ళెను. ఆవ్రత ప్రభావమున రమాదేవి మేఘునాధుడు, బలాహకుడు అను ఇరువురు కొమరుల గనెను.

## శ్రీ కలికిమూర్తి నిర్యాణము.

ఇట్లు శ్రీ కలికిమూర్తి వేయి వత్సరములు భార్యలతో సుఖ మనుభవించుచుండి, ప్రజలను క్రమముగా పాలించి, గృహస్థ ధర్మ మెట్టిదో ఇతరులకు తెన ప్రవర్తనయందే తెలియపర చుటచే వారందరును క్రమముగా వర్తించుచుండిరి. ఇట్లుండ ఒకనాడు బ్రహ్మాది దేవతలందరును ఆయనను దర్శింప శంబళ గ్రామమునకు వచ్చి పలువిధముల స్తోత్రములు చేసి యిట్లనిరి. " స్వామీ! తమరు అవతరించిన పని పూర్తియైనది. దుష్టులను నశింపజేసి, శిష్టులను రక్షించిరి. భూభారము తీరెను. కృతయుగ ధర్మములను స్థాపించిరి. వైకుంఠమునకు దయచేయవలెను." అని ప్రార్థింపగా ఆయన అంగీకరించి తన కుమారునికి రాజ్యపట్టాభిషేక మొనరించి వానికి అనేక బుద్ధులు చెప్పి ప్రజలను పిలిపించి వారలకు జ్ఞానోపదేశ మొనర్చి భార్యలతో గూడి దేవతలచే పరివృతుడై గంగానదీతీరమునకు చని యోగాసనమున కూర్చుండి ప్రాయోపవిష్టుండై ఆత్మావలోకనము చేసి ప్రాణములను విడచెను. వెంటనే దివ్యమంగళ విగ్రహుండును చతుర్భుజుండును అయి దివ్యవిమానముపై వైకుంఠమునకుం జేరెను. ఆయన భార్యలు సహగమనముచేసి దివ్య విమానములపై వైకుంఠమును పొంది ఆ శ్రీహరిని చేరిరి.

శ్రీ కలికిపురాణము సమాప్తము.

---

# అష్టాదశ పురాణ సారసంగ్రహము

## శ్రీవిష్ణు పురాణము

### గోపికల పూర్వజన్మ వృత్తాంతము

శ్రీకృష్ణమూర్తి ఉద్ధవునితో చెప్పినట్లు శ్రీశుకమహాముని పరిక్షిన్మహారాజుతో చెప్పెను.

శ్రీశుకులు:—ఓపరీక్షిన్మహారాజా! వినుము. పూర్వము శ్రీకృష్ణభగవానులు వ్రేపల్లెయందుండగా కంసుని సంహారింపదలంచి మధురాపురమునకు బోవ ప్రయాణమై రథమెక్కుచుండగా గోపికలు అడ్డముగావెళ్ళి రథమును నిలిపి మధురకు బోవద్దని అనేకవిధముల ప్రార్థింపగా కృష్ణుడు వారిని వారించి కొద్ది దినములలో మరలివచ్చెదనని చెప్పి వారిని తమఇండ్లకు పంపి పోయెను. మధురకు పోయిన పిమ్మట కొంత కాలమునరకు వారిని మరచినట్లూరకుండి తరువాత ఒకదినమున ఉద్ధవుని పిలిపించి ఇట్లనెను. "నీవు వ్రేపల్లెకు పోయి నావియోగమునకై విచారించుచున్న గోపికలను, గోవులను "ఓదార్చిరమ్ము" అనగా అతడు వెంటనే రథమెక్కి వ్రేపల్లెకు పోయి వారినిచూచి కుశల మడిగి యోదార్చి తిరిగి మధురకువచ్చి శ్రీకృష్ణుని దర్శించి సాష్టాంగ దండప్రణామములుచేసి ఇట్లనెను. "స్వామీ! గోపికలు సర్వదా మిమ్మునే ధ్యానము చేయుచుండుటకు వారు పూర్వ

జన్మమున ఏమిపుణ్యము చేసిరోగదా! వారియందలి దయమరి
చితమకు ఇచ్చుటనే యున్నారనియు తాముమిక్కిలి అదృష్ట
హీనుల మనియు వారు విచారించుచున్నారు. వారు ఏకారణ
ముచేత తమయందు అంతభక్తికలిగియున్నారో వారు పూర్వజ
న్మమునందు ఎవరో, ఎందువలన స్త్రీలయిరో సెలవిమ్మనిఅడిగెను.

కృష్ణుడు:—ఓ ఉద్ధవా! చెప్పెదను శ్రద్ధగా వినుము.
పూర్వము సత్యయుగమున వసువను ప్రజాపతికిని సత్యవతియను
అతని భార్యకును పదునారువేలమంది కుమారులు కలిగిరి. వారు
కొంతకాలము గురువునొద్ద విద్య లన్నియు నేర్చికొని పిమ్మట
గండకీనదీతీరమునకు బోయి ఈశ్వరునిగురించి గొప్పతపస్సు వేయి
సంవత్సరములవరకును చేసిరి కాని శివుడు ప్రత్యక్షము కానందున
పంచాగ్నుల మధ్యనుండి తపస్సుచేయుగా కొంత కాలమునకు
ఈశ్వరుడు దర్శనమిచ్చెను. అప్పుడు వారు ఆయనకు ప్రద
క్షిణ నమస్కారములుచేసి పలువిధముల స్తోత్రములు చేయుగా
మెచ్చి వరమడుగు మనెను. జ్ఞానమును, ముక్తిని ఇమ్మని
వారి నడిగిరి. అందుకు ఆయన ముక్తినిచ్చు శక్తి తనకు లేద
నియు రాజ్యముగాని, ఇంద్రపదవిగాని కోరిన ఇచ్చెదననియు
చెప్పెను. అవి తమకు అవసరము లేదనియు ముక్తియే కావలెన
నియు కోరినందున శివుడు ఇట్లనెను. "ఓ తాపసోత్తము
లారా! మీరు కోరిన ఫలము ద్వాపరయుగమున పొంద
గలరు. అది యెట్లనగా, అప్పుడు కంసుడను రాక్షసుడు

జన్మించి, దేవతలకు నరులకు అనేక బాధలు కలుగజేయును. ఆబాధల కోర్వలేక బ్రహ్మాది దేవతలు శ్రీ మహావిష్ణువుని శరణు జొత్తురు. వారి యందు కరుణించి శ్రీహరి కృష్ణమూర్తియై దేవకీ వసుదేవులకు తనయుడై మధురాపురమున పుట్టి, గ్రేపల్లె యందు యశోదానందులకు బిడ్డడనిపించుకొని అందు పెరిగి అనేక లీలలు చేసి రాక్షసులను సంహరించును. కావున మీరందరు గోపికలై పుట్టి ఆయనతో కేళీ వినోదము లనుభవించి ఆజన్మాంతరమున మోక్షము పొంది వైకుంఠము చేరుదురు." అని చెప్పి ఈశ్వరుడంతర్థానుడయ్యెను. అది మొదలు వారు శివుని మాటలు తలచుకొనుచు ద్వాపరము వరకు తపస్సుచేయు చుండి పిమ్మట వ్రేపల్లెయందు గోప స్త్రీలై పుట్టిరని శ్రీకృష్ణుడు ఉద్ధవునకు చెప్పెనని శ్రీ శుకులు పరీక్షిత్తునకు చెప్పెను.

శ్రీశుకులు కర్మఫలమునుగూర్చి పరీక్షితునకు జెప్పుట.

పరీక్షిత్తు:— ఓ శుకయోగీంద్రా! పురుషులు ఎట్లు స్త్రీలై జన్మింతురు.

శ్రీశుకులు:— ఓ రాజేంద్రా! వినుము. పురుషుడు స్త్రీని చంపినను, కారణములేక స్త్రీని కొట్టి దుఃఖపెట్టి బాధించి నను, ఆపురుషుడు స్త్రీయై పుట్టి అనేక దుఃఖములను, బాధలను, నరకమును అనుభవించును.

పరీక్షిత్తు:—ఏపాపమువలన గ్రుడ్డివారగుదురు ?

శుకులు:—చూచినది లేదనువారు అంధులగుదురు. వారు చాల బాధలను యముని వలన పొందుదురు.

కట్టి తీసికొని పోవుచు ఇనుపరోకండ్లతో మొత్తుదురు. అప్పుడు వారు ఆ దూతలను బహుప్రార్థింతురు గాని వారు వినరు. వారిని యమునియెదుట నిలుపగా వారుచేసిన పాపములను వారేచెప్పకొని రక్షింపుమని ప్రార్థింతురు. కాని యమధర్మరాజు వినక వీరిని కోయుమని దూతలకు ఆజ్ఞ ఇచ్చును. దూతలట్లు చేయుచుండగ వారి కాళ్లుపట్టి అనేక విధముల ప్రార్థించుచు విలపింతురు. కాని వినువారుండరు. ఇట్లు చాలకాలము బాధలు పొంది తుదకు పశువులై జన్మించి కసవుమేయుదురు.

పరీక్షితు:—మునీంద్రా! గ్రామమునకు పురోహితుడుగా నుండుట వలన దోషమేమి?

శకుడు:—గ్రామపురోహితుడు మహాపాపి. ఏలయనగా అతడు అందరిని సేవకుడు. అందరును సరిగా ప్రవర్తించునట్లు చేయుబాధ్యత అతనికుండున్నది. అది కష్టముగావున ఆపాపమతనికి పొందును. అతని ముఖము చూడకూడదు. చూచిన పాపము పెరుగును. అతనికి నమస్కారము చేయకూడదు. నమస్కరించిన వారికి ఆయువు క్షీణించును. అతనికి నరకము తప్పదు. దాని అంతమున కుక్కజన్మకలుగును. దక్షిణ ఖండన చేసి పుచ్చుకొనకూడదు.

పరీక్షితు:—స్వామీ! ఈ మాయ సంసారమున బుట్టి గదా. జనులు పాపపుణ్యములుచేయుదురు. వృద్ధులకు కదా పాపములుగాని పుణ్యములుగాని చేయుటకు అవకాశమున్నది? కొందరు

బాల్యమందును, మరికొందరు పుట్టక ముందే తల్లి గర్భముననె చచ్చుట వినుచున్నాము. అది యే పాపము వలననో సెలవిందు.

శుకులు:— నరులు పూర్వజన్మములందు చేసిన కర్మ ఫలము ఈజన్మయందనుభవింతురు. ఈజన్మయందు చేసిన కర్మ ఫలము ముందు జన్మములో అనుభవింతురు. కాని ఇప్పుడు చేసిన కర్మఇప్పుడే అనుభవమునకు రాదు. వెనుకటిఏడవజన్మయందలి కర్మఫలము ఈ జన్మలో అనుభవించుచున్నామనియు ఇంకను ఆరుజన్మల కర్మ నిలువయున్నదనియు వేదాంత శాస్త్రము చెప్పుచున్నది. దీనికే సంచిత మందురు.

దేవతలను నిందింపకూడదు.

పరీ:— జనులు పితరులనుగాని దేవతలనుగాని నిందించుచుందురు. అందుకు శిక్షయేమి?

శుకులు:— నిందించుటవలన కలుగు ఫలము చెప్పెదను వినుము. భూమిని నిందించువారి ఇంట లక్ష్మినిలువదు. చంద్రుని నిందసేయువారికి బొల్లి వచ్చును. శ్రీహరిని నిందచేయువారు అనేక కష్టము లనుభవింతురు. ఈశ్వరుని నిందసేయువారు సన్యాసులై భిక్షమెత్తికొని జీవింతురు. ఇంటిని నిందించువారు ఇతరుల ఇండ్ల భుజింతురు. గ్రామదేవతను నిందించువారు గ్రామములో నీచులై జన్మింతురు. జలనిందసేయువారు దాహముచే బాధపడుచుందురు. గోవులను నిందించువారికి ఆవులుండవు. అన్నమును నిందించువారికి అన్నము దొరకక దరిద్రులగుదురు.

వైద్యుని నిందించువారికి అసాధ్యమైన వ్యాధి సంభవించును. బ్రాహ్మణుని నింద సేయువారు నీచకులమునజన్మింతురు. జ్యోతిష్కుని నిందసేయువారు ఏడు జన్మములవరకు మూర్ఖులగుదురు. స్త్రీ, పురుషులను నిందసేయువారు కుక్కలై పుట్టి, అశుద్ధమును గోమాంసమును భక్షింతురు. సేద్యవృత్తిని నిందించువారలకు అన్నతి చేతకాకుండును. విద్యను నిందించువారు విద్యావిహీనులై యుందురు. అన్నమును ద్వేషించువారు వ్యాధిపీడితులగుదురు. అక్షరములను నిందించువారికి గుడ్డి, చెవుడు కలుగును. రాజును నిందసేయువారు ఆరాజ్యములో హింసపొందుదురు. ఋణముచేసి తీర్చనివాడు నాగరి .... అనగా దున్నను. బ్రాహ్మణుని నింద సేయువాడు పందిజన్మ నొందును. యజమానుని నిందించువాడు దరిద్రుడై అనేక దుఃఖములను పొందును. చిత్రగుప్తుని నిందించువాడు గ్రామకరణమగును. కరణమువని చాల పాపకరమైనదనియు, వానిపై యముడు కోపించి కుంభీపాక నరకమున వేయుననియు చెప్పుదురు. స్త్రీని నిందించువానికి వివాహము కాదు. ఒకప్పుడైనను సుందరమైన స్త్రీ లభించదు. దేవిని నిందించువాడు పురుగై పుట్టును. పురుషుని నిందించు స్త్రీ విధవయు, గొడ్రాలునగును. వెండి బంగారములను నిందించువాడు ఏడు జన్మలవరకు దరిద్రులగుదురని శ్రీకృష్ణుడు ఉద్ధవునితో చెప్పెను.

పరీక్షితు:—మునివర్యా! జనులుఎందువలన సంతానము లేనివారగుదురో, సెలవిండు.

శుకులు:—రాజా ! బీజమును నశింపజేయువారు గొడ్డువారగుదురు. అనగా వృషణములు కోసి గింజలు తీసి పారవైచువారికి పిల్లలు కలుగరు. ఆశపెట్టి భంగము చేయువారు భల్లూకము అనగా ఎలుగుబంటులై జన్మించి, అడవులలో తిరుగుచు నీచ పదార్థములను, మనుష్యులయు జంతువులయు పచ్చిమాంసమును తినుచుందురు. దేవజన్మ శ్రేష్ఠమని చెప్పుదురు.

బ్రాహ్మణులకు ఛండాలత్వము కలుగుట.

పరీక్షితు:—ఓ మునివర్యా ! మానవులలో శ్రేష్ఠుడు బ్రాహ్మణుడుగదా ! అతడు ఛండాలు డెట్లగును ? విశ్వాసహీను లెవరు ? వారికి శిక్ష యేమి ?

శుకులు:—రాజేంద్రా ! వినుము బ్రాహ్మణుడై పుట్టి శూద్రుని ఇంట హోమాదికర్మలు చేయించుట, దానముపుచ్చుకొనుట, మొదలగు కార్యములవలన ఛండాలుడగును. అనగా అపవిత్రుడగును. అందువలన ఆమరణాంతము అతడు ఛండాలుడై జన్మించి మలమూత్రముల నెత్తుట మొదలగు నీచకార్యములు చేయుచు దరిద్రము ననుభవించును.

అవిశ్వాసులు, మిగుల అహంకారము గలవారై ఇతరుల మాట లక్ష్యపెట్టక, ముఖము ఎదుట మంచిమాటలాడుచు, వెనుకనిందింతురు. అట్టివారు చనిపోవునపుడు యమదూతలు వారిని పాశములచే బంధించి యమునియొద్దకు అనేక బాధలు పెట్టుచు తీసికొని వెళ్లగా వానిని ఎనుబది నాలుగు నరకకూపములలో

వేసి శిక్షింపుమని దూతలకు ఆజ్ఞాపించును. పరోపకారులు, పాపవిముఖులు, శ్రీహరిని భజించువారు, పరద్రవ్యమును ఆశింపనివారు కోపములేనివారు, సాధులు, చెరువులు త్రవ్వించువారు, దేవాలయములు కట్టించువారు, ధర్మకార్యములు చేయువారు, నిజము చెప్పువారు, పురాణములు, పుణ్యకథలు వినువారు పరస్త్రీని తల్లివలె చూచువారు స్వర్గాది పుణ్య లోకములు పొంది సుఖింతురు.

## అత్తమామల సేవవలన ఫలము.

శుకులు:—మనుజులై పుట్టి తలితండ్రుల యెడల విధేయులై వారి సేవ చేయుచుండినవారు చనిపోయిన పిమ్మట రాజులై జన్మింతురు. గురుని సేవచేయుచు విధేయులై యుండువారు, పండితులై వేద శాస్త్రజ్ఞానమును పొంది ఇతరులకు బోధింతురు. వారిని అందరును మన్నింతురు. వారిపై యమదూతలు చూచుటకు భయపడుదురు. అట్లు చేయని వారును, తెలిసిన విద్య చెప్పనివారును, ఏడు జన్మముల వరకు మూర్ఖులై జన్మింతురు. వారికి మూగి, చెముడు, గ్రుడ్డి వచ్చును.

పరీక్షితు—స్త్రీలలో భర్తమాట విననివారును, అతనిని దూషించువారును, అత్తమామలను మన్నింపని వారును పొందు శిక్ష ఏమి?

శుకులు:—భర్త, అత్త, మామల మాటలు వినక, వారిని మన్నింపకుండువారును, ఎదురు చెప్పువారును, వారిని

అనాదరణ చేయువారును యమునికి శత్రువులు. కావున వారు చనిపోవునపుడు, దూతలచే కట్టి తెప్పించి యముడు వారిని అనేక విధముల శిక్ష చేయించును. ఇనుప రోకళ్ళతో వారిని కొట్టించుట, గునపములు నోట గుచ్చించుట నాలుక కోయించుట, మొదలగు శిక్షలు చేయించి పిదప రాబందులై జన్మింపజేయును.

## అకాల మరణములు.

పరీక్షితు:—కొందరు అకస్మాత్తుగా కత్తితో కొట్టబడి గాని, పాముచే కరవబడిగాని, పిడుగుబడిగాని, పులి మొదలగు క్రూర జంతువుల వలనగాని మొసలి వలనగాని మ్రింగబడి చత్తురు. అది వారి పాపమువల్లనా? పుణ్యమువల్లనా? సెల వియ్యవలెను?

శుకులు:—అట్టి చావులకే అకాల మరణ మందురు. వారు చేసిన పాపములవలననే అట్టి మరణము తటస్థించును. వారు దూతల వలన యముని యెదుటికి తేసికొని పోబడి అనేక శిక్షలుపొంది దంపములచే కోయబడి తిరిగి పురుగులైజన్మింతురు.

## బాల్యావస్థ యందలి పాపములు.

పరీక్షితు:—స్వామీ! జ్ఞానావస్థయేది? అజ్ఞానావస్థయేది? ఆయవస్థలందు చేయబడిన పాపపుణ్యముల తారతమ్యమేమి?

శుకులు:—రాజా! స్త్రీపురుషులకు 12 సంవత్సరములగువరకు అజ్ఞానావస్థయని చెప్పుదురు. అప్పుడు వారు చేసిన

పాపపుణ్యములు వారినిపొందవు. తల్లిదండ్రులకు తెలియునట్లు చేసిన పాపముగాని పుణ్యముగాని తల్లిదండ్రులనే పొందును. వారెరుగకుండ చేసిన వారి నంటవు. అజ్ఞానావస్థలో వారికి పాపపుణ్యభేదము తెలియదు. కావున అంతవరకు వారు కేవలము జననీజనకుల ఆజ్ఞానుసారము వర్తింపవలయును. తల్లిదండ్రులు వారిని మిక్కిలి మెలకువతో కాపాడుచుండ వలెను.

పరీక్షితు:—భార్య చేసిన పాపము భర్తను చెందునని చెప్పినారు. దైవము ఎవరిబుద్ధి వారికి ఇచ్చియున్నాడుకదా! పాపపుణ్యములకు బుద్ధిగదా ప్రధానము.

శుకులు:—ఔను. బుద్ధియే ప్రధానము. పురుషుడు చేసిన పుణ్యములో సగము భార్యకు చెందును. కాని భర్త చేసిన పాపములో భాగము భార్యకు చెందదు. వారుభయులు ఆలోచించి చేసిన పాపపుణ్యములు ఇద్దరను పొందును. ఒకరికి తెలియకుండ మరియొకరు చేసిన పాపము చేసినవారే అనుభవింపవలెను. భర్త భార్యకు తెలియకుండ పుణ్యముచేసినను ఆమెకు భాగము ఇవ్వకతీరదు. భర్త ఇచ్చిన ద్రవ్యముతో చేసిన దానధర్మముల ఫలములో భాగము అతనికి చెందును. భర్తకు తెలియకుండగాని, తెలిసినను ఆయన అనుజ్ఞఇయ్యనప్పుడుగాని, వారించునప్పుడు గాని, మానక భార్య చేయు పాపము భార్యయే అనుభవింపవలెనుగానిభర్తకుచెందదు. భర్తఅనుజ్ఞపొంది భార్య చేసిన పాపముగాని పుణ్యముగాని ఇద్దరును సమానముగా అను

భవింపవలెను. పురుషునికి సామాన్య లోకజ్ఞానమేగాక, విద్యా విశేషముల వలనను, సజ్జన సహవాసము వలనను హెచ్చు జ్ఞానమును సంపాదించుటకు అవకాశ మున్నందున, అతఁడు స్త్రీకంటె బుద్ధివంతుఁడని సామాన్యముగా యెంచబడును. కావున ఆయన చేసిన పాపమునకు ఆయనే కర్తగాని స్త్రీతో ఆలోచించి చేసినను ఆమెకు పాపములో భాగముండదు.

భార్యాభర్తల సంబంధము.

పరీక్షితు:—భార్యాభర్తలకుగల సంబంధము ఆజన్మాంతముతో తీరునా లేక కొన్ని జన్మములవరకు కలిసియుండునా ! ఇందు విషయమై సవిస్తరముగా చెప్పి, నాసందేహమును తీర్పుడు.

శుకులు:—భార్యాభర్తలకుండు సంబంధము ఒకజన్మముతో నశించునది కాదు. వారిలో ముందు మరణించువారు యమునియొద్దకు పోవుదురు. వారి వారి పాపపుణ్యములు విచారణచేయబడి వాటికి తగిన శిక్షగాని, స్వర్గాది భోగములుగాని అనుభవింపుచు నరకమునగాని స్వర్గమునగాని ఉండదు. అంతట రెండవవారు మృతినొంది యమలోకమునకుబోగా అట్లే జరుగును. అచ్చటవా రుండుటకు నియమింపబడిన కాలము కాగా ముందు పురుషుని జన్మింపజేసి కొంతకాలమయిన తరువాత స్త్రీని పుట్టించును. దేవుని అనుగ్రహము వలన వారుతిరిగి భార్యాభర్త లగుదురు.॥ దైవనియోగము తప్పింప నెవరివశము.

ఇట్లే అనేక జన్మములవరకు జరుగుచుండును. ఎప్పుడైనను పుణ్యవశమున స్త్రీ, పురుషుడైనను, పాపవశమున పురుడు స్త్రీ అయినను ఈ సంబంధము వీడును. అంతవరకు విడువదు.

పరీక్షితు:—మునివర్యా! గొప్ప సందేహము తీరినది. బాగుగా సెలవిచ్చితిరి. సరేగాని స్త్రీ, పురుషుడగుటయు పురుషుడు స్త్రీ యగుటయు ఎట్లు సంభవించును?

పురుషుడు స్త్రీ, స్త్రీ పురుషుడు అగుట.

శుకులు:—రాజా! కుమారుడు తల్లి అనుజ్ఞను పొంది సన్యసించి తల్లికి వందనముచేయుట వలన ఆ తల్లికి పురుషత్వము మరియొక జన్మమునకు వచ్చునని చెప్పుదురు. ఇట్లు స్త్రీలుకూడ పురుషులు కావచ్చును. శాపవశమునగాని, కొన్ని సరస్సులలో మునుంగుటవలన గాని పురుషులు స్త్రీలగుదురు. పూర్వము నారదుడు ఒకప్పుడు శ్రీకృష్ణుని మాయవలన స్త్రీయై నట్లును అరువదిమంది కొడుకులను కన్నట్లును వినలేదా? వారేకదా ప్రభవాది సంవత్సరములయిరి.

అని చెప్పగా విని ఆకథ సవిస్తరముగా చెప్పుడని పరీక్షితు మహారాజు అడుగగా శ్రీశుకమహాముని యిట్లని చెప్పెను.

ఓ రాజా! శ్రద్ధతో వినుము. శ్రీకృష్ణుడు ద్వారకలో మిగుల వైభవముతో నుండగా దేవర్షియైన నారదమహాముని వారిని దర్శింపబోయెను. అప్పుడు కృష్ణుడు ఆయనను అర్ఘ్య పాద్యాది విధుల పూజించి కూర్చుండబెట్టెను. వారుభయులు

మాట్లాడుచుండగా ప్రసంగవశమున నారదుడు ఆయనతో నిట్లనెను. ఓ స్వామీ! మీరు మాయామానుష దేహులు. మీమాయ యెల్లరకు గోచరముకాదు. అదివిని శ్రీకృష్ణుడు "ఋషివర్యా మీకు అగోచరముకాదుగదా" అనెను. నేను ముల్లోకములు తిరుగువాడను. నా మాట కేమి? అని చెప్పుచు. వా రుభయులు సంచారార్థము బయలుదేరి పోవుచుండిరి. అంతట కొంతదూరము పోవుసరికి నారదునకు విశేష దాహ మయ్యెను. నీరెందును కనబడలేదు. శ్రీకృష్ణుడు తన మాయ వలన అక్కడ ఒక సరోవరము కల్పించెను. దానిని జూచి దేవర్షి కృష్ణుని ఆగుమని, అందు స్నానముచేసి జలముల గ్రోలగా చక్కని స్త్రీ యయ్యెను. అప్పుడు కృష్ణునిజూచి సిగ్గు పడి, తల వంచుకొనెను ఇట్లున్న ఆమెను విడచి కృష్ణుడు ద్వారకకు పోయెను. అప్పుడు స్త్రీ రూపమున నున్న నారదుడు ఎందు పోవుటకును లజ్జించి ఆ వనమున నొంటరిగా దిరుగుచు, ఒకచోట తపస్సుచేయుచున్న మునిని జూచి వాని యొద్దకు బోయి పరిచర్య చేయుచుండెను. ఇట్లు కొంతకాలము జరుగగా వారు కామపీడితులై, అన్యోన్య ప్రీతులై కామవినోదము లనుభవింపుచుండిరి. చాలకాల మిట్లుగడచెను. అంతలో వారికి అరువదిమంది కుమారులు గలిగిరి. అంతట నొకనాడు హఠాత్తుగా ఆమె భర్తయు, పుత్రులును కాలముచేసిరి. అది జూచి ఆమెమిగుల శోకింపుచు, తనయొంటరితనమునకు విచారిం

చుచు ఏమి చేయుటకును తెలియక భర్తపై పడి రోదనము చేయుచుండెను. అంతట చాల పొద్దెక్కుట చేతను, అలసి యుండుట చేతను, ఆమె, ఆకలిబాధ పడలేక ఆహారముకొరకు నిటునటు చూడగా, దరినున్న మామిడిచెట్టున నొక పండు కనబడెను. దానిని తీసికొనబోగా అందకుండెను. అప్పుడామె చచ్చిపడియున్న తన కుమారుని శవమును అచ్చటికి లాగి దాని పై నెక్కినను అందకుండుట చూచి, మరికొన్ని శవములను దొంతరగా బెట్టి, పండు కోయునంతలో అచ్చట నొక బ్రాహ్మణుడు ప్రత్యక్షమై "ఓ అమ్మా! నీ వెవరు? చచ్చిపడియున్న వారెవరు? శవములపై నీ వేల యెక్కుచున్నా" వని అడిగెను. అది విని నామె ఇట్లు చెప్పెను. "అయ్యా! నే నెవ్వనైన నేమి! నా చరిత్రము మిగుల విచారకరమైనది. ఆయన నా భర్త. వీ రందరు నా పుత్రులు. అందరు ఏకకాలమున మృతినొందిరి. వీరి కొరకు దుఃఖింపుచుండగా, విపరీతమైన ఆకలి బాధ కోర్వలేక వీరిపై నెక్కి ఈ పండును తీసికొంటిని.' ఆ మాటలు విని విప్రుడామెతో "అమ్మా! ఎంతపాపము! నీకెంతకష్టము సంభవించినది. దైవకృత్యమున కేమి చేయగలవు. కావున విచారింపవలసినపనిలేదు. కాని వారిట్లు చచ్చి పడియుండగా వారికి దహనాది కృత్యములైన జరుపక, స్నానమైనను చేయక, నీవుభుజింప వచ్చునా? చెప్పెదను ర" మ్మని సమీపముననున్న కొలనికి తీసికొనిపోయి, అందు స్నానము చేయుమనెను. అప్పుడామె జలములో దిగుచుండగా, పండుపట్టుకొనియున్న చేతిని పై కుంచు

మనెను. ఆమె ఆ ప్రకారము మునిగి లేచుసరికి బ్రాహ్మణుడు అదృశ్యుడై అచ్చట శ్రీకృష్ణుడు నిలచియుండెను. ఆ స్త్రీ ఎప్పటివలె నారదుడయ్యెను. కాని ఒక చేతిక గాజులుండెను. అవి చూచియు, కృష్ణుని చూచియు ఆశ్చర్యమును, సిగ్గును బొంది, "స్వామీ! ఇది యంతయు నీ మాయయే కదా!" అనెను. కృష్ణుడు చిరునవ్వు నవ్వుచూ "సరే! ఆ చెయ్యి అట్లున్న దేమి? మరియొక సారి పూర్తిగా మునుగుము" అని చెప్పగా ఆప్రకారము చేసెను. పండు, గాజులుపోయి నారదుడు శ్రీహరిని ధ్యానించి యిట్లనెను. సర్వేశ్వరా! నీ చర్య లద్భుతములు. అచ్చట చచ్చి పడియున్న వారిని జూపి, వీరంద రెవరు? శ్రీ కృష్ణుడు మందహాసము చేయుచు, ఆయన కాల పురుషుడు. వీరు ప్రభవాది సంవత్సరములు. అనగా విని నారదుడు సెలవు తీసికొని దండప్రణామంబు చేసి, నారాయణ స్మరణ చేయుచు, గగనమార్గమున బోయెను. శ్రీకృష్ణుడు అంతర్ధానమయ్యెను. అని శ్రీ శుకులు పరీక్షిత్తుతో చెప్పి, ఇట్లే పురుషులు స్త్రీలగుదురు. ఇంతే కాక వారు చేసిన పాపములనున కూడ జన్మాంతరమున పురుషులు స్త్రీలగుటయు, పుణ్యముల వలన స్త్రీలు పురుషులగుటయు సంభవించును. అని శ్రీ శుక మహాముని చెప్పెను.

పరీక్షిత్తు:— మునివర్యా! నాధువులన ఎట్టివారో సెలవిండు.

శుకులు:—రాజా! ఎవరు ఏమిచేసినను సహించువారు సాధువులు. తలిదండ్రులు తమపిల్లలను ఎవరికినిశ్చయించిన వారికే వివాహమాడుదురు. పిమ్మట అత్తవారింటికి వెళ్ళి వారు పెట్టిన బాధలు పొందుదురు. పశువులను అమ్మెదరు. కొనినవారు వానిని తీసికొనిపోయి తమ ఇష్టానుసారము చేయుదురు. కావున అవి సాధువులు. చెట్లను మనుష్యులు నరికినను అవి ఊరకుందురు. అవి పరమ సాధువులు. శ్రీహరిని ఎల్లప్పుడు ధ్యానించుచుండువారు కూడ సాధువులనబడుదురు.

## ధర్మములలో శ్రేష్ఠములు.

పరీక్షిత్తు:—ధర్మాత్ములెట్టివారు ?

శుకులు:—శ్రీ మహావిష్ణువును సర్వకాల సర్వావస్థల యందు ధ్యానించుచు పుణ్యకార్యములు చేయుచుండువారు ధర్మాత్ములనబడుదురు. దేవాలయములు కట్టించువారు, తోటలు వేయించువారు, చెరువులు, నూతులు త్రవ్వించువారు పరోపకారములు, అన్నవస్త్ర దానములు చేయువారు, భూదానము కన్యాదానము చేయువారు, ధర్మాత్ములలో శ్రేష్ఠులనబడుదురు. వీరు మరణాంతరమున వైకుంఠమును పొందుదురు.

పరీక్షిత్తు:—పాపాత్ము లెట్టివారు? వారికేమి శిక్షయగును ?

శుకులు:—భూమిని అపహరించువారు యేడు జన్మములవరకు నరకమనుభవింతురు. ఇతరులకు అపకారము చేయువారు వేయి

జన్మలవరకు పందులై జన్మింతురు. చాడీలుచెప్పువారు నరకములో పడుదురు. ఇండ్లను కాల్చువారును, కల్లుత్రాగువారును రజస్వలకాని స్త్రీనివట్టువారును, విధవస్త్రీని పొంది సంతానమునుకను వారును, ఆశ నిరాశచేయు వారును, ఘోరనరకములలో బడి అనేకబాధలు చిరకాల మనుభవింపుదురు. వారికి మనుష్యజన్మ సామాన్యముగా లభింపదు. ఒకప్పుడు లభించినను కుష్ఠుమొదలగు మహావ్యాధులచే బాధపడుచు మిగుల దరిద్రులై నీచకులమున జన్మింతురు.

## దేహమే దేవాలయము.

పరీక్షిత్తు:—స్వామీ ! ఈ దేహమందు ముప్పదిమూడు కోట్ల దేవతలున్నారని చెప్పుదురు. వారెవరో యెచ్చట నున్నారో సెలవియ్య వలయును.

శుకులు:—రాజా ! వినుము. ఈశరీరతత్వము నీవు తెలిసికొన్నట్లయిన ఈఘోర సంసారమునుండి తరింతువు. ఈ శరీరము కట్టవంటిది. ఇందు అగ్నియున్నది. జ్ఞానులు ఈసంగతి తెలిసికొనియే అగ్నిదేవుని యెల్లప్పుడును పూజింతురు. ఈ యగ్ని సమస్తజంతువుల జఠరమందున్నది. దానివలననే జంతువులు భుజించు పదార్థములు జీర్ణమై వాని ద్రవము శరీరమందంతటను వ్యాపించి బలము నిచ్చును. ఆద్రవమేరక్తము, ఇంద్రియము అగును. ఆ యింద్రియమే బీజము. దాని వలననే తిరిగి జంతువులు పుట్టును. బడబాగ్ని సముద్రములోనున్నట్లే కడుపు

అను సముద్రమునందు ఈ అగ్నియుండి శరీరమంతటను దాని వేడి వ్యాపించు చున్నది. ఆయగ్నినే ప్రాణమనవలెను. ఎందు చేత ననగా దాని బలమునలననే శరీరము ఆరోగ్యముగా నుండుట కాని బలహీనమై రోగములచే బాధపడుటగాని సంభవించును. అది చల్లారుట వలననే ప్రాణముపోయి శరీరము చల్లనగును. అది మందముగా నుండుట చేతనే అజీర్ణము కలుగును. ఈ యజీర్ణమే సమస్త వ్యాధులకు ముఖ్యకారణము. కాబట్టి అట్టి అజీర్ణము కలుగకుండ జఠరాగ్నిని కాపాడుకొనుచుండవలెను. ఇట్లుచేయువారు నిరోగులై చిరకాలము జీవింతురు. సూర్యుడు చంద్రుడు నేత్రములయందును, వాయువు ముక్కునందును సరస్వతి నాలుకతుదను మహేశ్వరుడునాలుక మొదట హృదయమందు పరమాత్మయును ఉందురు. అతనికే పరమపురుషుడని పేరు. ఇట్లే దేహమంతట ముప్పది మూడుకోట్ల దేవతలున్నారు. కావుననే దేహమునకు దేవాలయమను పేరు వాడుకలో నున్నది. జ్ఞానులు ఈ సంగతి బాగుగ నమ్ముదురు.

పరీక్షిత్తు:—నిత్యాచారము సరిగా చేయనివారు యేమి శిక్ష లనుభవింతురో సెలవియ్యవలెను.

## నిత్యాచారములు.

శుకులు:—దంతధావనము చేయనివారు ఛండాలులై జన్మింతురు. ఉదయమున లేవగానే రాత్రికట్టిన బట్టవిడువనివారు రాక్షసులై పుట్టుదురు. స్నానము చేయనివారికి లేడిజన్మ కలు

గును. బ్రాహ్మణుడై యుండియు తనకు విధింపబడిన కర్మ చేయని వాడు తిరిగి పుట్టినప్పుడు ఛండాలుడగును. తనకు విధింపబడు కర్మలు సరిగా చేసికొనువారు అంతకంటె పవిత్రమైన శ్రేష్టమున కుటుంబములందు జన్మింతురు. స్త్రీ సంగమము చేసినవారు కట్టు బట్టతో స్నానము చేయవలెను. అట్లు చేయక భుజించువారు ఛండాలులై పుట్టి గోమాంసము తిని సురాపానము చేయుదురు. నొసట బొట్టులేకుండ భుజించువారు కుక్కలై జన్మింతురు. అప్పుడు వారికి నొసట మచ్చయుండును. అందువలన వారిని పోల్చనచ్చును. ఈపాపములు, ఇంకను ఇటువంటి పాపములు చేయువారు శ్రీహరిని సర్వదా ధ్యానించుచుండిన వారి పాపములు నశించును.

పరీక్షితు:—స్వామీ! ధ్రువుడు పసిబాలుడై యుండియు తపమాచరించి శ్రీమన్నారాయణుని కరుణయెట్లు బడసెను ? ఆబాలుని చరిత్రము విననలయునని కోరుచున్నాను. సెలవియ్య వలయును.

శుకులు:—ఓ మహారాజా! మంచి ప్రశ్న వేసితివి. ఇది వినదగినదే. ధ్రువుడు బాలుడైయునను అతని పూర్వజన్మవాసన వలన అతనికి అట్టి జ్ఞానము కలిగినది. అతని చరిత్రము చెప్పెద వినుము.

ధ్రువుని చరిత్రము.

చతుర్ముఖ బ్రహ్మ కుమారుడు స్వాయంభువు మనువు. ఇతనికి భార్యయైన శతరూపయందు ఇద్దరు కుమారులు కలిగిరి.

వారిలో మొదటివాడు ప్రియవ్రతుడు. రెండవవాడు ఉత్తానపాదుడు. ఈ ఉత్తానపాదునకు ఇద్దరు భార్యలు. వారిలో పట్టపు దేవియైన సునీతియందు ధ్రువుడు, సురుచియందు ఉత్తముడు, అను సుతులు కలిగిరి. వారిలో రాజుకు రెండవ భార్యయందు ప్రేమమెండు.

ఒక దినము రాజు ఉత్తముని తన తొడపై కూర్చుండబెట్టికొని యుండగా వాని తల్లి సురుచి యొద్ద నిలచియుండెను. అట్టి సమయములో సునీతిపుత్రుడైన ధ్రువుడు తండ్రియొద్దకుపోయి వానితొడపై కూర్చుండు అభిప్రాయము కనుపరుచగా సురుచి అతనిం జూచి యిట్లనెను. "ఓకుమారా! నీవు నీతండ్రి యంకతలమున కూర్చుండు భాగ్యమును పొందుటకు నాకడుపున జన్మింపవైతివి. నీ ఈ కోరిక నెరవేరవలెనన్న నాగర్భమున బుట్టుటకై శ్రీహరిని ధ్యానింపుమనెను. అట్లు జన్మించిన నీకోరిక నెరవేరును." అని గర్వముతో బలుకుట విని తండ్రి ఊరకుండెను. అందుకు మిగుల దుఃఖించుచు ధ్రువుడు తన తల్లియైనసునీతియొద్దకు ఏడ్చుచుపోయినతల్లి వానిని చేర బిలచి తొడలపైనిడుకొని ఊరడింపుచుండెను. అంతట కొందరు దాసీజనంబులు సునీతియొద్ద జేరి జరిగిన సమాచారమంతయు ఆమెతో చెప్పిరి. అదివిని ఆమె మిగుల విచారింపుచు, కుమారునితో ఇట్లనెను. "కుమారా! విచారింపకుము. నరుడు పూర్వజన్మములయందు చేసినసుకృత దుష్కృత కర్మల ఫలము

అనుభవింపక తీరదు. కావున శ్రీహరిని ధ్యానించిన నీ తండ్రి అంకపీఠంబు నలంకరించు శక్తి నీకు తప్పక కలుగును." అని చెప్పగా బాలుడైనను ధ్రువుడు తల్లిబోధనుగ్రహించి వైరాగ్యమును పొంది వెంటనే తల్లిదండ్రులనువిడచి బయలుదేరి యమునా నదీ తీరమున నున్న మధువనమునకు బోయి నారద మహాముని వలన వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రంబును ఉపదేశమునొంది తదేక నిష్ఠతో చిర కాలము జపించుచుండెను.

ఇట్లుండ నారదు డొకనాడు ఉత్తానపాదుని నగరమునకు పోయి, అతనిచే పూజింపబడి, ఉచితాసనమున కూర్చుండి విచారముగా నున్న రాజునుజూచి విచారమునకు కారణమేమని యడుగగా ఆ రాజు ఋషితో ఇట్లనెను, "ఓ దేవఋషివర్యా! అయిదు సంవత్సరములు వయస్సుగల ధ్రువుడను నా కుమారుడు నేను చేసిన అనాదరణము వలన వైరాగ్యము గలవాడై కోటను పేటను విడచి తన తల్లితో అడవికి పోయెను. అచ్చట ఏ మృగముల నోటబడెనో ఏమయ్యెనో యని విచారించుచున్నాను." అనగా నారదుడు ఇట్లనెను. "ఓ రాజేంద్రా! విచారింపకుము. నీ కుమారుని కేమియును భయములేదు. అతను శ్రీమన్నారాయణుని గూర్చి తపస్సుచేయుచున్నాడు. గొప్ప వరములు పొందును. అతనిమూలమున నీకీర్తి ప్రకాశించును. అతను కొద్దికాలములో ఇచ్చటికి వచ్చును. ఊరడిల్లుము" అని చెప్పగా నమ్మి కుమారునిగురించి యెల్లప్పుడును ఆలోచింపుచు రాజకీయ విషయములయందు విముఖుడై యుండెను.

అచ్చట ధృవుండు ఘోరతపస్సు చేయుచుండెను. అది యెట్లనగా ప్రథమ మాసమున మూడు దినముల కొకసారి వెలగ, రేగు ఫలములు ఆహారముగా పుచ్చుకొనుచును, రెండవ మాసమున ఆరు దినముల కొకసారి పండుటాకులు దినుచును, మూడవ మాసమున తొమ్మిది రోజుల కొకసారి జలము ద్రావుచును, నాల్గవ మాసంబున పదిరెండు రోజులలో నొకసారి వాయుభక్షణము చేయుచును, అయిదవ మాసంబున ఉచ్ఛ్వాసమును బంధించి యేక పాదంబున నిలిచి తపస్సు చేయగా ముల్లోకములును కంప మొందెను. దేవతలకు ఊపిరిసలుపక బాధ కలిగెను. అందుకు వారు భయపడి శ్రీమన్నారాయణుని యొద్దకు పోయి సాష్టాంగ దండప్రణామంబులు చేసి మొఱబెట్టగా ఆ యాది దేవుడు వారలతో ఇట్లనియె: "ఉత్తానపాదుని కుమారుడైన అయిదు సంవత్సరముల బాలుడు ధ్రువుడు తపస్సు చేయుచున్నాడు. నేను పోయి వానికి వరంబులిచ్చి మీ యార్తి శాంపెదను. మీరు వెరువక మీమీ నివాసములకు బొండు" అని సెలవియ్యగా దేవతలు వారి మార్గమున పోయిరి.

పిమ్మట గరుడవాహనారూఢుండై శ్రీహరి ధ్రువుడు తపంబు చేయుచుండిన మధువనంబునకు పోయి వాని యెదుట నిలిచి తన్మయత్వంబున శరీరముపై స్పృహ లేకయున్న బాలుని తన శంఖంబుతో నంటిన చైతన్యము పొందినవాడై దండ

ప్రణామస్తుతు లొనర్చెను. శ్రీహరి సంతసించి యిట్లనెను. " ఓ బాలతాపసీ! నీ మనంబునందున్న కోరిక నే నెఱుంగుదు. అది ఇతరులకు పొందరానిదైనను నీకు తప్పక ఇచ్చెదను. గ్రహ నక్షత్రములును, సప్త మహాఋషులును, ఇంద్రాది దేవతలును దేనికి ప్రదక్షిణము చేయుచుందురో అట్టి ధృవపదంబు నీవుగోరుచున్నావు. అది ప్రళయకాలమునందునుగూడనశించునది కాదు. ఇరువదియారు వేలేండ్లు ఆయినతరువాత నీ వందు జేరుదువు. అంతవరకు నీవు నీ తండ్రిచేనుండ విడువబడిన రాజ్యమును ధర్మమార్గంబున పాలించుచుండుము. నీ యన్నయైన ఉత్తముడు వేటకుబోయి అడవిలో మృతినొందును. వాని తల్లి వానిని వెతుకబోయి దావాగ్నిలో పడి చనిపోవును. నీవు చక్కగా రాజ్యపాలనము చేయుచు అనేక యజ్ఞములుచేసి తుదకు నన్ను స్మరించుచు దేహమునువిడచి నాశాశ్వతపదము చేరుదువు. అని శ్రీహరి అంతర్ధాన మయ్యెను. ధ్రువుడుతన రాజ్యమునకు బోగా తండ్రి సంతసించి తన రాజ్యమునకు పట్టాభిషేక మొనర్చి తాను వనమునకుపోయి తపంబు చేయనారంభించెను. ధ్రువుడు బాగుగ రాజ్యపాలన మొనర్చి, ప్రజలకు సుఖము కలుగజేసి తుదకు శ్రీహరి యాజ్ఞప్రకారము చిరసౌఖ్య మొందెను. ఇతనినే ధ్రువ నక్షత్ర మందురు.

పరీక్షిత్తు:— గురువర్యా! వేనున్నపతి మిగుల దుర్మార్గుడని విందుము. అట్టిఅపఖ్యాతి అతని కెట్లు కలిగెను?

## వేనుని కథ.

అదివిని శుకయోగి పరీక్షిత్తుతో వేనుని చరిత్ర ఇట్లు చెప్పెను. పూర్వము అంగరాజు అశ్వమేధయాగము చేయునపుడు హవిర్భాగము పొందుటకు ఋత్విక్కులు దేవతలను పిలువగా వారురారైరి. అందుకు అంగనృపతి మిగులవిచారించి సదస్యుల నడుగగా వారిట్లనిరి. " రాజా! నీవు సంతానహీనుడ వగుటచేత నీ యాగమున సురలు హవిర్భాగము గొనవచ్చుటలేదని చెప్పిరి. కావున నీవు పుత్రకామేష్టి చేసి సంతానము వడసిన దేవతలు వచ్చి వారి భాగములు స్వీకరింతురు. అది విని వేనుడు పుత్రకామేష్టి చేయుగా ఆయజ్ఞకుండము నుండి ఒక దివ్యపురుషుడు సువర్ణ పాత్రముతో పాయసము తెచ్చి రాజు కిచ్చెను. బ్రాహ్మణాను మతంబున రాజు ఆ పాయసమును భార్యకిచ్చి భుజింపచేసెను. పిమ్మట ఆమె త్వరలో గర్భవతియై ఒకకొమరుని గనెను. వానికి వేనుడను నామకరణము జేసిరి. ఆ బాలుడు తన పిన్నవయస్సు నందే తనతో యాటలాడు బాలురను క్రూరముగా శిక్షింపు చుండెను. కొంత యుక్తవయస్సు రాగాశరాసనములను ధరించి వేటకై యడవికిపోయి సాధుమృగములను సంహరింపు చుం డెను. ఇట్లు దుర్మార్గుడగుటకు కారణ మేమనగా ఇతడు తాత (తల్లి తండ్రియైనమృత్యువు) నుపోలిపుట్టెనట. కుమారుని యొక్కదు షబుద్ధిజూచి తండ్రి సహింపలేక సామ, దాన, భేదదండంబులను చతురోపాయంబుల వానిదుర్వృత్తి బోగొట్ట ప్రయత్నించి నిష్ఫల

మగుట ఎరింగి తాను రాజై యుండియు వానివలన కలుగు అప కీర్తికి వెరచి ఒక రాత్రి నిశీథమునందు యెవరికిని దెలియకుండ కోటవిడచి అడవికి బోయెను. మరునాడుదయమున లేచి నృపుని గానక రాణియు మంత్రులును మిగుల విచారించి నలుదిక్కులకు చారులను పంపి వెదకించిరిగాని రాజు కానరాడయ్యెను.

తరువాత రాజ్యమరాజకమగుటజూచి తల్లియు అమాత్యులును వేనునికి పట్టముగట్టిరి. ఇట్టి దుష్టుడు రాజగుట దెలిసి పాములకు భయపడి ఎలుకలు దాగుకొనునట్లు జారచోరులు పారిపోయి గహనసీమల దాగిరి. ఇతను మనుజులుచేయు దేవతాపూజలు హవిర్భాగములు తనకే సమర్పింపవలెనని రాజ్యమున చాటించెను. అదివిని మహామునులు ఇట్లు తమలో నాలోచించిరి. "వీనికి మనము పట్టముగట్టుట పామునకు పాలుపోసినట్లయ్యెను. మన మంగరము బోయి వీనిని ప్రార్థింతము. సరిగా ప్రవర్తించినచో సరి. లేనియెడల వీనిని భస్మముగావింతము." అని నిశ్చయించి అందరును వానియొద్దజేరి ఆశీర్వదించి పలువిధముల బుద్ధులు చెప్పిరి గాని విననందున తమ కోపాగ్నివలన వానిని భస్మము చేసిరి.

## పృథుచక్రవర్తి చరిత్రము.

ఇట్లు చంపబడిన వేనుని శరీరమును, అతని తల్లి నిశీథ మిగుల జాగ్రతతో కాపాడుచు పుత్రశోకమునకు మిగుల దుఃఖించుచుండెను. అప్పుడు దేశము అరాజకమవుటచే బాధలుమొందుగ

నుండుట జూచి, ఋషులు రాజును బుట్టింపనెంచి వేనుని తొడను మర్దింపగా ఒక కుమారుడు పుట్టెను. అతడు మిగుల తేజోహీనుడై యుండెను. వానికి నిషాదుడని పేరు బెట్టిరి. వాని వంశమువారు పర్వతములందును, అడవులందును వెలసి వేనుని దుష్ట గుణములు గలవారై యున్నారు. వీరికే కిరాతకు లందురు.

పిమ్మట ఆఋషులు ఆ వేనుని బాహువులను మథింపగా యందుండి విష్ణువుయొక్క అంశమున ఒక కుమారుడు, శ్రీమహా లక్ష్మియొక్క అంశవలన నొక కుమారెయును బుట్టిరి. ఆపిల్ల వానికి పృథువనియు ఆచిన్న దానికి అర్చి యనియు పేరు పెట్టిరి. వా రుభయులు దంపతులైరి. ఆ సమయమున దేవతలు పుష్ప వర్షము కురిపించిరి. ఋషులు సంతసించిరి. ఆ దంపతులకు కర చరణము లందు లక్ష్మీనారాయణులకు గల శంఖు, చక్రము, ధ్వజము, చాపము మొదలగు చిహ్నము లుండుట చూచి బ్రహ్మాది దేవతలు వారిని ప్రశంసించి పట్టాభిషేకము చేసిరి, ఆ సమయమున దేవతలలో ముఖ్యులు వారికి ఛత్ర చామరాది రాజలాంఛనము లొసంగిరి. అప్పుడు హోమాగ్నినుండి సూత మాగధులను ఇద్దరు పురుషులు జన్మించి రాజును పొగడుటకు మొదలు పెట్టిరి. వారి పొగడ్తలు విని రాజు వారితో ఇట్లనెను. ఓయీ ! మీరు నన్ను పొగడుటకు తగదు. ఏలయనగా నేను బాలుడను, ఇదివరకు నేనేమియు మంచి పనులు చేయలేదు. నేను చేయవలసిన మంచికార్యములు దెలుపుడు. నాచేత నయి

నంత మట్టుకు వాటిని జేయ ప్రయత్నించెదను. అనగా విని వారట్లు దెలిపిరి.

ఇతని తండ్రియగు వేనుని దుర్మార్గము వలన దేవతలు కోపించి వర్షములు కురిపింపరైరి. అందువలన భూమి ఫలింపక కరవు కలిగినందున ప్రజలు కోపపీడుతులగుచుండిరి. సమస్త ఓషధులను సస్యములను భూమి తనయందు లయింపజేసికొనెను. ఇతను న్యాయముగా పాలించుచుయజ్ఞాదులవలన దేవతలను తృప్తి పరచుచుండుటచే వర్షములు క్రమముగా కురిసెను. అందువలన అన్ని సస్యములు, ఓషధులు ఎప్పటివలె ఫలింప నారంభించెను. ఇందువలననే పృథుచక్రవర్తి భూమిని గోరూపధారిణిగా జేసి పితికెనని చెప్పెదరు. ఇట్లు ఈచక్రవర్తి లోకమునందలి జనులకు సర్వసుఖములు కలిగించుచు సుఖముగాను ధర్మముగాను, పాలించెను. ఈ చక్రవర్తి తొంబది తొమ్మిది అశ్వమేధయాగములు చేసి నూరవ పర్యాయము యజ్ఞము చేయ ప్రయత్నింపగా దేవేంద్రుడు యజ్ఞపశువైన అశ్వమును అపహరించె నట. కావున నూరవది పూర్తికాదయ్యె. అందుకు విచారించుచుండగా బ్రహ్మ అతనికి ప్రత్యక్షమై ఇట్లు చెప్పెనట. ' ఓ రాజా! నీకు ఈ యజ్ఞముతో పనిలేదు. నూరు అశ్వమేధములు చేసిన వారు ఇంద్రపదవి నొందుదురు. నీకట్టి పదవితో ప్రయోజనము లేదు. నీవు విష్ణువు అంశమున జన్మించితివి. దేహాంతమున ఆయనయందు లయించెదవు." అది విని చక్రవర్తి తృప్తినొందెను. అని శుకమహాముని చెప్పగా పరీక్షిత్తు విని సంతసించెను.

పరీక్షిత్తు:—గురువర్యా! పృథుమహారాజు పవిత్రమైన కథను వింటిని. మాంధాత చక్రవర్తి కథ వినవలయును. సెల విచ్చి నన్ను చరితార్థుని జేయ ప్రార్థించెదను.

మాంధాత చక్రవర్తి కథ.

పూర్వము కకుత్స్థవంశమున యువనాశ్వుడను వాడు పుట్టి అతిధర్మముగా న్యాయము తప్పక ఈ మహీమండలమును పాలించుచుండెను. అతను అనేక యజ్ఞములను యాగములను చేసెను కానియతనికి పుత్రులు లేకుండుటచే మిక్కిలివిచారమును గలవాడయ్యెను. సంతానమును పొందుటకై వేరుపాయమును గానక, ఆయన అడవికి బోయి, ఋషులను ఆశ్రయించుచు, వారికి సేవసేయుచు అందుండెను. కొంతకాలమునకు వారతని యెడల కరుణించి జలమును మంత్రించి మరునాడతని భార్య కియ్యవలెనని యొకపాత్రమున నుంచిరి. ఆరాత్రి యందరు నిద్రించుచుండగా, ఆ యువనాశ్వునకు విపరీత దాహము కలిగి తన దరినున్న పాత్రలోని నీరు త్రాగెను. అందువలన అతనికే గర్భము నిలిచి నవమాసములు పూర్తికాగా, ఆ మునులు వానియందనుగ్రహించి అతని కుక్షిప్రక్క చీల్చుకొని ఆ శిశువు పుట్టునట్లును, అందువలన అతనికి ప్రాణాపాయము లేకుండునట్లును వరమిచ్చిరి. అట్లు పుట్టిన శిశువునకు బొటనవ్రేలున అమృతము ఉత్పాదింపజేయగా, ఆ వ్రేలు పానము చేయుచు ఆ పిల్లవాడు బ్రతికెను. ఈ బిడ్డనికే మాంధాత అని పేరు. అమృత పానము

వలన బలము, ఔదార్యము, సాహసము, పౌరుషము విశేష ముగా కలిగి, నానాటికి వృద్ధినొందెను. ఇతను క్రమముగ సమస్త శత్రువులను జయించి రాజయ్యెను. ఇతనికి ముచికుందుడను కుమారుడును అనేకమంది కుమార్తెలును జన్మించిరి. ఆకన్యకలను సౌభరికిచ్చి వివాహముచేసెను.

పరీక్షిత్తు:—అయ్యా! ఈ సౌభరి ఎవరు? వాని చరిత్రము చెప్పుడు.

## సౌభరిచరిత్రము.

సౌభరి ఒక బ్రహ్మచారి యగు ఋషి. ఈయన జలములో నుండి తపస్సు చేయుచుండగా ఒక చేప తన పుత్ర, పౌత్ర కళత్రాదులతో ఆ జలమునందు సంచరించుట చూచి తానును వివాహమాడి సంసారము చేయుచుండిన బాగుండునని తలంచి తనకు దగిన స్త్రీని వెదకుకొనుటకు బయలుదేరి మాంధాత చక్రవర్తి యొద్దకుబోయి తన అభిప్రాయమును చెప్పగా రాజు విని అట్టి కురూపునకు తన కూతునెట్లు వివాహముచేయ గలనని విచారించుచుండెను. అంతట ఆ ఋషి రాజును జూచి ఏమని అడుగగా మాంధాత ఇట్లనెను. "ఓ ఋషివర్యా! మా వంశమందలి స్త్రీలకు స్వయంవరముచే వివాహమగుట సనాతనముగా జరుగుచున్నది." అనగా ఋషి వానితో నిట్లు చెప్పెను "ఓ రాజా! అలాగుననే చేయవచ్చును. నీ కుమార్తెలను పిలిపింపుము. వారిలో నిష్టపడు వారిని నాకిచ్చి వివాహము గావిం

ష్యము." ఆమాటలు విని తన కుమార్తె లందరిని పిలిపింపగా వారా మునినిజూచి మోహపరవశులై అందరును అతనిని పెండ్లి యాడెదమనిరి. అతను వారికి మిగుల సుందరరూపుడై కాన బడెను. కావున వారందరిని ఆ ఋషికిచ్చి ఏకముహూర్తమున వివాహము చేసెను. ఆయన వారిని తోడుకొని పోయి విశ్వ కర్మను బిలిచి తనభార్యలకు తగిన భవనములు నిర్మింపు మనగా ఆయన అట్లే యొనర్చెను. అతను వారితో కేళీవినోదములు చేయుచు చిరకాలము సంసారసుఖము లనుభవించుచు బహు విధ ఐశ్వర్యములను పుత్రులను పౌత్రులను ప్రపౌత్రులను పొంది తపస్సు చేయుటకై యడవికి పోయెను. అని శుకులు చెప్పగా పరీక్షిత్తు విని ఆశ్చర్యమొందెను.

## కల్మాషపాదుని కథ.

పిమ్మట పరీక్షిన్మహారాజు శ్రీశుకులను జూచి "స్వామీ కల్మాషపాదు డెవరు? అతనికీ పేరు ఎట్లు వచ్చినది ? సెలవియ్య వలయునని యడుగగా ఆయన ఆరాజుతో నిట్లు చెప్పెను. "రాజోత్తమా! వినుము. పూర్వము ఇక్ష్వాకుల వంశములో నొకడైన మిత్రసఖుడను రాజు యజ్ఞము చేయుచుండెను. అతని కులగురువైన వసిష్ఠు అధ్వర్యుడుగా నుండెను. ఆ యాగాంతమున నొక రాక్షసుడు వసిష్ఠుని రూపమున రాజు నొద్దకుబోయి యిట్లు చెప్పెను. "ఓ రాజా! నాకు యజ్ఞదక్షిణగా నరమాంసముతో భోజనము పెట్టింపుము." అది విని రాజు

యుక్తేయనెను. తరువాత ఆరాక్షసుడే వంటలవాని రూపముతో ఆమాంసము వండి తయారుచేసెను. అంత వసిష్ఠు రాగా ఆయనకు ఆమాంసముతో రాజు భోజనము పెట్టించెను. ఆగురువు దానిని పోల్చి నరమాంసమని ఎరింగి, కోపించి, ఆనృపునితో ఇట్లనెను. "ఓరాజాధమా! మేము తాపసులమనియు బ్రాహ్మణులమనియు ఆహారమునందు నియమముగలవారమనియు తెలిసియుండియు, మాకు నరమాంసము భుజింపజేసి, మమ్మును అపవిత్ర పరచితివి కావున, నీవు రాక్షసుడవై నరులను జంపి వారి మాంసమును భుజించుచుండుము" అని శాపమొసంగెను. అదివిని రాజు గురువుతో తమ సెలవు ప్రకారమొనర్చితిని. ఇందునాతప్పేమి? అనగా వసిష్ఠు దివ్యదృష్టినిజూచి సర్వమును ఎరింగి యిట్లనెను. "నీవలన నేరములేదు. అయినను నామాట వృథాపోదు. నీవు రాక్షసుడవై పదిరెండు వత్సరము లుండక తీరదు" అనగా రాజు కోపించి నన్ను వృథా శపించితిరిగాన, మీకు ప్రతిశాప మిచ్చెదనని జలము చేతిసీట పట్టియుండగా, అతని భార్యజూచి గురునికి శాప మీయవద్దని ప్రార్థింపగా, మాని ఆజల మెందుజల్లినను ప్రమాదము వచ్చునని తన పాదములపై జల్లుకొనెను. వెంటనే యతని పాదములయందు నల్లని తెల్లని మచ్చలు కలిగెను. వాని వలన నతనికి కల్మాషపాదుడని పేరు ప్రసిద్ధమయ్యెను. అంతటనుంచి ఆరాజు రాక్షసుడై నరులను జంపి మాంసము భక్షించుచుండెను.

ఇట్లుండ ఒకనాడు రాక్షసుడు వనవిహారము చేయుచున్న ముని దంపతులనుజూచి వారిలో పురుషునిబట్టి చంపి బక్షింపగా అతని భార్య రాక్షసునిజూచి కోపపరవశురాలై వానినిట్లు శపించెను. "నీవు మాదంపతుల నెడబాపితివి కావున నీభార్యను గూడునపుడు మరణింతువుగాక" అని శాపమొసంగి తనపతితో సహగమన మొనర్చెను. పిమ్మట ఆరాక్షసుడు శాపపరిమితి పండ్రెండు వత్సరములు గతించిన, వికృతమగు రాక్షసరూపును విడచి, ఆరాజు ఇంటికిపోయి భార్యనుజూచి, మునిపత్ని శాపము జ్ఞప్తికి తెచ్చుకొని భార్యను ముట్టకుండెను. అట్లు చిరకాలము గడపి విధిప్రేరితుడై శాపవశమున విగతజీవుడయ్యెను.

శంబరాసురుని వధ.

ఒకనాడు దేవర్షియైన నారదుడు శంబరుని యొద్దకు బోయి ఇట్లనెను. " ఓ దైత్యేంద్రా! నీవు మదోన్మత్తుడవై మన్మధుని భార్యయైన రతిదేవిని బలవంతమున చెరబట్టి తెచ్చితివి. ఆ మన్మధుడు శ్రీకృష్ణుని భార్యయైన రుక్మిణీ గర్భమున ప్రద్యుమ్నుడై జన్మించెను. అతని వలన నీకు త్వరలో మరణము సిద్ధించును." అని చెప్పిపోయెను. ఒక జాలరివాడు గొప్ప చేపను బట్టి దానిని రాజుకిచ్చిన బహుమానము దొరకునని శంబరున కొసంగెను. తుదకదివాని వంటఇంటికి కంపబడెను. అందు మాయావతియను పేర పరిచారికగా నున్న రతి దానిని కోయునపుడు అందున్న మిగుల సుందరుడగు శిశువునుజూచి

మోహాముచే రహస్యముగా పెంచుచుండెను. ఇట్లు క్రమక్రమముగా పెరిగి ప్రాయమును పొందిన యాబాలుడు ఒకనాడు తన్ను బెంచుచున్న మాయావతిని జూచి యిట్లనెను. "అమ్మా! నా తండ్రిని జూపుము." అనగా ఆమె యాబాలునితో నిట్లు సంభాషించెను.

రతి:—స్వామీ ! మీతండ్రి యిచ్చట లేరు.

ప్రద్యు:—అమ్మా ! ఏల నన్ను స్వామీ యని పిలుచుచున్నావు.

రతి:—కుమారా ! నేను మీకు తల్లిని కాను.

ప్రద్యు:—మరి నీవెవరు ? నన్ను పెంచుచున్నావే ?

రతి:— నేను మీ దాసిని. మీకు పరిచర్య చేయుచున్నాను.

ప్రద్యు:—అట్లయిన నాతలిదండ్రు లెవరు ?

రతి:—శ్రీకృష్ణ భగవానులు మీతండ్రి. శ్రీ రుక్మిణీదేవి మీతల్లి.

ప్రద్యు:—వా రెచ్చట నున్నారు ?

రతి:—వారు ద్వారకయం దున్నారు.

ప్రద్యు:—అయితే నే నెచ్చట బుట్టితిని?

రతి:—మీరు ద్వారకయందు బుట్టితిరి.

ప్రద్యు:—ఇచ్చటికి యెట్లు వచ్చితిని ?

రతి:—శంబరుడను ఈ దైత్యరాజు పురిటింట నిద్రించుచున్న మిమ్ము మాయవేషమున దొంగిలించి తెచ్చి సముద్రమున బారవైచెను. అప్పుడు మిమ్మొక చేప మ్రింగెను. ఆమత్స్యమును ఒక జాలరివాడు వలలో బట్టి తెచ్చి ఈ రాజునకిచ్చెను. దాని గర్భమున మీరుదయించితిరి. నేను మిమ్మును పెంచుచున్నాను.

ప్రద్యు:—ఈ రాక్షసుడు నన్ను సముద్రమున బారవేయుట కేమికారణము ?

రతి:—మీరు పూర్వజన్మమున మన్మథుడను పేరున ఈశ్వరుని తపోభంగము చేయగా, ఆయన కోపాగ్నివలన మిమ్మును భస్మము చేసెను. అప్పుడు రక్కసుడు నన్ను చెర బట్టి తెచ్చెనుగాని నేను పతివ్రత నవుటచే నన్ను ముట్టక నీ దాసిగా నిందించెను. మీరు మరల బుట్టి తిరిగి మీరతనిని చంపుదురని నారదుని వలనవిని మిమ్మును మహోదధిని పారవైచెను.

ప్రద్యు:—అయిన నేనిప్పుడేమి చేయవలెను ?

రతి:—మీరు వీనిని సంహరింపవలెను. ఇతను బహు మాయ లెరిగినవాడు. వీనిని సాధారణముగా చంపుట కష్టము. మీరును కొన్నిమాయ లెరింగిన గాని వానిని జంపలేరు. కావున సర్వమాయా వినాశిని యను విద్యను మీకునేర్పెదను. దానిని నేర్చుటచేతనే నాకు మాయావతి యను పేరు వచ్చెను.

యీ విద్యవలన మీరు వానిని చంపగలరని ఆ విద్యను ఆబాలుని కుపదేశించెను.

పిమ్మట దాని ప్రభావమున సమస్త మాయలను నశింప జేయసమర్థుడై ప్రద్యుమ్నుండు వానితో గూడి ఘోరయుద్ధ మొనర్చి తుదకు వానిని సంహరించెను. అంతట మాయావతి యను ప్రజ్ఞకు సంతోషించి ఆబాలుని దోడ్కొని గగనమార్గ మున ద్వారకకు బోయి అంతఃపుర స్త్రీలుండుచోట దించెను. వానిని జూచి యచ్చటి స్త్రీలందరు శ్రీకృష్ణుడని తలంచిరిగాని నూతన వయస్కుడగుటచే కాడని యెరింగిరి. రుక్మిణీ తనయుని జూచి కౌగిలించుకొని ముద్దాడెను. తదనంతరము శ్రీకృష్ణుడు కుమారుని జూచి రతివలన అతని చరిత్రము సవిస్తరముగా వినెను. అందరును సంతసించిరి. తల్లి ఏమాయని ప్రద్యుమ్నుడు పడుచున్న భ్రమ నివారణచేసి, వారిరువురకు మంచి సుముహూర్తమున వివాహమొనర్చి మిగుల ఆనందించిరి. దైవయోగము చూచితిరా ? వారినెట్లు సమకూర్చెనో !

## నరకాసురుని వధ.

ఈ కథ విని పరీక్షిన్నృపతి మిగుల సంతసించి శ్రీ శుక మహర్షిని జూచి గురుసర్యా! శ్రీకృష్ణుడు పదునారు వేల రాచ కన్యలను ఏక కాలమున వరించెనని చెప్పుదురు. వారతని కెట్లు లభించిరో చెప్పుడు. అని ప్రార్థింపగా శుకమహాముని యిట్లు చెప్ప నారంభించెను.

పూర్వము ప్రాగ్జ్యోతిష పట్టణమున నరకాసురుఁడను భయంకరమైన రక్కసుఁడుండెను. అతఁడు భూలోకమంతయు జయించి స్వర్గమునకు బోయి ఇంద్రుని గెలిచి వాని రాజ్యము సంపద అంతయు తీసికొనెను. అదితి కుండలములను పుచ్చుకొనెను. వాని బారి కోర్వలేక వారు శ్రీకృష్ణుని శరణుజొరగా, ఆ నీలవర్ణుఁడు దేవతలకు సహాయము చేయదలంచి బయలుదేరుచుండగా ఆ నున పట్టపుదేవులలో నొకతెయైన సత్యభామ వెంట బయలుదేరగా ఆమెను అనేక విధముల మళ్ళించెను. కాని ఆమె వినక కృష్ణునితో గరుడవాహనారూఢయై పోయెను. అప్పుడు కృష్ణుడు సత్యభామాసమేతుఁడై ప్రాగ్జ్యోతిష పురముపై బడగా నరకాసురుడు యుద్ధమునకు సిద్ధపడెను. సత్యభామ యతనితో కొంతసేపు ఘోరయుద్ధముచేసెను. అదిజూచి అందరును ఆశ్చర్యపడిరి. పిమ్మట శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రముతో వాని శిరస్సు ద్రుంచి వాని కుమారుడైన భగదత్తుని విధివినయములకు మెచ్చికొని ఆ రాజ్యమిచ్చెను. అటుతరువాత కారాగృహమున నున్న రాజులను రాచకన్యలను విడిపించెను. ఆ నృపులందరును కృష్ణుని పలువిధముల స్తోత్రములుచేసి సెలవు తీసికొని తమ దేశములకు పోయిరి. రాచకన్యలు శ్రీకృష్ణుని ధ్యానించివరించిరి. వీరు పదునారువేలమంది. వీరిని దేశదేశముల నుండి నరకాసురుడు బలిమిని బట్టితెచ్చి చెరయందుంచెను. వారిని విడిపించుటచేతను ఆయన రూపలావణ్యములను జూచి

వారు కృష్ణుని కోరుకొనిరి. ఆయన వారిని పరిగ్రహించెను. పదునారు వేల స్త్రీలు శ్రీకృష్ణునికి ఇల్లాండ్రయి యొప్పిరి. అని శుకయోగి పరీక్షిన్మహారాజునకు చెప్పెను.

శ్రీ విష్ణుపురాణము సమాప్తము.

గద్య.

ఇది శ్రీ పరమేశ్వర కరుణా కటాక్ష జనిత కవితా విచిత్ర
వేమూరి వంశపయః పారవార పరిపూర్ణ రాకా సుధా
కర హరితసగోత్ర శ్రీ సూర్యనారాయణాఖ్య తనూజ
శ్రీ జగన్నాథశర్మ ప్రణీతంబైన శ్రీ మదష్టాదశ
మహాపురాణ సారసంగ్రహమునందు మత్స్య,
కూర్మ, వరాహ, వామన, భవిష్యత్,
విష్ణుపురాణంబులు సంపూర్ణము.
శ్రీ పరదేవతార్పణమస్తు.

---